## Bibliographic Record Target

వేంకటసుబ్బారావు, తోలేటి.

వీరేశలింగకవిచరిత్రము / తోలేటి వేంకటసుబ్బారావుచేత రచియింపఁబడినది.- 2. కూర్పు.- తణుకు : డి. వి. రమణారావు, 1910.

xi, 359 p. :ports. ;22 cm.

Record no. 391

Vēṅkaṭasubbārāvu, Tōlēṭi.

Vīrēśaliṅgakavicaritramu / Tōlēṭi Vēṅkaṭasubbārāvucēta raciyimpam̐baḍinadi.- 2. kūrpu.- Taṇuku : Ḍi. Vi. Ramaṇārāvu, 1910.

xi, 359 p. :ports. ;22 cm.

Record no. 391



RAO BAHADUR PANDIT K. VEERASALINGAM PANTULU.

శ్రీ

# వీరేశలింగకవిచరిత్రము.

ఇది

రాజమహేంద్రవరము, ఆర్యాపురము

నందున్న

తోలేటి వేంకటసుబ్బారావుచేత

రచియింపఁబడి

డి. వి. రమణారావుగారిచే

తెనాలి

శ్రీ సౌదామినీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1910

కాపీరైటు.] రెండవకూర్పు 1000 ప్రతులు. [రిజష్టర్డు.

దీని వెల 1—0—0.

# PREFACE

——:o:——

It needs no introduction to a work like this. This is the revised and enlarged edition of the first critical biography written and published by me so long ago in June 1894.

Rao Bahadur Pandit K. Veeresalingam Pantulu, is a singular man, whose biography deserves to be written for the benefit and contemplation of the rising young generation of our Telugu country especially.

This well-known Reformer, Prose writer, Journalist and Poet of our Telugu country was the President elect of the Indian Social Conference held in Madras in January 1894 when the late lamented Mahadeva Govinda Ranade of the Bombay High Court, while introducing our Reformer to the audience rightly expressed with the talents of a worthy Judge as follows.

"You are all aware that Rao Bahadur K. Veeresalingam Pantulu has been a veteran worker in this cause. He is a man of few words, but has written much and worked suffered much and his life and his teachings are an example to us. * * *"

I hope the Educational Department and the Telugu reading public would be pleased to give me sufficient encouragement for the labour I have taken.

It regrets me very much when joyous recollections of 16 years back come to my mind of what encouragement both in word and deed of a magnanimous heart which the

late lamented Mr. S. Rangayya Chettiar, B. A., Proffessor, Christian College, Fellow of the Madras University, and the Telugu Translator to our benign Government of Madras, and above all the real benefactor of our Telugu country, had shown towards me.

In fine, I crave the indulgence of my readers and critics for all kinds of errors that may have crept into this work for more reasons than one.

I shall gladly accept any suggestions which my dear reader may be pleased to communicate, to help me for the future edition.

2—8—1910.
Aryapur;
Rajahmundry.

T. V. SUBBA ROW.

---

# పీఠిక.

హిందూదేశములోఁ జరిత్రములను వ్రాసెడి యాచారము పూర్వకాలమునుండియు లేకపోవుటచే, నిప్పుడు, కవులకాలమును దెలిసికొనుటయే కరంబు దుర్ఘటంబుగ నున్నది. ఇంక, వారలవృత్తాంతాదులను దెలుపుట యిప్పు డెంతయసాధ్య మయినదియు, వేఱుగఁ జెప్ప నక్కఱయే లేదు. చదువరుల కమితానందజనకం బగునటులు నూఱులకొలఁదిఁ బుటలు నింపవలసిన మహాకవులచరిత్రములు సహితము, మూఁడేసిముక్కలలో ముగింపవలసివచ్చినందుల కెంతయుఁ జింతింపవలసియున్నను, శిలాతామ్రశాసనాదులనుబట్టియుఁ, గవులు తమకృతుల నంకితముచేసిన రాజులకాలమునుబట్టియుఁ, గృతులయవతారికలను బట్టియు, దేశములోఁ బరంపరగ వాడఁబడుచుండెడు కథలనుబట్టియు, జక్కఁగఁ గాలనిర్ణయంబును జేయుచుఁ, దెలుఁగుకవులచరిత్రములు వ్రాయ నారంభించిన చరిత్రకారులబుద్ధివిశేషంబునకును, మితిమించిన యోపికకును, మన మెంతయు సంతసింపవలసియున్నది.

దేశభాషలలో నెల్లను, మధుర మయినదని పేర్కొనఁబడుచుండెడి మన తెనుఁగుభాషయందుఁ జిరకాలంబునుండి యున్నయిట్టికొఱంతను నివారింపఁ బ్రయత్నించుటకుం దగినవారలు, చిరకాలగ్రంథరచనపరిశ్రమకుశలురు, సమితప్రపంచజ్ఞానవిలసితులు, నపారపాండిత్యప్రకర్షులును దక్క తదితరు లనర్హు లని ముమ్మాటికిని జెప్పుటకిసుమంతయు సంశయంబు లేదు. అయినను, ప్రపంచజ్ఞానరహితుఁడను, జిరకాలగ్రంథరచనపరిశ్రమవిహీనుండను, పాండిత్యశూన్యుండను నయిననే నింతయు వెనుకఁదీయక, బుద్ధిచాపల్యంబున నిట్టిఘనకార్యంబునకుఁ గడంగి, యొకవిధంబుగ రచియించి, దీని నిట్లు ప్రకటింపఁ గలిగినందుల కెంతయు సంతోషించుచున్నాఁడను. ఈచరిత్రమును రచి

యించుటయందు నేను పడినప్రయాస మంతయు స్వానుభవైకవేద్య
మైనదియే కాని, యిట్టిదియని చెప్పుటకు, నాకు లేశమైనను శక్యంబు
గాకున్నయది. గ్రంథరచనంబునం దించుక స్వానుభవము గలవారలు
సహిత మీచరిత్రముం జూచి, నాకుం గలకించిత్స్వానుభవంబు నించుక
యోచించినచో నెంతయుఁ గష్టపడి నే నీచరిత్రంబును వ్రాయ నారం
భించితి నని యద్భుతాశ్చర్యభరిత మానసంబున నింతయు సంశయింపక
మానరు. చరిత్రంబులు లేనిలోపంబును గొంతవఱకు నివారింప నీ
"వీరేశలింగకవిచరిత్రము" ను బ్రప్రథమంబునన రచియింప నారంభించి,
యొకవిధంబుగ, దీని నిట్లు ప్రకటింప సాహసించిననాకు విద్యాశాఖవా
రును, విద్యార్థులును, మహాజనులును నాపడినప్రయాసంబునకుం దగిన
ప్రోత్సాహంబును గలిగించెద రని హృదయపూర్వకంబుగా నమ్ము
చున్నాఁడను.

ఇట్టిచరిత్రంబులు వ్రాయుట కిదియే ప్రథమప్రయత్నం బగుటం
జేసి, యిం దెట్టిదోషము లుండిన నుండవచ్చును. కావున, నాప్రియ
సహోదరు లగువిద్యార్థులారా! చరిత్రకారున కత్యంతావశ్యకంబు
లయిన యమితప్రపంచజ్ఞానంబుగాని, చిరకాలగ్రంథరచనానూనానన్య
సాధ్యపరిశ్రమంబుగాని, విశేషపాండిత్యంబుగాని, లేకయే, నిర్వహింప
వలసినమహాకార్యభారంబును లేశంబును దలంపనేరక, బుద్ధిచాపల్యం
బును మఱల్చుకొన నశక్తుండనయి, యించుకయును సంశయింపక, కవి
కులవతంసులు నాంధ్రభాషావచనవిలేఖకశేఖరులు నగునట్టియీవీరేశ
లింగముపంతులుగారికడకుం జని, "మీచరిత్రమును వ్రాయ నాకుఁ
గోరిక యున్నది; మీగ్రంథముల నెల్ల నాకొసంగఁ గోరెద" నని యా
పంతులుగారియన్నిగ్రంథంబులు గైకొనిననాసాహసంబునకు సంతసించి,
యిందలిదోషంబుల నెల్లను మన్నింపవచ్చును. లేదా, యీచరిత్రం
బును వ్రాయ దొడఁగినంతకాలంబు నిట్టిగ్రంథము రచియించుట, యెంత
యు సుకరం బగుకర్జంబుగఁ గనుపించినను, గలము గైకొని వ్రాయ



నారంభించుతఱి కింతింతని నుడువ శక్యంబు గానివిచారంబు మనసునకుం
గలుగఁజేసి, యసంఖ్యాకంబు లగునూహాకాలసర్పంబులు మనసును
గీలించి, పీడింప నారంభించినను, దలంచినకార్యంబును నిరంతరాయం
బుగ సాంతము గావింపవలయు నను ముఖ్యోద్దేశము గలవాఁడ నయి,
ధైర్యంబు నవలంబించి, యిట్లు రచియించుచు నేను పడినప్రయాసం
బును గొంచెము యోచించి, కనికరించి యయిన నిందలిదోషంబుల
నెల్లను మన్నింపవచ్చును. లేదా, కొంచెము వ్రాసినతోడనే సౌహార్ద
సుఖంబులఁ గాలయాపన సేయుచు నేల సుఖముగా నుండక, యీప్ర
యాస మని, సోమరిదేవత యాశ్రయించుచుండఁగా, విసుగు విరా
మము లేక, రమారమి ముప్పది నలువది సంవత్సరములనుండి యాంధ్ర
దేశంబున కమితానందజనకం బగునట్లు లమూల్యంబు లగుగ్రంథము
లను రచియించియున్న యీవీరేశలింగముపంతులుగారియెడల మీకుం
గలిగెడునమితగౌరవంబున నయిన నిందలిదోషంబుల నెల్ల మన్నింప
వచ్చును. ఎట్టులయిన నేటికింగాని కార్యనిర్వహణం బెంతయు దుర్ఘ
టంబు. దోషగణనంబో కరంబు సుకరంబుగదా!

నేను, పాఠశాలలయందు విద్యాభ్యాసము చేయుచున్నకాలము
నందు, 1892 వ సంవత్సరము, వేసంగికాలపుసెలవులలో నేలూరునకు
సమీపముగా నున్నయొకగ్రామమునకు బంధువులను జూచుట కరిగి,
మఱలి రాజమహేంద్రవరమునకు రావలయు నని తలంచునప్పటికి,
గాలువలు గట్టివేయఁబడియుండుటచే, బాల్యచాపల్యంబునఁ గాలినడక
మీఁద, మఱునాటి సాయంకాలమునకు విజ్జేశ్వర మనఁబడెడు విజయేశ్వ
రము చేరి, నాయంతరాత్మ వలదు వల దని యెన్నివిధంబుల బోధించు
చున్నను సరకుసేయక, యప్పటికదివఱకే వచ్చియున్నవిశ్వాసపాత్రుఁ
డయిననాచిన్ననాఁటి యుపాధ్యాయుని మాటలను విశ్వసించి, రాత్రి
యనక, గ్రుడ్డివెన్నెలలో, నోరుమనుచు నిరుప్రక్కలను గోదావరి
కానఁబడుచుండఁగా, భయంకరముగాఁ దీతువులు గూయుచుండఁగా

నిడుగెత్తునీరు ప్రవహించు నానకట్టుపై నత్యంతభీతచిత్తముతో నడచి నడచి, ధవళేశ్వరము చేరుట కింక ముప్పది నలువది గజములదూర మున్న దనఁగనే, ప్రాఁకుడుచే, జల్లున జాఱుటచేఁ, జేతిలోనిసంచి క్రిందఁ బడి, తడియుచుఁ గొట్టుకొనిపోవుచుండఁగాఁ, బ్రాణాపాయము నింతయుఁ దలంపక, నిమిషములలోఁ గ్రిందికిఁ జని, "దొఱకిన," దని యత్యంతోత్సాహకరంబుగఁ బలికి యీచరిత్రముయొక్క మొదటికూర్పు వ్రాతప్రతిని, గోదావరిపాలు గాకుండఁ గాపాడిన స్టెట్టిపేటకాపురస్థులగు మహారాజశ్రీ దినవహి లక్ష్మీపతిపంతులుగారికి, నిరంతర కృతజ్ఞతాసూచకము లగునావందనసహస్రంబుల నిందుమూలముగా నర్పించుచున్నాఁడను.

ఈచరిత్రమును జదువువారలు, విద్యార్థు లయిన, నుపాధ్యాయు లయిన, నెవ్వరైనను, దీనిని సాంతంబుగఁ జదివి, మఱి తమయభిప్రాయంబును వెల్లడింపఁ బ్రార్థించుచు, దీనిని సాంతంబుగఁ జదివిన పిమ్మటఁ దమమనసులకుం గలిగెడియాక్షేపణంబులనొండె, హితబోధనంబులనొండేఁ, గారణోదాహరణసహితంబులుగ నాకుం బరమదయాపూర్వకంబుగఁ దెలిపినచో, వానిం గృతజ్ఞతతో నంగీకరించుటయే కాక, దీనిని, మఱల ముద్రింపించునపుడు, నాకు యుక్త మనితోఁచినంతవఱకును గ్రహించి, యీచరిత్రంబును సవరింపఁ దలంచియే యున్నాఁడనని విన్నవించుచున్నాను.

2—8—1910
ఆర్యాపురము;
రాజమహేంద్రవరము.

తోలేటి— వేంకటసుబ్బారావు.

# ఉపోద్ఘాతము.

సీ. శ్రీకరంబు నఖిల ♦ క్షేమాకరంబును
హాళికి నిరవును ♦ నగుచు నుండి,
శకునులు, జంతువుల్ ♦ శైలముల్ సాలముల్
నీరముల్ వహ్ని న ♦ మీరములును,
సతతంబుఁ గలిమిని ♦ సౌఖ్యమందుచు నుండు
పోడిమి మీఱెడు ♦ భూతలంబు,
సూర్యుండు చంద్రుండు ♦ చుక్కలు మేఘముల్
ప్రేకము లగుచుండు ♦ నాకసంబు,
సృష్టిప్రభావంబు ♦ స్పష్టమగుచు నుండ
సమముగఁ జనుఋతు ♦ షట్క మెప్పుడు,
సారంబుఁ బరికించి ♦ సరసంపుఁబలుకుల
మహిమంబు వెలయించు ♦ మానవుండు,
శేషుఁడును, నేరఁ డని నుతి ♦ సేయఁగల్గి,
కన్నులకుఁ బెనుఁబండువై ♦ కరము హృద్య
మగుచు మించుసొంపులమయ ♦ మైనసృష్టి
సంతతంబును నెమ్మది ♦ సంస్మరింతు.

మత్తకోకిల.

పారికాంక్షిని బాదరాయణు ♦ వామలూరుజు మల్హణున్
భారవిన్ భవభూతినిన్ శివ ♦ భద్రునిన్ కవిమాఘునిన్
చోరు బిల్హణు భట్టభాణుని ♦ సూరిదండిని భోజునిన్
చారుభాషణుఁ గాళిదాసుని ♦ సంతతంబుఁ దలంచెదన్.

మత్తకోకిల.

నన్నపార్యుని శంభుదాసు న ♦ నంతు నాచనసోముఁ ది
క్కన్నఁ బెద్దన రామకృష్ణుని ♦ గంటు వేములవాడ భీ
మన్న మారనఁ బోతరాజుని ♦ మల్లనార్యుని నంది తి
మ్మన్నఁ గేతన రామభూషణు ♦ మానసంబున నెంచెదన్.

సీ. శ్రీరాజరాజన ♦ రేంద్రపురవరపు
హైస్కూలుపండితుఁ ♦ డనఁగ నొప్పి,
చిన్నతనంబునఁ ♦ జెన్నుమీఱుకయి
తవెలయునందనం ♦ దనశతకము,
బాలుర కెంతయు ♦ బాగుగా నీతిబో
ధనసేయుసుగుణాప్ర ♦ దర్శకంబు,
భక్తులు మెచ్చంగ ♦ భక్తచింతామణి,
కీర్తి గాంచ భగవత్ ♦ కీర్తనములు,
వచనకావ్యంబులు ♦ వ్రాయుటయందలి
తలము మిగుల నయ ♦ దర్పణంబు,
బుద్ధివిశేషంబు ♦ పొడకట్టఁగ సుగుణా
కరము సూక్తివసుప్ర ♦ కాశకంబు
భాషాంతరమునందు ♦ వాసిగాంచుచునుండఁ
గా మేఘసందేశ ♦ కావ్యవరము,
వీరరసంబునఁ ♦ బేరుదేరంగఁ ద
నరు వేణీసంహార ♦ నాటకంబు,
కవివరుల్ నుతియింపఁ ♦ గా మనోహరమగు
నటువిక్రమోర్వశీ ♦ నాటకంబు
వేదాంత మెల్లెడ ♦ విశదంబుగా నింపు
దొలుకఁ బ్రబోధచం ♦ ద్రోదయంబుఁ,



దమశక్తి యంతయుఁ ♦ దనరుచు నుండఁగఁ
గొమరు మీఱంగ శా ♦ కుంతలంబు,
మొదలగుగ్రంథముల్ ♦ పొదలంగ రచియించి,
భారత మంతయు ♦ వచనకావ్య
ముగ రచియింపఁగ ♦ మున్నె తలఁచి యుండి
చెన్నుగ రచియించు ♦ చున్నవాని,
వడ్డాదివంశాబ్ధి ♦ పార్వణచంద్రుని
రమ్యచరితు సుబ్బ ♦ రాయకవిని,
వలసి యడుగ వచ్చెడిచదు ♦ వరులకెల్ల
నయము మీఱఁగ నేర్పెడు ♦ నాదుగురుని
సరసకవివరు సదమల ♦ సాంద్రయశుని
నిరతము మది నుతించెదఁ ♦ బరమభక్తి.

సీ. గీర్వాణభాషను ♦ గీర్తిఁగాంచినకవి
నాథుని శ్రీహర్షు ♦ నైషధంబు,
మిశ్రమంబుగ నున్న ♦ విశ్రుతు లెల్లరు
నహహా యనుచు నుండ ♦ నాంధ్రమందుఁ.
సంచు మించఁగ రచి ♦ యించినయట్టియా
శ్రీనాథుఁ డేపాటి ♦ శ్రేష్ఠుఁ డంచు,
నియమ మొక్కటి చేసి ♦ నేర్పుఁ జూపినయట్టి
తిక్కన యేపాటి ♦ ధిషణుఁ డంచుఁ
బరగఁ బ్రబంధముల్ ♦ వ్రాసిమిగిలినట్టి
కవివరు లేపాటి ♦ కవులటంచుఁ
బక్షపాతము లేని ♦ పండితు లైనట్టి
మంచివా రెపుడు స్తు ♦ తించుచుండ,
నొక్కనియమ మేమి ♦ యక్కజం బనుచును
మూడునియమంబులు ♦ మొదటనుంచి,

శుద్ధాంధ్రమై, యోగ్య ♦ శూన్యమై, నిర్వచ
నం బైనశృంగార ♦ నైషధంబు,
సరసంబుగా నుండి ♦ సార్థకమై తన
ర రసికజనమనో ♦ రంజనంబు,
నచ్చ తెనుంగున ♦ నరయుంగ నరు దగు
సరణిని భారత ♦ సంగ్రహంబుం,
జదువుట కెంతయు ♦ సరళంబుగా నుండి
కుతుక మందించు శా ♦ కుంతలంబు,
నద్భుతంబుగా నుండి ♦ యచ్చెరు వ్పొదవించి
వరలెడురాజశే ♦ ఖరచరిత్ర,

గీ. మహిమము వెలయంగా మిశ్ర ♦ మంబుగా న
నుంగుగా నుండ నచ్చ తె ♦ నుంగునందు,
నెన్నియో గ్రంథముల్ రచి ♦ యించి మించి,
రాజమందిరికాలేజి ♦ తేజ మంద
నందలిప్రధానపండితుం ♦ డగుచు నుండి,
యెన్నియో సుగుణము లుద ♦ యించునటుల
చేయం దగునుపన్యాసముల్ ♦ చేయుచుండి,
పాఠశాలలచదువరుల్ ♦ ప్రస్తుతింప,
సరసకవివరుల్ నుతిచేయ ♦ సకలసుజన
లోకసంపూజ్యుం డగుచు వె ♦ లుంగునట్టి
యాసుధీవిశాలుని సన్మ ♦ హాకవీంద్రుం!!
గందుకూరి వీరేశలిం ♦ గమును దలంచి!!!

క. మహిలో నార్యవితంతూ
ద్వాహనము నెలకొల్పినట్టి ♦ ధన్యతరుండా



మహనీయచరిత నంతయు
రహిం దీటంగ నతులితగతి ♦ రచియింతు నొగిన్.

క. సన్నుతి గనం దగుచరితము!
చెన్నలరంగా విరచన ♦ చేయుట యెట్లో!!
మన్నతి మీ రందఱు దయ
మన్ననమైం గైకొనుండు ♦ మాన్యులు మీరల్.

క. చారిత్రం బిది యనుచును
బారావారంబు నీద ♦ భావించితి నే
దీరముం జేరంగ లేనా?
మీరలు ననుం జూచు చుండ ♦ మిక్కుటవుదయన్.

గీ. అఖిలజీవిజాలంబుల ♦ సుఖముకొఱకె
యిల నుపకరించుటకెకద ♦ ఈశరీర
మనుచుం బాటుపడియెడుమ ♦ హాత్ముకీర్తి,
వసుధలోపల వ్యాపించు నసదృశముగ.

---

శ్రీ

# వీరేశలింగకవిచరిత్రము

పంచభూతాత్మకం బైనయీప్రపంచ మంతయు, మనసును బదార్థంబు నని యిరుదెఱంగులుగ నున్నది. పశుపక్షిజనంబులు మానసపదార్థసంపన్నంబులు. శైలసాలంబులు కేవలపదార్థసంపన్నంబులు. స్వభావంబున, జీవిజననంబు సర్వోత్కృష్టంబు. అందు, మానవజన్మం బత్యంతసర్వోత్కృష్టంబు. పంచేంద్రియసంపన్నంబును, ననేకోపజాతిభేదసంయుతంబును నగుజంతుజాతంబునందలిమనుజునకును బంచేంద్రియంబులలో నయనేంద్రియంబు, ప్రధానగణనార్హంబు. మనుజుండు నయనేంద్రియసహాయంబునం జేసి, జ్ఞాననేత్రంబునం బదార్థవిలోకనంబునకు సమర్థుం డగును. పదార్థవిలోకనంబున శిరసున నూహ లుదయించు చుండును. శిరసున నుదయించెడి యూహలనెల్ల వెల్లడించుటకుం బ్రధానాధారంబు జిహ్వేంద్రియంబె యైన నందులకు భాషయావశ్యకంబు. సంస్కృతం బాద్యప్రకృతి. ప్రాకృతంబు ద్వితీయప్రకృతి. ఆంధ్రభాషవికృతి. మున్నీదేశ మాంధ్రులచేఁ బరిపాలింపఁబడు చుండుటం జేసి,యీయదియాంధ్రదేశంబు నాఁబరఁగె. ఆంధ్రదేశంబున వ్యవహరింపఁబడుభాషయాంధ్రభాష. ద్రాక్షారామము, శ్రీశైలము కాళేశ్వర మనుసీమూఁడుశివమహాక్షేత్రంబులయందును మూఁడులింగంబు లుండుటం జేసి, యయ్యవి త్రిలింగక్షేత్రము లని వ్యవహరింపఁబడుచు వచ్చెను. అమ్మూఁడుక్షేత్రంబులకు నడుమ నుండెడుదేశం బంతయుఁ ద్రిలింగదేశం బని వన్నెకెక్కియున్నయది. త్రిలింగదేశంబునందలిభాష త్రిలింగభాష. త్రిలింగశబ్దభ

వంబు తెలుఁగు. మన మిప్పుడు తెనుఁగని వాడుచుండెడుపదంబా తెలుఁగనుశబ్దంబునకు రూపాంతరము. మన తెనుఁగుభాషయుఁ, దక్షిణంబు లగుదేశభాషలంబోలెఁ గ్రమక్రమంబుగ దినదినాభివృద్ధిని గాంచుచు వచ్చెను. ఏదేశంబున నేభాషయు నేకాలంబునను నొక్కసారిగ మహాదుచ్ఛ్రయదశకు వచ్చెననినచో నయ్యదికరంబు నసాధ్యంబని యెట్టివిజ్ఞునకైనను సులభంబుగ బోధపడక మానదు. కావున మనమిప్పుడు కవిత్రయంబువా రని శ్లాఘించుచుండెడునన్నయభట్టారకాదులు సహితము, తమకుం బూర్వంబున నున్నకవులు రచియించినయాంధ్ర గ్రంథంబులం జదివియేయట్టియనవద్యాసదృశం బగుకవితానైపుణినందియుండిరని యొకింతయు వెనుఁదీయక సాహసంబునం జెప్పఁగలము. అప్పటికి మన కింకను ముద్రాయంత్రంబు లనుమహాభాగ్యంబు లేకుండుటం జేసియుఁ దాళపత్రగ్రంథంబులు చిరకాలస్థంబులు గాకుండుటం జేసియుఁ గవిత్రయంబువారికిం బూర్వు లగుకవులచే రచియింపఁబడినగ్రంథంబు లేవియు మనకు లభ్యంబులు గాకుండుటకు మన మెంతయుఁ జింతింపవలసియున్నను, శ్రీమదాంధ్రభారతంబువంతటిమహాగ్రంథమును సహితము రచియించునంతటిసామర్థ్యంబును గలుగఁజేయఁదగినమహాగ్రంథంబులు మన తెనుఁగుభాషయం దంతకుఁబూర్వంబుననుండి యుండవలయు నని నిస్సందేహంబుగఁ జెప్పుటకుం బెక్కునిదర్శనంబు లుండక యున్నవా యని యనుకొనుటకైనను మన మెంతయు సంతసింపవలసియున్నది. ఎట్లయినను, శ్రీమదాంధ్రభారతంబునుగాంచి, నేటికించుమించుగ నెనిమిదితొమ్మిదివందలసంవత్సరంబులకు వెనుక నిప్పురంబును బరిపాలించుచుండినవిష్ణువర్ధనుం డనఁబరఁగినరాజరాజనరేంద్రునికాలంబునకు మనయాంధ్రభాష మహోన్నతపదవికి వచ్చిన దని చెప్పవలసి యున్నది. పురాణకవనంబునకు బాల్యదినంబు లవియే యై యున్నయవి.



పిమ్మట, రాజరాజనరేంద్రునికాలంబునకు రెండుమూఁడువందల సంవత్సరంబులకనంతరంబున భాస్కరరామాయణాదిగ్రంథంబు లుద్భవిల్లె. రాజరాజనరేంద్రునికాలంబునకు రమారమి మూఁడువందల సంవత్సరంబులకుం బిమ్మట మన తెనుఁగుదేశం బంతయు రెడ్లయధీనం బాయెను. శ్రీనాథాదికవు లందఱు రెడ్లకాలంబుననె నివసించి యున్నవారు. పరమభక్తాగ్రేసరుం డగుపోతరాజు, భక్తిరసప్రధానంబుగను, లలితపదగుంభితంబుగను, యమకాదిశబ్దాలంకారభూయిష్ఠంబుగ, నతిశ్రావ్యంబుగ, నుండునట్టులం బురాణకవనంబున ననన్యసాధ్యానూనధోరణిం గల్పించి, శ్రీమదాంధ్రభాగవతంబు నాంధ్రప్రపంచమున కొసంగి, తాను శాశ్వతం బగుయశంబును సంపాదించుకొని యున్నవాఁడు. ఆంధ్రభాషాభిమానులుగ నుండుచువచ్చిన రెడ్లకాలంబునకు రమారమి రెండుమూఁడువందల సంవత్సరంబులు గడచినయనంతరంబున నీతెనుఁగుదేశం బంతయు మఱల రాజులయధీనం బయ్యెను. కృష్ణదేవరాయ లేతత్సంతతిలోనివాఁడు. ఇతఁడు, విష్ణుచిత్తీయం బనునామాంతరంబుగల యాముక్తమాల్యదకుం గృతికర్త. మనుచరిత్రాదిప్రబంధరత్నంబులకుం గృతినాయకుఁడు. ప్రబంధరచనోత్పత్తికిం బ్రధానకారణభూతుఁ డయిన కృష్ణదేవరాయలు రాజ్యముచేయుచుండెడుకాలంబున మనయాంధ్రభాష ప్రబంధకవనంబునం బూజ్యతవహించె. మనయాంధ్రభాష యింకను నభివృద్ధి నొందవలయు ననుతలంపున దేశదేశంబులనుండి కవులను రప్పించి, సభలుచేసి, వారలం బరీక్షించి, సామర్థ్యానుసారంబుగ మాన్యంబు లొసంగియు, బహుమానంబుల నొసంగియు నిట్లనేకవిధంబులఁ బాటుపడుచుండి, కరంబుమెలకువగలిగి నేలనేలుచు, నిజాస్థానంబున నల్లసాని పెద్దన్న, నందితిమ్మన్న, అయ్యలరాజురామభద్రుఁడు, ధూర్జటి, మాదయ్యగారిమల్లన్న, పింగళిసూరన్న, రామరాజభూషణుఁడు, తెనాలిరామకృష్ణుఁడు ననునష్టదిగ్గజంబులం గలసి సర్వదాకవితాగోష్ఠిం గాలంబు

విలువగ గడపుచుండి, యెట్టకేలకుం దాను గవికులసార్వభౌముల సహవాసంబునం జేసి, ప్రబంధనిర్మాణదక్షుండై, యాంధ్రభోజుం డను బిరుదువడసి, సర్వజనవిశ్రుతుం డయి, చిరకాలయశంబు సంపాదించుకొని యున్న వాఁడు.

కృష్ణదేవరాయనికాలానంతరమున రాజ్యపరిపాలనముం జేయుచువచ్చినరాజు లెవ్వరు, సంతఁగా భాషాభివృద్ధికిం బాటుపడక యుండుటం జేసి, మనయాంధ్రభాష దినదినక్రమంబుగ క్షీణదశనొంద నారంభించెను. అట్లు గొంతకాలంబు గడచినయనంతరంబున, నేటికి రెండుమూఁడువందలసంవత్సరములకు వెనుక హూణదేశీయు లీహిందూదేశంబునకు వచ్చునప్పటికి; మన తెనుఁగుదేశం బంతయు స్వతంత్రులగు రాజులచేఁ బరిపాలింపఁబడుచువచ్చెను. ఈస్వతంత్రరాజులు గ్రమక్రమంబుగ నందఱు, హూణులకుం గప్పంబులు చెల్లింపవలసివచ్చెను. కొంతకాలము దేశమునందంతట నల్లుకొనియుండిన పూర్వపునల్లకల్లోలస్థితి యంతయు నడఁగినయనంతరంబునఁ గ్రమంబుగ హూణదేశీయులు మనహిందూదేశముయొక్క క్షేమాభివృద్ధికై శక్తివంచనం బొకింతయు లేక పాటుపడ నారంభించి, తొలుఁదొల్త, స్వదేశభాషాభివృద్ధికిం దగునదుపాయంబుల నెల్ల నెల్లెడల నెలకొల్పుచు, మనదేశభాషలనెల్ల నభివృద్ధిం జెందఁ జేయనారంభించి, ౧౮౫౭ వ సంవత్సరంబున నీచెన్నపురి సర్వకలాశాల నుస్థాపించిరి. కృష్ణదేవరాయనికాలానంతరంబున, జగ్గకవి, తిమ్మకవి, లక్ష్మణకవి మొదలయినయనేకు లమూల్యంబు లగుప్రబంధంబులను రచియించుచువచ్చినను, హూణభాష, దేశమునందంతటఁ బ్రబలనారంభించినయనంతరమం దాంధ్రదేశమునందంతటఁ బఠనీయగ్రంథంబులుగ నియమింపఁబడనర్హంబు లగునటుల నాకాలంబునఁ జెన్నపురిరాజధానీసర్వకలాశాలయం దాంధ్రోపాధ్యాయులుగనున్న పరవస్తుచిన్నయసూరిగారు, ,,బాలవ్యాకరణము,, ,,నీతిచంద్రిక-పూర్వార్థము,,ను సర్వజనసమ్మతంబుగ నుండి హృదయరంజకంబులుగ నుండునట్లు రచియించి, రచియింపనారంభించిన ,,నీతిచంద్రిక,, నంతయు ముగింపకయే కాలవశులైరి. చిన్నయసూరివిరచితం బని మన మిప్పుడనుకొనుచుండెడు బాలవ్యాకరణంబును రచియించినది, శ్రీస్థలకృష్ణమూర్తియను పండితుఁడే కాని, చిన్నయసూరిగారు కాదనియును, దానిం జిన్నయసూరిగారెట్లో సంపాదించి, స్వకృతంబుగఁ బ్రకటించెననియుం బలువురు చెప్పుచుందురు గాని, యందులకుం దగిననిదర్శనంబు లేవియుం గానరావు. ఛందోబద్ధంబు గాకయుండుట తక్క, మిగిలిన సర్వాంశంబులయందును బద్యకావ్యంబనియే చెప్పఁదగునటులం జిన్నయసూరిగారు రచియించిన ,,నీతిచంద్రిక,, యే మన యాంధ్రభాషయందు నిజం బగుమొట్టమొదటి వచనకావ్యం బని చెప్పవలసియున్నయది. అయ్యది ౧౮౫౩ వ సంవత్సరంబునం బ్రకటింపఁబడినది. అప్పటికీవీరేశలింగము పంతులవారు నాలుగైదు సంవత్సరంబులప్రాయముగలవారయి యుండిరి.



వర్తమానంబునఁ బ్రామాణికకవి యని యెన్నికగాంచుచున్న వీరేశలింగముపంతులవా రసాధారణసామర్థ్యంబును వెల్లడించుచు ,,శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధము,,ను బాల్యంబుననె రచియించియున్నారు. పంతులవారు నైషధంబు నించుమించుగ నిరువది యిరువదిరెండు సంవత్సరంబుల ప్రాయముగలవారయి యున్నసమయంబున రచియించియుండుటం జేసి, బాల్యదశను యోచించినచోఁ దిక్కనసోమయాజికాలము మొదలుకొని నేటివఱకు నున్నమనతెలుఁగుకవులలో నెవ్వరునిట్టి నియమములనుంచి గ్రంథముఁ రచియించినవా రొక్కరయిననుండి యున్నారాయని మనము తర్కింపవలసియున్నయది. ఇట్లు చెప్పుటచే, వీరేశలింగముపంతులువా రట్టితిక్కనసోమయాజికిం గలిగిన సామర్థ్యాధిక్యముకన్న నెక్కుడు సామర్థ్యమును గలిగియున్నారని చెప్పవలయునని నాయుద్దేశముగాదు. తిక్కన, బాల్యమున నిక్కనిర్వచననియమము

నుంచిమిశ్రమముగ నుత్తరరామాయణకథను రచించి యున్నారు. ఏకీభావసంపన్నతయన్న నేమియో యెఱుంగని మనహిందూసంసారములయందింత శీఘ్రకాలమున నింతటిగ్రంథకర్తయగుటంజూడ మనమొంతయు నాశ్చర్యంబొందవలసి యున్నయది. అట్లుచెప్పుటచే వీరేశలింగము పంతులువారు కారణము లేవియు లేకయే, యింతటిశక్తిసంపన్నులయి యున్నారని నేనెన్నఁడుం జెప్పంబోను. వర్తమానకాలస్థితిం బూని పరికింప, మనహిందూసంసారంబులయందలితలిదండ్రులయొక్కయుఁ గుమారులయొక్కయు విద్యాభ్యాసాంగంబులయందుఁ బ్రపంచముకన్న నత్యధికంబుగ వ్యత్యాసంబుండక మానదని, లేశమయినను సందియంపక చెప్పకమానువారెవ్వరు నుండరు. తలిదండ్రులు, కుమారులెట్లో యొకరీతిన నేయన్యాన్యోద్యోగంబుననో ప్రవేశించి, సంసారభారంబు నెంతశీఘ్రకాలంబున వహింపఁగలిగిన నంతసమర్థతాసంపన్నులని వారలం దలంచుచుందురు. కుమారు లెంతకాలహరణం బయిననుస్వచ్ఛందంబుగనె జీవనంబు సేయుఁదలంపు గలిగియుందురు. దేవాలయంబులు గట్టించి, యందు విగ్రహములు స్థాపించి, మూఢభక్తిచే నట్టిప్రతిమలనారాధింపవలయు నని తలిదండ్రు లధికోత్సాహంబు గలవారయి యుందురు. కుమారులో ద్వైతమే మిథ్య యని, యనేకోపన్యాసంబులు రచియించి, యన్యదేశమునం దంతటఁ బ్రబలఁ జేయవలయు ననుముఖ్యోద్దేశంబుల గలవారయి యుందురు. స్త్రీలకు విద్యయనావశ్యకం బని తలిదండ్రులమతంబుగ నుండును. స్త్రీవిద్య యత్యంతావశ్యకం బని కుమారు లుపన్యసింప నారంభించెదరు. స్త్రీపునర్వివాహంబులపేరు దలపెట్టినతోడనే తలిదండ్రుల కెంతయుఁ దలకంటకంబుగఁ గన్పడుచుండును. స్త్రీపునర్వివాహంబులు బాలవితంతువుల కత్యంత క్షేమాభివృద్ధికరంబు లనియు, దేశంబున కమితశ్రేయోభివృద్ధికరంబు లనియుఁ గుమారు లధికోత్సాహంబున మనసున నాటుకొనునట్లు



లం జెప్పనారంభించెదరు. పురాణాదులయందుఁ దలిదండ్రు లధికాదరంబు గలవారయి యుందురు. కుమారులుపురాణాదుల నెల్లఁ గల్పితకథలనునిశ్చితాభిప్రాయంబు గలవారయి నిరసించుచుందురు. మొక్కులు, సమారాధనములు, గ్రామదేవతలు, బలులు మొదలయినవానియందెల్లను దలిదండ్రులు పరమభక్తి తాత్పర్యంబు గలవారయి యుందురు. కుమారు లయ్యవి యన్నియు మూఢదురాచారంబు లని తలంచి, యట్టిదురాచారపిశాచములనెల్ల జనులను వదలునట్లుచేయునదుపాయంబుల నెల్లసర్వదా చింతించుచుందురు. వేయేల? హిందూదేశంబున నెక్కడనో తక్క మిగిలినయన్నిసంసారంబులయందు నున్నవార లందఱు, వేఱువేఱుమహానదులం బోలుచు, వేఱువేఱుమహాసముద్రంబులం గలిసెడియూహలం గలిగి యుందురు. జనులయం దేకీభావసంపన్నతయే కుదురుపడక యుండినచో, వారలమనసులకు స్థిమితంబుగలుగ నేరదుగదా! మనస్స్థిమితంబు లేనిచో! గ్రంథరచనంబు జరుగుటయెట్లు? హిందూసంసారస్థితిగతు లిట్టిదుస్స్థితియందున్నకాలంబున నింతింతని చెప్పనశక్యం బగుదుస్తరంబయినకష్టసముద్రంబున నీది యీది, పారముఁ జేరి, మనయాంధ్రదేశీయులహృదయంబుల నత్యంతాశ్చర్యంబును, నమితసంతోషంబును, నద్భుతవిచారంబును గలుగఁజేయుచుండినవీరేశలింగము పంతులవారియెడల మనయాంధ్రదేశీయు లెంతకృతజ్ఞత గలవారయి యుండవలయునో, మీరలే యోచింపుఁడు. ఇట్లుచెప్పుటచే మనయాంధ్రదేశీయు లందఱొక్కవీరేశలింగముపంతులవారియెడలనే కృతజ్ఞతగలవారయి యుండవలయునని నాయభిప్రాయంబుగాదు. వస్త్రాభరణాభ్యంజనాదులయందలిదృష్టియటుండఁ, బ్రాణరక్షణంబున కత్యంతావశ్యకంబులయిన నిద్రాహారంబులపయి సహితము దృష్టి నుంచక యహోరాత్రంబులఁ బాటుపడుచుండెడు ప్రతిగ్రంథకర్తయెడలను మన మందఱము నెంతయుఁగృతజ్ఞులమయి యుండవలయును.

హిందూదేశంబులో, ముఖ్యంబుగ మనయాంధ్రదేశంబున, నధిక
ప్రయాసమునందినంగాని గ్రంథకర్త లగుట కరంబు దుష్కరంబనియే,
చెప్పవలసియున్నయది. బాల్యంబుననే, తలిదండ్రులో, లేక తల్లియో
తండ్రియో సజీవులై యుండెడికాలంబున, గ్రంథకర్త యగుట యెంతయు
దుస్సాధ్యంబుగనుండఁగా, నిట్టియపూర్వసామర్థ్యంబును వెల్లడించునట్టి
గ్రంథంబులను బాల్యదశయందె రచియించుటకు వీరేశలింగముపంతు
లవా రెట్టిట్టి బాధలనందియుండవలయునో, యాపంతులవారికే తెలియ
వలెను; లేదా, సమర్థతాసమర్థతలంగాని, సమయాసమయంబులం
గాని, యొకింతయు మనంబునఁ జింతింపక, తలకుమీఱినకార్యంబుల
నెఱవేర్పఁదలంపుగలవారలకుం దెలియవలయునుగాని, తదితరులకుం
దెలియుట సులభసాధ్యంబుగాదు. బాల్యమునందే పంతులవారు జీవి
తకాలమునందంతటను గ్రంథకర్త పదవియందే యుండవలయుననినిశ్చ
యించుకొని యున్నారు. కావున, వారిని జిరకాలగ్రంథకర్తయని
చెప్పవచ్చును. చిరకాలగ్రంథకర్తయనగాఁ జిరకాలసుఖియనియును,
జిరకాలమనోరోగి యనియునేకదా? యథార్థము! గ్రంథకర్త లనుభవిం
చుచుండెడి కష్టసుఖంబు లెల్లను స్వానుభవైకవేద్యంబులేకాని మాట
లఁజెప్పుట యెవరికింగాని సుకరంబుగాదు. ఒకనిముషంబున నపరిమితమైన
సంతోషంబు మనసునకుం గలుగుచుండును. రెండవనిముషంబుననె
యపరిమితం బగువిచారంబు మనసునకుం గలుగుచుండును. అపరిమిత
సంతోషంబువలనను నపరిమితవిచారంబువలనను నొక్కొక్కసమయం
బున శిరసునందలి యూహాలన్నియు నొక్కసారిగఁ, గపాలోపరితలభా
గంబును, శిరసుయొక్క కుడియెడమభాగంబులను భేదించుకొని బయ
లువెడలుననియుం దోఁచుచుండును. నిరంతరగ్రంథరచనాభ్యాసం బే
కాంతనివాసస్వభావంబున కలవాటుపడంజేయును. శాంతస్వభావంబు,
భయము, సాహసము, గోపము, గారుణ్యము, పట్టుదలయు మొదలైన



యూగుణంబుల నెల్ల మహోన్నతపదవికి వచ్చునటులం జేయుట సిద్ధం
బు. తలిదండ్రులు జీవించియుండెడి గ్రంథకర్తల కందఱకును రచియిం
చెడి పుస్తకంబులసంఖ్యనుబట్టియు, వానిసామర్థ్యముంబట్టియు, నాలిము
చ్చుతనంబును, నేలచూపులునుగొంతవఱకుండప్పక స్వభావగుణంబు
లుగ మాఱుచుండును. అట్టివారల కందఱకు దేహదార్ఢ్యాదులంబట్టి
శీఘ్రకాలంబుననో, దీర్ఘకాలంబుననో శిరసునందును, నేత్రంబులయం
దును, మెడయందును నడుమునందును, మణిబంధమునందును, దేహ
ముయొక్క ప్రతియవయవంబునందును హృత్క్లేశపుంజంబునందును
నిట్టివియని చెప్పుటకెంతయు సాధ్యంబులుగాని బాధ లుదయించు చుం
డును. హృత్క్లేశపుంజంబునందలి బాధతక్క మిగిలినయన్ని బాధలు
నేదియైనను నౌషధంబు సేవించినను సేవింపకయున్నను గ్రమక్రమంబుగ
నిశ్శేషంబులై హరించుచుండును. హృదయపీఠికయందలి బాధమా
త్రము యుక్తసమయంబున నుచితౌషధంబును సేవింపకయుండినచో,
నయ్యది దినదినక్రమంబున నభివృద్ధిఁజెందుచుఁ, జిట్టచివరకు వీడనిదగ్గు
గ మాఱి, మరణపర్యంతంబును బాధించుచునే యుండును. అయ్యది
ముఖ్యంబుగఁ బ్రతిశీతకాలారంభమునను బ్రారంభించి, ప్రతివేసంగికా
లారంభమునను నుపశమిల్లుచుండును. నిరతాలోచనంబునం జేసి, ఫాల
తలంబుయొక్కయుఁ, గటప్రదేశంబులయొక్కయు, నేత్రంబులయొక్క
యు, లోపలిభాగంబులతో సంబంధించియుండెడు నరంబులెల్లను బ్రబలి
యొక్కొక్క సమయంబున మితిమించిన యుష్ణత యుదయించి, నేత్రం
బులు టప్పునఁ బగులుననియుం దోఁచుచుండును. గ్రంథరచనంబునం
గష్టసుఖంబు లత్యధికంబులుగ నుండుటం జేసి, యొక్కొక్కసమయంబు
నఁ బ్రపంచకంబుపయి నపరిమితకోపంబును, నమితసంతోషంబును, నధి
కవిచారంబును, మనసునకుంగలుగుచు, నొకసమయంబున నకాలమర
ణంబు సంభవించిన నెంతయు సుఖంబుగ నుండుఁగదాయనియును, నిం

కొకసమయంబున మనుజుండు పూర్ణంబుగ శతసంవత్సరంబులైనను జీవించుటయే స్వభావనిశ్చితశాసనంబుగ నుండిన గ్రంథకర్తలునూరులకొలఁది గ్రంథంబులు రచియించుటకు సమర్థులై యుందురుగదా యనియును, మఱియొకసమయంబునం జేతనైనకొలంది నించుకైనం గాలహరణంబును జేయనొల్లక దేశక్షేమంబునకై పాటుపడి, మనకుంగలపరోపకారకాంక్ష జనులమనసున స్థిరపడఁజేయఁ బ్రయత్నింపవలయుననియుం దోఁచుచుండును. గ్రంథకర్తలకుం గలుగుచుండెడుబాధల నెల్లఁ బరిపూర్ణంబుగ నిటఁదెలిపినచో, నయ్యవి బాల్యంబుననె గ్రంథకర్తలు గావలయు ననుతలంపుగలవారల మనోత్సాహంబున కెంతయు భంగకరంబులుగ నుండకమానవు. కావున నట్టి కష్టసుఖంబులంగూర్చిన యంశంబుల నెల్లనుజాలించి, యింక వీరేశలింగముపంతులవారికవిత్వముంగూర్చియు, గ్రంథరచనావిధానముంగూర్చియుఁ, బత్రికావిలేఖనముంగూర్చియు, ముద్రాయంత్రస్థాపనముంగూర్చియు, మతవిషయముంగూర్చియు, నాంతరంగికస్వభావముం గూర్చియు, బాలురకు విద్యనుగఱపు రీతినిఁగూర్చియు, నుపన్యాసంబులొసంగు మార్గముంగూర్చియుఁ, బ్రార్థనామందిరముంగూర్చియు, స్త్రీపునర్వివాహంబులంగూర్చియు, నింక జీవితకాలంబును గడుపనిశ్చయించినరీతిం గూర్చియుఁ దదితరాంశంబులంగూర్చియుఁ గొంచెమిట నుదాహరించి పిమ్మటఁ జరిత్ర మారంభించెదను.

వర్తమానంబున మనయాంధ్రదేశమునందంతట మొట్టమొదఁటి రాజమహేంద్రవరపుకవి యని ప్రసిద్ధివహించుటకుం దగినవారలు వీరేశలింగముపంతులవారే యని చెప్పవలసి యున్నయది. పంతులవారిచే రచియింపఁబడిన యాంధ్రకవులచరిత్రమునందలి పీఠికయందున్న „పురాణములను బ్రబంధములను స్మృతులను తెలుఁగునఁ జేసినవారు నాకిప్పటికి నూటయేఁబది మందికంటె నధికముగాఁ గానఁబడుచున్నారు. వారిచరిత్రములన్నియు నీగ్రంథమం దుండును,, అనుదానింబట్టి యోచించినచో వీరేశలింగముపంతులవారిమతానుసారంబుగ, నట్టివారలనుమాత్రమే మన మిప్పుడు కవులనుగాఁ బరిగణింపవలసి యుండును. ఎట్టు లైనను, నిశ్చయించుటకు ముందుగఁ గవిశబ్ద మెట్టివారలయందు వర్తించునో కొంచెము యోచింతము. కవిశబ్దంబునకుం గావ్యమురచియించినవాఁ డని యేకదా యర్థము. మనపూర్వకవులలోని నన్నయభట్టారకాదులు పురాణములం దెనిఁగించియున్నారు. పెద్దనాదులు ప్రబంధములను రచియించియున్నారు. శ్రీనాథాదులు కావ్యములం దెనిఁగించి యున్నారు. అట్టివారలందఱాప్తులగుటం జేసియే, కవులుగఁ బరిగణింపఁబడు చున్నారు. వర్తమానంబున మనవారలలో విశేషంబుగ వచనకావ్యంబులను రచియించువారలు నాటకములం దెలిఁగించువారలుమాత్రమే కానఁబడుచున్నారుగాని, పురాణములం దెలిఁగించువారలుగాని, ప్రబంధములను రచియించువారలుగాని, స్మృతులను దెనిఁగించువారలుగాని యెక్కడనంతగ గానఁబడకయే యున్నారు. మనపూర్వులలోఁ దెలుఁగుకవు లెవ్వరును నాటకములం దెనిఁగింపకుండుటం జేసి, యిప్పుడు వీరల నందఱను గ్రంథకర్తలనిపిలుచుట సముచితమో, లేక, కవులనిపిలుచుటయే సముచితమో, యని మన మిప్పుడు సంశయింపవలసియున్నయది. అట్టివిషయముంగూర్చి నేనుమాత్ర మిప్పు డేదియు నిశ్చయింపఁబోనుగాని, యేవిషయమునం బరిశీలించి చూచినను, గవియని చెప్పుట కనేకనిదర్శనంబు లుండుటంజేసి, వీరేశలింగముపంతులవారినిఁ గవియని చెప్పుటకుమాత్రము లేశమైనను సంశయంబులేదు. పంతులవా రచ్చతెనుంగున నొకమహాకావ్యమును రచియించియున్నారు. రసవంతముగ నొకప్రబంధమును సహితము రచియించియున్నారు. నాటకములంగూడ తెనిఁగించియే యున్నారు. స్వకపోలకల్పితముగఁ బద్యగద్యాత్మకముగ ననేకగ్రంథములు రచియించియేయున్నారు. ఇదియంతయు సర్వజనసుప్రసిద్ధంబుగనే యున్నది. వీరేశలింగముపంతులవారు రాజమహేంద్రవరంబుననె జన్మిం

చియుండుటంజేసి, పంతులవారినే ముందుగ రాజమహేంద్రవరపుకవి యని చెప్పవలసియుండును. రాజమహేంద్రవరమునఁగాక, యెక్కడనో జన్మించి, యెక్కడెక్కడనో విద్యాభ్యాసంబుగావించి, యుద్యోగములనే కారణములుగఁ జేసికొని రాజమహేంద్రవరమునకువచ్చి, గ్రంథములను రచియించుచుఁ బ్రఖ్యాతిగాంచు చున్నవారలను, రాజమహేంద్రవరపుకవు లనిచెప్పుట సహేతుకముగనుండునో, యిక్కడనెజన్మించి, యిక్కడనె విద్యాభ్యాసంబుగావించి, యిక్కడనె యుద్యోగమును సంపాదించి, యిక్కడనె యనేకగ్రంథములను రచియించి, యాంధ్రదేశమునం దంతట ఘనకార్యములే, కారణముగఁజేసి, యపరిమితంబగుయశంబును సంపాదించి, చరిత్రకారునకుఁ దప్పక యమితసంతోషము, నపరిమితవిచారము, నమితాశ్చర్యము, నమితభయము, గలుగునటుల నించుమించుగ బాల్యమునుండియు జీవితకాలమును మార్గప్రదర్శకముగ నుండునట్లు మిగుల విలువగ గడపుచున్న వీరేశలింగముపంతులవారిని మొట్టమొదఁటిరాజమహేంద్రవరపుకవి యని చెప్పుటయే సహేతుకముగనుండునో, యయ్యది, యవిచారణీయాంశం బగుటంజేసి యిట వేఱుగఁ జెప్పనక్కఱయే లేదు.

పంతులవారు నేటి కించుమించుగ నాంధ్రభాషయందలియన్ని గ్రంథములను సావధానముగఁ బరిశీలించుచుఁ జదివియున్నారు. అందు విశేషగౌరవముతోడను, శైలి నవలంబింపవలయు ననుముఖ్యోద్దేశముతోడను, సోమయాజివిరచితమైనభారతభాగము నంతయుఁ బలుమఱు చదివియున్నారు. దానంజేసియే, పంతులవారికవితాధోరణి యనేకవిషయములఁ దిక్కనసోమయాజి కవిత్వమును బోలుచుండును. శృంగార రసంబునకును, హాస్యరసంబునకును వీరేశలింగముపంతులవారు పెట్టినది పేరు. ఈయనకవిత్వమునకుం గడుమాధుర్యమును గలుఁగఁజేయున



ట్టిప్రధానాలంకారము స్వభావోక్తియే యని చెప్పఁదగి యుండును. స్వభావవర్ణనంబుల కిరవగు నింగిలీషువిద్య నభ్యసించువిద్యార్థులకుం గరంబు హృద్యంబుగ నుండుటకు ముఖ్యకారణం బదియే యయి యున్నయది. ఈయనకవిత్వమునఁ గఠినము లగువిశేషణములుగాని, గూఢపదములుగాని, యన్వయకాఠిన్యముగాని, యతికఠినసంస్కృతపదకలితదీర్ఘసమాసంబులుగాని, యెక్కడను గానుపింపవు. ఇవియే, యీయన గ్రంథములు జనసామాన్యమునం దనివార్యం బగునాదరణంబు నొందుటకుఁ బ్రధానకారణములుగ నున్నయవి. ఈయనకవిత్వమునందలివిచిత్రమై యతిమనోహర మగుగమనిక యెంతయు విశేషముగ ద్విపదలయందును, సీసపద్యములయందును గానిపించుచుండును. కవిత్వము ద్రాక్షాపాకమయి మిగుల రసవంతముగ నుండును. ఈయన కవిత్వమునను బాదపూరణంబునకయి తెచ్చిపెట్టుకొనెడివ్యర్థపదము లెక్కడనంతగాఁ గానిపింపవు. అభిప్రాయంబు లెల్లను ధారాళంబుగఁ బాదపాదంబులనె యిమిడి యుండుటంజేసి, పద్యంబులు చదువుట కెంతయు మనోహరంబులుగ నుండును. ఈయనకవిత్వమునందు యతి సార్థక మని చెప్పఁగలను. ఏయేపదము లేయేస్థలముల యందుండవలయునో, యాయాస్థలముల కింతయుఁ బ్రయత్న మక్కఱలేకయే, యయ్యవి తమంతటఁ దామె సిద్ధ మగుచుండునట్లు కనుపడు చుండును. ఈయన, ధ్వనియే ప్రధానంబుగఁ జేసికొని, నిరర్థకము లగుపదముల నెక్కడను బ్రయోగించునట్టి స్వభావంబు గలవారుగారు. పదములకూర్పు మాత్రమె కాక, యర్థసందర్భమును మిక్కిలి పొందికగా నుండును. ఏవిషయంబుల జెప్పినను,మిగులయుక్తియుక్తంబుగను,గరంబుప్రౌఢంబుగనుండుచుండును. అందులకు "జన్మాంతరము," మొదలగు నుపన్యాసరత్నంబులె ప్రబలనిదర్శనంబులు. చదువరులకుం జూచినతోడన, సులభంబుగ బోధపడునట్లు తమయభిప్రాయంబులనెల్ల నన్వయకాఠిన్యంబనునది లేశంబును

లేనిసులభమయి మృదుమధుర మయినపదములతోడం గూడినశైలినిఁ దెలుపుటయం దీయనకుం గలసామర్థ్యం బవర్ణనీయంబయి యున్నయది. కవిత్వము లోకోక్తులతోడం గూడి, జాతీయంబుగ నుండును. కావున వీని కవిత్వముంబూని పరికించువారలు సోమయాజికిం గలకవితానైపుణ్యము నందుట కీయన చాల కాలమునకు వెనుకనె సమర్థులై యున్నారని చెప్పక మానరు. వీరేశలింగము పంతులవారు కవిత్వముం జెప్పుటకారంభించి, నేటి కించుమించుగ నిరువది యిరునది యైదు సంవత్సరములు గావచ్చినను, పంతులవారు నేటికి రచించినపద్యములు మూడునాలుగు వేలకంటె నధికంబుగ లేవు. ఇట్లు చెప్పుటచే, నిన్ని సంవత్సరంబులకు రచియించిన పద్యంబుల సంఖ్య యిదియేనా యని కొందఱడుగవచ్చునుగాని, యితరు లెవ్వరైనను నూరుసంవత్సరంబులకైనం జేయఁజాలని కార్యంబుల నెఱవేర్చిన వీరేశలింగము పంతులవారి సామర్థ్యంబు నిటు విశదీకరించినచో నట్టివారలందఱు పద్యంబులసంఖ్యకే యెంతయు సంతసింపక మానరు. మఱియు నించు మించుగ మూడు నాలుగు వేల పద్యములను వేఱు వేఱు గ్రంథంబుల రచియించిన వీరేశలింగము పంతులవారిని, శ్రీ మదాంధ్ర భారతంబున రమారమి యిరువది ముప్పది వేల పద్యములు గలుగునట్లు లేకధారగఁ బదునైదుపర్వములను రచియించినతిక్కనసోమయాజితోడం బోల్చుటకు వీలుపడునా యని ప్రప్రథమంబునఁ గొందఱడుగవచ్చును గాని, పంతులవారు రచియించిన యన్నిగ్రంథంబులం జదివి విమర్శనతోడం బరిశీలించి చూచినప్పుడుమాత్ర మట్టివారలు వీరేశలింగము పంతులవారికవిత్వము, పదలాలిత్యమునందును, యుక్తిబాహుళ్యమునందును, నర్థగౌరవమునందును, రచనాచమత్కృతియందును, శయ్యావిశేషమునందును, సందర్భశుద్ధియందును, గల్పనాకౌశలమునందును సోమయాజికవిత్వముం బురుడించుచుఁ గరంబు వరలుచుండు నని చెప్పక మానరు. శ్రీ మదాంధ్రభాగవతమును రచించిన



పోతరాజు తనగద్యములయందు ‹‹సహజపాండిత్య,, యని వేసికొని యున్న విటీవల రచియించిన ‹‹వీరభద్రవిజయము,, నందొక పద్యంబునందనకుఁ గలపాండిత్యము నంతయుఁ దనతండ్రి యగు కేతనార్యుని యనుగ్రహమున సంపాదించియున్నానని వ్రాసికొని యున్నాఁడు. కావున దీనింబట్టి యోచించినచోఁ బోతన, గురుముఖంబున విద్యనభ్యసించియే యున్నాఁడని చెప్పవలసియున్నయది. వీరేశలింగము పంతులవారో, కేవలము స్వయంకృషివలననే యిట్లు నిరుపమానమయి, సర్వజన శ్లాఘాపాత్రంబుగనుండునట్టులు కవిత్వముఁ జెప్పుటకు సమర్థులయి యున్నారు. దానంజేసి మన మిప్పు డీయనను సహజపాండిత్య సంపన్నులని చెప్పుటకింతయు సంశయము లేదుకదా!

మనపూర్వకవులయం దొక్కొక్కకవి యొక్కొక్కసంపూర్ణసామర్థ్యమును దనగ్రంథంబుల వెల్లడించి యున్నాఁడు. కాని, పంతులవారు తమ కన్నివిషయంబులం గలయమితసామర్థ్యమును వెల్లడించుట కెంతయుఁ బాటుపడుచు సఫలీకృతమనోరథులయియుండుటను మనము చిరకాలమునుండి చూచుచునే యున్నారము. ఆయాకార్యములు, నాయాగ్రంథములును, వారికిం గలయసాధారణ సామర్థ్యమును, మితిమించినయోపికను వెల్లడింపక మానవు. అనేకవిషయములం దమితసామర్థ్యమును గలిగియుండుటం జేసియే, వీరేశలింగముపంతులవారికి, స్వభావసిద్ధంబుగనున్న నిజంబగుకవితాసామర్థ్యంబు సమసిపోయినదనియే చెప్పవలసి యున్నయది. పంతులవారిని మన తెనుఁగు కవులతో విశేషంబుగఁ బోల్చి చూచుటకంతగా వీలుపడదు. కాని, యొక్కొక్కవిషయమునం దింగ్లీషుకవులలో నొక్కొకనితోడం బోల్చుట కింతయు సంశయం బుండదు.

వీరేశలింగముపంతులవారిజీవితకాలమునుగూర్చి విశేషముగ నెఱిఁగినవారలందఱు, పంతులవారిజీవితకాల మనేకవిషయముల, హూణకవిచరిత్రకారుఁడును, ప్రథమనిఘంటునిర్మాణదక్షుఁడును నగుజాన్సనునకవీశ్వరునిజీవితకాలముతోఁడఁ దులతూఁగు చుండునని చెప్పకమానువా రెవ్వరు నుండరు. ప్రదేశ వర్ణనములు మొదలైనవానినిగూర్చి మిగుల మనోహరముగ నుండునటుల గ్రంథములను రచియించుటయందును, సంసారభారంబును వహించుటకుఁ గొంతకుఁ బూర్వంబున నే యుద్యోగమునం జేరుటకును స్థిరంబగునభిప్రాయము లేక, సర్వదా గ్రంథరచనోద్యోగముననె మనమును గీల్కొల్పియుండుటయందు, నంత విశేషముగఁ గాకపోయినను, వక్తృత్వమునకును గ్రంథరచనమునకును దారతమ్యము గలిగి యుండుటయందు నీయనవిశేషముగ, నాలివరు గోల్డుస్మిత్తును కవీశ్వరుం బోలుచుండురు. తమగ్రంథములపై నితరు లెవ్వరైనను గేవలమీర్ష్యభావముననో, లేక, యజ్ఞానముననో యయుక్తవిమర్శనముల బ్రకటించినం జూచిమాచి, యూరకుండనేరక మిగుల యుక్తముగ నుండునటుల మరల విమర్శనములఁ బ్రకటించి, వారల నందఱఁ బరిహాసపాత్రులనుగఁ జేయుటకుఁజాలిన యావన్మాగ్రహమును గలిగియుండుటయం దల్జాండరుపోపనుకవీశ్వరునింబురుడించు చుందురు. వ్రాయఁదలఁచినదానిని జక్కఁగ మనసుననె యోచించి, మఱల మార్పులేవియు లేకయుండునటుల గ్రంథములను రచియించుచుఁ దాము వ్రాసినగ్రంథముల నెవ్వరికిని జూపకయే, రచియించినతోడన ముద్రితములుగఁ జేయుటయందును, ముద్రింపఁబడినగ్రంథముల నెప్పుడును మఱలఁ జూడకుండుటయందు నీయన డ్రైడ సనుకవీశ్వరుని, బోలుచుందురు. జనులయాచారవ్యవహారములను జక్కఁజేయఁదలఁచి హాస్యసంజీవనులు ప్రకటించుటయం దీయన నెడిసను మొదలైన యింగ్లీషు కవులనేకుల తోడంబోల్పవచ్చును.



పంతులవారు నేటికి రచియించినగ్రంథములసంఖ్యను జూచియే పలువురు పలువిధములఁ బ్రస్తుతించు చుందురు. ఈయనకుఁ గలసామర్థ్యమునకు నోపికకునీసంఖ్య యొకసంఖ్యయే కాదని నాయభిప్రాయము. పంతులవారు గ్రంథములను వ్రాయ నారంభించి, నేటి కించుమించుగ నిరువది యిరువదియైదు సంవత్సరములు గావచ్చినది. ప్రహసనాదులు మననునం దలఁపక, సంవత్సరమునకు రెండేసిగ్రంథములు రచించినను, ,,రసికజనమనోరంజనము,, ,,రాజశేఖరచరిత్రము ,, మొదలైనగ్రంథములవంటిగ్రంథములను, నేటికధమము, నలువదియైనను రచించియుండవలయును. అటుల, గ్రంథముల నింకను రచింప కుండుటకుఁగారణము పంతులవా రసమర్థు లగుట యని నేనెప్పుడును జెప్పఁబోను. వెనుకటివర్ణనంబులనెక్కైకొనుచు, ,, రసికజనమనోరంజనము,, వలెఁ బ్రబంధములను రచియింపవలె నని వీరేశలింగముపంతులవారి యభిప్రాయము గాదు. ఆంధ్రభాషయందు నవీనగ్రంథములను రచియింపవలయు ననియే పంతులవారిముఖ్యాభిప్రాయము. ,,రాజశేఖర చరిత్రము,, వంటి యుపయుక్తములగువచనప్రబంధములను రచియింప కుండుట కాచరిత్రము తాముతలంచిన యాదరణమును విద్యాశాఖవారి యందును జనసంఘమునందు నంతగాఁ గనకుండుటయే యనిచెప్పఁగలను. జనులదురాచారవ్యవహారములను జక్కఁగ వెల్లడించు చుండెడివచనప్రబంధములు మన తెనుఁగునం దింతకుము న్నెవ్వరును రచియించి యుండలేదు. అట్టి గ్రంథములలో నీరాజశేఖరచరిత్రమే మొట్టమొదఁటిదిగ నున్నది. ఇదియే మొదటివచన ప్రబంధం బయినను నయ్యది, యొంతటిసంపూర్ణస్థితి యందుండి యెట్టిగౌరవంబునకుం బాత్రంబుగ నున్నదియు నందలి యొక్కప్రకరణంబు నయినను గొంచె మోపికతోడం జదివిచూచినచో నిట్టిచరిత్రంబులం జదువుటవలన జనసంఘంబునకుం గలిగెడిలాభంబులు నులభంబుగ బోధపడక మానవు. ఏదేశంబునను జనులనుఖాసుఖంబు

లాయాదేశంబులయందలి మతాచార వ్యహారాదులననుసరించియేయుండును. కావున దేశీయులసౌఖ్యాభివృద్ధి నపేక్షించువార లందఱు ముఖ్యముగ నిట్టి వచనప్రబంధములసంఖ్యనే యభివృద్ధిపరుపఁ బ్రయత్నింపవలయుననియే నాముఖ్యోద్దేశంబుగ నున్నయది.

పంతులవారు రచియించినయన్నిగ్రంథంబులలో నొక్క నీతిచంద్రిక విగ్రహము,ను మాత్రము దూరంబుననుంచి, మిగిలిన యేగ్రంథమును జూచిన నేయుపన్యాసంబును జూచిన నాద్యంతముపఱకొక తెఱంగున నుండెడియోపికయునోర్పును, మృదుమధురమైనసులభశైలియును గరం బచ్చెరువుగఁ జదువరుల కెఱుకపడక మానవు. వర్తమానంబున, ననేక విషయములయందు, వీరేశలింగము పంతులువారే మార్గప్రదర్శకు లని చెప్పవలసి యున్నది. ఈయన యనేకవిధము లగుగ్రంథములను రచియించియున్నారు. కావున, నిఁక నెవ్వరేగ్రంథమును రచియించినను, వీరలే యట్టివారల కందఱకును మార్గప్రదర్శకులుగనుండు రనుటకు సందేహము లేదు. ఈయన, యేవిషయమున గ్రంథమును రచియించినను, నయ్యది నవీనంబుగ నుండుటయే కాక, యయ్యది సర్వాంశంబులయందును సంపూర్ణస్థితియందే యుండుననుటయును నిర్వివాదాంశమే యగును. వర్తమానంబున, శుద్ధాంధ్రమునఁ గరంబు రసవంతంబుగ నుండునట్టుల గ్రంథములను రచియించినది వీరేశలింగము పంతులవారు. వచనప్రబంధంబులన్న నేమియో యెఱుంగని మనయాంధ్రభాషయం దట్టిగ్రంథములను రచియించియున్నది వీరేశలింగముపంతులవారు. మన తెనుఁగుభాషయందుఁ బ్రకృతిశాస్త్రంబులు లేనిలోపంబును నివారింపఁ బ్రయత్నించి, శారీరశాస్త్రంబును రచియించి, యింకను, జ్యోతిశ్శాస్త్రము మొదలగునట్టి శాస్త్రంబులను భాషాంతరీకరించియున్నది వీరేశలింగముపంతులవారు. ఉపన్యాసధోరణియన్నకలలో నివార్తగ నున్నమన యాంధ్రభాషయందు నిజమగునుపన్యాసధోరణిని



గల్పించినది వీరేశలింగముపంతులవారు. జనసంఘంబునకు సుఖాభివృద్ధిని గలుగఁజేయుటలందు, మతాచార వ్యవహారాదులం దొక్కఁగ మార్పులుగలుగఁజేయఁ బ్రయత్నించియున్నది వీరేశలింగముపంతులవారు. కావున, నిన్నియంశములఁ బ్రవీణు లగుటకుఁ దగిన యట్టిజ్ఞానసంపదనుసంపాదించుటకీయన యెంతెంత పాటుపడి, యెన్నెన్నికష్టంబుల పాల్పడి యుండవలయునో చదువరులే యూహింపఁ దగును.

ఈయన, ప్రారంభమునుండియు, తాము వ్రాయున దేదియైన నాబాలవృద్ధంబుగ నందఱకును సులభంబుగఁ దెలియవలయు ననుముఖ్యోద్దేశంబు గలవారై యున్నారు. పంతులవా రట్టియుద్దేశంబు నెంతచక్కఁగ నెఱవేర్చియుండినదియును మనమందఱమును గన్నులారఁ జూచుచునేయున్నారము. పత్రికలయందంశంబులంగూర్చి వ్రాయుటయందును, చదువరుల హృదయంబుల కాహ్లాదంబును గలిగించునట్టియంశముల నేర్పుటయందును, వారికి గలవిచిత్రసామర్థ్యం బెంతయుఁ గొనియాడఁ దగి యుండును. గ్రంథాదులం బీఠికలంబలె, పత్రికలయందు విజ్ఞాపనంబులు వ్రాసి, జనుల హృదయంబుల నాకర్షించుటయం దీయనకుంగల సామర్థ్యం బలవఱ్చుకొనుట యితరుల కంతగా వీలుపడదు. ఈయన యిన్నిగ్రంథములు రచియించుటకు ముఖ్యకారణం బితరగ్రంథకర్తలకంటె నీయనకుంగల పలువిధములగు నాధారములుగలిగియుండుటయే యని చెప్పఁగలను. ఈయన స్వకపోలకల్పితంబుగ గ్రంథములను రచియింపఁగలరు. సంస్కృతమునుండియు హూణభాషనుండియు నేవిషయములను గూర్చినగ్రంథముల నైనను బరిశ్రమంబును బ్రయత్నంబు ననుసదియొకింతయుఁ గనుపడకుండునట్టులు హృదయరంజకంబుగ భాషాంతరీకరించునట్టిసామర్థ్యం బీయనకు విశేషంబుగాఁ గలదు. పలువిధంబు లగుగ్రంథములను రచియించుటయట్లుండ, నన్నిగ్రంథంబుల నొక్కసారిగ నారంభించి, యాయాగ్రంథములకుఁ గావల

సినరసములు లేశంబును చెడకుండ నెంతయు మనోజ్ఞంబుగఁ దత్తదుచితగతుల గ్రంథములను రచియించుసామర్థ్యంబుకూడ పంతులవారు విశేషంబుగఁ గలిగియున్నారు. ఒక్కకాలముననె సంస్కృతంబునుండి యొకగ్రంథమును, హూణ భాషనుండి యొకగ్రంథమును భాషాంతరీకరింప నారంభించియు, స్వకపోలకల్పితముగ నొకగ్రంథమును వ్రాయ నారంభించియు, నడుమనడుమ రసవంతములుగ నుండునటులు హాస్యసంజీవనులను బ్రచురించుచు, నెడనెడ నుపన్యాసములు మిగుల గభీరధోరణిం బ్రచురించుచు, మీఁదుమిక్కిలి యాంధ్రభాషాభిమానులగువారలందఱుందమచేతనగు ప్రోత్సాహంబును గలుగఁజేసినచో శ్రీవివేకవర్ధని, బ్రతిదినంబునను బ్రచురించుటకుం దగిన సామర్థ్యంబును సహితము వీరేశలింగముపంతులవారు కలిగియే యున్నారని నేను ధైర్యముతోఁ జెప్పఁగలను. వర్తమానంబున నిట్టియపూర్వసామర్థ్యమును గలిగియున్నవానిని మఱియొకని వేలు మడచి చెప్పఁ బ్రయత్నింపుఁడు. అట్టిశక్తిసంపన్నుని నామధేయంబును విని సంతసింతము. ఇట్లు చెప్పుటచే నీయనకుం గలసామర్థ్యంబుతోడం దులతూఁగుసామర్థ్యం బితరులకు లేదనునదియే నాముఖ్యోద్దేశము గాని, వీరేశలింగముపంతులవారు సర్వవిషయంబులఁ బరిపూర్ణసామర్థ్యంబుగలవారని, నేనుసాహసించి చెప్పఁజాలను. పంతులవారిటీవల రచియించిన గ్రంథములను, బాల్యమున రచియించిన గ్రంథముల నించుక సావధానంబుగఁ బరిశీలించి, నిపుణముగఁ జూచువారలకందఱకును, వీరేశలింగముపంతులవారు, కాలము ననుసరించియు, జనుల యభిరుచి ననుసరించియు, గ్రంథములను రచియించునట్టి స్వభావంబు గలవారలే కాని, తమకుంగలసామర్థ్యము ననుసరించి గ్రంథములనురచియించునట్టి స్వభావముగలవారలు కారని సులభముగ తెలియకమానదు. కాలమునకుఁ దగినటుల గ్రంథములను రచియించుట కితరులంతగా సాహసింపఁ జాలరు. సాహసించినం బ్రయోజనము నంతశీఘ్రకాలమునఁ గానఁ



బడదు. ఇట్లు చెప్పుటచే నితరు లెవ్వరు నట్టిగ్రంథములను రచియింపఁ గూడదనికాని, రచియించినచో లేశమును వారలకుఁ బ్రయోజనం బుండదని కాని నాయభిప్రాయము కాదు. ముఖ్యముగ మనయాంధ్రదేశమునందలిజనసంఘమున భాషాభిరుచి గాఢం బగునిద్రను జెందుచున్నదని యెవ్వరును జెప్పక మానరు. అందులకు ముఖ్యనిదర్శనము గ్రంథకర్తలగ్రంథములు పఠనీయగ్రంథములుగ నిర్ణయించినంగాని, కొంచెమైన నమ్ముడువోవకుండుటయే యని నే నిట వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు. కావున, గ్రంథకర్తలందఱు, ముందుగా, జనులకభిరుచిం గలుగఁజేయునట్టి గ్రంథములను రచియింప నారంభించి, జనసంఘంబునం జదువరులసంఖ్య యనునొక దానిని సృజియింపఁ బ్రయత్నించుటయే దేశీయులకును, భాషకును, దమకును, మిగులలాభకరముగ నుండునని తెలియఁజేయవలసి యున్నయది.

నేటివఱ కీయనకవిత్వమున నితరకవిత్వములయందువలెనే, సామాన్యవృత్తంబులె కానఁబడు చుండును. ఇట్లు చెప్పుటచే, వీరేశలింగముపంతులవా రపూర్వవృత్తరచనాకుశలురు గారని నాయభిప్రాయముగాదు. ఈయన బాల్యమునుండియు మృదుమధుర మయిన సులభశైలికే విశేషముగ నలవాటుపడి యున్నారు. జనసంఘమున నీభాషయు సమసియే యున్నయది. అదియే వీరేశలింగముపంతులవారి ప్రహసనాదులు విశేషముగ నమ్ముడువోవుటకు ముఖ్యకారణము. పంతులవా రట్టిసంగతి నెఱింగి, గ్రంథములను రచియించి, చదువరులన్ననేమియో యెఱుంగనిమనయాంధ్రదేశమున నట్టిసంఖ్యను దినదినప్రవర్ధమానంబుగఁ జేయుచున్నందుల కందఱును, ముఖ్యముగ గ్రంథకర్తలందఱును, వారియెడ మిగులఁ గృతజ్ఞులుగ నుండవలసియున్నది. అట్లు చెప్పుటచేఁ బ్రహసనాదులు నిరర్థకములనికాని, యట్టి వెవ్వరును రచియింపఁ జనదనికాని, నాయభిప్రాయము గాదు. అట్టిప్రహసనంబులవలన, నా

చారవ్యవహారాదులు చక్కఁబడు ననుటకు సందేహము లేదు. పంతులవారు చిరకాలంబునుండి సులభ మయినమృదుమధురశైలి కలవాటు పడుటం జేసి, ఇప్పుడు, వారొక్కసారిగ, సంస్కృతికదీర్ఘసమాసముల తోడను, గఠినము లగుసంస్కృతపదములతోడను, మించినయన్వయ కాఠిన్యముతోడను, గ్రంథములను రచియింపఁగలరా యని మనము సంశయింపవలసి యున్నయది. ఇట్లు చెప్పుటచే వీరేశలింగముపంతుల వా రట్టిగ్రంథములను రచియింప సామర్థ్యంబు లేనివారలనికాని, యట్టి కఠినగ్రంథములఁ గొన్నింటిని రచియింపవలయు ననికాని, నాయభిప్రాయము గాదు. భాషయం దభిరుచి యభివృద్ధిఁ జెందినం గాని యట్టి గ్రంథములు సర్వజనసమాదరణపాత్రములు గానేరవు. కాన, నింకను నట్టిగ్రంథములనే రచియించుచుండవలయును. నేటికించుమించుగ, 30 సంవత్సరములకు వెనుక రచింపఁబడిన రసికజనమనోరంజనంబున నక్కడక్కడఁ గొన్ని శ్లేషపద్యములు గానఁబడు చుండును. పంతులవారటుల నక్కడక్కడఁ గొన్ని శ్లేషపద్యములను రచియింపవచ్చును; కాని, రాఘవ పాండవీయాదిగ్రంథములఁ బోలునటుల నొకసంపూర్ణశ్లేషకావ్యంబును రచియించుటకుం బరిశ్రమంబున కంతగా లోనుగాని యీకాలమున వారికి వీలుపడునని సాహసించి చెప్పఁజాలను. అమితపరిశ్రమంబును వెల్లడించునటుల విశేషముగ బంధకవిత్వమును జెప్పుట కీయనకు సాధ్య మగునా యని యనేకులు చెప్పవచ్చును. కాని, పూనిరచియింప నారంభించినచో నటుల గ్రంథమును రచియించుట యీయన కొక దుస్సాధ్య మైనకార్యంబుగాకయే యుండియుండును. అటులఁ జిరకాలము కూరుచుండి, రచియించుటవలన రచించువారలకు లేశమును లాభ మగుపడకుండుటయే కాక, చదువరులకును విశేషలాభము గానఁబడదు. కాని యట్టిగ్రంథములు దత్కర్తలయసమానసామర్థ్యమునుమాత్రము వెల్లడింపకమానవు. పురాణభాషనుండి గ్రంథములను మధురతరంబులు



గ నుండునటుల భాషాంతరీకరించుటయందీయనకుం గలిగిన సామర్థ్యంబితరులకుం బట్టువడుట కరంబుదుర్ఘటంబు. ఆగ్రంథములనామంబులకు నందలిపాత్రంబుల నామములకును శ్రుతిహితంబులగు మాఱుపేరులను బెట్టుటయం దీయనకుం గలవిచిత్రవిశేషసామర్థ్యం బాయాగ్రంథములే, వెల్లడించుచుండును. సంస్కృతమునుండి భాషాంతరీకరింపఁబడినగ్రంథములయందు నీయనకుంబట్టువడిన మార్గసౌలభ్యము సులభంబుగ బోధపడక మానదు. అందులకుం దగిన కారణంబుల నందఱెఱింగియేయుందురు. పంతులవారు, దమకలమునకుం దామె బంధములుబిగియించి, మొట్టమొదటనె నైషధంబును సలలితముగ రచియించుటయుం బిమ్మటబంధత్రయంబు నువదల్చి, సార్థకంబుగ నుండునటుల రసికజనమనోరంజనంబును రచించుటయును, సాంస్కృతికభాషాంతరములయందలిసరసరచనకుం బ్రధాన కారణము లని చెప్పవచ్చును. గుదియించినకలీయంబులు, సడలించినం దడయక, పరువిడు సైంధవము చందంబునం గలము సత్యహరిశ్చంద్ర నాటకమున నసదృశంబగు కవితాధారను వెల్లడించి యున్నయవి. ఈయన సర్వకాలములయం దొక తెలుఁగున నెశృంగారహాస్యరసకలితంబులుగ నుండునటుల గ్రంథములనురచియించునట్టిసామర్థ్యముగలవారని చెప్పుటకుం బ్రబలనిదర్శనంబులు పెక్కు గానఁబడు చుండును. అందులకు ముఖ్యముగ నైషధాభిజ్ఞానశాకుంతల సత్యహరిశ్చంద్ర నాటకములు, నభాగోపాఖ్యాన ప్రహ్లాదనాటక తిర్యగ్విద్వన్మహాసభలు నుదాహరణములుగఁ జెప్పవచ్చును. వేయేల? పంతులవారికవితావిధానమును, నవీనగ్రంథ రచనావిధానంబు, నించుక నిర్మలహృదయంబునం బరిశీలించి, చూచునారలంద ఱీయన నభినవతిక్కన యనియు, నాధునికాంధ్ర కవితాపితామహుం డనియును, జెప్పక మానరు. ఇంక ముద్రాయంత్రముంగూర్చి యొకకొంచెము యోచింతము.

వీరేశలింగముపంతులవా రిన్నిగ్రంథంబులు రచియించుటకు, ముఖ్యకారణం బింట ముద్రాయంత్రం బుండుటయే యని నేఁ జెప్పఁగలను. ఇట్లు చెప్పుటచే నిల్లింట ముద్రాయంత్రం బుండినం దదితరు లట్లు గ్రంథములను రచించెదరని నాయభిప్రాయంబుగాదు. సంఖ్యకిన్ని గ్రంథములను రచియించినను రచింపవచ్చునుగాని, యిట్లాంధ్రదేశీయులనందఱ సమాకర్షించునటులం బలుఁదెలుంగులగు గ్రంథములను రచించుటమాత్రము తదితరులకు సాధ్యంబుగాదు. ఈముప్పదినలువది సంవత్సరంబులలో నీయనయొనర్చినకార్యంబు లితరు లెవ్వరయినను జేయఁబ్రయత్నించినచో, నయ్యవి సంవత్సరశతంబున కయిన నెఱవేర్పఁబడనేరవని సులభంబుగఁ దెలియకమానదు. ప్రారంభంబున ముద్రాయంత్రమును వీరేశలింగముపంతులవారు, తమస్నేహితుల సహాయంబునఁ దెప్పించుటకు సమర్థులయిరి. అట్లుమ్మడిగాఁ గొంతకాలము వ్యాపారము జరిగినపిమ్మట నాకాలముయొక్కస్థితినిబట్టి నష్టమే విశేషంబుగ వచ్చుట కారంభించెను. ముద్రాయంత్రముం గొనుటయందుఁ జేరినవారలలోఁ గొందఱు కేవలము లాభంబునకే యాశించినవారలగుటచే, నట్టినష్టంబును సహింపనేరక, యందఱు దాని నెవ్వరి కయిన నమ్మ నిశ్చయించుకొనిరి. వీరేశలింగముపంతులవారు, తాముతమజీవితకాలమునం దంతట గ్రంథములను రచియింపవలయు ననుముఖ్యోద్దేశంబుగలవారగుటం జేసి, తమ కడనంతధనంబు లేకపోవుటచే నొకరికడ నప్పుగైకొని ముద్రాయంత్రంబును స్వాధీనంబుగఁ జేసికొనిరి. ఆప్రారంభపుదినంబులయం దాయన పడినప్రయాసం బంతయు నప్పటిపత్రికలలోనివిజ్ఞాపనంబులే వేవిధంబుల ఘోషించుచున్నయవి. చాలకాలంబునుండి యీముద్రాయంత్రంబువలన ననేకులు పోషింపఁబడుచుండిరి. మొట్టమొదట నందుఁదగిన యక్షరంబులు లేకపోయినను, లేనియక్షరంబులను విడిచియే పత్రికలం జాలకాలము ప్రచురించుచువచ్చిరి. ఇతరు లెవ్వరైనను నప్పుడాముద్రాయం



త్రంబును గొనినచో నింతశీఘ్రకాలంబులో నట్టిస్థితికిం దేఁగలరని నేఁజెప్పఁజాలను. పంతులవారు చెన్నపురంబునకుం జని మఱలివచ్చునప్పుడెల్లను ముద్రాయంత్రవిషయమయినవాని నేవియో కొన్నింటిని దెచ్చుచునే యుండిరి. ఆకారణంబుననె, యప్పటి కప్పటికి హస్తిమశకాంతరంబులువారయుండుచు నచ్చెను. ఇప్పుడుమాత్రము దానివలనంగలుగుచుండెడి లాభమును గొంచెము యోచించినచో నయ్యది సులభంబుగఁ దెలియకమానదు. ఇంటికద్దె లేకపోయినను, సొమ్మునకు వడ్డియయినను దిన్నఁగావచ్చియుండలేదు. అయినను వారిగ్రంథములన్నియుం జక్కఁగ ముద్రింపఁబడుచుండుటయే యీయనకుం గలిగెడి విశేషలాభ మని చెప్పవలసి యున్నయది. అదియే వారలకు విశేషఁబుగ హెచ్చరికను గలుగఁ జేయుచుండెను. ఆహెచ్చరికయే వీరేశలింగముపంతులవారి నా కాలమునం దనేక గ్రంథంబులు రచింపం బురికొల్పుచుండెను. ముద్రాయంత్రముం గూర్చియు, నందుమూలంబునం దదధికారులకుం గలుగుచుండెడిలాభముంగూర్చియుం బలుపురుపలువిధంబులుగఁ దలంచుచుఁ గాలయాపనంబుఁ జేయుటకంటెఁ, దాము నొకయంత్రముం దెప్పించి సమర్థించుకొనుటయే యొంతయు లాభకరమయినకార్యము. పరులసామర్థ్యముంగూర్చి యోచించుటకన్నఁ దాము నొకపత్రికం బ్రకటింపనారంభించి, యట్లయమితంబగుయశంబును సంపాదించి, మనస్సంతోషంబు నందుటయే యొంతయు ధర్మమార్గంబుగ నుండును. కార్యబులకుం గడఁగిన నేమగునోయని వెనుకముందు లూగులాడుట ధీరగుణసంపన్నులకు లక్షణంబుగాదు. కేవలము స్వయంకృషివలననే ముద్రాయంత్రంబును సంపాదించినవారలసామర్థ్యంబునకు మన మెంతయు సంతోషంబు నాశ్చర్యంబు నందవలసి యున్నయది. ఇంకనిక్క విమతవిషయముం గూర్చి కొంచెము వినుండు.

పంతులవారిమతవిషయముంగూర్చి చర్చించుచుఁ బలువురు పలువిధంబులుగ నిశ్చయించుచుందురు. ఈయన, బాల్యంబునుండి నేటివఱకును, మతవిషయంబున ననేకమార్పులం జెంది యున్నారు. 'నైషధంబును' రచించినకాలమున శివుఁడే ప్రధానదైవంబనియు, 'రసికజనమనోరంజనము'ను రచించినకాలమున విష్ణువే ప్రధానదైవంబనియు, 'శుద్ధాంధ్రభారతసంగ్రహము'ను రచించినకాలంబునఁ బరబ్రహ్మమే ప్రధానదైవంబనియుం బ్రస్తుతించి యున్నారు.

పంతులవారు మొట్టమొదట రచియించిన 'శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధము', నందలి,

మాలిని. తిగకొటికలదాయా ♦ తెల్లయేఱున్న రాయా!
సెగకనుగలదంటా! ♦ చేఁదుఁ గొన్నట్టిజంటా!
సొగసులతలకట్టా! ♦ సూడులం గొట్టుదిట్టా!
జిగియరచెలిజేఁడా! ♦ చిక్కరాకొతుసూడా!

క. నునుఁగుత్తుకఁ జేఁదిడుకొని,
తనరుచు నున్న తెఱఁగంటి ♦ తలకట్టా! లోఁ
గన లెనయ హత్తిరక్కసు
ననిలోనం గూల్చి, క్రచ్చు ♦ లందినదిట్టా!

అనుపద్యములంబట్టియుఁ, దరువాత రచియించిన 'రసికజనమనోరంజనము', నందలి,

సుగంధివృత్తము

పొన్నగున్న నెక్కి గొల్ల ♦ పువ్వుబోండ్లతోడఁ తన్
పన్నెమీఱఁ జేతు లెత్తి ♦ పల్వురొక్కచెల్వునిన్
జెన్ను మీఱ మ్రొక్కుకున్నఁ ♦ జేలలీయనంచు నాఁ
డన్నపంతు గెల్చుకొన్న ♦ యట్టిదిట్టవేలుపా!



మాలినీవృత్తము.

జగము లరయువాఁడా! ♦ సాదులం బ్రోచుఱేఁడా!
పొగరుఁబసులగొంగా! ♦ పూపబల్వెన్నదొంగా!
పగయొఱుఁగనివేల్పా! ♦ పైఁడిపుట్టంబుదాల్పా!
వగలుతొలఁచుమిన్నా! ♦ వాసిగన్గొల్లపిన్నా!

అనుపద్యములం బట్టియుఁ బిమ్మటరచియించిన 'శుద్ధాంధ్రభారతసంగ్రహము', నందలి,

క. కలువలవిందును బ్రొద్దును
మలలన్సంద్రముల నెల్ల ♦ మఱియాపుడమిన్
వెలుఁగును జీకటిఁ జుక్కల
నెలమినిఁ గలిగించి, ప్రోచి ♦ యేలెడుసామీ!

మాలిని— జగములయెకిమీఁడా! ♦ సాదులంబ్రోచుఱేఁడా
పగ యెఱుఁ గనివాఁడా! ♦ పల్వాలం ద్రుంచుప్రోడా!
వగలొదవనివాఁడా! ♦ వంతసంద్రంపుటోడా!
నెగులడచెడివాఁడా! ♦ నేలకున్నంగడీఁడా!

అనుపద్యములంబట్టియు వారల మనసునఁ గ్రమక్రమంబుగ భగవద్జ్ఞానమెట్టి మార్పులను జెందుచువచ్చినదియును సులభంబుగ బోధపడక మానదు.

లోకములోఁ గలజ్ఞానములలో నెల్లను సర్వోత్కృష్టమైనది భగవద్జ్ఞానమేకదా! అట్టిజ్ఞానము గాలక్రమంబున స్థిరపడునదియేకాని, యొక్కసారిగ మొట్టమొదటనే స్థిరపడునదికాదు గదా! వీరేశలింగముపంతులుగారును, మనపూర్వకవు లందఱివలెనే, యవతారాదులయందొకకాలంబున విశ్వాసమును గలిగియే యుండిరి. అందులకు,

క. కొబ్బెరకాయలు మెక్కుచు
నిబ్బరముగఁ గొల్చువారి ♦ నెఱిఁబ్రోచెడియా
గిబ్బవజీరుకుమారుఁడు
గొబ్బున నొడఁగూర్చుఁగాతఁ ♦ గోరికలెలమిన్.

తోటక వృత్తము.

పొలుపొందిన బీరము ♦ పూని జగం
బులనెల్లను నేచుచు ♦ ముద్దియలా
ర్వ లలింజెఱఁ బెట్టిన ♦ రావణునౌ
దలలెల్లను ద్రుంచిన ♦ దండిదొరా!

చ. కలుములచేడెకోడలు ని ♦ గారపుఁ జెల్లని మేనిచాన ప
ల్కులసిరి కాటపట్టు బలు ♦ కోరికఁ బెన్మిటి మోముదమ్ములం
దలరెడుకొమ్మ సోయగపు ♦ టంచపయి న్నడయాడుచాను యా
నలువవెలంది నిచ్చలును ♦ నాలుకఁ గాపురముండుఁగావుతన్

అనుపద్యములే పరిబలనిదర్శనములుగా నున్నవి.

ధవళేశ్వరమున నుపాధ్యాయులుగ నున్నకాలమున ననఁగా ౧౮౭౮—౭౯వ సంవత్సరములయందుఁ బలువురు తమమిత్రులతోడం బ్రసంగించుచు, బ్రహ్మసమాజమతమే సర్వోత్కృష్టం బగుమత మని తమనిశ్చితాభిప్రాయమును దెలియఁజేయుచు వచ్చిరి. అంతల కీయన రచించి, ప్రచురించిన ''బ్రహ్మపద్యచంద్రిక,, యందలి,

శ్రీకరుఁ డైనయీశ్వరుఁడు ♦ శ్రేయములం దయచేసి, కూరిమిం
గైకొని ప్రోచుఁగాత! గుణ ♦ గణ్యులఁ, బుణ్యుల, సత్యశీలురన్,
బ్రాకటభక్తియుక్తులను, ♦ బ్రాహ్మసమాజమతావలంబులన్,
లోకచయోపకారులఁ, బ్ర ♦ లోభవిదూరుల, ధర్మచారులన్.

అనుపద్యము గొంతవఱకు కొకనిదర్శనముగ నుండును. మతవిషయమునం దీయన యనేక మార్పులనుఁ జెంది యున్నను, ద్వ్యర్థసంగతంబుగ



నుండి యాస్తికులకును నాస్తికులకును సంతోషమును గలిగించునట్టి ''ఏకమేవాద్వితీయ,, మ్మను ప్రమాణవాక్యమును బట్టి పంతులవారిని నాస్తికులనికాని, యాస్తికులనికాని నిశ్చయింపఁ జాలము. హృదయపూర్వకమైననిజం బగుభక్తిని వెల్లడించునటుల, 'శ్రీవివేకవర్ధనీ, పత్రికయందుఁ బ్రచురింపఁబడిన 'భగవద్గుణములు, 'భగవద్విషయక ధర్మములు, 'దైవసహాయము, 'భగవన్మహిమయు, కరుణాళుత్వమును, 'ఈశ్వరభక్తి' యను నుపన్యాసములంబట్టియు, నేదియో యొకమతమున స్థిరమైన యభిప్రాయమును గలిగియుండెడి కాలంబున ననఁగా నించుమించుగ నలువదిసంవత్సరముల ప్రాయమునందున్నకాలమున, స్వకపోలకల్పితముగ రచించిన 'సత్యహరిశ్చంద్రనాటకము, నందలి,

శ్రీకల్యాణగుణాకరుండు, త్రిజగ ♦ త్సేవ్యుండు, నిత్యుండు, సు
శ్లోకుం,డాద్యుఁ డతీంద్రియుండు,పరమే ♦ శుం,డప్రమేయుండు,లో
కైకాధారుఁడు, సర్వశక్తుఁ, డమలుం ♦ డాద్యంతశూన్యుండు,ప్రే
మైకస్థానుఁడు నైనదేవుఁ డిడుఁ ♦ మీకత్యంతసౌభాగ్యముల్.

అనుపద్యమునబట్టియును, నేటికిరమారమి ముప్పదియైదుసంవత్సరములక్రిందటఁ బ్రకటింపఁబడిన'వివేకవర్ధని,పత్రికయొక్క రెండవసంపుటము యొక్క రెండవసంచికయందుఁ బ్రకటింపఁబడిన''భగవ వర్తితము,,అను దానింబట్టియును దరువాత నీమధ్యకాలంబున నప్పుడప్పుడు ప్రకటించుచువచ్చిన ఆస్తిక్యము, భగవద్గుణములు, భగవద్విషయకధర్మములు, దైవసాహాయ్యము, భగవన్మహిమయు, కరుణాళుత్వమును, ఈశ్వరభక్తి, పాపశిక్షణము,ఇహాపరములు,ఈశ్వరోపాసనము, ప్రార్థన, మొదలుగాఁగల యుపన్యాసములను బట్టియును, ముఖ్యముగా 'జన్మాంతర,మను నుపన్యాసమునకుం జిట్టచివర నున్న ''పాపభీతికలుగఁజేసి మనలనుసన్మార్గమునఁ ద్రిప్పెడి యద్భుత శక్తిగలదివ్యౌషధము భగవదారాధన యొక్కటియే

గనుక, మన మీశ్వరు నెన్నఁడును మఱచిపోక యాసర్వకారుణ్యుని సదా స్మరించుచు నాతని గుణానుభవముగలిగి యాయనయాజ్ఞలను జెల్లించుచు నానంద మనుభవింప నెల్లవారును బ్రయత్నింపవలయును,, అను వాక్యములంబట్టియును, బిమ్మట నిరువదియైదు ముప్పదిసంవత్సరముల కనంతరమున రచియింపనారంభించి, ముద్రింపించుచున్న 'స్వీయచరిత్రము, నందలియీశ్వరప్రార్థనములోనున్న 'ఓపరమేశ్వరా! ఓదయాసత్యాధర్మస్వరూప! ఓసుజనహృదయ ప్రమోదసంధాయకా! నీకునమస్కారము, అనుదానింబట్టియును బూసిపరికించి యీయనమతం బాస్తిక్యంబనియే పలువురు చెప్పుచుందురు. ఆస్తిక్య నాస్తిక్యనిర్ణయమునకు ముందుగ భగవచ్ఛబ్దార్థ నిరూపణం బావశ్యకంబుగదా నిజంబగుభగవద్జ్ఞానము బరికించి యోచించి చూచినప్పుడును, పంతులవారి ప్రబోధచంద్రోదయ మనునాటకరత్నమునందలి,

చ. కలదఁట! యాత్మ యొక్కటి జ ♦ గంబున దేహముకంటె వేఱుగా
ఫల మది మీఁదఁ గాంచు నఁట! ♦ భద్రముగాఁ బరలోకమం దహా!
వలవని యీదురాశయు న ♦ భస్తరురాజము పూచి స్వాదుస
త్ఫలముల నిచ్చునన్ భ్రమము ♦ వంటిదికాదె తలంచి చూడఁగన్.

శా. అహా! లేనిపదార్థ మున్న దని మి ♦ థ్యల్ పల్కునయ్యాస్తిక
ద్రోహుల్ నాస్తికులంచు దూష్యులనుచున్ ♦ దూషింత్రు సత్యార్థ్యులన్
మాహాత్మ్యస్థితిఁ బంచభూతపరిణా ♦ మంబౌను జైతన్యసం
దోహం; బెవ్వరు దేహభిన్నునిఁగ నెం ♦ దుం జూచిరే జీవునిన్?

అనుపద్యములం గాంచి నిజంబగుకవితాసామర్థ్యమును దలఁచినప్పుడును, బ్రపంచమందునిజమైన నీతిమార్గమున సర్వదా వర్తించుమనుజునకు క్లేశమైనను, దైవముతోడిప్రయోజన మక్కఱయే లే దనునా యభిప్రాయమునుబట్టి యోచించినప్పుడును మాత్రము, వీరేశలింగము పంతులవారి ముఖ్యమతము, నీతియే ప్రధానాధార మైనస్వభావసిద్ధంబగుమతమే యనిసాహసించి చెప్పక తప్పదు. ఈయన యన్నిగ్రంథములను సావధానంబుగఁ జదివెడువారల కందఱకును స్వభావజ్ఞానమే విశేషంబుగమనసున నాటుకొనును నని నేఁ దలంచెదను. ఇఁక, వారలయాంతరంగికస్వభావాదులంగూర్చి కొంచెము వినుండు.



ప్రపంచమునందు, మనుజులు భిన్నభిన్నస్వభావములు గలవారలుగ నుందురని, యించుకయనుభవము గలవారలుసహితము, సులభముగఁ జెప్పఁగలరు. ఒకమనుజునకు మఱియొకమనుజునిస్వభావమును బరిపూర్ణముగ నెఱుఁగుటకరంబు దుస్సాధ్యము. మనుజులస్వభావముల నెఱుఁగుట కనేక మార్గములుగలవు. అందు, వినికిడి మొట్టమొదటిదిగ నుండును. వినికిడివలన నొకమనుజుని స్వభావంబును విశేషంబుగ నెఱుంగ వచ్చును. ముఖావలోకనంబులవలనను, సంభాషణంబులవలనను, సాంగత్యంబువలనను నొకనిస్వభావంబు నంతకన్న విశేషంబుగ నెఱుంగఁగలము. అందులో నట్టివారలస్వభావంబు నెఱుంగుట కరంబు దుస్సాధ్యంబు. అట్టివారలస్వభావము నెఱుంగఁ దలంపు గలవార లందఱును పైనఁజెప్పిన యన్నిమార్గములఁ బ్రయత్నించినఁగాని, యయ్యది, సులభముగఁ బట్టువడదు. పైనఁజెప్పినమార్గములుగాక, యిట్టివారల స్వభావంబు నెఱుంగుటకు ముఖ్యాధారము వారలు రచించిన యన్నిగ్రంథములు సావధానంబుగఁ బరిశీలించుచుఁ జదువుటయే యని నేఁ జెప్పఁగలను. ఇట గ్రంథములనిచెప్పుటచే, వచనకావ్యము లనికాని, ప్రబంధము లనికాని, నాటకంబు లనికాని మీరలు తలంపఁ జనదు. కాని, విశేషముగ మతాచారవ్యవహారాదులంగలదురాచారంబుల వెల్లడించుచు మనసుల సన్మార్గమునకుఁ ద్రిప్పఁజాలిన 'రాజశేఖరచరిత్రము, 'సత్యవతీచరిత్రము,

వ్యవహారధర్మబోధిని, బ్రాహ్మవివాహము, మొదలైన గ్రంథములును, జన్మాంతరము, అతిబాల్యవివాహము, ఈశ్వరదత్తగ్రంథములు, అభ్యాసము, మిత్రులు, ప్రపంచకజ్ఞానము, స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము, మొదలైనయిట్టియుపన్యాసములు ననియే మీర లూహింపవలసి యున్నయది. కావున వీరేశలింగముపంతులవారిస్వభావము నెఱుంగునుద్దేశము గలవారంద ఱాయన రచించిన యన్నిగ్రంథములం జదివిన నయ్యది సులభముగఁ దెలియక మానదు. ప్రతివిషయమును గూర్చినసర్వాంశముల నాయాగ్రంథములు వెల్లడించుచున్నవని నేను సాహసించి చెప్పఁగలను. అధికాలోచనంబు గలవారలదేహములయం దెప్పుడును, వేఁడిమి విశేషముగనుండుచుండును. అత్యుష్ణము శీతలమునకు హేతువు. విశేషముగ మేలుకొనువారల కందఱకును దేహతత్త్వమున శీతల మత్యధికముగ నుండును. కావున, నట్టివారలకు శిరోభారము మొదలైన రుగ్ణతలు ప్రాప్తించుట సిద్ధము. విశేషముగ మేలుకొనుచుండుటం జేసియు, అనేకగ్రంథములను అనేకపత్రికలకు సర్వదాచదువుచుండుటం జేసియు,విశేషముగ గ్రంథములను రచించుటం జేసియు నట్టివారల మొగములు కనులి యెంతయు నైల్యమునొందునటులఁ గనుపడుచుండును. విశేషపరిశ్రమమునకు లోనై చుట్టును నైల్యము నొందిన నేత్రములం దప్పుడప్పుడు మనము చూచుచుండెడి బాధను వెల్లడించుచిహ్నంబులే వారలు విశేషముగఁ జదువుట కలవాటుపడి యున్నారని తేటపడకమానదు. ఇతరగ్రంథకర్తలవలె నీయన యెప్పుడంతగాఁ దామురచియించిన గ్రంథములను జదువుకొని సంతసించునట్టిస్వభావంబు గలవారలు కారు. దానం జేసియే పంతులవారిన్ని గ్రంథములు రచించుట సిద్ధించినది. జీవితకాలమునం దెప్పుడును గ్రొత్తక్రొత్తగ్రంథములం జదివి నవీనాంశముల నెఱుఁగుచు నుండవలయుననియే యీయనముఖ్యోద్దేశముగ నున్నది. ఇయ్యది యెంతయు శ్లాఘనీయం బని నేవేఱుగఁ జెప్ప నక్కర లేదు.



మార్గములం జనునప్పు డెప్పుడు నేదియుం జూడని వారలవలె జూపర కందఱకగపడుచున్నను, నలుకెలంకులం జక్కఁగ నిమిషంబులలోఁ బరిశీలించి చూచుచు,నాయావిశేషంబులనెల్ల నెఱుంగునట్టి విచిత్రసామర్థ్యమును గలిగి యున్నారు. ఏవిషయముం గూర్చియు నెంతవిశేషముగ నెఱింగిన నంత యెఱుంగనివారలవలె నగపడుచుందురు. ఇదియే నిజమైనజ్ఞానసంపన్నుల లక్షణము. ఇట్లు చెప్పుటచే, మూఢుల కడఁ జేరి, జ్ఞాను లని వారలం బీడింపఁజనదు. ఈయనబాల్యంబునుండియు విశేషముగ స్త్రీలలోఁ గలసిమెలసి సంభాషణంబులు సలుపునట్టి స్వభావముగలవారలుగాకపోయినను, నెప్పుడును స్త్రీలతోడనె సంభాషణంబులు సలుపుచుండెడువారలకన్నను నత్యధికంబుగ గృహవిషయములంగూర్చినసంభాషణంబుల కొంతయుఁ బ్రతిబింబములుగ నుండునటుల హాస్యసంజీవనులను వ్రాయుటయం దీయనకుం గలవిశేషసామర్థ్యమెంతయు శ్లాఘాపాత్రముగ నుండును. ఈయన, తమకు నిజమని తోచినయంశముల నెల్లఁ, జక్కఁగఁ దలఁచి యెంతటిపైయధికారులనైనం గనుఁగొనునట్టిసాహసంబుగలవారని, చెప్పుటకుం బెక్కునిదర్శనంబులు గానవచ్చుచున్నవి. ఈయన, యెప్పుడు నంతగా విద్యార్థులతోడం జనువుగ సంభాషించు నట్టిస్వభావంబు గలవారలుగాక యుండినను, దమకుం గలరచనాచమత్కారంబునను, సదాచారప్రవర్తనంబునను, నందఱయనురాగంబును సమాకర్షించునట్టివిచిత్రసామర్థ్యంబును గలిగియున్నారు. చూచువారల కందఱకును విశేషంబుగ నీయన యెప్పుడితరులతో మాటాడనివానివలెఁ గనుపడుచున్నను గొంచెముసహవాసము కుదిరినపిమ్మట నీయన యెంతమహోత్సాహకరంబుగ సంభాషించుచుందురో యనేకు లెఱింగియే యున్నారు. కాలమును దామెంతవిలువగలుగునటుల గడపుచున్నను నడుమ నెవ్వరైననువచ్చినచో, వారలకు లేశమయినను నిరుత్సాహంబు గలుగకుండునటుల సంభాషించు

చుండును. ఈయనకుస్నేహితు లెవ్వరు నంతగా లేకయున్నను, నాంధ్ర దేశమునం దంతట నీయన కెంతెంతగౌరవంబును ననురాగంబునుగల పరమమిత్రు లుండియున్నారో ప్రతిదినంబునను లెక్కలేకవచ్చుచుండెడి యుత్తరంబులే, వేవిధంబుల వెల్లడించుచుండును. ఈయనకుంగల స్వభావవైచిత్ర్యం బేమియోకాని, యెంతెంతక్రొత్తవార లయినను నమిత వాత్సల్యంబును వెల్లడించుచుఁ బరమమిత్రులవలె సంభాషణంబులు సలుప నారంభించుచుందురు.

కాశి, రామేశ్వరము మొదలగుతీర్థయాత్రాప్రదేశముల కరుగు వార లనేకు లెంతయోగౌరవముతో నుత్సాహముతో వచ్చి, పంతుల వారితోసంభాషించి, పరమానందమునొందుచుఁ బోవుచుండుట నే ననేకసారులు చూచి యున్నాను. అట్టి జనాకర్షణమునకుంగారణము లీయనకుం బ్రకృతిసిద్ధముగాఁ గలపరోపకారచింతాధైర్యాసాధారణ సామర్థ్యంబులేయని నేను నిశ్చయముగాఁ జెప్పఁగలను. ఆతీఱున నెంతకాలము స్నేహమును నెఱపుచు వచ్చినను, మఱలసంభాషించుటకు వచ్చు నప్పు డెప్పుడు నెంతయుఁగ్రొత్తవారలవలెనే కానఁబడు చుందురు. అందులకు ముఖ్యకారణంబు, వారలందఱివలె నధికప్రసంగములకు దిగక, యెవ రేవిషయమునుంగూర్చి సంభాషింపఁ జొచ్చిననట్టియొక్క విషయమునుగూర్చియే ప్రత్యుత్తరముల నిచ్చుచుండునట్టి స్వభావము గల వార లగుటయే యని మనమూహింపవలసియుండును. దానంజేసియే వారలతోడసంభాషణములను సలుపువారలుగాని, సహవాసమును జేయువారలుగాని, గ్రంథకర్తలుగానేరకయున్నారు. ఇంచుకవ్రాయుట కలవాటుపడువారల కాయనతో, సహవాసముకుదిరినచో నట్టివారల కందఱకునటుల నింకను, గొప్పగొప్పగ్రంథములను రచియింపవలయు ననియును, దేశాచారవ్యవహారముల మంచిమంచిమార్పులను గలిగింప వలయుననియునుం దోఁచకమానదు. ఈయన ప్రతిసంభాషణమునుమా



టలాడువారలకు నవీనోద్దేశములను నవీనోత్సాహమును గలుగఁజేయక మానవని నేనుదృఢముగాఁ జెప్పఁగలను. సర్వసాధారణంబుగ నిట్టివారలం దఱు దాముచేయనుద్దేశించెడికార్యముల నెల్లఁ జక్కగ నాలోచించినం గాని, యట్టికార్యంబుల నెన్నఁడునుదిగకయే యుందురు. దిగినచోఁ గార్యసాఫల్యంబందినంగాని విడువకయే యుందురు. పంతులవారినిజమైన స్వభావము నెఱుంగుటకాయనచే రచియింపఁబడిన "ఆంధ్రకవులచరిత్రము", నందు, శ్రీనాథకృతంబు లగు,

సీ. కవిరాజుకంఠంబుఁ ♦ గౌఁగిలించెనుగదా!
పురవీథి నెదు రెండ ♦ పొగడదండ;
సార్వభౌమునిభుజా ♦ స్తంభ మెక్కెనుగదా!
నగరివాకిట నుండు ♦ నల్లగుండు;
ఆంధ్రనైషధకర్త ♦ యంఘ్రియుగ్మంబునఁ
దగిలియుండెనుగదా! ♦ నిగళయుగము;
వీరభద్రారెడ్డి ♦ విద్వాంసుముంజేత
వియ్యమందెనుగదా! ♦ వెదురుగొడియ;
కృష్ణవేణమ్మ గొనిపోయె ♦ నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయెఁ ♦ దిలలుఁ బెసలు
బొడ్డుపల్లెను గొడ్డేలి ♦ మోసపోతి;
నెట్లు చెల్లింతు టంకంబు ♦ లేడునూర్లు?

సీ. కాశికావిశ్వేశుఁ ♦ గలిసెవీరారెడ్డి;
రత్నాంబరంబు లే ♦ రాయఁ డిచ్చుఁ?
గైలాసగిరిఁ బండెఁ ♦ మైలారువిభుఁ డేగె
దినవెచ్చ మేరాజు ♦ తీర్పఁగలఁడు?
రంభఁ గూడెఁ దెనుంగు ♦ రాయరాహుత్తుండు

కస్తూరికేరాజుఁ ♦ బ్రస్తుతింతు?
స్వర్గస్థుఁ డయ్యె వి ♦ స్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వని ♦ పంక్తిఁ గలదు?
భాస్కరుఁడు మున్నె దేవుని ♦ పాలి కరిగెఁ
గలియుగంబున నిఁక నుండఁ ♦ గష్ట మనుచు
దివిజకవివరుగుండియల్ ♦ దిగ్గు రనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ ♦ డమరపురికి.

అనుపద్యములం జూపుచు, నొసంగిన "అవసానదశయం దిట్టికష్టముల కెల్లనుగారణము, యౌవనదశయందుఁ గామవశముచేత స్వేచ్ఛగావిహరించి దేహమును, ధనమును బోఁగొట్టుకొన్న పాపఫలముతక్క వేఱొక్కటి గానరాదు.,, అనునభిప్రాయమే చాలి యుండును.

ఈయనకు జ్యోతిషము, పురాణములు మొదలైనయిట్టివానియం దెంతమాత్రమును నమ్మిక లేదు. మనవారలలో ననేకులవలెఁ, గాశికిం జని గంగానదిని మునిఁగినచోఁ బుణ్యము సమకూరు ననికాని, పర్వదినముల నఖండగౌతమిని స్నానముఁ జేసినచోఁ బుణ్యమువచ్చు ననికాని, యట్లు చేయకుండినఁ బాపము లభించు ననికాని, యీయన యెంతమాత్రమును నమ్మకము లేనివారై యున్నారు. జీవహింసనొనర్చుచు యజ్ఞాదుల నొనర్చినచోఁ దమకుగాని, తమపితృదేవతలకుంగాని పుణ్యలోకంబుల నమితసుఖము లభించు ననికాని యీయన కెంతమాత్రమును నమ్మకము లేదు. ఇట్టివారలయందు, మూఢదయయనునది లేశమునుగానరాదు. ఇట్లు చెప్పుటచే వీరేశలింగముపంతులవారు దయావిహీను లనికాని, క్రూరస్వభావు లనికాని నాయభిప్రాయముగాదు. అనేకులవలె మూఢదయ యనునది లేక యుండుటకు ముఖ్యకారణం బీయన విశేషముగ గ్రంథములను రచించుట కలవాటుపడి యుండుటయును, సోదరీసోదరు లెవ్వరును లేక యుండుటయు నని నేఁ జెప్పఁగలను. ఇట్టివా



రల కందఱియెడ, సర్వజనసహోదర న్యాయమే వర్తిలుచుండును. జాత్యంధులును, వికలాంగులును సుఖముగ శయనించుటకుం దగినయొకగొప్పగృహమును గట్టింపవలయు ననునొక్కయుద్దేశమే యీయనకుం గలదయాపూర్ణస్వభావమును వెల్లడించు చుండును. ఈయన, నయభయంబు లెంతవిశేషముగఁ గలిగియుండునటుల బాలుర నెంతప్రేమతోఁ జూచుచుందురో మిగుల ప్రేమానుబంధమునఁ బెనుచుకొనుచున్న బాలుని స్వభావంబు నెకింత యెఱింగినవార లెఱుంగక మానరు. వీరేశలింగముపంతులవారు బాల్యమునుండియుఁ దమకుంగల స్నేహితు లెందఱెందఱెట్టి దురభ్యాసముల కలవాటుపడినను, శిరోభారము, దగ్గు మొదలైన బాధల ననుభవించుచున్నను, జుట్టలు పొడుము మొదలైనవాని కలవాటు పడకుండినందులకు, మన మెంతయు సంతోషమును, సంతాపము నందవలసి యున్నయది. గ్రంథములు రచియించుటయందువలె, నడకయందును నతివేగమును గలిగియే యున్నారు. ఎప్పుడు నతివినమ్రతను వెల్లడించునట్టి వస్త్రములనె ధరించుచుందురు. ఈయన, తమకుంగలయర్వాగౌరవాధిక్యమును సముచితస్థితియందుంచుట కాయన కెట్టిసామర్థ్యం బుండియున్నదియు నించుమించుగ నిరువది సంవత్సరముల నుండి తమయింట నున్నముద్రాక్షరశాలయందుఁ బనిచేయుచుండెడి వారల కాయనయెడలం గలిగియుండెడి, మితిమించిన నయభయంబుల తెఱంగెఱింగినవారలకుఁ దెలియక మానదు. పూర్వకాలమున గ్రంథములను రచించి, తిక్కనసోమయాజిని మెప్పించుట కరంబు దుష్కరంబుగనుండుచునచ్చెనని మనమిప్పుడు వినుచున్నారము; కాని, వర్తమానంబున గ్రంథములను రచియించి, వీరేశలింగముపంతులవారిని మెప్పించుట సామాన్యున కింతయు సాధ్యంబు గాకుండుట మనమందఱమిప్పుడు కన్నులారఁ జూచుచునే యున్నారము. లేశలేశంబులను సహితముఁ బరీక్షించి నిష్పక్షపాతబుద్ధితోడ నభిప్రాయంబు లొసంగుచుండుటం జేసియే, పంతు

లవారి కటుల నమితగౌరవంబును వెల్లడించుచు ననేకులు తాము రచించి చెడి గ్రంథముల దప్పక యభిప్రాయములకుఁ బంపుచు, వారల మెప్పును బడసినచో నెంతయు సంతసించుచుందురు. ఈయన, తమ కార్యములఁ జక్కఁగఁ గనుఁగొనునట్టి స్వభావంబుగలవారలగుటం జేసియే వారలం బలువురు కఠినమైన యజమానునిగఁ దలంచుచుందురు. అట్లు తలంచుచుండుటకు ముఖ్యకారణంబు వారల యసమర్థతయే యని చెప్పవలసి యుండును. ఒకసారిగ ననేక కార్యములను జేయఁ బ్రయత్నింపఁ జనదని పలువురకు, హితోపదేశంబును జేయుచుందురుగాని, తాము మాత్రమట్టులు దమ హితోపదేశంబును యనుసరించి నడువక, సమర్థులగుటం జేసియే, యొక్కసారిగ ననేక కార్యంబులం జేయఁ బ్రయత్నించుచు, సతతము సఫలీకృతమనోరథు లగుచుందురు. సంభాషణములఁ దాము విశేషంబుగ మాటలాడకున్న నితరులను విశేషముగ మాటలాడఁ జేయుటయం దీయనకు విశేషం బగు విచిత్రసామర్థ్యము గలదు. విశేషముగ నవ్వుపుట్టునటుల గ్రంథములను రచించునట్టి సామర్థ్యము గలవారలందఱుఁ గొంత కాలమునకు దమలోఁ దామె విశేషముగ నవ్వుకొనుట కలవాటుపడియుందురు. ఆకారణంబుననే యట్టివారలు నవ్వుచునే నవ్వక యుండునటులం జూచువారలకుం గనుపడుచుందురు. ముఖస్వభావాదుల నెట్టియభిప్రాయములను వెల్లడింపకుండుటకు విశేషముగఁ బ్రయత్నించుచుందురు. ఈయనకు బాల్యమునుండియు, గుప్తదానమే ప్రధానాలంకారముగ నుండెను. దేహదార్ఢ్యముగలవారల కెప్పుడును దమ్మిడినయిన నీకుండవలయుననియే యీయన ముఖ్యాభిప్రాయము. బ్రాహ్మణులకు సంభావనలు, భోగభామినులకు వసువులు నీయకుండవలయు ననుటకు ముఖ్యకారణం బిదియే యయి యున్నది. యాచకు లెవ్వరైనం దమకడకు వచ్చిన నట్టివారల యాంతరంగిక స్వభావాదుల నన్నింటి నెఱింగి, మఱియు, దానము చేయు



చుందురు. మనసున నున్న యభిప్రాయంబుల నెల్లను నిర్మల హృదయమున మోమోట మనునది యొకింతయు లేకయే, ఘనతనుగాని, దీనతనుగాని, యోచింపక వెల్లడించునట్టి సుస్వభావముగలవారనియే చెప్పవలసి యున్నయది. ఏమతంబుననున్న వారలా మతముననే యుండి సుఖతరంబుగ నుండునటుల మార్పులం గలుగ జేసికొనవలయుననియే యీయన ప్రథమముఖ్యాభిప్రాయముకాని, మతాంతరులతోడం గలసి భోజనంబులు చేయవలయుననిగాని, జన్నిదములం బారవేయవలయు ననికాని, యీయనకుఁ బూర్వాభిప్రాయము లేదు. ఇట్టివారలు కష్టముల కంతగా జంకునట్టి స్వభావము గలవారలుగ నుండరు. కష్టములవలననే విశేషముగ ధైర్యమును మనోత్సాహమును, గలుగఁ జేసికొని, కార్యసాఫల్యము నందుచుందురు. కష్టకాలముననె సుజనుల సౌజన్యత సులభముగఁ గనుఁగొనవచ్చును. ఈయనకుఁ దెనుఁగు వైద్యమున నంతగా నమ్మక మున్నటులు కనుపడదని కొందఱనుకొనుచుందురు గాని, యయ్యది సత్యము గాదు. ఈయనకింగ్లీషు వైద్యమున విశేషముగ గౌగవము గలిగి యుండుటకు ముఖ్యకారణం బీయన బాల్యమునుండియు, దాము స్వయముగ, వైద్యనామధారులు కేవలము ధనాపేక్షతోడనే చేయుచుండెడి మోసపుకృత్యములను, గపటవాక్యములను, జక్కఁగఁ గని విని యుండుటయే యని చెప్పవచ్చును.

వర్తమానమున మనయాంధ్రదేశమునందలి గ్రంథకర్తలందఱు విశేషముగ, గ్రంథకర్తల కందఱకును స్వభావసిద్ధముగఁ గలుగుచుండెడి మనస్సంతోషమును మాత్రమె యనుభవించుచున్నారు. తదితర కారణముల వారలకుం గలుగవలసిన యుత్సాహం బేదియు లేక యుండుటం జేసి యనేకులయం దట్టి యొకయుత్సాహము సహిత మదృశ్యమగుచు నుండుటను మనమందఱమును గన్నులారఁ జూచుచునే యున్నారము. జనసామాన్యమున భాష విశేషముగ నభివృద్ధిఁ జెందియున్న

ప్రతిదేశమునను దత్తద్భాషలయందలి కవు లందఱు, విశేషముగ మన సంతోషమును, యశమును, ధనమును గలిగి ప్రకాశించుచుందురు. వర్తమానపుఁ దెలుఁగుకవులలో నట్టిసంతోషత్రయమును చిరకాలము నైన నెక్కుడుసారిగ విశేషముగ ననుభవించుచున్నది యొక్కవీరేశలింగముపంతులవారనియే చెప్పవలసి యుండును. సమకాలికులగు కవుల నుగూర్చియీయనకుం గలయభిప్రాయములం గూర్చి పలువురు పలువిధములుగఁ జెప్పుకొనుచుందురు. పంతులవారు తమయాంధ్రకవులచరిత్రంబున నాచనసోమునిం గూర్చి వ్రాయుచు "ఇంచుమించుగా నెఱ్ఱనయు, సోమనాథుఁడును నేకకాలికులుగనుక శంభుదాసునికవిత్వమునం దీయన కంతగౌరవము కలిగియుండకపోవచ్చును.,, అని వ్రాసియున్నారు. సమకాలికుల కీర్ష్య యుండుట సుప్రసిద్ధము. కాని, పంతులవారి కితరులయెడ నీర్ష్యయున్న దని చెప్పుట కెప్పుడు నంతగా వీలు పడదు. బాల్యమునుండియు నీయనకు విశేషముగ నితరులను మించవలయునను సుగుణమే కొంతకాలమువఱకు నుండెను. అందులకుం గలప్రబలనిదర్శనం బందఱెఱింగియే యుండవచ్చును. ఇప్పుడీయన యితరగ్రంథకర్తలయెడ మూకీభావంబునే కలిగి యున్నారు. ఎవ్వరెటుల నెట్టిగ్రంథములను రచియించుచున్న నాగ్రంథములపయిం దమకుం గలయభిప్రాయముల నొసంగఁగోరునంతవఱకు నట్టిగ్రంథములం గొంచెమైనను సరకుగొనకయేయుందురు. ఈయనకు స్వసామర్థ్యమునుగూర్చి గౌరవనీయం బగుగరువముగలదని నేను చెప్పఁగలను. అటుల గౌరవనీయం బగుగరువంబు సామర్థ్యముగలవారలు సంతోషపూర్వకముగ నొప్పుకొనినచో నయ్యది యొకదుర్గుణముగ భావింపఁ జనదు. పంతులవారు, స్వసామర్థ్యాధిక్యముంగూర్చినదృఢనిశ్చయంబును గలిగియే యున్నారు. ప్రపంచమందు మనుజునకట్టియుత్సాహంబును, స్వసామర్థ్యముంగూర్చిననమ్మకంబును లేక యుండినచోఁ గష్టతరంబుల గుణకార్యంబులు గొన



సాగుట కెట్లు వీలుపడును? ఈయన కట్టిమనోనిశ్చయంబు, నుత్సాహంబును, గౌరవనీయంబగుగరువంబును గలవని చెప్పుటకు నేను సాహసింపఁగలను. అట్లుసాహసించి చెప్పుటకు నాకుం గలయనేకాధారంబులలో ముఖ్యంబు లగునవి, చిరకాలంబుక్రిందటఁ బ్రచురింపఁబడిన "శ్రీకొక్కొండ వేంకటరత్నకవికృతవిగ్రహతంత్రవిమర్శనము" నందలి "వీరేశలింగముగారు పాఠశాలం జదువుకొనుచుండునప్పుడే సంజీవని కంటె ముందుగాఁ బుట్టిన గోదావరీవిద్యాప్రబోధినికి వ్రాయుచుండుటయు, నించుమించుగ సంజీవనితోడఁగూడఁబుట్టినపురుషార్థప్రదాయినికి, దఱచుగాఁ బద్యగద్యాత్మకంబుగ వ్రాయుచుఁ బలువురచేఁ బొగడు గాంచుటయుఁ గొంతకొంత పంతులవారు నెఱింగియుండవచ్చును. పట్టువడియేఁబో వారిగ్రంథములవలెనే వీరిగ్రంథములు నమ్ముడువోవుచు వారికిఁ గలిగిన లాభమే వీరికింగలిగియుండును." అనునవియేయని యిటఁ దెలియఁజేయుచున్నాఁడను. మఱియు, గ్రంథవిమర్శన సామర్థ్యంబును గనంబఱచు "కొక్కొండ వేంకటరత్నకవికృతవిగ్రహతంత్రవిమర్శనము'' లో నత్యంతతీక్ష్ణవాక్యములకుం బిమ్మట నున్న,

"లోకములో నెవ్వరును సర్వజ్ఞులు గామిం జేసి, యెంతటివారు చేసినపుస్తకముల యందును గొన్నిదోషము లుండక తప్పవు. అందులోఁ బ్రథమమున వ్రాయఁబడిన పొత్తములయందుఁ దప్పులు కుప్పలుగా నుండవచ్చును. పంతులవారివచనగ్రంథములలో నిది మొదటిది కాఁబట్టియే దీనియం దిట్టిపొరపాటులు మెండుగఁ బడియుండును. తరువాత వీరువ్రాయుచువచ్చుసంజీవనిశైలి యీపుస్తకముశైలికంటెఁ బెక్కుమడుంగులుమిన్నగానున్నది. అందుచే వీర లలవాటువలనఁ గ్రమక్రముముగా వృద్ధినొందుచున్నట్టు తోఁచుచున్నది. కాఁబట్టి వీరింతటితోనే నిరుత్సాహులుగాక, మఱియుఁ దెలుఁగున వచనకావ్యములను వ్రాయఁ బ్రయత్నింతు రని వారి నత్యంతముఁ బ్రార్థించుచున్నాను." అనువాక్య

రాజమునుబట్టి, వీరేశలింగముపంతులుగారికిం బ్రకృతిసిద్ధముగాఁ గలవినమ్రతాహితోపదేశసత్స్వభావములును, మనను నాకర్షించునట్టిమృదుమధురశైలిని వచనరచనం గావించుశక్తియును సులభంబుగ బోధపడక మానదుగదా!

అభిజ్ఞానశాకుంతలనాటకమునందలిపీఠికయం దున్న 'ఒకవేళ జనుల కీపుస్తకము సంతోషజనకముగానే యున్నయెడల, ఇందు నాకల్పన మేమియులేక, సర్వమును కాళిదాసునిదే యగుటవలన నామహాకవిని మెచ్చవలయునేకాని నన్ను శ్లాఘింపవలసినపని యెంతమాత్రమును లేదు' అనుదానింజూచునప్పుడును, సత్యహరిశ్చంద్రనాటకంబునందలి పీఠికయందున్న 'ఇందలి మొదటినాలుగంకములనుసంవత్సరముక్రిందట నెలదినములలోపల వ్రాసితిని. నాలుగైదు దినములలో పంచమాంకమునుగూడ వ్రాసిముగించినాను' అనుదానిని, సత్యహరిశ్చంద్ర నాటకమునందలి చంద్రమతియొక్క 'నాకుఁదల్లిదండ్రులు చెప్పించినవిద్యసార్థకమగునట్లాశుకవిత్వముగా 'దండక మొకటిచెప్పి, యిప్పు డిప్పావకుని మెప్పించెదను' అనువాక్యముంజూచినప్పుడును క్రమంబుగ, వీరేశలింగము పంతులవారు తామురచియించెడి గ్రంథము లెంతరసవంతములుగానున్న నంతవినమ్రతనువెల్లడించుచుందు రనియు, గ్రంథములుమిగుల వేగముగరచియించుటయం దీయనకు విశేషసామర్థ్యంబు గలదనియును, వీరాశుకవిత్వంబు సహితముచెప్పుటకు సామర్థ్యంబు గలిగియున్నా రనియును, మనకునిశ్చయముగాఁ దోఁచక మానదు. అట్టియుద్దేశంబులను, పంతులవారును సంతోషపూర్వకంబుగ వెల్లడించుచునేయుందురు. ఇంక, బాలురకు విద్యను గఱపురీతినిగూర్చియు, సభలయం దుపన్యాసముల నొసంగు మార్గముంగూర్చియు కొంచె మిట నుదాహరించెద



ఈయన కేవలము స్వయంకృషివలననే యిట్టియశేషంబగుజ్ఞానసంపదను, గవితాసామర్థ్యంబు నలవర్చుకొనియున్నారు. కావున, నీయొక్కయంశమే పంతులవారిప్రతిభావిశేషంబును వేవిధంబులవెల్లడించుటకుం జాలియుండును. అట్టిస్వయంకృషియం దనురాగంబును గలుగఁజేసినముఖ్యకారణంబులు, క్రొత్తక్రొత్తగ్రంథములం జదువుటవలన మనసునకుం గలిగెడియానందంబును, దాముస్వయముగా గ్రంథములను రచియించునపుడు మనసునకుం గలుగుచుండెడియానందంబును, భాషాభివృద్ధికిం బాటుపడువారలలో మొట్టమొదటివార లని జనులనుకొనునట్లమితోత్సాహంబునం బాటుపడవలయు ననుముఖ్యోద్దేశంబు ననునవియే యని మనము నిశ్చయింపవచ్చును. తాము కేవలము స్వయంకృషివలననే, యిట్టియసాధారణ సామర్థ్యంబును సంపాదించుకొనియుండుటం జేసి, వారలువిద్యగఱపురీతికిని దదితరులమార్గంబులకును విశేషంబుగఁ దారతమ్యం బుండును. చదువరులకు ముఖ్యంబుగఁ దెలుపవలసిన యంశంబుల నెల్లఁ జక్కఁగఁ దెలుపుచుందురేకాని, యనావశ్యకములగువాని నెప్పుడునంతగాఁ జెప్పనెల్లరు. తాముపాధ్యాయులుగ నున్నకాలంబున నెల్ల విశేషభాగము చదువరులకు విశేషంబుగఁ బ్రపంచకజ్ఞానంబు గుదురునటుల సంభాషణంబులు సలుపు స్వభావమును గలిగియుండిరి. ఈస్వభావమే పాఠములు చదువు బాలురకు మిగుల సహకారిగనుండుచువచ్చెను.

పరీక్షాప్రశ్నంబులనేర్పుటయం దీయనకుంగల విచిత్రసామర్థ్యంబు చదువరుల కెంతయువింతను, సంతోషంబును గలుగఁజేయుచుండును. ఈయనపుస్తకములం జదువునప్పుడు కొంచెము శ్రద్ధవహించి చూచినచో, వారలు చదివెడిరీతి, పంతులవారు లేశలేశంబులను పరిశీలించుచుఁ జదువునట్టిస్వభావంబు గలవార లనియు, నింగ్లీషునను సంస్కృతంబునను దెలుఁగునను గణనాతీతంబులగు గ్రంథములం జదివి

యుండుటంజేసి యమితప్రయాసంబునకులోనై యున్నవారనియును, దేటపడక మానదు.

ఈయనసభలయం దుపన్యసించువిధం బెఱింగినవారలందఱా యన చెప్పఁదలఁచిన యంశంబుల నెల్లను వినువారలమనసుల గాఢంబుగా నాటుకొనునట్టులం జెప్పునట్టిసామర్థ్యంబుగలవా రని చెప్పకమానరు. అయినను, పంతులవారి లిఖితరూపకములగు నుపన్యాసంబులకును, వాగ్రూపకములగు నుపన్యాసములకును విశేషతారతమ్యంబుండకమానదు. అందులకుం బ్రధానకారణం బాయనకు వాక్సామర్థ్యంబుకంటె రచనాసామర్థ్యంబె విశేషముండుటయే యని నేఁ జెప్పఁగలను. సభలయం దేవిషయముఁగూర్చియయిన నెవ్వఁడయిన నుపన్యసించుటయం దీయనకుంగల గంభీరోపన్యాసధోరణి వర్తమానపుగ్రంథకర్తలలో నెవ్వరియందొకింతయుఁ గానరాదు. పిడుగులవంటి పదములతోడను, దీర్ఘసమాసములతోడను మెఱుపులవంటివాక్యముల నుపన్యసించువారలు మహోపన్యాసకులని కొందఱు తలంపవచ్చును; కాని, యదిసరికాదు; అట్టివారలు నిజమగువక్తలు కారనియే నాయుద్దేశము. ఇంక, మనయాంధ్రదేశముయొక్క స్థితిం గొంచెము యోచించినచో నట్టిమందిరమును గట్టుటకెన్నిసంవత్సరములకైన నితరగ్రంథకర్తలు సమర్థులుగా నేరరని చెప్పఁజేయుచుండెడి యాపట్టణమందిరముం గూర్చి కొంచెము ముచ్చటింతము.

చిరకాలంబునుండి మన తెనుఁగుదేశంబున ననేకులు దేవాలయములం గట్టించుచున్నారు. పలువురు చెఱువులు, నూతులు త్రవ్వించుచున్నారు. ఇంక ననేకు లిట్టి సత్కార్యంబులం జేయుచునే యున్నారు; కాని, మతాదివిషయంబులంగూర్చి చర్చించి, యందుమూలంబున జనసంఘంబున కుపకారకరంబుగ నుండునట్టులం బాటుపడుతలంపుగలవారల కందఱకుం దగినసభాభవన మొక్కటియయినం గట్టించినవారెవ్వరును లేరు. అట్టిలోపంబును నివారింపఁ బ్రయత్నింపవలయు నని తలంచి, నిజంబుగఁ గష్టార్జితంబని మొట్టమొదటఁ జెప్పవలసినధనంబున నీరాజమహేంద్రవరంబున నొక గొప్పసభాభవనంబును వీరేశలింగము పంతులవారు కట్టించియున్నారు. అయ్యది, వారలకుంగల జన్మభూమియందలి ప్రేమాధిక్యమును వెల్లడింపకమానదు. ఇట నొకపట్టణమందిరముంగట్టించుటకుఁ బలువురు గడచిన పదిపదునైదుసంవత్సరంబులనుండియుఁ బాటుపడుచుండుటయు, నందొక్కరయిన నట్టిమందిర మేదియుం గట్టింప సాహసింపఁజాలకుండుటయు ననేకు లెఱింగియేయుందురు.



ఏడువేలరూపాయలకుం బైగ వెచ్చించి, వీరేశలింగముపంతులఁ వారట్లు స్వయముగాఁ దామేయంతధనంబు నొసంగి యట్టిసభాభవనంబును గట్టించుటకును ముఖ్యకారణం బుండియేయున్నదిగాని, లేకపోలేదు. వారు పూర్వము స్త్రీపునర్వివాహంబుల విషయమయి యుపన్యాసంబుల, నొసంగ నుద్దేశించుచుండెడికాలంబున ననేకులు లోకోపకారధురీణులట్టిసభలకుం బాఠశాలామందిరంబుల నీయకుండుటంజేసి, పంతులవారాయాకాలంబులయం దెంతయు మనస్సంక్షోభంబు నందియున్నారు. ఏకాలమునందు నేదేశమునందును జిరకాలాగతము లగు నాచారోద్దేశములకు విరుద్ధముగఁ గార్యముల నొనర్చు నుద్దేశములను బోధింపఁ బ్రయత్నించినచో జనులు సర్వవిధములఁ బ్రతిబంధములను గల్పింపఁ బ్రయత్నింపక మానరు; కాని, జనులు గల్పించుప్రతిబంధములే కార్యకరణోత్సాహంబున కత్యంతసహకారములుగ నుండక మానవుగదా!

ఆకాలంబున నీయనపడిన సంక్షోభమేయాయన నిట్టిఘనకార్యంబునకుఁ గడంగఁజేసిన దని నేఁ జెప్పఁగలను. అట్లీపట్టణమందిరంబును, వీరేశలింగము పంతులవారుగాక, తదితరు లెవ్వ రయినను గట్టించినచో మనమప్పు డిన్నివిధంబుల శ్లాఘింపవలసినయావశ్యకంబుండదు. పూర్వు లార్జించిన ధనంబునఁగాని, యేయితర వ్యాపారంబున సముపార్జించినవి

త్తంబునంగాని యట్టిపట్టణమందిరంబును నెవ్వారైనను గట్టించినచో మన మప్పు డట్టివానియొక్క సచ్చింతకుమాత్రమే సంతసింపవలసి యుండును. గ్రంథములఁ బఠనీయగ్రంథములుగ నిర్ణయింపఁబడినఁగాని, యమ్ముడు వోవుట కలలోనివార్తగనున్న మన యాంధ్రదేశంబున రసవంతంబుగ గ్రంథములను రచియించి, జనులయందు గాఢనిద్రం జెందుచున్న భాషా నురాగంబును మేలుకొల్పి, యట్టి యనురాగంబును, దినదినప్రవర్ధమా నంబుగ నుండునటులు పాలుమాలిక యనునది లేశంబును లేక పాటుప డుచు, గ్రంథంబులమూలంబుననే యంతధనంబును సంపాదించి యట్లుస చ్చింతతోడ నొకగొప్పసభాభవనంబును గట్టించిన వీరేశలింగముపంతుల వారిసామర్థ్యంబునకును, సచ్చింతకును, సాహసంబునకును, మన మెంత యుసంతసింపవలసి యున్నది. ఎట్టియపూర్వసామర్థ్యంబును గలిగియున్న ను, నట్టివారలందఱు,

గీ. తరులు ఫలసమృద్ధిని నమ్ర ♦ తనువహించు
మేఘములు నవోదకముల ♦ మిగులవంగు
సత్పురుషు లుద్ధతులుగారు ♦ సంపదలను
బటుపరోపకారులకు స్వ ♦ భావమిదియె.

అనురీతి నెప్పుడును నిగర్వచూడామణులుగనే యుందురు. ఇంక, పంతు లవారి నిటు లాంధ్రదేశమునం దంతట నాబాలవృద్ధప్రసిద్ధంబుగ నెఱుఁ గఁజేసిన స్త్రీపునర్వివాహములంగూర్చి కొంచెము యోచింతము.

చిరకాలమునుండి జనసంఘంబున నాటుకొని యున్న దురాచా రంబుల నెల్ల దొలఁగింపవలయు ననుముఖ్యోద్దేశంబునం బాటుపడు చు న్నవార లొక్క వీరేశలింగముపంతులవారే యయియున్నారు. ఇతరగ్రం థకర్త లెవ్వరు నిట్టిసదుద్దేశంబునకుం గడఁగ కుండుటఁ జేసి, యట్టివారలనీ యంశంబుననీయనతోడం బోల్చుటకు లేశమయినను వీలుపడదు. అట్లు బహువిధములయిన ప్రయాసంబులకు లోనయి వారలు నిర్వహించినకా



ర్యంబులు స్త్రీపునర్వివాహకార్యంబులు. ఇట్టియాచారము మనదేశం బున నింతకుమునుం దెప్పుడును జరిగియుండలేదు. ఈయన కీవిధంబున నె ల్లెడల దట్టంబుగనల్లుకొనినయమితయశంబును సంపాదించినవి స్త్రీ పునర్వివాహంబు లనియే చెప్పవలసి యున్నను, నట్టిప్రఖ్యాతి కంతయు నవియే ముఖ్యకారణంబు లని చెప్పుటమాత్రమంతగా సముచితంబుగాదు. స్త్రీపునర్వివాహంబులకుం బూర్వంబుననె పంతులవారి ననేకు లాంధ్రదే శంబున ననేకవిధంబుల నెఱింగియున్నారు. ఈయనకు గ్రంథంబులును బత్రికలును, హాస్యసంజీవనులును, విశేషంబుగం బ్రఖ్యాతిని సమకూ ర్చియున్నయవి. ఒకగ్రంథములను రచియించుటవలనఁగాని, పత్రికలం బ్ర చురించుటవలనఁగాని, యిటులమితయశంబును సంపాదించుటమాత్ర మెవ్వారికిని సాధ్యంబుగాదు. అట్టి ఘనకార్యంబుల నెఱవేర్చుటకుముఖ్యా ధారము విత్తమేయని నే వేఱుగఁ జెప్పనక్కఱలేదు. చిరకాలమునుండి యనాథయువతు లందుచుండెడి విపత్పరంపరలు గన్నులార విలోకించి పరమదయార్ద్రహృదయులయి, నిజౌదార్యగుణంబు దేటపడునటులు లేశ మును వెనుదీయక యట్టికార్యంబులకు ముప్పదివేల రూపాయల నొసం గిన సాహసౌదార్యగుణసంపన్నుఁడగు పైడా రామకృష్ణయ్యగారిసచ్చిం తకు మన మెంతయు సంతసింపవలసి యున్నయది. రామకృష్ణయ్యగారి ధనసహాయంబువలన నేఁటికన్ని జాతులవారలలోను వీరేశలింగముపంతు లవారు స్త్రీపునర్వివాహంబులు జరపియున్నారు. ధనమొసంగినది రామకృష్ణయ్యగారే యయినను విశేషంబుగఁ బ్రయాసంబుల నంది కార్యంబుల నెఱవేర్చుచువచ్చినది ముఖ్యంబుగ వీరేశలింగము పంతు లవారే యని చెప్పవలసి యున్నది. ఈయనపడిన ప్రయాసంబును వారుప్రచురించినయుపన్యాసాదులే వేవిధంబుల ఘోషించుచున్నయవి. అందలి 'స్త్రీపునర్వివాహవ్యాపారముయొక్క భూతవర్తమానస్థితు'లను

నున్యాసంబునందలి కొన్ని వాక్యంబు లిటఁ దెలియఁజేయుట యెంతయు నావశ్యకంబని తలఁచి యట్లు చేయుచున్నాఁడను.

"ఈ ౧౮౭౯ వ సంవత్సరము మొదలుకొని తరువాత రెండు సంవత్సరములకు పిమ్మట ప్రథమవివాహమగువఱకునుపట్టిన సమస్తవ్యయములను నేనేవహించినాను. నేను చేసినయుపన్యాసములను ముద్రింపించి,కొన్నిప్రతులను విక్రయించినను,విశేషభాగ మూరక పంచి పెట్టినాను; వాదమునిమిత్తమయి ముప్పదినలువది స్మృతులను, ఇతరపుస్తకములనుకొని కృషిచేసినాను; బహుస్థలములయం దున్న వారితోనుత్తర ప్రత్యుత్తరములను జరపుచు వలసినప్పు డితరస్థలములకుఁగూడపోయి యుపన్యసించుచువచ్చినాను;వివాహములు చేసికొనెదమనివాగ్దానములు చేసినవిద్యార్థులకుఁగొందఱికిఁ బాఠశాలజీతములకు సహాయముచేయుచు వచ్చినాను; బాలవితంతువులున్నస్థలములను విచారించి, సమాచారములను దెచ్చుటకును, కృషిచేయుటకును, మనుష్యులకు సొమ్మిచ్చుచువచ్చినాను; బాలవితంతువుల సంరక్షకులతో మాటాడుటకయి అమలాపురము, మండపేట, తాళ్ళపూడి, కాకినాడ, విఘ్నేశ్వరము, రామచంద్రపురము, పాలకొల్లు మొదలయినస్థలములకు మనుష్యులనుపంపుటయేకాక, వీనిలో నొకటిరెండుస్థలములకు నేనును బోవుచువచ్చినాను;ఈప్రయాణములలో నొకసారియొకపల్లెలో శీతకాలపురాత్రియం దొకమిత్రుఁడును నేనును పశువులపాకలోని పశువులతోఁ గలిసి రొచ్చుకంపులో పరుండి నిద్రింపవలసివచ్చినది:—వివాహమొకటికి వేయేసిరూపాయల చొప్పున వ్యయపెట్టుటకయి రామకృష్ణయ్యగారు నాకధికార మిచ్చినను, నేను విచ్చలవిడిగా సొమ్మువ్యయపెట్టక, తాత్కాలికస్థితినిబట్టి సాధ్యమయినంతమితముగానే సొమ్మువాడుచు వచ్చినాను — నేనుపట్టణమునుండి తెప్పించినసొమ్మంతయు బల్లారిలోజరిగిన వివాహములకుఁ గలుపుకొని



౯౭౫౮-౭-౫ పోగా నేనీసమాజమువారికి లెక్కయొప్పగించునప్పటికి నాకే రు ౩౩౦-౧౪-౯లు రావలసియున్నవి. నా కెంతబాకీయున్నను నేనాసొమ్మెప్పుడును మఱల పుచ్చుకోఁదలఁచుకోలేదు. వివాహములారంభమయినది మొదలుకొని ౧౮౮౪ సంవత్సర ప్రారంభమువఱకును శీతకాలపుసెలవులలోను వేసవికాలపుసెలవులలోనుకూడ, నేనీపనిమీఁద చెన్నపట్టణమునకో, మఱియొకస్థలమునకో పోక మానినసంవత్సరము లేదు. నావ్యయములను తమసొమ్ములోనుండి పుచ్చుకొమ్మని రామకృష్ణయ్యగారెన్నిసారులు చెప్పినను, పుచ్చుకొనక, నాప్రయాణవ్యయములను నేనే వహించుచు వచ్చినాను. ౧౮౮౫ సంవత్సరము మెయి జూన్ నెలలలో చందాలనిమిత్తము చెన్నపురికి వెళ్లినప్పటి వ్యయములను మాత్రము వసూలైన చందాసొమ్ములోనుండి పుచ్చుకొన్నాను. ఇంతేకాక, ఈకార్యములమీఁద మునిస్వామిమొదలైన వారిని నెలలకొలఁది త్రిప్పినను, సమాజధనమునుండి యేమియు గ్రహింపక వారిజీతములు మొదలైనవానిని నేనేభరించుచు వచ్చినాఁడను. కార్యసాఫల్యము కాని విషయములలో స్త్రీపునర్వివాహ ప్రయత్నములయందు నేను వ్యయపెట్టిన సొమ్మేమియు నేను సమాజపులెక్కలో వ్రాయలేదు. విశాఖపట్టణమునుండి యొకబ్రాహ్మణుఁడు వితంతుకన్యలను తీసికొనివచ్చెద నని చెప్పి, మునిస్వామిని విశాఖపట్టణమండలమునందు పెక్కుదినములు త్రిప్పి తుదకు కొంతసొమ్మెత్తుకొని పాఱిపోవుట మొదలైన వార్తలను పలువు రెఱిఁగి యుందురు:—చేతిలో సొమ్ము లేక పోయినప్పుడును, యుక్తకాలములో నాకు చెన్నపురినుండి సొమ్ము రానప్పుడును కొన్నిసారులు రాఁబోవు నెలజీతములు ముందుగాముట్టక కొందఱి కాలస్యముగా ముట్టినవి. అప్పుడును నేనప్పయినను చేసి, కొంతసొమ్మయినను ముందుగా నియ్యనిమాస మొకటియు లేదు. నేమిప్పుడు వివాహములను జేసికొన్నబీదవాండ్రకు నెల

ంకి ఇంచుమించుగా రులాల చొప్పునఁ గొన్నిసంవత్సరములవఱకును ఇచ్చెద మని ప్రచురించితిమి:—''

అను మొదలైనవానిం జూచువారలకు వీరేశలింగముపంతులవారావిషయంబుల నెన్నెన్ని చిక్కులం బడియున్నదియు, వారల కెట్టిసచ్చింత గలిగియున్నదియు, నేప్రకారముగ బహువ్యయములను తగ్గించుచు వచ్చినదియు, సులభముగ బోధపడక మానదు. పంతులవారాయావివాహములకైన వ్యయముల వివరమును రామకృష్ణయ్యగారికిఁ బంపుచువచ్చిరి. రామకృష్ణయ్యగారట్టివివరములు తమ కక్కఱలేదనియును, వారలయందుఁ దమకంతనమ్మకము లేకపోలేదనియును, దమకు వీరేశలింగము పంతులవారియెడలఁ గలగట్టినమ్మకమును, సచ్చింతను, దెలియఁజేయుచు ననేకయుత్తరములను వ్రాసియున్నారు. అవియన్నియు నెఱింగియున్న, నట్టిలెక్కలనెల్లను జూచినచో, నయ్యవి నాకత్యంతోపకారకరంబులుగ నుండకమానవని తలంచి, లెక్కలంజూపవలయునని కోరినతోడనె యన్నింటినిఁ గ్రమమున నగపఱచిరి. లెక్కలనెల్లను మిగులజాగరూకతతోఁ జూచినపిమ్మట, శ్రీపునర్వివాహములం జేసికొనినవారల కాపంతులువారు గనఁబఱచుచువచ్చిన సహాయములను, అందులకువారలయెడ నగపఱుపఁబడిన కృతజ్ఞతాసూచకములగు ప్రతీకారములను జక్కఁగఁదలంచి మిగులసంతసించితిని. వితంతూద్వాహంబుల విషయమై యీయన యెంతయమితప్రయాసమును పడియున్నా రనినను జెప్పవలసియే యున్నయది. మన తెనుఁగుదేశంబున, నీయననే నిజమైనమతసంస్కారి యనిచెప్పవలసి యున్నయది. ఇట్లుచెప్పుటచే శ్రీపునర్వివాహంబులం జేసికొనినవారలంద ఱమితసుఖంబు ననుభవించుచున్నారనికాని, వారలు కేవలస్వప్రయోజనపరత్వంబుననే వివాహంబులం జేసికొన్నవారని కాని నేను చెప్పఁబోను. పంతులవారు వారివలన తమకు లేశమైనను నుపకారంబునుగోరక కే-



వలము సచ్చింతతోడనె వివాహములం జేయనారంభించి రనియెవ్వరును జెప్పకమానరు. మనవారలలోఁ గొందఱాయన శ్రీపునర్వివాహములు చేయ నారంభించుటకు ముఖ్యకారణం బమితయశంబును సంపాదించుటయం దాయనకుం గలయత్యాశయని చెప్పుకొనవచ్చును. దేశీయులయందఱ సుఖాభివృద్ధుల కింతయుఁ బాటుపడక, పాటువడి యమితప్రయాసమునకు లోనయి మహాకార్యంబులం జేయనారంభించినచో, నట్టివారలకుం గీర్తిరాకుండుట యెట్లుసిద్ధించును? మహాకార్యములె ముఖ్యకారణములగఁ జేసికొని పొరలిపొరలివచ్చుచుండెడి యశస్సముద్రంబు నాఁపఁగడంగుట కెట్లువీలుపడును? దేశక్షేమాభివృద్ధులకై శక్తివంచనయొకింతయు లేక, ప్రతిమనుజుండును వీడక పాటుపడుచునే యుండవలయును. అట్లు మన తెనుఁగుదేశమున సమితపరిశ్రమమునకు లోనయి, పాటుపడువారలలో వీరేశలింగముపంతులవారే మొట్టమొదటివారుగ నున్నారు. కావున నట్టివారలయెడ నందఱియెడ స్వదేశాభిమానుల మగుమనమందఱమును, మిగులఁ గృతజ్ఞులమైయుండవలసియుండు నని నేనిట వేఱుగఁజెప్ప నక్కఱలేదు.

పునర్వివాహములను జేసికొనినవారలలో ననేకులిప్పుడు తాము విశేషముగఁ గష్టముల ననుభవించుచున్నారమని చెప్పవచ్చును. అయ్యది యెంతయు సత్యమేయయి యుండవచ్చును. కాని, తమకష్టములకెల్లను వీరేశలింగము పంతులవారినే ముఖ్యకారణులనుగఁ జెప్పుట కెట్లు వీలుపడునో నేనెఱుంగ నేరకున్నవాఁడ. అట్టికష్టములకెల్లను స్వయంకృతాపరాధమునె ముఖ్యకారణముగఁ జెప్పవలసియుండును. పంతులవారట్టి వారల కందఱకును దమచేతనైనకొలఁదిని సహాయ మొసఁగుటయేకాక, తాము చేసినవాగ్దానములను జక్కఁగఁ జెల్లించియే యున్నారు. ధనమును వ్యయపఱచుటయం దీయన స్వతంత్రించి యొక్కకార్యమును జేయలేదు. ధనము నొసంగిన రామకృష్ణయ్యగారే లెక్కలక్కఱ-

లేదని యనేకవిధముల నుత్తరములు వ్రాయుచువచ్చినను, జనుల స్వభావమును జక్కఁగ నెఱుఁగునట్టి జ్ఞానసంపదగల వారగుటం జేసియే వీరేశలింగముపంతులవా రాయాలెక్కల నెల్లఁ గ్రమముగ నుంచుచువచ్చిరి.

స్త్రీపునర్వివాహములవిషయమై యీయన యిప్పుడెంతధనమునైనను జనులనుండి సంపాదించుటకుఁ దగిన సామర్థ్యమును గలిగియున్నారు. అందుల కీయనయెడ దేశీయులకుఁగల సద్భావమును నమితగౌరవమును ముఖ్యకారణము లని చెప్పవచ్చును. కావునఁ, బునర్వివాహములను జేసికొనినవారల కీయన యెట్టి సాహాయ్యములం జేయఁదలంచినట్టి సాయముల నెల్ల సులభముగ నొసఁగఁగలరని చెప్పుట కింతయు సందేహము లేదు. అయినను, వీరేశలింగము పంతులవా రొనర్చుచుండెడి వివాహములు వధూవరులయన్యోన్యాభిప్రాయానుసారముగ నొనర్పఁబడుచుండెడి స్త్రీపునర్వివాహములే కాని, భార్యాభర్త యనుశబ్దముల యర్థము నైన నెఱుఁగనేరక, యుక్తాయుక్తపరిజ్ఞానవివేకవిహీనులై కన్యావరులయిష్ట మనునది లేశమును లేకయే, తల్లిదండ్రు లొనర్చుచుండెడియతిబాల్య వివాహములుగావు. కావున, వార లందఱు వారియెడ నెంతయుఁ గృతజ్ఞులుగ నుండుటయే పరమధర్మము. ఈయన యట్టివారల యందఱియెడ నెంతయుఁ గృతజ్ఞులుగనుండి సహాయమునె చేయుచుందురు. ఇంకనీయన, స్త్రీపునర్వివాహముల విషయమునను, నింకను స్వదేశీయుల కందఱ కుపకరించెడియనేకవిషయములనుగూర్చియు విశేషముగఁ బాటుపడఁదలఁచి, యుద్యోగమును సహితము వదలుకొని, యొక్క యీచెన్నపురి రాజధానియందకాక, కలకత్తా, బొంబాయి మొదలైన యితరరాజధానులకు సహిత మేగి, యక్కడి దయార్ద్రహృదయుల కందఱకును దేశీయులకుం గలకష్టముల నెల్లను వెల్లడించి, తమచే నగుమార్పులను గలుగఁజేసి, జనసంఘమునకు సుఖమును గలుగఁజేయ నిశ్చయించుకొనియున్నారు. కావున, స్వదేశాభిమానుల మగు మనమందఱ మిట్టివారలయెడ నెంతకృతజ్ఞతగలవారలముగ నుండవలయునో మీరలే యోచింపుఁడు. ఆంధ్రదేశముయొక్క మూఢదురాచార వ్యవహారములను జక్కఁగ యోచించువారలందఱు స్త్రీపునర్వివాహకార్యముల నొకఘనకార్యముగఁ దలంపకమానరు. అట్టి ఘనకార్యములను నెఱవేర్చువారల కందఱ కొకవిధమయినయానందము గలుగకమానదు. ఆయానందము నీయనచే, నమితసంతోషమువలన నుదయించెడియున్నతను వెల్లడించునటుల రచియింపఁబడి ప్రచురింపఁబడిన "రాజమహేంద్రవర స్త్రీపునర్వివాహ చరిత్రము" నందలి "ఆమఱునాఁడే యీసంగతి యూరంతయుపొక్కి, యాచిన్నదానిని చూచుటకయి జనులు తీర్థప్రజవలె రాసాగిరి. అందుచేత కొన్నిదినములు మాయిల్లు తిరుమల వేంకటేశ్వరులయాలయమువలె వచ్చెడివారితోను, పోయెడువారితోను, సందడిగానుండెను" అనునీరెండువాక్యములే విశేషముగ వెల్లడించుచున్నయవి. పునర్వివాహములనుగూర్చి విశేషముగ నాలోచించునప్పుడీయన యెంతయు స్వానుభవమునే వెల్లడించునటులు రచియించిన "సత్యహరిశ్చంద్రనాటకము" నందలి

గీ. నారికేళంబుపయి నెక్క ♦ సారిగాఁగ
వారిదము నీరుఁ బిడుగును ♦ బంపునట్లు
విధియు సంతోషదుఃఖము ♦ ల్వొలయ నాకు
నొక్కసారియె గూర్చుచు ♦ నున్నవాఁడు.

ఉ. ఆపద లొక్కటం దగులు ♦ నప్పుడె ధీరుఁడు సుస్థిరుం డగున్;
కాపురుషుండు కష్టముల ♦ గాసిలి నిల్వక సంచలించెడున్;
కావునఁ దీవ్రమారుతము ♦ దండడి ముట్టిన, బెండు నిల్వఁగా
నోపక పాఱుచో నిలిచి ♦ యుండవె మ్రాకులు సుస్థిరంబులై?

అనుపద్యములు స్మరణకు రాకమానవు. వర్తమానమున, మనయాంధ్ర దేశమునందలి జనసంఘమున, వీరేశలింగముపంతులవా రిట్టియున్నత స్థితికి వచ్చుటకుఁ గారణములు పలువురు పలువిధములుగఁ జెప్పుచుందురు. ఏదేశమునను, మనుజుని మహనీయునిగ గణింపఁ జేయుటకుం జాలినవి కాలముయొక్కయు, సంసారములయొక్కయు స్థితిగతులును, సంక్షోభము ననియే నేఁ జెప్పఁగలను.

గీ. చితుకులు గదల్చుటను నగ్ని ♦ చెలఁగి మండు;
చెఱుగుఁ జేయుటచేఁ బాము ♦ పడగ విప్పు;
మఱియు క్షోభంబువలననె ♦ మానవుఁడును
దనదుమహిమంబు చూపును ♦ దథ్యముగను.

అనురీతిని, మనుజునియొక్కనిజం బగుమాహాత్మ్యమును వెల్లడించుటకు, క్షోభమే ముఖ్యకారణముగ నుండును. కావున, నట్టివారల గౌరవనీయం బగునున్నతస్థితికి ముఖ్యకారణంబు లాయామనుజులకుం గలపూనికయు, నోర్పును, నుత్సాహంబును, నంతరాంతరముల వచ్చుచుండెడియంతరాయముల మూలమునఁ గలుగుచుండెడి యధైర్యమునఁ గుంది క్రుంగుమనసును హెచ్చరించుటయందు, నెడనెడ నమితసంతోషమందుచు నాఁపం దరముగానితెఱంగున నుప్పొంగు చుండుమనసు నదిమి కుదించుటయందు నట్టివార లందఱు, స్వాభావసిద్ధంబుగఁ గలిగియుండెడిమితిమించినసామర్థ్యంబు ననియే చెప్పెదంగాని, విపరీతార్థములు గల్పించుచు మనవార లందఱు చెప్పెడురీతి నదృష్టఫలమని కాని, పూర్వజన్మసుకృతపుణ్యఫల మనికాని, మీఁదిమిక్కిలి దైవానుగ్రహమనికాని, నేనెప్పుడును జెప్పఁబోను.

వీరేశలింగముపంతులవారి పూర్వుల వాసస్థాన మీగోదావరిమండలంబు నందలి హేలాపురం బనఁబడుచుండెడి యేలూరు. పంతులవారి ముత్తాతతండ్రిగారగు రాజలింగముగారి పూర్వులు నెల్లూరిమండ



లంబునందలి కందుకూరుపుర నివాసులుగ నుండియుండిరి. ఆకారణంబుననె వారలకు గృహనామంబు కందుకూరివా రనివచ్చినది. వారు, నబాబులకాలములో దేశపాండ్యాలుగ నుండిరి. పిమ్మట, రాజలింగముగారి మనుమఁడును, ఈరాజలింగముగారి పుత్త్రుఁడునగు చంద్రమౌళిగారి పుత్త్రుఁడును, వీరేశలింగము పంతులవారికిఁ దాతగారును నగు వీరేశలింగముగా రిక్కడిజమిందారులకడ మంత్రిత్వమును వహించి, లౌకికవ్యవహారధూర్వహులనియును, బరమతపోనిధులనియును, గొప్ప పండితులనియునుం బ్రఖ్యాతిని జెందుచు, సుఖంబుగఁ గాలంబును గడుపుచువచ్చిరి. ఆవీరేశలింగముగారు, తమపూర్వులవలె శివునిం బ్రధాన దైవంబుగఁ దలంపక పరమదైవంబునె సంభావించుచు వచ్చిరి. అంహుతికు ‘‘ రసికజనమనోరంజనము ’’ నందలి,

ఉ. ఆతఁడు విద్దెలంగరము ♦ నందఱచేతను మెప్పుపొంది, మే
ల్కేఁతల నెందును న్నవతు ♦ లేక చెలంగి, కరంబుమేటియై
బ్రాతిగ నేలతేండ్లకడఁ ♦ బ్రెగ్గడయై కడుఁ బేరుపొంది, తా
నేతటి మేటిదేవరనె ♦ యెంచుచు లింగని మానెఁ గొల్వఁగన్.

అనుపద్యమే నిదర్శనముగనున్నది. ఈవీరేశలింగము పంతులవారిపూర్వులు, దేశపాండ్యాలుగను, మంత్రులుగనుండి కవులనాదరించుచుఁ గృతుల నంకితంబుగ నందినట్లు పంతులవారిచే రచియింపఁబడిన ‘‘ రసికజనమనోరంజన ’’ మను శుద్ధాంధ్రప్రబంధమునందు ‘‘ మొకల నాకోలంబు తెఱంగించుక వక్కాణించెద ’’ నని వ్రాసిన,

సీ. జగములఁ గలిగింప ♦ నెగడింపఁ బొలియింప
గలవెన్నుఁ డేవేల్పు ♦ కన్నతండ్రి
మేలిమి నల్లరకును ♦ గలుములుగలిగించు
సిరిచెలి యేవేల్పు ♦ చెలఁగుతల్లి

ఖేల రేగి యందఱ ♦ వలపించి స్రుక్కించు
ననవిల్తుఁ డేవేల్పు ♦ ననుఁగుఁదోడు
చదువుల కెల్లను ♦ గుదురగుచు వెలుంగు
వెలిచాన యేవేల్పు ♦ వెలఁదిమిన్న
యట్టి నలువవంగడమున న♦ మరఁబుట్టె
రాజలింగ మనంగను ♦ రహిఁ దనర్చి
యతఁడు బేసికన్నులవేల్పు ♦ నందుఁగలుగు
బత్తి కలిమిని సరిలేక ♦ వన్నెమీఱె.

గీ. ఊళ్లబల్లెలు నేలుచు ♦ నుండి యాతఁ
డెల్ల వారలఁ దనుపుచు ♦ నీగిచేత
వాసిగని కాంచెను గొలంబు ♦ వన్నెకెక్క
జంద్రమౌళి యనుకుమారు ♦ సాటిమీఱ.

క. అక్కమయను నెలనాగన్
మక్కువతోఁ బెండ్లియాడె ♦ మఱియాతఁడు మున్
మఱకంటి గట్టుకన్నియ
నక్కఱతోఁ దాను బెండ్లి ♦ యాడినకరణిన్.

క. వీరేశలింగ మనుకొడు
కారయఁగాఁ జంద్రమౌళి ♦ కరుదుగఁ బుట్టెన్
జేరి మునుపాలకడలికి
గారాబపుఁజందురుండు ♦ కలిగినమాడ్కిన్.

ఉ. ఆతఁడు విద్దెలం గరము ♦ నందఱచేతను మెప్పు పొంది మే
ల్చేఁతల నెందును న్నవతు ♦ లేక చెలంగి కరంబు మేటియై
వే తగు నేలతేండ్లకడఁ ♦ బ్రెగ్గడయై కడుఁ బేరుపొంది తా
నేతఱి మేటిదేవర నె♦ యెంచుచు లింగనిమానెఁ గొల్వఁగన్.



గీ. కోమరులను గాంచె నాకందు ♦ కూరికొలపుఁ
బెద్ద వేంకటరత్నమున్ ♦ పెద్దకొడుకు
వెనుకఁ జిన్నిసుబ్రహ్మణ్య ♦ మనుకొమారు
నలరుతనచాన యైనకా ♦ మమ్మయందు.

క. అందుల సుబ్రహ్మణ్యుఁడు
పొందుగ నెల్లరును దన్నుఁ ♦ బొగడఁగ సిరులం
జెంది వెలిఁగెఁ దనసరివా
రందఱిలో మిగుల సన్న ♦ యానకు లోనై.

గీ. మున్ను కడలిరాకన్నియఁ ♦ జెన్ను మీఱ
వలచి, వెన్నుండు గైకొన్న ♦ చెలువు దోఁపఁ
బున్నమ యనంగఁ దనరారు ♦ పొలఁతిమిన్న
నబ్బురంబుగఁ బెండిలి ♦ యాడె నతఁడు.

క. అయ్యిరువురకును సంతస
మెయ్యనఁ జేకూఱ నేను ♦ నుదవితి మదిలో
నెయ్యమున న్నిలుపుదు మరు
నయ్యను వీరేశలింగ ♦ మనఁ జను చుందున్.

అనుపద్యములవలనను, స్వీయచరిత్రమునందలి యొకభాగముగ, నుండఁదగునట్లుగ "నాంధ్రకవులచరిత్రము"లో రచియింపఁబడిన "అత్తలూరి పాపకవి" చరిత్రమునందున్న,

" ఈకవి చెన్నబసవపురాణ మనునయిదాశ్వాసములపద్యకావ్యము రచియించి, మాపూర్వులలో నొక రయినకందుకూరి యమృతలింగముగారికంకితము చేసెను. మాపూర్వులు మహమ్మదీయప్రభుత్వములో "దేశపాండ్యా" లయి ఘనతనుబొంది పెక్కుకావ్యములను కృతులనంది కవుల నాదరించియున్నారు. పూర్వము కృతిపతు లయిన

వారిని గూర్చినకొన్నిపద్యముల నీపుస్తకమునుండి యిం దుదహరించు చున్నాను.

ఉ. అతనికీర్తికై కువల ♦ యాశ్వచరిత్రకృతిన్ గ్రహించి ప్ర
స్ఫీతము లైనకొత్తపలి ♦ వేలెటిపా డనునగ్రహారముల్
ఖ్యాతిగఁ జేసి బంధులకు ♦ గ్రాసనమృద్ధులొసంగి శాంభవ
వ్రాతము గోర్కు లిచ్చి, విభ ♦ వంబున మల్లనమంత్రి వర్ధిలెన్.

కందుకూరి మల్లికార్జునమంత్రి కువలయాశ్వచరిత్రము కృతినందిన తరువాత

సీ. మహితపంచాక్షరీ ♦ మాహాత్మ్యమును గృతి
యంది త్రైలోక్యవి ♦ ఖ్యాతిఁ గాంచె;
నతిభక్తి శ్రీశైల ♦ మందు మానులుమెచ్చ
సంవత్సరము నివా ♦ సంబు చేసె;
నిష్ఠాగరిష్ఠుఁడై ♦ నేఁడునాఁ డనక య
సంఖ్యమాహేశ్వరా ♦ ర్చన మొనర్చె;
హితుల రక్షించి య ♦ హితుల శిక్షించి భూ
పతుల వశ్యులఁ జేసి చతురుఁ డయ్యె;
నితని కెనయైనమంత్రులీ ♦ క్షితితలమునఁ
గలరె యని సర్వజనములుఁ ♦ బలుక నెగడెఁ
గందుకూర్ మల్లికార్జున ♦ నందనుండు
సంగరగుహుండు వీరేశ ♦ లింగవిభుఁడు.

వీరేశలింగమంత్రి పంచాక్షరీమాహాత్మ్యము కృతినందెను. అటు తరువాత

సీ. నారదప్రభ మించి ♦ నారదప్రభ నెంచి,
యమరినకీర్తిదా ♦ నములవాఁడు,



చిత్రభానునిమీఱి ♦ చిత్రభానుని గేరి
పరఁగుసుచిప్రతా ♦ పములవాఁడు,
భీముపేర్మిని గెల్చి ♦ భీముఁ బేర్మి నగల్చి
వఱలినభూతిస ♦ త్వములవాఁడు,
ధర్మగర్వముఁ ద్రోచి ♦ ధర్మగర్వముఁ బాచి
తగుశివభక్తిస ♦ త్యములవాఁడు,
జగతిఁ జెలు వొందె నుదయాస్త ♦ శైలసేతు
శీతనగమధ్యరాట్సభా ♦ సీనవిబుధ
వినుతసుగుణుఁడు, మల్లికా ♦ ర్జునసుతుండు,
మహితధృతిశాలి, బసవరా ♦ ణ్మంత్రిమౌళి.

క. ఘనముగ నైతముపూడియు
మినుమించిలిపాడు సిరులు ♦ మించంగ నొసం
గెను గురుచరవరులకు బస
వనితో నెనయైనమంత్రి ♦ వసుధం గలఁడే?

క. తనమేనయల్లుఁ డావృత
వినయుం డగుబుద్ధిరాజు ♦ వీరసచేతన్
గొనె సత్యవతీపరిణయ
మనుకృతి శ్రీబసవమంత్రి ♦ యతిసంప్రీతిన్.

కందుకూరి బసవరాజుగారు సత్యవతీపరిణయమును గృతినందిరి. అటుపిమ్మటఁ గందుకూరి యమృతలింగముగారు రచించిన బసవపురాణమును గృతినందిరి.''

అనుపద్యాదులవలనను, వీరిపూర్వులు లింగధారులయి వీరశైవులయి మిగులధర్మాత్ములయి, భూదానాదులు చేసి, కీర్తివడసినవారయి, దేశపాండ్యాలయి, పెక్కుకావ్యములను ముఖ్యముగా శైవగ్రంథములను గృతుల నందినవారయి మహాసుప్రసిద్ధిని సంపాదించిన

వార లని యెంచక యోచించి చూచువారలకు సులభముగా బోధ
పడక మానదు.

అట్లు మంత్రిత్వంబునువహించి, విశేషముగఁ బ్రఖ్యాతిని సంపా
దించుచుఁ గులంబువారల కందఱకును, దమచేతనైనకొలఁదినిసాయ
మొసంగుచు, బంధువర్గంబులోనివారల మని వచ్చెడువారల నెల్ల
ను సేవలముపారమార్థికచింతతోడ నెంతకాలము తమయింటనున్నను న
న్నవస్త్రాదుల నొసంగి, యమితప్రేమంబునఁ గాపాడుచువచ్చి రనివిన్నాఁ
డను. ధనమున్న దని, బంధువుల మని చెంతఁ జేరెడివారల నందఱనాతీ
రునఁ బ్రోచుచు ధనమును బుణ్యమునకై వెచ్చించుటం జేసియే విశేష
ముగ ధనికులుగ నుండవలసినవారి కొక్కగృహము మాత్రమే మిగిలి
యుండెను. అయినను మన మందఱ మిప్పుడందులకు సంతసింపవలసియే
యున్నది. ఇక్కడి పితామహులం డగువీరేశలింగముగారి కిరువురు కుమా
రు లుదయించిరి. అందు మొదటివాని పేరు వేంకటరత్నముగారు. రెండ
వ కుమారుఁడు సుబ్రహ్మణ్యముగారు. వీరేశలింగము పంతులవారితాత
గారు కాలవశు లగునప్పటికి వేంకటరత్నముగారును, సుబ్రహ్మణ్యము
గారును, తల్లిగారు నొక్కకుటుంబముగనే యుండిరి. తరువాత సుబ్ర
హ్మణ్యముగా రిక్కడ మండలకరగ్రాహికడ నుద్యోగమును సంపాదించి
రి. సుబ్రహ్మణ్యముగారు మిగులసద్గుణసంపన్నులగుటం జేసియే యన్న
యానకులోనయి మిగుల నయభయంబుల మెలంగుచు వారలహితోప
దేశముల నెల్లను జెవియొసంగుచు సుఖముగఁ గాలము గడపుచువచ్చిరి.
ఇట్లుండఁగా సుబ్రహ్మణ్యముగారికిఁ బుత్రసంతానము సంప్రాప్తమయ్యెను.
పిమ్మట విధ్యుక్తముగ జాతకర్మాదులం గావించి కుమారునకు వీరేశలిం
గమని పేరుపెట్టుకొని మిక్కిలి గారాబంబునఁ బెరుచుకొనుచుండిరి.



ఇప్పుడాంధ్రదేశమునం దీవీరేశలింగము పంతులవారెట్టిప్రాజ్ఞు
లుగఁ బరిగణింపఁ బడుచుండునదియు మనమందఱమును జూచుచున్నాము
గదా! నేఁటికించుమించుగ నరువదిరెండుసంవత్సరములకు వెనుకఁ గుమా
రునకుఁ బేరుగఁ బెట్టుకొనిన "వీరేశలింగ" మనుశబ్దమాంధ్రదేశమునం
దంతట నొకగొప్ప సంస్కారి యనియును గొప్పకవీశ్వరుఁ డనియును, జ్ఞా
నసంపన్నుఁడనియును, సన్మార్గప్రదర్శకుఁ డనియును, నమిత సమర్థతాసం
పన్నుఁడనియు, నర్థముగలుగునటులుగ మారినయీకాలంబున వీరేశలిం
గముపంతులవారి తలిదండ్రులు జీవించియుండినచో వారలెంతెంతయా
నందమున నుప్పొంగుచుందురో నేనెఱుఁగఁజాలకున్నాఁడను.

దేహాభిన్న మగునాత్మ యనుచు నొకటి యున్నయెడల మనుజు
నిమరణానంతరమున నాత్మల కెఱుంగుసామర్థ్యమే యున్నయెడలఁ జిరకా
లాగతపూర్వాచారమునకు విరుద్ధముగ స్త్రీపునర్వివాహాచారమును లేశ
మును జంకక ధైర్యస్థైర్యములతో మన తెనుఁగుదేశంబున నెలకొల్పినయీ
వీరేశలింగముపంతులవారిం గాంచి వీరిజననీజనకులు మొదలగువా రెం
తయు నాగ్రహ మందుచు దుఃఖించు చుందు రనియే చెప్పవలసి
యున్నది. సంఘముచేసికొనిన యేర్పాటుల ననుసరించి వచ్చుచున్న
వివాహచిహ్న మని చెప్పవలసిన యజ్ఞోపవీతమును దమయంతరాత్మ
సత్యమని బోధించిన బ్రాహ్మమతధర్మముల కనుగుణంబుగ జన్నిదము
ను దీసివేసిన వీరేశలింగముపంతులవారి పూర్వులు సజీవులయి యుండఁ
గలిగినచో వారలెల్లరు నెంతపరితపించుందురో నేనూహింపఁజాలకున్నా
ను. వర్తమానంబున వీరిబంధువులలో ననేకులు వీరాచరించిన యజ్ఞో
పవీతవిసర్జనకార్యముంగూర్చి ముచ్చటించుచు నయ్యది యకార్యకరణ
మని చింతించుచునే యున్నారు. కాని వీరుమాత్ర మెవ్వరెట్లు తలంచి
చెప్పుచున్నను, దమయంతరాత్మబోధ ననుసరించి యాచరించి, లోక

మునకుం గార్యాచరణ మావశ్యకమని బోధింపఁగలిగితినిగదా యని నిశ్చింతతో సంతసించుచునే యున్నారని చెప్పవలసియున్నది.

వేంకటరత్నముగారికి సంతతి లేక యుండుటం జేసి, తమ్మునికుమారు నతిప్రేమమునఁ జూచుచువచ్చిరి. ఆంధ్రదేశమున మితిమించిన గౌరవమునకుఁ దావలం బగునీరాజమహేంద్రవరమే వీరేశలింగము పంతులవారికి జన్మభూమిగ నున్నది. అసంఖ్యాతము లగుదురాచారముల కిప్పుడుపట్టుకొమ్మయయి, యమితసంక్షోభమునకు నివాసమై యున్నమనహిందూమతమనెడి గొప్పకోటయొక్క మూఢతామోమయకవాటంబులు బాహాటంబుగఁ దెఱచి లోపలిదురాచారభూతంబుల నెల్లఁ జేతనయిన కొలందిని బారఁదోలఁ బ్రయత్నించియున్న "శ్రీ వివేకవర్ధని" పత్రికం బ్రచురించుశ్రీవివేకవర్ధనీముద్రాక్షరశాల నెలకొల్పంబడి యున్నగృహం బేదియో, శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధాదిగ్రంథరత్నముల కసంశయంబుగ రత్నాకరం బగుగృహం బేదియో, దేశదేశములు మ్రోగునటు లమితదురాచారమహాసముద్రంబున నమితంబగు నల్లకల్లోలంబు నొకకాలంబునఁ గలిగించిన స్త్రీపునర్వివాహ సదాచారంబు దేశంబునఁ జక్కఁగఁ బ్రాకి మార్గప్రదర్శకముగ నుండునటులు మొట్టమొదట స్త్రీపునర్వివాహములు జరుపఁబడినగృహం బేదియో, యశంబు నిజావాసంబుగఁ గావించుకొనిన సౌధంబుగలగృహం బేదియో, యాత్రార్థంబుగఁ గాశీరామేశ్వరాదిలసత్క్షేత్రములకుం జనుచు మఱలివచ్చుచు దర్శనీయునిఁగఁ దలంచుచు సందర్శింపఁ బలువురువచ్చుచుఁ బోవుచుండెడి గృహం బేదియో, "హాస్యసంజీవనులం బ్రచురించుచుండెడి వివేకవర్ధనికిం బత్రికాధిపతులగు వీరేశలింగము పంతులువారి ల్లిదియే, ఇదియే." యని యందఱుఁ జెప్పుకొనునటుల మనసున కమితసంతోషమును గలుగఁజేసెడి గృహం బేదియో యట్టియాగృహంబుననె వీరేశలింగము పంతులవారు కీలకనామసంవత్సర చైత్రశుద్ధ యేకాదశీ భానువారమునాఁడు, ౧౮౪౮వ సంవత్సరము ఏప్రిలునెల ౧౬వ తేదిని సూర్యోదయానంతరమున జనియించిరి.



ఈయనకించుమించుగ నాలుగైదు సంవత్సరంబుల ప్రాయము వచ్చునప్పటికే తండ్రిగారు కాలవశులైరి. సుబ్రహ్మణ్యముగారు మరణకాలమున కిరువదియైదు సంవత్సరముల ప్రాయముగలవారై యుండిరి. కావున వీరికిఁ దండ్రిగారు లేనిలోపం బతిసంతాపకరంబుగ నతిబాల్యముననె సంప్రాప్తమయ్యెను. అప్పటినుండియు వీరు, పెత్తండ్రిగారగు వేంకటరత్నముగారి పోష్యములో నుండిరి. చిన్నతనముననె తండ్రిగారు కాలవశులగుటం జేసి, వీరేశలింగముగారిని తల్లిగారగు పున్నమ్మగారును దదితరులు నెంతయు మితిమించిన గారాబంబునఁ బెనుచుచువచ్చిరి. అదియేవారల నమితవ్యాధి పాలుచేసినదని చెప్పుటకు లేశమును సందేహము లేదు. అట్టివారలంద అనుభవించుచుండెడి కష్టసుఖము లన్నియు ననుభవైకవేద్యము లేకాని మాటలఁజెప్పుట కెవ్వరికిని దరంబుగాదు. ఈయన బాల్యదశయందంతటఁ బిమ్మట నుద్యోగమునఁ జేరునంతవఱకును జబ్బువలన విశేషముగ బాధనందుచునే యుండిరి. అందులకు ముఖ్యకారణంబులాయనకుం గొంచె మేదియయినను వ్యాధివచ్చినతోడనే, లేక లేక కాంచిన కుమారుఁడగుటచే నేమియగునో యని యమితభయ మందుచు ధైర్యమనుదానిని లేశమును మనసున నిల్పుకొననేరక, యొక్కసారియె యిరుగుపొరుగువారలలో నెవ్వరేవైద్యములఁ జెప్పిన నట్టివైద్యముల నెల్లఁ జేయఁబ్రారంభించి వ్యాధినిమఱింత హెచ్చించుచుండుటయు, దురాచారపిశాచావేశులై ముడుపులం గట్టెదమనియు, వ్రతము లాచరించెదమనియు, నుపవాసములు సల్పెదమనియును యుక్తాయుక్తముల నెఱుంగనేరక కాలవిలంబనంబు సేయుచుండుటయు, మఱియు దేహమునఁగొంచెము జబ్బుపడుచున్న

డని తమకుఁ దోఁచినతోడనె యెప్పటివలెనే పాఠశాలకుంజని ప్రియా సంబులకు లోనగుచుండుటయు ననియే మనమూహింప వలసియుండును. ఎట్టులైనను స్వభావసిద్ధముగ బలహీనం బగు దేహతత్త్వము గలవారగుటచే నెప్పుడు నేదియో యొకజబ్బుతోడనె పాఠశాలలం జదువుచుండెడి కాలమునం దంతటబాధల నందుచునేవచ్చిరి.

మూడుసంవత్సరముల ప్రాయముననున్న సమయమునం దీయన, పెత్తల్లిగారితోడ గ్రామాంతరమునకుఁ బోవలసివచ్చెను. కాలువలు క్రొత్తగాఁద్రవ్వఁబడుచుండెడికాల మదియే యయియున్నది. కావున, నా కాలంబున గ్రామాంతరములకుం బోవలసిన వారలందఱును, బల్లకుల మీఁదనె పోవుచుండుటయె వాడుకగా నుండెను. అట్లుపయనమయి పోవుచుండఁగా మార్గమధ్యమునఁ గుమారునిఁబల్లకియందుఁ గూరుచుండఁబెట్టి సమీపమున నున్నసమయమున నీయన యందుఁగూరుచుండి యూరకుండ నేరక, పల్లకినుండి తొంగిచూచి, నిలువులోతున్న కాలువ యందుఁ గర్మవశంబునఁబడుట తటస్థించెను. అప్పుడు, పల్లకిమోసికొని వచ్చిన బోయవాండ్రలోనొకఁడా కాలువలో శీఘ్రముగా దుమికి యీయన నప్పు డకాలమరణమునుండి తొలఁగించెను. సమయానుకూలంబగు నాబోయవాని సాహసకృత్యంబునకు మనమెంతయు సంతసింపవలసి యున్నయది.

ఈయన యించుమించుగ నాలుగైదుసంవత్సరముల ప్రాయము గలవారగు నప్పుడె తండ్రిగారగు సుబ్రహ్మణ్యముగారు కాలవశులగుటం జేసి, పంతులవారివిద్యాభివృద్ధులభారమునంతయును వేంకటరత్నముగారే వహింపవలసివచ్చెను. పిమ్మట, విద్యాభ్యాసము జేయుటకుం దగినకాలమున నొక శుభముహూర్తంబున నందఱివలెనే కుమారునకు విద్యాభ్యాసమునుగావించి, యాకాలంబునఁ దమయింటికి మిగుల సమీపంబుననేయున్న గోపాలస్వామి దేవాలయములోనున్న యొకచిన్న



బడికిఁబంపుచువచ్చిరి. ఇట్టివారలు బాల్యంబున నెట్టివారలుగ నుందురో మనకిప్పుడు సంపూర్ణంబుగ యోచించుటకంతగా సాధ్యముగాకపోయినను, స్వభావమునుగొంచె మూహింపవచ్చును. అందులకుం దొడ్డబడి పంతులకుం గొంచెము ముక్కుతోట్రియుండెను. విశేషముగ నవ్వు పుట్టునటులఁ జేయుటకుంజాలిన సామర్థ్యముమనుజునకు స్వభావసిద్ధముగ నుండినచో నయ్యది యట్టికారణముల నభివృద్ధిఁజెందకమానదు. స్వభావసిద్ధముగ మనుజునకట్టిసామర్థ్యమే లేకయుండినచో నయ్యది నవీనంబుగ మనుజునియందు సృజియింపఁబడియయిన నుండకమానదు. ఇక్కడి గోపాలస్వామి దేవాలయంబున నాతీఱునఁ గొంతకాలము విద్యాభ్యాసముచేసి, తరువాత దమయింటి కంతకన్నను సమీపంబున నున్న మఱియొకబడికిం బనుపఁబడుచుండిరి. రెండవపంతులు కొంచెము గూనుకలిగి యుండెను. కావున, మొదటి యుపాధ్యాయుని సంభాషణంబులును రెండవ యుపాధ్యాయుని నడకలునీయనకుం జిన్నతనమునుండియు విశేషముగ నీతులుహాస్యసంజీవనులు వ్రాయుటకు ముఖ్యకారణములని చెప్పవలసియుండును. కారణములు లేక యెన్నఁటికిని గార్యములుజరుగనేరవు. వేంకటరత్నముగారు తమ్మునికుమారునియం దమితప్రేమగలవారైనను, గృహమునందలి స్త్రీల కలహములవలన మున్నున్న మేడయింటిని వీరేశలింగముగారికిచ్చి, వివాహమైన శీఘ్రకాలముననె వేఱుగనుంచిరి. అటు తరువాత, కొన్నిసంవత్సరములకు ౧౮౬౭వ సంవత్సరమునందు వీరిపెదతండ్రిగారగు వేంకరత్నముగారు రోగపడి యేలూరినుండి యౌషధసేవనిమిత్తము రాజమహేంద్రవరము వచ్చి, కొన్నిమాసములు వ్యాధిబాధితులయి యుండి లోకాంతరగతులైరి. ఇప్పటికి వీరేశలింగముగారికిఁ బందొమ్మిది యిరువదిసంవత్సరముల ప్రాయముండెను. చిన్నతనమునందే తండ్రిగారుమరణమునందినను, గన్నకుమారునికంటె విశేషముగాఁ దమ్మునికుమారునివిద్యాబుద్ధులవిషయంబున నెంతయుఁ

బాటుపడుచుండిన వేంకటరత్నముగారి మరణము వీరేశలింగముగారిమన నున కెంతయు విచారమును గలిగించియుండకమానదుగదా!

ఆకాలమునం దీయన విశేషముగ దేవాలయములయందే విద్య నభ్యసించియుండుటచేఁ దమకుం గవిత్వము చెప్పుటకు సామర్థ్యము వచ్చి నతోడనే తామను బరమభక్తితాత్పర్యమునఁ 'గోపాలశతకము' ను 'మార్కండేయ శతకము' ను రచియించిరి. ఆశతకంబు లిప్పుడు నామైక శేషంబులుగనె యున్నవి. ఐన 'నభాగోపాఖ్యానము' నందలి యంత్య నియమములతోడ రచియింపఁబడిన

శ్రీరమణీ హృల్లోలా!
కారుణ్యలతాలవాల! ♦ కాంచనచేలా!
ఘోరాహవ జయలీలా!
శ్రీరాజమహేంద్రవరపు ♦ రీగోపాలా!

అనుపద్యమొక్కటియే బాల్యదశయందలి మృదుమధురకవితా రచన కొకచక్కని చిన్ననిదర్శనంబుగ నున్నయది.

ఈయన బాల్యమునుండియు, నెవ్వరిని నమ్మనట్టు పయికిఁ గనఁ బడకుండి, యెల్లవారలను బ్రేమతోను, దయతోను జూచుచు వారి సంగతిని దాము సమగ్రముగాఁ దెలిసికొనుపర్యంతము తమరహస్యము లను వారికిఁ దెలియనీయక యుచితక్రమంబున నుండుసత్స్వభావము గలవా రని నిశ్చయముగాఁ జెప్పుట కనేకనిదర్శనములు గలవు. ఇట్టి స్వభావమును గలిగియున్న వా రగుటచేత నే వీరు తమజీవితకాలమునం దుఁ దరువాతఁ దాము చేయుచువచ్చిన యనేకకష్టకార్యంబుల నేవిధ మగునంతరాయంబులును, గష్టములును లేకయే సాఫల్యంబు నొం దుచు వచ్చిరి. బాల్యమునుండియు వీరుమిత్రులవిషయములో మిగుల జాగరూకులయి యుండుటచేత నే చాలవఱకు సుఖసాధనములం గార్య



సాఫల్యము నొందుచు వచ్చిరి. "మిత్రులు" అనువిషయముంగూర్చి వీరు తరువాత వ్రాసినయొక చిన్న వ్యాసములోని,

"మానవకోటిలో నెవ్వరును కొందఱైన మిత్రులు లేకుండ సు ఖజీవనము చేయనేరరు. దిగంబరు లయి కేవలవనవాసము చేయుప శుపక్షియులకు సహితము, వారికిఁ దగిన మిత్రులు స్వల్పసంఖ్యాకు లయినను లేక సౌఖ్యము కలుగదు. మనుష్యునకు మిత్రులుండుటవల న ముఖ్యముగాఁ గలుగులాభములు మూఁడు —౧— తనకష్టసుఖము లు మిత్రులతోఁ జెప్పుకొనుట. మనకష్టకథలను మనసుకలిసినవారితో జెప్పుకొందుమేని సగమువిచారము పోయి మనసులోనిభారము చులు కపడును. మనసంతోషవార్తలను స్నేహితులకుఁ జెప్పినచో మనసం తోషము ద్విగుణ మయి యపరిమితసుఖము వచ్చును.—౨—తన కార్యములయం దాలోచనను పుచ్చుకొనుట. మనమితరులకార్య ములయం దెంతచక్కఁగా నాలోచన చెప్పఁగలవార మయినను స్వకా ర్యములయందు మనబుద్ధి నంతగా వినియోగింప నేరము. స్వాభిమాన ము మొదలయినవానిచేత కృత్యాకృత్యనిర్ణయమును జేయుట కసమర్థు ల మగుదుము కాన మన మేలును గోరువారియొక్క హితోపదేశ మవశ్యముగాఁ గావలసి యుండును.—3—కావలసినప్పుడు సాహా య్యమును పొందుట. మనసంసారస్థితిగాని దేహస్థితి గాని జబ్బుపడి నపుడు మన కితరులవలని ధనసాహాయ్యము కావలసి యుండును. మనకష్టసుఖములయందు బాధ్యతను వహించినవారు తప్ప మఱియొక రట్టిసాహాయ్యమును జేయరు. ఒకవేళ మనము ధనికులముగా నున్నను మనుష్యసాహాయ్యముసహిత మనివార్యముగాఁ గావలసి యుండును. కాఁబట్టి యీపయిని జెప్పినలాభముల ననుభవించుటకయి యెల్లవారును మిత్రుల నార్జింపవలసి యున్నది,

* * * *

సత్కార్యకరణముచేతఁ గలిగిన స్నేహముమాత్రమే చిరకాల ము నిలిచి సుఖోపాదకముగా నుండును; గాని యకార్యకరణముచేతఁ

గలిగినమైత్రి యెన్నఁటికిని స్థిరమయినదియు, శుభము నిచ్చునదియు నయి యుండును. దీని నెఱిఁగి చిన్నవాండ్రసంరక్షకు లిట్టిసహవాసములు తమబాలుర కబ్బకుండఁ గాపాడుచు రావలయును.''

అనువాక్యరత్నములు హితోపదేశపూర్వకములుగ నుండుటయే కాక, వీరిస్వభావమును జాలవఱకు సులభముగా వెల్లడించుచున్నవి.

ఈయన పెత్తండ్రిగా రుద్యోగంబులమీఁదఁ బెద్దాపురము మొదలయిన స్థలములకుం బోవునప్పుడీయనను సహితము తమకూడనేయా యూళ్లకుం దీసికొనిపోవుచుఁ దమకు సాధ్యమైనంతవఱకును దెనుఁగునందు విశేషంబుగఁ బరిశ్రమంబు చేయించుచువచ్చిరి. వీరేశలింగము పంతులవారును గొంచెము చక్కఁగఁ జదువుటకును వ్రాయుటకు నలవాటుపడిన తోడనె వేంకటరత్నముగారు తమకుందీరుబడిగ నున్నప్పుడెల్లను గుమాస్తానిచే భారతమునో లేకమఱియేయితర తెనుఁగుగ్రంథమునో చదివించుచుఁ దా మర్థమును బోధసేయుచు వచ్చిరి. అటులుకొంతకాలము గడచునప్పటికి వీరేశలింగముగారు పదుమూఁడుసంవత్సరముల ప్రాయముగలవారుగనుండిరి. ఆకాలమునందీయూరున హూణవిద్యనభ్యసించు పాఠశాలలు విశేషంబుగ లేకయుండుటంజేసియు, బాల్యంబుననె తండ్రిగారు కాలవశులగుటం జేసియు, నజ్ఞానాంధకారంబునకు బాలసూర్యునివలె నాకాలంబునం గ్రమంబున నభివృద్ధి చెందెడి హూణభాష దేశీయులచేఁ 'మాలభాష మాలభాష''యని మిగుల హైన్యంబుగఁ జూడఁబడుచుండుటం జేసియు, వీరుబాల్యమునుండియు నింగ్లీషువిద్యనభ్యసించుట కంతగావీలుపడకపోయెను. ఎట్టులయినను, వేంకటరత్నముగారును తదితరులును, గాలముననుసరించి హూణవిద్య నభ్యసింప జేయుటయే యెంతయు సముచితంబని యుక్తకాలంబునఁ దలంచి ౧౮౬౧వ సంవత్సరంబునప్పటికి హూణపాఠశాలకు వీరేశలింగముగారిని బంపనారంభించిరి. కావు



న హూణవిద్యను జదువనారంభించునప్పటికి వీరుపదుమూఁడుసంవత్సరముల ప్రాయము గలవారుగనుండిరి.

ఆకాలంబున నీరాజమహేంద్రవరమునఁ బ్రవేశ పరీక్షతరగతివఱకు నుండెడుపాఠశాల యొకటిమాత్రమే యుండెను. జ్ఞానమభివృద్ధి జెందినపిమ్మట హూణభాష నభ్యసించుటచే నీయన విశేషముగఁ జుఱుకుతోడను శ్రద్ధతోడను బాఠములనుజదువుచు వచ్చిరి. పాఠశాలలలోని యుపాధ్యాయులందఱీయనకు స్వభావసిద్ధముగఁ గలజ్ఞానసంపదకునుసూక్ష్మగ్రహణసామర్థ్యమునకును నమితజ్ఞాపకసామర్థ్యమునకును మిగులసంతసమందుచుండిరి. అట్టిసామర్థ్యము నెల్లను దఱుచుగవచ్చుచుండెడువ్యాధులు విశేషముగ నదృశ్యముగఁ జేయుచువచ్చెను. కావున నీయనతాము పాఠశాలలంజదువుచుండెడి కాలమునందంతటను భవిష్యద్ఘనతను వెల్లడించుటకుందగిన చిహ్నంబులుగలిగియుండకయే యుండిరి. అట్లుబాల్యంబున విశేషంబుగ సోమరులని ప్రసిద్ధి చెందినవారలే ప్రపంచమునందు సర్వసాధారణంబుగ విశేషసామర్థ్యంబు గలవారలుగ మాఱుచుందు రనుటకుసందేహము లేదు. బొగ్గులనుండి రత్నము లుదయించుచుండెడి తెఱంగుననె సోమరులసంఘమునుండియె మహనీయు లుదయించుచుందురు. అట్టివారల కందఱకును జీవితకాలంబున నిసుమువంటి సోమరితనంబు నుండియే ఘనకార్యములను శైలములను దీయుటకుం జాలినసామర్థ్యము లభించుచుండును. ఇట్లు చెప్పుటచేఁ గాలమునంతయుఁ బలుఁదెఱంగుల వృథసేయుచుండువార లందఱుం దామొకప్పుడు గొప్పవారల మయ్యెదమని యంతకన్నను గాలవిలంబనంబును జేయవలయునని నాయుద్దేశముగాదు. ప్రపంచమునందు మనుజుఁడెప్పుడును సుఖాభివృద్ధికిం బాటుపడుచునే యుండవలయును. స్వయంకృషివలన లభించిన ధనసంపదచే ననుభవించెడిసుఖంబునె యొకసుఖంబుగ గణింపవలయుఁగాని, తదితరసుఖంబుల నొకింతయు సుఖంబులుగ గణింపఁజనదు. ఆకారణంబునసె

వీరేశలింగము పంతులవారు చాలకాలముక్రిందట రచియించిన తమ 'నీతిదీపిక' యందు స్వతంత్రజీవనమను శీర్షిక యందు,

గీ. అన్నవస్త్రాదులకు నైన, ♦ నధిక మైన
భోగభాగ్యంబులకు నైన, ♦ భూమిమీఁద,
నొరులనేనమ్ముకొనియెప్పు ♦ నుండ రాదు;
తనదుచేతుల నమ్మంగఁ ♦ జనును గాని.

గీ. పెద్ద లార్జించి, లోపలఁ ♦ బెట్టిచన్న
ధనము ధాన్యంబుఁ, జోరులు ♦ తఱి నెఱింగి
తస్కరించినఁ, బోవును ♦ దాఁచుకొన్న;
నవుల, వ్యర్థునిగతి యేమి ♦ యగును కనుఁడు.

గీ. పూర్వులు గడించి చనుమాన్య ♦ ములను మనుజు
పండ కుండును; రాజులు ♦ పన్ను చాలఁ
గట్టుదురు వానిమీఁదఁ; దా ♦ కట్టువడును;
నపుడు దిక్కునిబిడ్డ కేమి ♦ యగును చెపుడు.

గీ. తాతముత్తాత లెంతెంత ♦ ధనముకూడఁ
బెట్టి, పెట్టెలు నిండఁగఁ ♦ బెట్టియున్నఁ,
గష్టపడి, తాను న్యాయమా ♦ ర్గమునఁ బడయు
స్వార్జితం బొకగవ్వతో, ♦ సమము గాదు.

గీ. కాన, మానవుఁ డెప్పుడుఁ ♦ గష్టపడుచు,
వలయువిద్యలఁ గళలను, ♦ బాల్యముననె
చక్కఁగా నేర్చి, యితరుల ♦ సాయ మాస
పడక, తనయంత జీవింపఁ ♦ గడఁగ వలయు.

అనురీతి నెంతయు సముచితం బగుమార్గంబునన హితోపదేశంబును జేయుచున్నారు. ఈయన హూణపాఠశాలలం జేరిన యొకటిరెండు



సంవత్సరములకె, వేంకటరత్నముగారు మొదలైనవారలం దఱీయనకు వివాహమునుజేయ సంబంధముల నాలోచించు చుండిరి.

కాతే రనుగ్రామ మీరాజమహేంద్రవరంబునకు రమారమి రెండుక్రోశముల దూరమునం దున్నది. ఆకాలంబున నక్కడ నివసించుచుండిన, అద్దంకి పట్టాభిరామయ్యగా రనువారు తమ రెండవకుమార్తెకుం దగినసంబంధము నాలోచించుచుండి, యంతకమున్న కందుకూరివారని యెఱింగియేయున్నారు గావున, వారప్పు డీరాజమహేంద్రవరమునకు వచ్చి, వీరేశలింగముపంతులవారి తల్లిగారగు పున్నమ్మగారితోడను, వేంకటరత్నముగారితోడను దమయభిప్రాయమును వెల్లడించి, తమకూఁతునకు రాజ్యలక్ష్మీదేవిగారికి వివాహంబు నాసంవత్సరంబుననె మిగుల వైభవముతో జరిపిరి. వీరేశలింగముపంతులవారు వివాహమగునప్పటికిఁ బదునాలుగు సంవత్సరముల ప్రాయము గలవారుగనుండిరి. కావున, నయ్యది బాల్యవివాహమనియే చెప్పవలసియున్నది. బాల్యవివాహములవలని యనర్థములను జక్కఁగా స్వానుభవమువలన నెఱింగినవార లగుటచేతనే తరువాత దామెంతయు గంభీరముగా వ్రాసిన "అతిబాల్య వివాహ" మనునుపన్యాసమునందు,

"వివాహము లెవ్వరిసుఖసంతోషాదులనిమిత్త ముద్దేశింపఁబడినవో, వానియందలిలోపమువలన నెవ్వరు కలకాలమును దుఃఖ మనుభవింపవలసినవా రగుదురో, తమచిరకాలసుఖజీవనమున కనుకూలప్రతికూలములుగా నుండుసాధకబాధకముల నాలోచించుకొనుట కెవ్వరర్హులో, వారియంగీకారమును పరస్పరేచ్ఛను లేశమాత్రమును గణింపక మన దేశమునందు కొన్నివర్ణములవారు వివాహములయం దాస్వాతంత్ర్యమునంతను తామే యక్రమముగా వహించి యాచారబలముచేతను మఱికొన్నికారణములచేతను యుక్తాయుక్తవిచారమును జేయఁ

జాలక నిర్దోషు లయినబిడ్డలకు మితిమీఱినకష్టములను తెచ్చిపెట్టుచుం డుట చూడ నెంతయు శోచనీయముగా నున్నది.

* * * *

యోగ్యు లయినపురుషుల కయోగ్యురాండ్రు భార్య లగుట లభించుటయు, గుణవంతు రాం డ్రయినస్త్రీలకు గుణహీనులు భర్త లగుట లభించుటయు, పరస్పరాంగీకారము లేకపోవుటచేత మనను కలియకయు, భర్తకంటె ముందుగాభార్య యెదిగి కాపురమునకు వచ్చియు, దంపతులలో నొకరు విద్యావంతు లయిన నొకరు మూర్ఖశిరోమణులుగా నుండ దటస్థించియు, బహుదంపతు లేకగృహమున వసించుచుండియు సుఖమన్నమాట యెఱుఁగనివా రగుచున్నారు.

* * * *

దుఃఖముల నెఱుఁగక నిర్విచారముగా నుండవలసినయటువంటి సుఖకాలములోనే యాఁబోతునకు గుదెకఱ్ఱ కట్టినట్టు మనవారు బాలురకు సంసారము నంటకట్టి తల యెత్తుకొనకుండఁ జేయుటవలన మనవారుత్సాహమును ధైర్యసాహసాదులును లేనివా రయి పూనికతో స్వతంత్రించి యేసత్కార్యమును జేయుటకును పనికిమాలినవా రగుచున్నారు. అందుచేతనే మనబాలురు సాధారణముగా వివాహము లేక పాఠశాలలో చదువుకొన్నంతవఱకును దేశోపకారమునిమిత్తము పాటుపడవలె ననియు, సంఘదురాచారములను మాన్పవలె ననియు, స్త్రీలయొక్కయు నీచకులమువారియొక్కయు స్థితిని బాగుచేయవలె ననియు, తలఁచి మిక్కిలి యుత్సాహముతో సమాజము లేర్పఱిచి ప్రసంగములు చేసి ధైర్యముతో దురాచారములను దూషింపఁగలిగియు, వివాహమై భార్య కాపురమునకు వచ్చినరెండుమూడు సంవత్సరముల లోపలనే తమపూర్వావస్థ నంతను మఱచిపోయి, తొంటియుత్సాహము చెడి దీనముఖములు గలవారయి, దేశాభిమాన మన్నమాటను



స్మరణకు తెచ్చుకొనక, తొంటిప్రసంగములను సమాజములను విడిచి పెట్టి, ధైర్యసాహసములను స్వాతంత్ర్యమును గోలుపోయి, ఎవ్వరియడుగులకు మడుగు లొత్తియైనను ఎన్నియిచ్చకము లాడియైనను నెలకు పదియేనురూపాయలపని సంపాదించి లంచములు పుచ్చుకొనియో కల్ల లాడియో తమభార్యాపుత్రులను పోషించుటయే పరమార్థమని సిద్ధాంతము నేర్పఱుచుకొని, లోకమునిమిత్తము పాటుపడఁ దలఁచిన వారిని జూచి పరిహసించుచు వారిని నిరుత్సాహపఱిచి, తాము లోకమునకు నిష్ప్రయోజకు లగుచున్నారు.,,

అని యిట్లు లెక్కలేనియనర్థములను వెల్లడించి, భార్యాభర్తలనుశబ్దములు సార్థకము లగునట్లు వివాహములు జరుపుటకు హితోపదేశమును జేసియున్నారు.

ఆకాలమునందు వీరేశలింగము పంతులవారును దేశాచారము ననుసరించి, యందఱివలెనే మతాచారాదులయందు విశేషముగ నమ్మకము గలవారుగ నుండిరి. కావున బంధువులు మొదలైనవా రందఱు వారికాకాలంబున జపతపాదులం గలమితిమించిన నిష్ఠకు మిగులసంతసించుచువచ్చిరి. అట్లుహూణవిద్యనభ్యసించుచుండినను పంతులవారు తామునాలుగవ తరగతికి వచ్చువఱకును మంత్రములు మొదలైన వానియందెంతయు నమ్మకము గలవారలై, మంత్రవేత్తలనఁబడుచుండెడి వారలకడ నెంతయు గౌరవమున నట్టిమంత్రముల నెల్లను సంపాదించుచు, సంధ్యానుష్ఠానాదులం గ్రమముగ జరపుచువచ్చిరి. అట్లు విశేషముగ జపించుచు వచ్చినయనేక మంత్రములలో, ‘‘వివేకచంద్రిక’’ యను ‘‘రాజశేఖరచరిత్రము’’ ననున్న ‘‘ఓం-ఖేం-ఖం-ఘ్రిసి-హుం-ఫట్-సర్వశత్రుసంహారిణే - శరభసాళ్వాయ-పక్షిరాజాయ-హుం-ఫట్ స్వాహా’’ యను శరభసాళ్వంబును నొకటిగా నుండెను.

ఆహా! చూడుఁడు! ఒక కాలంబున నట్టినమ్మకముల కెల్లను గనిగ నుండిన వీరేశలింగము పంతులవా రిప్పు డెంతసంస్కారధురీణులుగ దేశమునం దెన్నఁబడుచున్నారో యొకింత యోచింపుఁడు. నిజముగ దురాచారభంజన సమ్మోహనాస్త్రం బని చెప్పనొప్పు హూణవిద్యయందలి ప్రభావమును గాలముయొక్క సంస్కార చాతుర్య స్వభావమును నేనేమని యభినందింపఁగలను. ఆంగ్లహూణవిద్య విశేషముగ నభ్యసింప నారంభించినకొలఁదిని పంతులవారికిం గలవెనుకటి నమ్మకమంతయుఁ గ్రమక్రమంబుగ నశింప నారంభించెను. మతాచార వ్యవహారాదులయం దొకకాలమున విశేషముగా నమ్మకమును గలిగియుండి, యనతిదీర్ఘకాలముననె యవియన్నియు వెఱ్ఱినమ్మకములుగ దాముసంభావించుటయేకాక యితరులకు సహిత మట్టివానియందు నమ్మక మొకింతయు నుంచఁ జనదని బోధింప నారంభించుచుండుటం జూచి యింటనున్నవారును బంధువులలో ననేకులును "వీరేశలింగము క్రైస్తవులలో గలియనున్నాఁ"డని ప్రసంగములఁ జెప్పుకొనుచువచ్చిరి. అట్టిసంభాషణము లన్నియు వీరలకుఁగలవిమర్శజ్ఞానమును సుకరంబుగ నభివృద్ధి నొందఁ జేయుచువచ్చెను.

పూని పరికింప నీయనరచియించిన యన్నిగ్రంథములలోను సర్వోత్కృష్టమయిన దనియు ననన్యసాధ్యం బగునది యనియు నాంధ్రభాషానురాగాభిమానంబులు గలవారల కెల్లను బరమానందకరం బగునదియనియుం జెప్పఁదగిన "ఆంధ్రకవుల చరిత్రము" నందున్న ఓగిరాలజగన్నాథకవిచరిత్రములో నున్న

౧౮౬౯వ సంవత్సరమున నేను పాఠశాలలోఁ జదువుకొనిచుండిన కాలములో సుమనోమనోభిరంజనములోని మొదటి మూఁడాశ్వాసములను వ్రాసికొని యున్నాను. అయినను కవియీముప్పది సంవత్సరములలోను గ్రంథమునకుమెఱుఁగుపెట్టి సంస్కరించి యెక్కువవన్నె తెచ్చెను.

అనుభాగమును జదువునప్పు డీయన విద్యార్థిగా నున్నకాలంబున నాంధ్రగ్రంథములను జదువవలయునన్న యభిరుచి యెంతవిశేషముగఁ గలిగియున్నదియును సులభముగా బోధపడక మానదు. ఆకాలమునందు మంచి మంచిగ్రంథములు ముద్రింపఁబడియుండక పోవుటచేతను ముద్రింపఁబడియున్నగ్రంథముల వెలలు విశేషముగనుండుటచేతను, విలువ యెంతయైనను గొని చదివియానందింప వలయు నను నుత్సాహ మున్నను వలసినధనము చేతనుండక యుండుటచేతను వీరు గ్రంథములకు వ్రాఁతప్రతులు సిద్ధముచేసికొనియుఁ బుస్తకము లమ్మువర్తకులకడకుం జనియు నాంధ్రగ్రంథపఠనముఁ గావించి జ్ఞానాభివృద్ధిని గావించుకొనిన మార్గముం గూర్చి యోచించినచో నయ్యది యవలంబనీయ మార్గప్రదర్శకంబుగ నున్నదని తోఁచకమానదు.

౧౮౭౬వ సంవత్సరమునకే వీరేశలింగముగా రనేక తెనుఁగుపత్రికల కుపన్యాసాదులం బద్యగద్యాత్మకంబుగఁ బంపుచుఁ బలువురచేఁ బొగడుగాంచుచుఁ దమకుంగల కవిత్వం బనునావను యశస్సముద్రంబునఁ జక్కఁగ దేశీయుల కందఱి కుపకరించునట్టి చిహ్నములను వెల్లడించుచు నడుపుచువచ్చిరి. హిందూదేశంబున స్వాతంత్ర్యోద్దేశములకుంబుట్టినపట్టుగు వంగదేశమునం దంతట, నొకకాలంబున నమితప్రఖ్యాతినిగాంచిన రాజారామమోహనరాయలు కేశవచంద్రసేనులు మొదలగు మహాపురుషులు విశేషముగ ముచ్చటింపఁబడుచుండెడి కాల మదియే యయియున్నయది; కావున, నట్టివారల విశేషాంశములన్నను వీరేశలింగముపంతులవారు తెనుఁగుపత్రికలయందును ఇంగ్లీషుపత్రికలయందును మిగుల నుత్సాహంబుతోఁ జదువుచునేయుండియుండవచ్చును. ఈయన పాఠశాలం జదువుచుండెడి యాకాలంబుననే మొట్టమొదట స్త్రీపునర్వివాహములు కలకత్తా మొదలైన యారాజధానులయందే జరుపఁబడుచుండెను. అవియన్ని యువిశేషముగ నిట్టివారల నాకర్షించి మనస్సున గాఢంబుగ నాటుకొనకమానవు. ఈయన బాల్యముననె సంసారభారమును

వహింపవలసివచ్చుటచే నప్పుడు తమపాఠశాలయందుఁ బ్రధానోపాధ్యాయులుగ నున్న దొరగారికిఁ దెలుఁగు చెప్పుచు వచ్చిరి. కావున వీరికి బాల్యమునుండియుఁ గొంచముగానో గొప్పగానో ధనము చేతనుండుచునే యుండెను. అప్పటికిం గలయుత్తర ప్రత్యుత్తర వ్యాపార మెంతయధికముగ నుండుచుండునో యాయాపత్రికలే తెలియఁజేయకమానవు. ఈయనకు దురాచారములనడచుటయందుగలయుత్సాహమును వెల్లడించుటకును, నీయనకుంగల కవితాసామర్థ్యంబందఱకును దేటపడఁజేయుటకును దగిన యొకటి రెండు నిదర్శనములను మాత్రమిట నుదాహరించెదను.

ఆకాలమునం దమపాఠశాలకుఁ బ్రధానోపాధ్యాయులుగ నున్నవారసమర్థులై తిన్నగా పనిచేయక, తమయిష్టానుసారంబుగ నుండుటంజేసి, యయ్యది చక్కఁజేయఁ దలంచి కొందఱు సహపాఠులను జేర్చుకొని చెన్నపురమునందలి డైరక్టరుగారి పేరిటం దమపాఠశాలయందలి యక్రమముల నెల్లను దెలియఁజేయుచు నొకవిజ్ఞాపనమును బంపిరి. అయ్యదిచూచి విచారించి కొన్నిమార్పులుచేసి పాఠశాలోపాధ్యాయుల కందఱ కెంతయు భయముపుట్టఁ జేయునటులొక యుత్తరమును డైరక్టరుగా రంపియున్నారు. పాఠశాలం జదువునప్పుడె యీయన యొకింతయు భయములేకయె యెట్టెట్టికార్యములకుఁ గడంగుచువచ్చినదియు నియ్యది తెలియఁజేయక మానదు. ఆకాలముననె యీరాజమహేంద్రవరమున కొకగొప్ప కవీశ్వరుఁడు వచ్చెను. ఆయనకుం గల యష్టావధానమునందలి సామర్థ్యమునుగని సంతసింపవలయు నని తలంచి, యప్పటిభాషాభిమానులలోఁ గొందఱొకగొప్పసభను నిర్ణయించిరి. ఆసభయందాకవి, తనకుంగల సామర్థ్యమును జూపినతోడనే, జనులందఱాయన కుచ్ఛిష్టగణపతి యుపాసనబలంబు గలదని, యాసామర్థ్యమునకుఁ బలువురు పలువిధముల గారణంబులు చెప్పుకొన నారంభించిన, నాకవీశ్వరుఁడును దనకుఁగల సామర్థ్యంబున కదియే ప్రధాన



కారణం బనిచెప్పుచువచ్చెనఁట! ఆసమాచారమంతయు ముఖ్యముగ విద్యార్థులం దఱిలోను వ్యాపింప నారంభించెనఁట!

ఆకాలంబున నిప్పటి పౌర పాఠశాల వీరేశలింగము పంతులవారి యింటనే యుండెను. ఆపాఠశాలయందలి యుపాధ్యాయులందఱాకవీశ్వరుని యపూర్వసామర్థ్యమునకు సంతసించి పలువిధములనట్టిసామర్థ్యముల కెల్లను ముఖ్యకారణం బుపాసనబలం బనియే నిశ్చయించుచుండుటంజూచి, యొకదినమున వారలతోడ సంభాషించుచు, నట్టిసామర్థ్యమును బరిశ్రమంబునుజేసిన ననతిదీర్ఘ కాలముననె సంపాదింప వచ్చునని చెప్పినంతోడన, వారలందఱుఁ బరిహసింప నారంభించిన, వీరట్టిసామర్థ్యంబొకయసాధ్యంబులోనిదిగాదని వారలకుం దెలుపఁ దలంచి యాశుకవిత్వంబును జెప్పుటకారంభించి, కొద్దిదినంబులకె తమయింట నొకసభను జేర్చి మిత్రుల కందఱకు నష్టావధానంబుచేసిచూపి యదియొకకష్టతర మయినకార్యము గాదని తెలియచేసియున్నారు. నాఁటనుండియు; వీరిసమర్థత కందఱుఁ గరంబచ్చెరు వందుచువచ్చిరి. పిమ్మట నట్టిపరిశ్రమంబుఁ జేసినచో మనోబలంబునకు భంగము గలుగక మానదనితలంచియు, నయ్యది నిరుపయోగమని తంచియు నటులెప్పు డంతగాఁ జేయుచువచ్చినవారు కారు.

పాఠశాలలం జదువు చుండెడి కాలంబున నీయనవిశేషముగ దెలుఁగు గ్రంథములం జదువుట కలవాటు పడుచు వచ్చిరి. గ్రంథములు చదువవలయునన్న యభిలాష మనసున నెంతయున్నను జేతధనముండినఁగాని పుస్తకములులభించుట కరంబు దుష్కరంబు. ప్రబంధరత్నంబు లని పేరువడసియున్న వసుచరిత్రాది గ్రంథములు ముద్రింపఁబడి, విక్రయమున కీరాజమహేంద్రవరమునకుఁ గ్రొత్తగావచ్చుట కవియే ప్రారంభపు దినంబులుగ నున్నయవి. అట్టి వసుచరిత్రంబును జదువవలయునన్న యభిలాష యిట్టివాని కెంత విశేషంబుగ నుండియుండ

వచ్చునో మీరలే యోచింపుఁడు. వసుచరిత్రమును జదువవలయునన్న యభిలాష దినదినక్రమంబున నభివృద్ధిఁ జెందుచుండుటయును, దానిని గొనుటకుఁ జాలినధనము చేతనుండకుండుటయును గొంచెము యోచించి, యెట్టకేల కొకయుపాయంబు నాలోచించి, మాసమునకొకరూపాయిచొప్పుననిచ్చి మూఁడునాలుగుమాసములలో దానివిలువనుదీర్చెదనని పుస్తకముల వర్తకునితోడ నిర్ణయించుకొని, పాఠశాలకుజీతముగఁ దల్లిగారిచ్చుచువచ్చిన రూపాయల నావర్తకున కిచ్చి, యక్కడనె వసుచరిత్రమును జదువుట కారంభించిరి. అట్లుపాఠశాలకుంజనకుండుట నంతయు నెవ్వరివలననో తల్లిగారెఱింగి, వర్తకున కింకను నీయవలసినసొమ్ము నిచ్చి, కుమారునకు వసుచరిత్రనిప్పించి, పాఠశాలకుఁ గ్రమముగాఁబోవు చుండవలయు నని యప్పటికి నెమ్మదిగాఁ దెలియఁజేసిరి.

పాఠశాలలఁ జదువుచుండెడి కాలమునం దట్టివార లందఱు సర్వసాధరణముగఁ, దమకుఁ బోషకులుగ నుండెడు తలిదండ్రులనో, లేకతదితరులనో యేదులు మోసముచేయుచు వచ్చినకాలము కొంచె మైన నుండకమానదు. దానంజేసియే, తలిదండ్రులు మొదలైనవారలంద ఱట్టివార లెట్లు ధనమును సంపాదించి, సంసారసాగరంబు నీదఁగలుగుదురో యని పలువిధములఁ దటపటించుచుందురు. అందుల కు ముఖ్యకారణ మట్టివారలందఱుం దదితరులవలె నింట నెప్పుడు బీర ములం బలుకక యుండుటయే యనిమన మూహింపవలసి యుండును.

పిమ్మట, ౧౮౬౯ వ సంవత్సరమునం దీయన ప్రవేశపరీక్షకుం జనిరి. ఆసంవత్సరమందీయన విశేషముగా దగ్గుచే బాధపడుచుండిరి. మనసునకు లేశమైననుస్తిమిత మనునది లేక యనేకవిధంబుల నమిత ప్రయాసంబునకు లోనగుచుండిరి. ఆకారణంబుననె, యాసంవత్సరంబున నీయనప్రవేశపరీక్షయందుఁ దేరనేరరయిరి. పిమ్మట ౧౮౭౦ వ సంవత్స రమునం దేవలము స్వయంకృషివలననె ప్రవేశపరీక్షం గృతార్థులైరి.



పాఠశాలలం జదువుచుండెడికాలంబుననె, యనఁగా ౧౮౬౯-౭౦ వ సంవత్సరంబులలోనే 'శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచననైషధముఁ' రసికజన మనోరంజనము' 'అభాగ్యోపాఖ్యానము' 'శుద్ధాంధ్రోత్తర రామాయణము' మొదలయిన గ్రంథములను రచించి యందుఁ గొన్నింటిని మాత్ర మప్పటప్పుడు, బృందావనపుర మనఁబడుచుండెడిబందరున మాసపత్రికగఁ బ్రచురింపఁబడు చుండెడి "పురుషార్థప్రదాయిని" మొదలయిన పత్రికలకుం బంపుచువచ్చిరి. ఈయనపాఠశాలలో విద్యాభ్యాసము జేయుచున్నకాలములో ననేకసారులు సత్ప్రవర్తనమునకును, బుద్ధికౌశల్యంబునకును బహుమానంబులనందుచు వచ్చుచునేయుండిరి.

ఆకాలమునందు, నాంధ్రవిద్యార్థులకుఁ బఠనీయగ్రంథ మాంధ్రభారతారణ్యపర్వమునందలినలోపాఖ్యానంబె యగుటచే వీరు, బాల్యమునుండియు, నన్నయభట్టారకవిరచితనలోపాఖ్యానంబును, మిగుల మనోహరంబుగ నుండుటచే, నద్దానిని గరం బనురాగంబున నత్యంతముఁ జదువుచువచ్చిరి. ఇంతటి కవితాకీర్తిసంపన్నులుగావలసినంతుల వారు బాల్యముననుఁ గొంచె మైన సారగ్రహణ శక్తిసంపన్నులుగ నుండక మానరు గదా! ఈనలోపాఖ్యానమును, జదువుటచే నీయనకుం గలుగుచువచ్చిన మనస్సంతోషంబింకను దమ్మాంధ్రగ్రంథములను జదువ మఱియుమఱియుఁ బ్రేరేపింపఁ దమపూర్వులు సంపాదించి యింటనుంచిన ముద్రితగ్రంథంబు లేమి తాళపత్రగ్రంథంబు లేమి మితిమించిన పూనిక గలవారయి చదువనారంభించిరి.

అటులు కొంతకాలము జరిగినతరువాత, భాషయందలిపదజాల మొకకొంత మనసునకుఁ బట్టువడుటచే నేదియయినను వ్రాయకుండ నుండనేరకుండుటచే, నేదయినఁ జిన్నపుస్తకము నొకదానినివ్రాయ మనసున నుద్దేశము గలుగ నారంభించెను. చిన్నతనమునుండియు నలచరిత్రమునే చదువుచు వచ్చుచుండుటచే, నాచరిత్రంబున వ్రాయఁదలంచి

యాంధ్రభాషామహార్ణవపారగులయి, నిరంకుశంబయినయశంబు సంపాదించిననన్నయాది కవివరేణ్యుల నందఱఁ దలంచి యనేకనియమంబుల నుంచి గ్రంథమొక్కటియైనను రచింపఁబడ కుండుటం జేసి, తామానలోపాఖ్యానంబును "శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధ" మను పేరిట రచియించినం దమ్మందఱు కరంబు మెచ్చెదరని తలంచి, యేతద్గ్రంథరచనమునకుఁ గడంగిరి. ఇట్టిమహాగ్రంథరచనారంభాంత్యంబుల నీగ్రంథకర్త యనుభవించిన భయోత్సాహాతిరేకంబు స్వానుభవైకవేద్యమైనదేకాని, యిట్టిదియని మాటల నుడువ నేరికిం దరంబుగాదు. "ఈ శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధ"మె యీగ్రంథకర్త ప్రథమప్రయత్నముగాఁ గానఁబడుచున్నను, బూని పరికింపనయ్యది యంతగా సరిగాదు. ఇంతకుంగొంతకుఁ బూర్వంబుననె, గోపాలశతకమునందలియనేకపద్యములును, జనార్దనశతకమునపద్యములును వీరు రచించి యుండవలయును. అట్లు చేయుటచేతనే, పంతులవారి కీనైషధమును రచియించుట యం దప్పరిశ్రమము సహాయపడియుండియుండక మానదు. ఎట్లులైన, నీనైషధమే ప్రథమప్రయత్నమని చెప్పవలసియున్నది.

ఆహా! చూడుడు. పాఠశాలను విడువక పూర్వముననె, యనగా వించుమించుగ నిరువది యిరువదిరెండు సంవత్సరముల ప్రాయముననె యిట్టిగ్రంథరచనంబునకు సాహసంబున గమకించుటం గన నీయనసామర్థ్యాతిశయం బెంతయు శ్లాఘాపాత్రంబుగ నున్న దని నే వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు. ఆకాలమున, నేఁటికిరమారమి ముప్పదినాలుగు సంవత్సరములకు వెనుక దైవసమాజినియను పురుషార్థప్రదాయినియందున్న "ఈగ్రంథకర్తగారి వలననె రసికజనమనోరంజనము మొదలగు కొన్ని యాంధ్రగ్రంథములుకూడను రచింపఁబడినటులు తెలియవచ్చుచున్న"దనుదానింజూచిన నీయన యించుమించుగ నిరువదిరెండుసంవత్సరముల ప్రాయముగలవారయి యుండినసమయముననే శుద్ధాంధ్రమున నిరోష్ఠ్యముగఁ గవిత్వముపండితజనాదరణపాత్రం బగునటులు మధురమైన నాతికఠిన మగుపదగుంభనమును యుక్తిచమత్కారంబులుంగలిగి, సలలితఘంటిలిం జెన్నువహింపఁ జెప్పసామర్థ్యంబు గలవారై యుండిరని మనము నిశ్చయింపవలసి యున్నయది.



ఆకాలంబున నీగ్రంథమును జూచుచువచ్చిన గొప్పపండితులును, శాస్త్రజ్ఞులును, గవీశ్వరులును, వీరేశలింగముపంతులవారి కవిత్వము, జాతీయముగాను, మృదువుగాను సరసముగా నున్నదని గ్రంథకర్తకత్యంతప్రోత్సాహకరం బగునటులైకకంఠ్యంబుగ నుడువనారంభించిరి. అట్టిరసజ్ఞులగుగొప్పపండితులొసంగిన యభిప్రాయములు పంతులవారి కమితోత్సాహంబు గలిగించుటయె కాక, వారిని జీవితకాలమునందంతట నత్యంతసుఖప్రదం బగుగ్రంథకర్తపదవియందె యుండవలయు నను నిశ్చయమును జేయనొనర్చినవి. ఆకారణముననే పంతులవారంతటిబాల్యమున రచించిన యనన్య సాధారణ మగునింతటిమహాకావ్యమున సహితము నిజవంశాభివర్ణనమును గావింపకయె గ్రంథరచనంబునకుఁ దొడంగిరి. నిస్సందేహముగ నిది యొకమహాకావ్యమనియె చెప్పఁదగియున్నది. ఏరికిం గాని మిశ్రమనిరోష్ఠ్యంబుగం గాని, శుద్ధాంధ్రంబుగం గాని నిర్వచనంబుగంగాని శుద్ధాంధ్ర నిర్వచనంబుగ గాని గ్రంథమురచించుట సులభసాధ్యంబుగ నుండునుగాని శుద్ధాంధ్రంబున నిరోష్ఠ్యంబుగ గ్రంథమును రచియించుటమాత్ర మంతగా సులభసాధ్యంబు గాదని నేదృఢముగా మున్మాటికి నొక్కివక్కాణింపఁ గలను. శుద్ధాంధ్రంబున నిరోష్ఠ్యంబున నొకటిరెండు పద్యములు వ్రాయుటయె యత్యంతప్రయాస జనకంబుగనుండ గ్రంథమంతయు నితరులకుందప్పక నిరుత్సాహంబు గావించు నిట్టి భీతిజనకంబగు నియమత్రయంబున ముగించిన గ్రంథకర్త బుద్ధివిశేషంబును సాహసాతిశయంబు నెంతయు శ్లాఘాస్పదంబు లని యొప్పికొనిచెప్పకుండువా రెవ్వరు? ఇట్టిగ్రంథము రచియించు టన్యులకంతగా సా

ధ్యంబు గాకుండుటం జేసియే పంతులవారు ప్రతిపద్యరచనానంతరం బున దామనుభవించిన కష్టసుఖంబులం దేటపఱుపఁ బద్యంబులు లెక్కిం పనారంభించుకొనియుందురు. నిర్వచనంబు సంగతియటుండ నచ్చతెనుం గున నిరోష్ఠ్యంబుగ నీనైషధంబున మూఁడువందలడెబ్బదియైదుపద్యం బులు గానవచ్చుచున్నవి! నలునిచరిత్రం బెఱింగించు గ్రంథంబులు మన తెనుంగున నెన్నియున్న నీనైషధరచనమునఁ బంతులవారికిముఖ్యముగా దోడుపడిన దాయూబాల్యపతితం బగు నన్నయభట్టారకుని నలోపాఖ్యా నం బనియే చెప్పవలసియున్నది. ఈనైషధంబు నించుక సావధానంబుగ జదువువారల కీగ్రంథకర్త యక్కడక్కడ యుక్తాంశంబులని స్వమతం బున కెఱుకపడుచు వచ్చినపట్టుల నా శ్రీనాథరచిత నైషధంబునించు క సహాయంబుగఁ జేసికొని గ్రంథంబురచియించి రని సులభంబుగబోధ పడును.

ఇక్కావ్యరత్నంబు నిరోష్ఠ్యంబుగంగూడ రచియింపఁబడుటం జేసి, యిందలి భీమదమయంతీదమనదమదాంతఋతుపర్ణబాహుకాది పదంబుల నెత్తెఱంగున నెఱింగించిరో యెఱుఁగఁ జదువరుల కత్యంతాశ్చ ర్యముమనంబున నుదయింపకమానదు. ఇందలి భీముఁడనుదానికిం గ్రథ కైశికుం డనుసుఖప్రదంబగుపదం బుంచుటం జేసి యయ్యది యిచ్చోసను డువంబడియె. మిగిలినపదంబుల నారంభంబున నక్లైయునిచి, పద్యములు రచియించి, యయ్యవి చదువరుల కంతగా నాశ్చర్యజనకంబులుగ నుండ వనియుం, గొందఱుగాకున్నఁ గొందఱయిన నిట్టియసాధ్యస్థలముల నక్లో గడ రచియించినదని యనకమాన రనియునుం దలంచి పిమ్మట,

తే. ఒనరఁగా నేడునాల్గుల ♦ యొక్కటగుమఁ
దనరు తెనుఁగచ్చరానను ♦ దయలసందుఁ
గూడినదయంతి యనఁ జెల్లు ♦ కూఁతు నొర్తుఁ
దనరుకొడుకుల నిద్దఱిఁ ♦ గనియె నతఁడు.



క. తగునైదైదుల రెండయి
సొగసగు తెనుఁగచ్చరాన ♦ సూటి యెసంగన్
దగియెడుతుర్ణులసందుగ
లిగినఋతుర్ణుఁ డనుఱేఁడు ♦ లెస్సగనచటన్.

తే. నాలుగాఱులనాలుగై ♦ కాప్రలినిపుద
యానుగలయచ్చ తెలుఁగచ్చ ♦ రానఁ దొలుత
నలరియుండిన హుకుఁ డన ♦ నతనియొద్ద
నుండునది యని యాసతి ♦ యొసఁగి చనిన.

అని యిట్లోకవింతమార్గంబును గల్పించి, పద్యములను రచియిం చియున్నారు. ఇందలి,

క. సిరియొదఁ గలహొరజేజే
దొరయు నెలఁతనోరనుండు ♦ దొరజేజే త
ల్లరుఁ గొలుచుఱేఁడ! త్రాంచుల
సరులు గలుగుజక్కులదొర ♦ సంగడికాఁడా!

మాలిని.

తిగకొటికలదాయా! ♦ తెల్లయేఋన్న రాయా!
సెగకనుగలదంటా! ♦ చేఁదుఁగొన్నట్టి జంటా!
సొగసులతలకట్టా! ♦ సూడులంగొట్టుదిట్టా!
జగియరచెలిఱేఁడా! ♦ చిల్కరారౌతుసూడా!

పంచచామరము.

కలంగితోడి రక్కసీంద్రు ♦ కాలికొద్ది దూటఁగాఁ
జెలంగుచుం దిగంచుకత్తి ♦ చేతఁ దళ్కు లీనఁగాఁ
గొలంది లేనికిన్కతోడ ♦ గ్రుడ్డు లెఱ్ఱఁ జేసి యా
తొలంగుహాత్తి సోకుఱేనిఁ ♦ ద్రుంచినట్టిరాయఁడా!

అనసూయాశ్వాసాద్యంతపద్యములంగాంచిన, నీయన కేవలశైవమతావలంబకులగుటంజేసి పద్యంబుల నిట్లు శివపరంబుగ రచియించియుండవచ్చునని చదువరులు భావింపవచ్చునుగాని, యట్లుచేయుట కది ముఖ్యకారణంబని నేఁజెప్పఁజాలను; కాని యట్లుచేయుటకు ముఖ్యకారణంబులు, పంతులవారీనైషధంబు రచియించు నప్పటికతిబాల్యంబున నుండుటచే మతవిషయిక వికాసం బింకను మనంబున నుదయింపకుండుటయుం, గవిసార్వభౌముఁ డని బిరుదువహించిన కూచిమంచి తిమ్మకవిచే శివపరంబుగ రచింపఁబడిన నీలాసుందరీపరిణయాద్యనేక శుద్ధాంధ్రప్రబంధములం జదువుటయునునని నేదృఢముగాఁ జెప్పఁగలను.

ఇట్లీగ్రంథముంగూర్చి పొడిపొడిమాటల నుడువుటకంటె యీ యాకవుల పద్యంబులు వీరలపద్యంబులుం గొన్నింటి నిట నుదాహరించినచో నీనైషధ మెంతసులభమైన రసవంతమగు శైలిని రచియింపఁబడి యెట్టిసామర్థ్యమును వెల్లడించు చున్నదియును దేటపడకమానదు; కావున నట్లొనర్చెదను.

*శ్రీనాథుఁడు*

సీ. తల్లిమదేకపు ♦ త్రిక పెద్దకన్నులఁ
గాన దిప్పుడుమూఁడు ♦ కాళ్ళముసలి
యిల్లాలు గడుసాధ్వి ♦ యేమియు నెఱుఁగదు
పరమపాతివ్రత్య ♦ భవ్యచరిత
వెనుకముందరు లేదు ♦ నెనరైనచుట్టంబు
లేవడియొంటేని ♦ జీవనంబు
గానకకన్న సం ♦ తానంబుశిశువులు
జీవనస్థితి కేన ♦ తావలంబు



కృపఁదలంపఁగదయ్య! యో ♦ నృపవరేణ్య!
యభయమీవయ్య! యోతుహి ♦ నాంశువంశ!
కావఁగదవయ్య! యర్థార్థి ♦ కల్పశాఖి!
నిగ్రహింపకుమయ్య! యో ♦ నిషధరాజ!
సీ. ఎల్లచో నారాక ♦ కెదురుచూచుచునుండు
నెలఁతుక యెద నెంత ♦ తలఁకెనొక్కొ!
యేఁ డేయి నన్నొంటి ♦ నిలుదాఁటనీకుండు
కన్నతల్లి యదెంత ♦ కలఁగెనొక్కొ!
తోఁడునీడలలాగు ♦ తొలఁగని చెలికాండ్రు
పోలినఁ గనకెంత ♦ తూలిరొక్కొ!
నేఁ జేరుటయెఱింగి ♦ నెవరునఁజనుదెంచి
కొడుకులుతారెంత ♦ కుందిరొక్కొ!
కూడి యెల్లరిది తెలిసి ♦ కొన్నయంతఁ
గటకటా! తాత నీచేతఁ ♦ గడకు నేఁడు
చిక్కఁగాఁ జేసె నే నెద్ది ♦ సేయుదింక
హాళి నన్నేలు ఱేఁడ! నే ♦ ననదనైతి.

*నన్నయభట్టు*

చ. కలి దమయంతిఁ బాప సమ ♦ కట్టు సతిం బతి వాయ నోపఁడా
లలనను దీర్ఘసౌహృదబ ♦ లంబున నిట్టులు రెంటఁ జేసియ
న్నలుఁడు విమోహరజ్జులఁ బె ♦ నంగి గతాగతకారియైనయ
య్యెలయనుబోలె నూఁగడక యెంతయుఁ బ్రొద్దు వినిశ్చితాత్ముఁడై. (న)
ఉ. అయ్యెలనాగ డించి చన ♦ నక్కలిరేఁచగ లేచు లేచియా
తొయ్యలి నొంటిజేసి చన ♦ దోఁచక క్రన్ననఁ గూరుచుండుఁ దా
నుయ్యెలతీరుగా నెడద ♦ యూఁగగ నాఁగక యెట్టకేలకుం
జయ్యనఁగానడించి చనెఁ ♦ జానను లో నెన రేది యొక్కటెన్. (వీ)
చ. అవిరళవిస్ఫులింగనివ ♦ హంబుల నభ్రపథంబు నంటుచున్
దవదహనంబుదగ్రతరు ♦ దాహముచేయుచు నున్నఁజూచిమా

నవపతి దానియంతరము ♦ నవ్విని యెన్నరనాథ సన్నుగా
రవమున వేగఁ గావ నిట ♦ ర'' మ్మనునార్త మహానినాదమున్

క. వినిశంకింపక చెచ్చెర
ననఘుం డత్యుగ్రతర ♦ దవానల మధ్యం
బున కేగి కనియె దీనా
నను మండలితాంగు నొక్క ♦ నాగకుమారున్. (న.)

మత్తకోకిల

కొండఁ దాఁకుచుఁ జెట్లఁ గాల్చుచుఁ ♦ గూడి తద్దయుఁ గాఱుచి
చ్చెండగాయుచు నుండఁగాఁగను ♦ హెచ్చి చుట్టుకొనంగలో
నుండు నాగులతేఁ డొకం డిదె ♦ యొనఁ గండ యొకింతనే
గండడంగక యుండ గ్రక్కున ♦ గాచి యేలగదే యనన్.

చ. ఒనరగ నాలకించి యతఁ ♦ డొయ్యన డాయఁగ నేగి యందులోఁ
గనుఁగొనెఁ జుట్ట చుట్టుకొని ♦ కన్నులనీ రొలుకంగ నేడ్చుచున్
నెనరునఁ జిచ్చులో నడఁగి ♦ నీల్గకయుండఁగ నన్నుఁ దీయ గ్ర
క్కునఁ నిటు రాగదయ్య! యని ♦ కుయ్యిడు గ్రాఁచులతేని నొక్కనిన్. (వీ)

క. అఱపొఱడు కుఱుచ చేతులు
నెఱవశరీరంబు గలిగి ♦ యొరులకు జూడం
గొఱగా కుండియు మన్మథు
నెఱపులఁ బడియెడు నితండు ♦ యువతీప్రియుఁడై. (న.)

చ. అనుచుఁ దలంచుచున్న తరి ♦ నందలిలెంక యొకండు కొంత చెం
తనిలిచి యాలకించి నలుఁ ♦ దారసిలం జనుదెంచి చూచి యి
చిన్నఁగినగుడ్డలుం గుఱుచ ♦ చేతులు గూనును సొట్టకాళ్ళుఁ గ
ల్గినయితనాలు నీతనిని ♦ గెల్చిన చక్కని దంచుఁ దద్దయున్. (వీ)

ఉ. భామ విదర్భకేగి తన బంధుజనంబులయొద్ద నుండియుం
గోమలదేహసౌఖ్యములఁ ♦ గుంది వెలిమై మలినార్ధవస్త్రయున్



భూమిరజంబు సంగమునఁ ♦ బొల్పగు చుండఁగ నుండె జీవిత
స్వామి నిజేశుఁ జూచు దివసంబులు గోరుచు సువ్రతంబుతోన్. (న.)

చ. చిలుకలకొల్కి యక్కరణిఁ ♦ జెన్నుగఁ జుట్టలయొద్ద నుండియుఁ
నలు నెదలోఁ దలంచుచు న ♦ నల్ దలఁ దాల్చక నేల సెజ్జగా
నల యరచీరతో నొసల ♦ నంటితొలంగనిమాసితోఁ గనుం
గొలుకులనీటితో నెసఁగెఁ ♦ గూరుకు చెందనికన్నుదోయితోన్. (వీ.)

ఈ శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధంబును, నన్నయభట్టారకునినలో పాఖ్యానంబును సావధానంబుగఁ జదివి, నిష్పక్షపాతబుద్ధిం జూచినచో నట్టివారల కందఱ కీనైషధం బెన్నినియమంబు లున్న నెల్లెడ మిగుల ధారాళం బగు మృదుమధురధోరణిని రచింపఁబడిన దనియు, నెంతయు రసవంతముగా రచించిన నన్నయభట్టారకుఁడు, తన నలోపాఖ్యానంబును బ్రత్యేకముగ నొక ప్రబంధముగ రచించినచో నయ్యది యింక నెన్నిమడుంగులెక్కుడు రసవంతముగా నుండునో యనియునుం దోఁచక మానదు. చదువరులారా! నియమంబులెన్ని యున్న, నాద్యంతంబువఱ కొక్క తెలుఁగున రచింపఁబడిన యీనైషధంబునందలి పైపద్యంబులం గవిత్వం బెంతయు సులభంబుగ నుండి, యెంత రసపుష్టికలదిగా నుండి మించుచున్నదియును గాంచితిరిగదా! ఆహా! చూడుఁడు. తిక్కన సోమయాజి, తాను బాల్యంబున రచించిన నిర్వచనోత్తరరామాయణం బున నొక్క నిర్వచనవిశేషణంబునకై,

క. వచనము లేకయు వర్ణన
రచియింపఁగఁ గొంతవచ్చుఁ ♦ బ్రౌఢుండగు గథా
ప్రచయము బద్యములన పొం
దుచితంబుగ జెప్ప టాఱ్యు ♦ లొప్పిదమనరే.

అని లిఖియించి యుండఁగా నిశ్చయంబుగ భూతత్రయంబని చెప్ప నొప్పు నీనియమత్రయంబునకిం దీగ్రంథకర్త యెట్లుగాఁ జెప్పుకొనవలయునో

సూక్ష్మబుద్ధి విశేషగ్రహణైక ధూర్వహులరగు మీకడ నింతయు నెఱిఁగింప నావశ్యకము లేదు.

ఇట్లు నియమత్రయముతో గ్రంథములను రచియించినవారలంతగాఁ గానరాకున్నారు. ఒకవేళ నట్టినియమములతో గ్రంథము రచియింపఁబడియున్నయెడల నది యంతగా హృదయాహ్లాదకరంబుగ నుండకయే యుండునని చెప్పవలసియున్నది. వైదర్భీపరిణయాద్యనేక గ్రంథరచనావిశారదుఁడగు మచ్చ వేంకటరాయకవిచే రచియింపఁబడి పూర్వము గుంటూరు పురమతల్లి నుల్లసిల్లుచుండిన శ్రీ మదముద్రితగ్రంథ చింతామణీ పత్రికాధిపతులగు బ్రహ్మశ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారిచే సపీఠికంబుగాఁ బ్రకటింపఁబడిన "శుద్ధాంధ్ర నిరోష్ఠ్యనిర్వచన కుశచరిత్రము" నందలి,

ఉ. అద్దిర చిల్కతేజిదంటి ♦ యారయ నీదొరనన్ను నేలినన్
గద్దరి నీయలుంగులను ♦ గండడఁగించెదనిట్లటంచుఁ దా
నొద్దిక జీల్చుచున్నదన ♦ నొయ్యనఁ జెందొగలేర్చి చీరుచున్
సుద్దిగ నిల్చి యొక్క చెలి ♦ చూచుచు నుండె గుశుం గుఱంగటన్.

ఉ. కోయనుచెంచు జేండ్రిదన ♦ కోఱను జీల్చుచు జొత్తుచూడ్కులన్
రాయగ నగ్గితున్కలు హుహూ ♦ టూహుటి రాల్చుచు గడ్డుకుక్కలం
గూయగనీ కడంచుచును ♦ గుజ్జున దాఁకిన యొంటిగాని నా
రాయఁడు జంకకీలు గొని ♦ గ్రిక్కున గుచ్చి యడంచెఁ దేజునన్.

అనుపద్యములను జదివి యోచించునప్పుడు కవి మిక్కిలి శ్రమపడి యెంత ప్రగల్భత చూపఁ బ్రయత్నించినను మనసునకుం గలుగవలసినయానందము గలుగకయే యున్నదని చెప్పవలసియున్నది.

వర్తమానంబున, ముద్రాయంత్రంబులు మన తెనుఁగుదేశంబున నెలకొల్పంబడియున్న, ననాదిగా వచ్చుచుండెడుగద్యంబులు వ్రాయువాడుక నింతయుఁ బాటింపక, పంతులవారు తామిటీవల రచియించు గ్రంథంబుల నట్లు గద్యంబులు వ్రాయకయే ప్రచురించుచు వచ్చుచున్న



ను, ఈనైషధకావ్యంబునకును మిగిలిన రెండుమూఁడచ్చతెనుఁగుకబ్బంబులకును, బాల్యంబున రచియింపఁబడిన యభాగ్యోపాఖ్యానంబునకును మాత్రమే గద్యంబులు వ్రాసియున్నారు. పంతులవా రిటీవల రచియించినశాకుంతలాదినాటకంబులకును, నీతిచంద్రికాదివచనకావ్యంబులకును గద్యంబులు వ్రాయకుండుటకు ముఖ్యకారణంబు, పంతులవారు తమప్రఖ్యాతి, యాంధ్రప్రపంచంబునం దంతట విశ్రుతంబుగనున్న దనుదృఢనిశ్చయంబు గలవారగుటయే యని సందియం బొకింతయు లేక నేనిట వక్కాణింపఁగలను. ఇందలి గద్యంబును, రసికజనమనోరంజన శుద్ధాంధ్రభారతసంగ్రహములయందలి గద్యంబులు నొక 'సద్యశోబంధుర' 'నైషధమహాకావ్య రచనాచాతురీధురంధర' యను నీరెండంశంబులందక్క, తక్కిన యంశంబుల నొక్క తెలుఁగుననె వ్రాయఁబడియున్నయవి. పంతులవారు వర్తమానంబున నెంతటి సంస్కారధురీణులుగా నెన్నఁబడుచున్న, నీనైషధంబు రచియించినది బాల్యంబున నగుటచే నిందును, నించుమించుగా నెనిమిదితొమ్మిదివందలసంవత్సరములకుఁ బూర్వము జీవించియున్న నన్నయభట్టు తన "నలోపాఖ్యానము" నందుఁ జిట్టచివర,

సీ. ఇన్నలోఖ్యాన ♦ మెప్పుడు దత్తావ
ధానులై వినువారు ♦ దవిలిభక్తిఁ
జని వేడువారును ♦ జగదీశ కలిదోష
నిర్ముక్తు లగుదురు ♦ నిఖిలపుణ్య
ఫలభాగు లగుదురు ♦ బహుపుత్త్రపౌత్త్రాయు
రారోగ్యధనయుక్తు ♦ లగుదురెల్ల
విషములకును దుష్ట ♦ విషయంబులకు దూరు
లగుదురు ధర్మాత్ము ♦ లగుదురుర్వి

గదు ప్రసిద్ధ మిదియుఁ ♦ గర్కోటకునిదమ
యంతిఁ బుణ్యమూర్తి ♦ యైననలుని
నుతచరిత్రుఁడైన ♦ ఋతుపర్ణుఁ గీర్తింపఁ
గలిభయంబు లెల్లఁ ♦ దొలఁగునధిప!

అనిరచియించిన తెలుంగునను మఱియు, రమారమి రెండుమూఁడు వందల సంవత్సరములకుఁ బూర్వము జీవించియుండిన చరిగొండ ధర్మన్న యను కవివరుం డనర్గళకవితాధారను సలక్షణముగాఁ దానురచియించిన "చిత్రభారతము" నందు,

చ. చదివెడువారికి న్వినెడు ♦ సభ్యులకు న్మది వాంఛఁ జేయుబ
ల్లిదులకుఁ గల్గు విప్రులకు ♦ లేగలతోఁ గనునట్టి లక్షపె
న్మొదవుల నిచ్చినట్టి ఫల ♦ మున్ హయమేధము జేయుపుణ్యమున్
గొదుకక ధాత్రి యంతయు న ♦ కుంఠితదానము సేయుశ్రేయమున్.

క. గ్రామములు వేయు సాల
గ్రామంబులు లక్ష కోటి ♦ కన్యాజనమున్
హేమాద్రు లనంతంబులు
ప్రేమ నొసఁగుఫలము దీని ♦ బేర్కొనఁగలుగున్.

అనివ్రాసిన తెలుంగుననుమనపూర్వకవికృతానేకగ్రంథములయందువలెనే,

క. ఈనలుకత యడుగునతఁడుఁ
దా నాలించెడు నతండు ♦ దగఁ గనునతఁడున్
జానగుకొడుకులఁ గూఁతుల
తోను సిరులఁ గొల్లలాడు ♦ దురు లగ్గనయున్.

అనివ్రాయఁబడియున్నయది. ఐన నిట్టి యంశంబుల నంతగాఁ బాటించు టంతయు నుచితంబుగాదు. వేయేల? పంతులవారి కవితాసామర్థ్యాతిరేకంబుం బరిశీలింపఁదలంపుగలవారీ "శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధముం"గన్నులార విలోకించిన నయ్యది తేటతెల్లంబు గాకమానదు.



అట్లు నైషధమును ముగించిన తరుణముననె మగుడ నేదియయిన నొకప్రబంధము రచియింపవలయు నను నుద్దేశంబునం జక్కని యనేక కథలం దిలకించి యొట్టకేలకుఁ జిత్రాంగదాపరిణయంబునందలి కథ తమ ప్రబంధమున కనువగుకథగా నిశ్చయించి ప్రథమంబున మిశ్రకావ్యంబుగా రచియించి మిశ్రకవిత్వంబునం దిటువంటి ప్రబంధములనేకంబు లిదివఱకే యుండియున్నందున దీనినచ్చతెనుంగున వ్రాయుట యుచితమని యెంచి యత్యంతప్రయాసజనకం బని యింతయు సంశయింపక, మిశ్రకావ్యముగా రచియించిన ప్రబంధములోని కథనేపుచ్చుకొని తెనింగింపఁ దగినంత వఱకు దానియందలి పద్యములను వర్ణనంబులను గ్రహించి, కొన్నింటిని గ్రొత్తగాఁ జేర్చి, గ్రంథమును ముగించిరి. ఈకారణంబుననె, యీగ్రంథము చదువరుల కధికానందజనకంబుగ నుండి, రసికజనమనోరంజననామం బన్వర్థంబగునటు లున్నదని చెప్పుటకెంతయు సంతోషించుచున్నాఁడను. పూనిపరికించినచో నిదియొక 'యపురూప మైనయచ్చతెలుఁగుశృంగారప్రబంధ' మనియే చెప్పఁదగి యుండును. ఇప్ప్రబంధరత్నంబు, పదలాలిత్యమునందును, రచనాకౌశలమునందును, గల్పనాచాతుర్యమునందును, పొన్నిగంటి తెలగనార్యునిచే రచియింపఁబడిన యయాతిచరిత్రంబుతోడను, కూచిమంచి తిమ్మకవి సార్వభౌమునిచే రచింపఁబడిననీలాసుందరీపరిణయంబుతోడను దులతూఁగు చున్న నిందలి యాద్యంతంబువఱకు నొక్కతెలుంగున నున్న మృదుమధురశైలి నాలభ్యంబునకుమాత్ర మయ్యయాతిచరిత్రంబును, నీలాసుందరీపరిణయంబును దీసిపోవకమానవని యింతయు వెనుదీయక నేనిట నుడువఁగలను. విద్యాశాఖవారీగ్రంథమును బరిశీలించి కరంబు శ్లాఘించి, దీనిని శాస్త్రోపాధ్యాయపరీక్ష తరగతికిం బఠనీయ గ్రంథముగనిర్ణయించి, వర్తమానకవులలో సర్వవిధంబుల నగ్రగణ్యు లనిచెప్పనొప్పుపంతులవారి కర్హగౌరవంబు నొసంగియున్నారు. పంతులవారికి బాల్యం

బునఁగల యధికమగుజ్ఞాపకశక్తియు, మితిమించిన సామర్థ్యంబును బరిశీలింపఁ దలంపుగలవారీ రసికజనమనోరంజనంబును బ్రధానద్వితీయ నిదర్శనంబుగఁ గైకొనంజనును. వర్తమానంబున, దైవమునుగూర్చి యెంతయో భేదమైనయభిప్రాయము గలపంతులవారు దీనింగూడ బాల్యంబుననె రచియించుటచే, నైషధంబునందువలెంగాక,

క. నెట్టన గొల్లపడంతుల
బట్టలు దొంగిలినచుట్టు ♦ వాల్దాల్పునకున్
బొట్టెలఁ జంపఁ గడంగిన
కట్టిఁడి ముద్దియ దునిమిన ♦ కఱివేల్పునకున్.

సుగంధివృత్తము.

పొన్నగున్న నెక్కి గొల్ల ♦ పువ్వుబోండ్లతోడుతన్
వన్నెమీఱఁ జేతు లెత్తి ♦ పల్వు రొక్కచెల్వునన్
జెన్నుమీఱ మ్రొక్కుకున్నఁ ♦ జేలలియ్య నంచు నాఁ
డన్నపంతు గెల్చుకొన్న ♦ యట్టిదిట్ట వేలుపా!

అను మొదలయినరీతిని, దీనిని విష్ణుపరంబుగ రచించియున్నారు. పూని పరికింపఁ బంతులవారిని నేఁటికి సర్వమతసార మతావలంబకులని చెప్పవచ్చును. ఈప్రబంధము రచింపఁబడుసమయంబునకొక్క నీలాసుందరీపరిణయంబె ప్రచురింపఁబడిన శుద్ధాంధ్రప్రబంధంబుగా నున్నయది. ఇప్పుడుమనము చదువుచుండెడు యయాతిచరిత్రము పంతులవారు, తామును ప్రబంధనిర్మాణదక్షులై యాంధ్రభాషకు మహోపకారంబు చేయఁగలందియుఁ, బొన్నిగంటి తెలగనార్యున కెంతయుఁ గృతజ్ఞత నగపఱుపఁ దలంచియు నధికప్రయాసమున శిథిలతాళపత్రగ్రంథమునుండి ప్రచురించినగ్రంథము. దీనింబట్టి యీ రెండుమూడచ్చతెనుఁగుంగబ్బంబుల సహాయంబును బట్టియె పంతులవారు శుద్ధాంధ్రంబున నిట్టియనర్గళకవితాధార నలవర్చుకొని యుండియుండవచ్చునని కొందఱు



నిశ్చయింపవచ్చును గాని, యయ్యది యంతగా సరిగనుండనేరదనియే నాయుద్దేశముగ నున్నయది. శుద్ధాంధ్రమున రెండుమూడు ప్రబంధములం జదివి, యింతధారాళంబుగఁ గవిత్వము చెప్పుటయెఱికిఁగాని సాధ్యంబుగానేరదు. గ్రంథమింత యత్యంతాశ్చర్యజనకంబుగ నుండుటకు ముఖ్యకారణం బిప్పటికే పంతులవారించుమించుగ నాంధ్రంబుననున్న యన్నిగ్రంథంబులు, ముఖ్యముగ శ్రీమదాంధ్రభారతంబునందలి సోమయాజి రచించినభాగంబును సాంతంబుగ సావధానంబుగ బఠించియుండుటయేయని చెప్పవలసియున్నయది.

వీరేశలింగముపంతులుగారు, తరువాత ననేకసంవత్సరములకుం బిమ్మటఁ దాము రచియించి ప్రకటించిన "ఆంధ్రకవుల చరిత్రము" నందు మొట్టమొదట నన్నయభట్టుచరిత్రమునందు,

"స్వప్నకథను షష్ఠ్యంతములను మొట్టమొదటఁ జేసినవాఁడు తిక్కనసోమయాజి. ఆతనిని జూచి యించుమించుగా తరువాతికవులందఱును దమకు స్వప్నములో నిష్టదేవతాసాక్షాత్కారమును షష్ఠ్యంతములను దమగ్రంథములో వెఱ్ఱిగా నేఁటివఱకు వేసికొనుచున్నారు." అని వ్రాసియున్నను, ఈ "రసికజనమనోరంజనము" నందు, నిజవంశాభివర్ణనానంతరమున,

సీ. ఏమేటియడుగుఁబొం ♦ దామరల్, తొలివేల్పు
మొకలగువారలు ♦ పొందఁ జాల
రే వేలుపులవేల్పు ♦ నెదయందుఁ బాయక
కలుములకొమ్మ ని ♦ చ్చలును నుండు
నే దిట్టబొజ్జలో ♦ నెల్లజగంబులు
నొకమూలఁ బొందుగా ♦ నొదిగి యుండు
నే పెనుదంటపై ♦ న్లై దురంపుటొరెంపుఁ
దపసి లోనగువారు ♦ తలఁతు రెపుడు

నట్టి వెన్నుండు కనికర ♦ ముట్టిపడఁగ
నాదు డెందంపుఁ దమ్మిలోఁ ♦ బాదుకొలిపె
నాదుకబ్బంబుఁ దనకప్ప ♦ నంబు సేయు
తలఁపు పెఱవేలుపుల నేరి ♦ దఱియకుండ.

అని స్వప్నమునం దని చెప్పక, జాగ్రత్స్వప్నమునందే, శ్రీమహావిష్ణువు కనికరం బుట్టిపడునట్లుగా నీరసికజనమనోరంజనంబును, దన కర్పణంబు చేయునట్లుగాఁ జేసియున్నాఁ డని వ్రాసి,

క. అట్టికనికరపుగనికిన్
గట్టిగ వేలుపుల నెల్లఁ ♦ గాచుచు మదిలోఁ
బుట్టినకినుకన్ రక్కసి
జెట్టులఁ దునుమాడుసిరుల ♦ చేడెమగనికిన్.

క. నెట్టన గొల్లపడంతుల
బట్టలు దొంగిలినచుట్టు ♦ వాల్గాల్పునకున్
బొట్టెలఁ జంపఁగడంగిన
కట్టిడిముద్దియఁ దునిమిన ♦ కఱివేల్పునకున్.

క. క్రాలెడువాలున్ బంగరు
సాలు న్నెఱిచుట్టువాలుఁ ♦ జాలఁగ నలుపౌ
డాలుం బాలకడలినడి
ప్రోలున్ సరిమాటమేలుఁ ♦ బొసఁగెడుదొరకున్.

క. మేటికి సిరిమెదతామర
తేఁటికి గరువంపుఁబొలసు ♦ దిండులదళపుం
గాటపుఁ దెమ్మెరనెచ్చెలి
నీటికిఁ దెఱగంటిపక్కి ♦ నెఱిగూటికొగిన్.



క. ఎన్నిక గనుకవ్వడియొ
లన్నకుఁ దోల్వేల్పుపాగరు ♦ టావుల మెకపుం
గున్నకుఁ జెన్నగు జేజే
మిన్నకు బలుగొల్లకులపుఁ ♦ బిన్నకు నెమ్మిన్.

అని షష్ఠ్యంతపద్యములనుసహితము చేర్చియున్నారు. కాని,

క. క్రొబ్బెరకాయల మెక్కుచు
నిబ్బరముగఁ గొల్చువారి ♦ నెఱిఁ బ్రోచెడియా
గిబ్బవజీరుకొమారుఁడు
గొబ్బునఁ నొడఁగూర్చుఁగాతఁ గోరిక లెలమిన్.

అని వినాయకప్రార్థనంబునుగావించినయిక్కవి, దేవతావిగ్రహములనుసహితముప్రకటించి, "శ్రీనందినే నమః "శ్రీబిల్వేశ్వరాయ నమః" "శ్రీతనుమధ్యాబిల్వేశ్వరాభ్యాం నమః" "శ్రీగణపతయే నమః" శ్రీసుబ్రహ్మణ్యాయనమః అని దేవతానమస్కారములను గావించిన

సీ. కవికులతిలకాఖ్యఁ ♦ గావించితివి మొట్ట
మొదటనే నరసింహ ♦ ముఖమున నను
శ్రీకాళహస్తీశు ♦ చే నొనరించితి
విద్వత్కవీశాఖ్య ♦ వెలయఁగ ననుఁ
బండితరాయాఖ్యఁ ♦ బచరించితివి జగ
ద్గురుశంకరాచార్య ♦ వరసభ ననుఁ
జేర్చి శ్వేతద్వీప ♦ విద్వత్కవిపరీక్ష
సత్కృతుఁ జేసితి ♦ జానుగ నను
విజయనగరేశుసత్కృతి ♦ విద్వదార్యుఁ
గా నొనర్చితి కవిరత్న ♦ గరిమను ననుఁ
జేయఁ దొడఁగితి బిల్వేశ్వ ♦ రీయకృతిని
నను నెటు లొనర్తొ తనుమధ్య ♦ వినతసాధ్య!

అని యాత్మానందంబును వెల్లడించుకొనిన బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నశర్మ పండితరత్నమువలె, విభూతిరేఖా విలసితేశ్వర విగ్రహమునుగాని, శంఖచక్రగదాధరగరుడారూఢ శ్రీమహావిష్ణు విగ్రహమునుగాని, మూషికపరివార సమంచిత నారికేళాంచిత తుండవిభాసిత వినాయకవిగ్రహంబునుగాని, మఱియేయితరవిగ్రహంబునుగాని ప్రకటింపక, భక్తిపూరితము లగునట్టి ప్రార్థనములమాత్రమే చేసి యున్నందులకు మన మెంతయు సంతసింపవలసియే యున్నది.

ఇంకస్థాలీపులాకన్యాయానుసారంబుగ నీరసికజనమనోరంజనము నందలి,

ఉ. ఆనగుమోముచక్కఁదన ♦ మాబిగిసిబ్బెపుగుబ్బదోయిమొ
ప్పానిఱుపేదకౌనుసొగ ♦ సావెలిదళ్కుపిసాళిచూపుడం
బానిడువాలుగన్బెళుకు ♦ లాజిగినిద్దపుమేనిసోయగం
బానునుసోగపెన్నెరుల ♦ యంద మయారె యొయారికే తగున్.

చ. పలుకులలాగు నెమ్మొగము ♦ బాగును మీసమునూఁగు నెక్కలై
యలరుట కోర్కె యబ్రపడి ♦ యప్పటిపాలునిఁగా నెఱింగి నె
చ్చెలిగమిఁ జేరి చెప్ప మన ♦ చెంగట మున్ బువుఁదోఁట నేరిమిం
బలికినయల్లబూటకపు ♦ మాటలమూట యితండె యంచటన్.

ఉ. పయ్యెద జాఱఁ జెక్కుఁగవ ♦ పైఁ జిఱుచెమ్మట లూరఁ బూసరుల్
కయ్యము గోర లేఁగవును ♦ గబ్బిచనుంగవ దూఱజాఱుకొ
ప్పొయ్యన వీపుఁ జేర వెస ♦ నూర్పులు పైపయిఁ గ్రమ్మ దేరఁ దా
నయ్యెడ నింతియోర్తు తల ♦ యంటఁ దొడంగెను వాలుఁగంటికిన్.

చ. మురుగులు జారఁ జెమ్మటలు ♦ ముద్దుమొగంబునఁ గాఱ ముత్యపు
న్సరులొకయోరఁ జేరఁ జిఱు ♦ నవ్వులు మొల్కలు దేర నంటుజొ
ల్లిరుదెసలందుఁ జెక్కులప ♦ యి న్వడిఁ దూఁగుచు డాలువాఱ నా
దొర తలఁబ్రాలు వోసెనల ♦ తొయ్యలియూఁదలమీఁద దోయిటన్.



ఉ. కౌనసియాడ ముంగురులు ♦ గ్రక్కునఁ జెక్కులమీఁదఁ గూడఁ బెం
పూనినగుబ్బదోయిపయి ♦ నొక్కట పేరులు త్రొక్కులాడఁ బై
పైని బయింట యాడ నును ♦ బంగరుగాజులు పట్టుపీడ నా
చానయుఁ గ్రీడిమీఁదను వె ♦ సం దలఁబ్రాలను బోసె దోయిటన్.

అనుపద్యంబులం గాంచినచో, మనసునకుం గలిగెడునభిప్రాయం బిప్పుడు మనము, నిరతతపోగరిష్ఠుం డనియుఁ బరమవేదాంతవిదుం డనియునుం బ్రశంసించునాకూచిమంచి తిమ్మకవిసార్వభౌమునిచే రచింపఁబడిన యన్వర్థంబగు రసికజనమనోభిరామమును జదువునప్పు డేతద్గ్రంథకర్తంగూర్చి మనకుం గలిగెడునభిప్రాయముకంటె నయ్యది ద్విగుణంబుగ నుండక మానదు. వేయేల? గ్రంథరచనంబునం దత్యంతాభిలాషగల విద్యార్థు లందఱు, పరనార్వంబు లగు ప్రబంధరత్నంబులలో నొకటిగాఁ బరిగణింపఁబడఁదగినదీనింగూడ చదివినచో నట్టివారలకు సరసకవితారచనావిధానంబు సులభంబుగఁ బట్టువడకమాన దని నేఁ జెప్పఁగలను.

అచ్చతెనుఁగునందు గ్రంథములను రచియించుటకష్ట మగుటచేతనే, పూర్వమునం దుండినకవులు కొందఱు, తమతమకృతులలో నక్కడక్కడ నొక్కొక్కయచ్చతెనుఁగుపద్యమును వేయుచు వచ్చిరి. అట్టి వానిని జూచియే జను లత్యాశ్చర్యపడుచుండిరి. ఆకారణముచేతనే, కృతిపతి యన్నట్లుగా, యయాతిచరిత్రముయొక్క పీఠికయందుఁ బొన్నికంటి తెలగనార్యుఁడు,

ఉ. అచ్చతెనుంగుపద్దె మొక ♦ టైనను గబ్బములోన నుండినన్
హెచ్చని యాడుచుందు రది ♦ యెన్నుచుఁ బెద్దలు పొత్తమెల్ల ని
ట్లచ్చతెనుంగున న్నొడువ ♦ నందులచంద మెఱుంగువారు నిన్
మెచ్చరొ యబ్బురం బనరొ ♦ మేలనరో కొనియాడరో నినున్.

అని యచ్చతెనుంగునందు గ్రంథములు రచియించుట మిక్కిలి కష్టమని బోధపడునట్లుగాఁ జెప్పియున్నాఁడు. అనేకులుకవులు పరోక్ష

ర్షమును సహింపఁజాలనిదుస్స్వభావము గలవారయిన ట్రోహెూధపద్ధిగి యున్నను, సమకాలీను లగుకవులకుఁ బరస్పరకవిత్వముల యందంతగౌరవము లేకయుండుటను మనముసాధారణముగాఁ జూచుచున్నను,బరులను వంచించుటయందును, పరిహసించుటయందును, ఆసక్తిగలవారలే విశేషముగాఁ గానవచ్చుచున్నను, బరమతస్థులని యించుకయును యోచింపక, సాంఖ్యశాస్త్ర మహాసముద్రోత్తుంగతరంగమని చెప్పఁదగిన తమ «బిల్వేశ్వరీయము» నందు,బ్రహ్మశ్రీకొక్కొండ వేంకటరత్నశర్మపండితవరేణ్యుఁడు కవిస్తవ మొనరించుచు,

ఆ. అచ్చతెనుఁగుఁగబ్బ ♦ మలవరించుటఁ గూడి
మంచితిమ్మనయును ♦ మంచితెలగ
నయును లింగనయును ♦ నయమున స్వీయభా
షాభిమానమాన్యు ♦ లనినుతింతు.

అని వీరేశలింగముపంతులవారిని నుతించియున్నారు. రసగ్రహణపారీణు లని చెప్పనలసినవేంకటరత్నశర్మగారు వీరేశలింగముపంతులుగారు రచియించినయచ్చతెనుంగుగ్రంథములనుజదివి, మెచ్చుకొని, యబ్బురంబొంది, మేలని యట్లు కొనియాడియున్నారు.

పంతులవా రిప్పటికే శ్రీమదాంధ్ర భారతమునఁ జాలభాగము చదువుటయేకాక, ప్రచురింపఁబడి యున్నప్రబంధములను, తాము సంపాదించుచు వచ్చినతాళపత్రలిఖితగ్రంథములనుజదువుచుండి, యమితానందం బొందుచువచ్చి, «యెక్కడఁ జూచినను స్త్రీలకచములయొక్కయు, కుచములయొక్కయు, రతులయొక్కయు, పతులయొక్కయు, వర్ణనంబులె కాని మానవులను సన్మార్గంబునకుఁ ద్రిప్పఁజాలిననీతులను బోధించువాక్యంబులు మందునకైనంగానరాని, «తారాశశాంకవిజయము», «బిల్హణీయము» మొదలైన దుష్టప్రబంధములను» జదివినప్పుడు మనమునకుం గలుగుచువచ్చినయసహ్యతకుఁ గోపంబునకు మేర లేకుండు



టచే, నట్టకేలకు, వానిం బరిహసించునట్టి లోకహాస్యప్రబంధము రచింపఁదలంచి యప్పటికిం గాలానుగుణ్యముగ వ్యభిచారదోషఫలంబు ననుభవించినయొకమహాత్ముని చరిత్రమును బ్రహ్మగోర్యోపాఖ్యాన మనికల్పించి, ప్రతిపద్యహాస్యరసాస్పదం బగునటుల రచించి, తమమిత్రులకత్యంతోల్లాసజనకం బగునటు లప్పుడప్పుడు చదువుచువచ్చిరి. పరవనితారతి యమితపాపమూలం బనియే యిందలిముఖ్యఫలితార్థము. ఆకాలమునందలి స్నేహితు లందఱు పంతులవారికి, రామలింగమువలెనే వికటకవిత్వం బబ్బుచున్న దని చెప్పుకొనుచువచ్చి రని పంతులవారి సహపాఠులలో నొకరు నాకుఁ దెలియఁజేసి యున్నారు. సాధారణముగ నుపాఖ్యానము లన్నియు నరణ్యావాసము చేయుచున్న ధర్మరాజాదులకు మార్కండేయుం డెఱింగించె ననియో, లేక, నైమిశారణ్యంబున శౌనకాదిమహర్షులు సత్రయాగం బొనర్చుతఱి వారలకు రౌమహర్షణి వినిచె ననియో, చెప్పఁబడి రచింపఁబడు చుండుటచే, నిదిహాస్యాస్పదంబైనకథ యగుటం జేసి, ధర్మరాజును సందర్శింపఁ జనుదెంచిన యొకపరిహాసకుఁడు దీనిని వాని కెఱింగించె నని చెప్పఁబడి యున్నది. మనపూర్వకవులు రచించినయన్నిప్రబంధములయందు నున్నముఖ్యకథ యొకరాజు వేఁటకుం జని యచ్చోటనొక కాంతామణిం గాంచి తన చెలికానిసాహాయ్యంబున దానిని గాంధర్వంబునఁ బాణిగ్రహణంబుఁ జేసికొనుటయే, యని యింతకుమున్న యెఱింగినచదువరుల కెఱింగింప ననవసరము. పునరుక్తిదోషం బని, యిసుమంతయు వెనుదీయక చర్వితచర్వణంబుగ వర్ణించినదానినే మఱలమఱల వర్ణించుచు నాయాప్రబంధముల నాయాకవివరేణ్యులు వెల్లడించుచు వచ్చినతత్త్వద్బుద్ధివిశేషంబు నెఱుంగఁ దలఁచినవో నాయాప్రబంధంబులం గన్నులార వీలోకించి తీఱవలయునేగాని, యయ్యది సులభంబుగఁ దేటపఱుప నాకిట్టి శక్యంబుగాదు. ఇందును, గథ యట్లే కల్పింపఁబడియున్నదిగాని, గ్రంథారం

భంబు మొదలుకొని గ్రంథాంత్యంబువఱకొక్క తెఱంగున నపూర్వవర్ణనావిలసితంబుగ నున్న యీయుపాఖ్యానంబును గాంచినచో మనసు హాస్యరసంబున నుప్పొంగక మానదు. ఇందలి,

ఉ. అతనికిఁ బొట్టకోసినను నక్షర మొక్కటి లేదు; కాగడన్
వెతకినఁ దెల్వి లేదు; దయ వీసముఁ గల్గనైన లేదు; ప్రో
న్నతనయవిద్య లేదు పదు నాల్గుపుటంబులు పెట్టికాల్చినన్;
జతురత వాతపెట్టినను సత్యము జిహ్వకు రాదొకప్పుడున్.

సీ. ఒకదిక్కునను గుక్క లొకగ్రుక్కఁగాఁ గూయ
నొకచెంతబలుదుంత లొలసియార్వ
నొకమూలఖరజాల మురులీల నోండ్రింప
నొకచోటగుడిసేటి యువతు లడల
నొకదండ ముదిముండ లొకదండుగాఁ గూడ
నొకవంకబలుకుంక లొదిగియుండ
నొకపొంతఁ గడముంత లొకదొంతరగ నుండ
నొకక్రేవ మధుసేవ లొనరఁ జేయ
బొంటపోగులుఁ జీపుళ్ళుఁ బేడకుప్ప
లలుకుగుడ్డలుఁ గోడియీ కెలుకు దనర
డంబుమీఱినశునకాసనంబునందుఁ
గొలువులోఁ జచ్చినట్టులు గూరుచుండె.

గీ. వచ్చి గుడిచెంతఁ గూర్చున్న వారిఁ గాంచి
మీరు రక్తవర్ణాలక్, సైరిభాంగి,
మర్కటానన, పర్వత మధ్యభార,
వనిత నాదైనఁ గంటిరే యనుచు నడుగ.



ఉ. డా యనుభీతిఁ బొంద మగఁ డా యనుఁ దల్పులు తీయరాదె రం
డా యనుఁ బల్కవేమి చెపు డా యను సొమ్ములు పెట్టెలంకెముం
డా యనుఁ వేగ రావె మొఱ డా యను లోపలఁ జేరి యేడ్వ గా
డా యను సిగ్గు బూను టిపు డా యను నచ్చెలి మాటిమాటికిన్.

గీ. వెలుపలికిఁ దీసికొనివచ్చి వీపు మీఁద
ముఖముమీఁదను మెడమీఁద ముక్కుమీఁద
మణుగుగుద్దులవానలు మచ్చుచూపి 
పిండిపెట్టిరభాగ్యుని నిండుగాను.

చ. తటుకునఁ జుట్టుముట్టి పడ తాడనకూర్పరఘట్టనంబులన్
జటిపొటిమొట్టికాయలను జేరలనిండినచెంపకాయలం
బటుతరముష్టిఘాతములఁ బల్మఱును న్వాదచల్లి దేహముం
తట రుధిరమ్ము గ్రమ్మఁ గఱి దైత్యుని నెట్టనివానిఁ జేసిరన్.

అనుపద్యంబులం గాంచినచో నెంతయు నాహ్లాదకరం బగునటులు హాస్యసంజీవనులను రచించుచు, నాంధ్రంబున హాస్యకాళిదాసని బిరుదు నందఁదగినపంతులవారు బాల్యమునందే యెంతవికటంబుగఁ గవిత్వము చెప్పనట్టి సామర్థ్యంబును గలిగియుండినదియుం దేటపడక మానదు.

పిమ్మటఁ, దిక్కనసోమయాజిరచించిన "నిర్వచనోత్తరరామాయణము" కడుప్రౌఢంబుగ నుండ లేదనుతలంపున నయ్యుత్తరరామాయణకథను వ్రాయఁ దలంచి, సోమయాజికృతి సంస్కృతమునకు సరిగ నుండినదియు లేనిదియు ననునంశం బటుండ నంతగాఁ గష్టతరంబు గాని నిర్వచననియమంబుం జేసికొని రచించినదానిం దాము శుద్ధాంధ్రంబున రచించినచో నయ్యది విశేషశక్తివిదితంబుగ నుండకమాన దనితలంచి యందుఁ బ్రథమాశ్వాసంబు చాలభాగము రచించి ప్రచురించి యున్నారు. వ్రాసినయంతవఱకు నున్నదానిం గాంచి, యందలి భాగంబును విరళంబుగఁ బొంచి వ్రాసినరీతియు, నగాథకల్పితవర్ణనావిధానస

బును, సత్వాయసౌలభ్యంబును గొంచెము యోచించినచో నయ్యది
సోమయాజి కృతోత్తరరామాయణంబుకన్న ననేకవిధంబులం గడు
ప్రౌఢంబుగ నున్న దని తోఁచకమానదు. ఇయ్యది, యింతగసవంతం
బుగ నుండుటకుఁ బ్రధానకారణం బిది కరం బభిరామంబగు రసికజన
మనోరంజనంబును రచించినతరుణంబున రచింపఁబడుటయే యని చెప్ప
వచ్చును. నవయౌవనంబున నున్నతఱిం గరంబు రసవంతముగఁ గవిత్వ
ము చెప్పెడి సామర్థ్యము గలవంతులవా రిప్పుడు దీనిని సొంతము గావిం
పఁ బ్రయత్నించినచో నిట్లు రచించుటమాత్రము సాధ్యముగ నుండ
దనియే చెప్పవలసియున్నది గాని, యిట్టీరామాయణంబు ముగింపఁబడి
నచోమాత్ర మియ్యది చదువరులహృదయంబుల కత్యంతాహ్లాదకరంబు
గ నుండి, తిక్కనకృతోత్తరరామాయణంబును దిరస్కరింపకమాన దని
చెప్పక మానరు. అమితసామర్థ్యంబును వెల్లడించుశుద్ధాంధ్రనిరోష్ఠ్య
నిర్వచననైషధాదిప్రబంధములను, అభిజ్ఞానశాకుంతలాదినాటకంబులను
చైకొని, చదివియానందించి, యందుమూలంబున గ్రంథకర్తకుం గరంబుత్సా
హంబును గల్పించెదరుగాక! సొంతము గావింపఁబడనియీపుస్తకముం
గూర్చి యిట్లధికంబుగఁ బెంచి వ్రాయుటకన్న నిందలికవితాధోరణి యెం
తమార్దవంబును వహించియున్నదియుం జూపుటకై యిందుండి కొన్ని
పద్యంబుల నిట నుదాహరించుటయే యెంతయు సముచితంబుగ నుండు నని
తలంచి, యిట్లు చేయుచున్నాఁడను.

సీ. చెలువంబుగా నాడు ♦ వెలయాంద్రబంగారు
చిఱుగజ్జియలమ్రోత ♦ చెవులు దనుప
విరిబోఁడు లిరుగ్రేవ ♦ వింజామరలు వేయ
వెడలుచల్లనిగాలి ♦ విందుగొలుప
రహిమీఱఁ దాల్చిన ♦ రతనంపుపనిసొంపు
తొడవులతళతళల్ ♦ కడలు నిండఁ



బగడాలకంబాల ♦ పజ్జముద్దియనుల
కెంబట్టుపఱపులు ♦ డంబుసూపఁ
గొలువ నేతెంచుదొరలెల్ల ♦ గుములు గూడి
యెదుట నొదవుదాఁక నందంద ♦ యొదిగియుండి
యడుగుదోయికి మ్రొక్కుచు ♦ నవల నిలువఁ
బసిఁడిగద్దియఁ గొలువుండె ♦ బలియుఁ డతఁడు.

చ. అలరులకొమ్మలో మరుని ♦ యమ్మలో బంగరుకీలుబొమ్మలో
వలపులదీవులో తొవల ♦ బావులొ చక్కనిగుజ్జుమావులో
తొలకరిమించులో యనఁగఁ ♦ దూకొని యచ్చరలేమ లచ్చటన్
బెళుకుఁగనుంగవల్ తళుకు ♦ బెన్నెడలుం దగ సందడింపుచున్.

సీ. ఒకచోట నునుబాట ♦ లోకతేటగాఁ బాడు
దుగు నల్లతా లెల్లఁ ♦ గరఁగిపాఱ
నొకయోర వగమీఱ ♦ మొక మోరగ నొనర్తు
రలమి దట్టంపువె ♦ న్నెలలు గాయ
నొకచాయఁ గనుగాయ ♦ లకు డాయవత్తు రొ
య్యారంపు నడకల ♦ హావుసునిండ
నొకదండ విరిమండ ♦ లొడినిండఁ గూర్తురు
కమ్మనితావులు ♦ గ్రమ్ముకొనఁగఁ

గీ. బిలుతు రొకచక్కనెచ్చెలి ♦ పిండు నిక్క
కలికిపలుకులఁ జిలుకలు ♦ కలఁగిచూడ
నడుతు రొకగ్రేవ సొలపుగా ♦ నడిమిత్రోవఁ
గడియ నరుదెంచి యంచలు ♦ కాళ్ళఁ బెనఁగ.

చ. వడివడిఁ బౌలుతెంచి యొక ♦ పైదలి యూర్పులువుచ్చి నవ్వొనన్
బడఁతుకమోర్తు చా లిప్పుడె ♦ నవ్వుకు మంతయు తేపె గటిగాఁ

గోడుకులతల్లి పోదు వృక ♦ కొంచెము నాఁటికి దాఁచుకొమ్ము నా
సడికే నెలంతయుం; గడువు ♦ లుబ్బఁగ నవ్విరి కొమ్మ లందఱుర్.

ఈయన పాఠశాలలయందు విద్యాభ్యాసముచేయుచున్నకాలంబునఁ బ్రతితరగతియందును బుద్ధిసూక్ష్మతకును, ముఖ్యముగా వినయసత్ప్రవర్తనమునకును బాఠశాలాధికారులవలనను, నుపాధ్యాయులవలనను మిగులగౌరవింపఁబడుచుఁ బుస్తకములు మొదలగునవి బహుమానంబుగ నందుచువచ్చిరి.

1860 వ సంవత్సరమునం దిక్కడ మండలన్యాయాధిపతులుగ నుండిన హెన్రి మోరిస్‌దొరగారిచే వీరికి బహుమానంబుగ నొసంగఁబడినయొక్కపుస్తకమునం దిట్లు వ్రాయఁబడియున్నది.

"THIS BOOK WAS PRESENTED
to
KANDUKURI VEERESALIMGAM
with other
books required for the
new class into which he
was promoted as a
PRIZE
for
Good conduct
in
THE RAJAHMUNDRY ZILLAH SCHOOL
BY
HENRY MORRIS."

దీనింబట్టి, వీరేశలింగముపంతులుగారికి వినయసౌశీల్యాదిగుణసంపత్తి బాల్యంబునుండియు నెక్కుడుగనే యుండియున్న దని చెప్పవలసి యున్నది.

అట్లు 1870 వ సంవత్సరమునఁ బ్రవేశపరీక్షం గృతార్థు లయిన తరుణంబుననె యిక్కడిపాఠశాలయం దిరువదియైదురూపాయల వేతనము



గలసహాయోపాధ్యాయులుగ మొట్టమొదటఁ బ్రవేశించిరి. వీరు బాల్యంబునుండియు సూక్ష్మగ్రహణసామర్థ్యము గలవా రగుటం జేసి, యుద్యోగమునం జేరియే క్రమంబుగ న్యాయవాదిపరీక్ష మొదలయినకొన్ని పరీక్షలం గృతార్థు లగుచువచ్చిరి. జీవితకాలమునం దంతటను గ్రంథములను రచియించి, జీర్ణించుచున్న మనయాంధ్రభాషను సాధ్యమయినంతవఱకు వీడక పాటుపడుచు నభివృద్ధి నొందింపవలయు ననుముఖ్యోద్దేశముగలవా రగుటం జేసి, పత్రికలకు నడుమనడుమ నమూల్యంబు లగునుపన్యాసాదులఁ బంపుచుఁ గేవలము స్వయంకృషివలనఁ బరీక్షలకుం జనుచు నాతిఱున నుపాధ్యాయోద్యోగమునం దుండియే, గ్రంథములను రచియించుచుండిరి. తరువాత నాపాఠశాలయం దొకయుపాధ్యాయుఁ డగత్యము లేక యుండుటం జేసి, పంతులువారికాయుద్యోగము కొంతకాలములోనే నిలిచిపోయెను. ఆకాలమునకు వీరి సహపాఠులలో ననేకులు తహసీల్దారులుగను, డిప్యూటికలక్టరులుగను నుండియుండుటం జేసి, తమస్నేహితుని యున్నతస్థితికిం దీసికొనిరావలయు ననుసదుద్దేశంబున నాయుపాధ్యాయోద్యోగంబును వదలుకొనియయినను రావలయు నని పలువిధంబులఁ దెలియఁజేయుచుఁ, బ్రారంభమునందే యిరువదియైదు రూపాయల వేతనము గలయొక రాజకీయోద్యోగంబు నిప్పించెద మని యుత్తరములను వ్రాయుచువచ్చిరి. అతఁడున హృదయపూర్వక మయినమిత్రవాత్సల్యమును గనుపఱచుచు వార లంద ఱెన్నెన్ని విధముల నుత్తరములను వ్రాయుచువచ్చినను, బంధువర్గంబులోనివార లనేకు లెన్నెన్ని తమకు హితోపదేశంబులుగఁ దోఁచినవాని నెల్లను బోధింప నారంభించినను, సర్వసాధారణంబుగ నిట్టివార లందఱుఁ దమ మనస్సులను స్వాతంత్ర్యోద్దేశంబుల కాలవాలంబుగఁ జేసికొనక మానరు గావున, తనుస్నేహితులయొక్కయు, బంధువులయొక్కయు నట్టిహితోప

దేశంబుల నెల్లను బెడచెవిం బెట్టుచు నాయాయుద్యోగముల నెల్లను దృణప్రాయములుగఁ దలంచుచు, నట్టియుద్యోగంబులు తమ కక్కఱలే దని వారికిం బ్రత్యుత్తరంబులఁ బంపుచు నమితసంతోషమును యశమును గూర్చునట్టిగ్రంథరచనోద్యోగంబునె యవలంబించుచు వచ్చిరి. అట్లాకాలమునం దీయన తమమిత్రులహితోపదేశంబుల ననుసరించి యట్టియుద్యోగంబులఁ జేరియుండినను, నేఁటికి వీరెక్కడనో యేతహసిల్దారుగారుగనో లేక యేడిస్ట్రిక్టుమునసబుగారుగనో, లేక యేడిప్యూటికలెక్టరుగారుగనో యుండి యుపకారవేతనము నంది యనామకులయి యుందురేకాని యీతీరునఁ బలువిధములు నాంధ్రదేశమునం దంతట నఖిలప్రఖ్యాతిని గాంచి యుండకయే యుందురుగదా!

పిమ్మట నొకటిరెండు సంవత్సరంబులన 1872-73 సంవత్సరంబులం గురంగేశ్వర మనఁబడుచుండెడికోరంగియందలి పాఠశాలయందుఁ బ్రధానోపాధ్యాయత్వమును వహించి, నెలకు ముప్పదిరూపాయలవేతనమును గైకొనుచుండిరి. కోరంగియందు వీరితో సహోపాధ్యాయులుగఁ బనిచేసినయొకనాయుఁడుగారు, 1893 వ సంవత్సరమున నేనిక్కడి శ్రీవివేకవర్ధనీ ముద్రాక్షరశాలయందుఁ గార్యనిర్వాహకుఁడనుగ నున్నకాలంబున వీరేశలింగముపంతులవారిని సందర్శింపఁ జనుదెంచి, వీరాకాలమునం దిట్టిగొప్పఖ్యాతిని దేశమున సంపాదించుటకుం జాలినచిహ్నములను లేకయేయుండిరనియును సహోపాధ్యాయులయెడ నెంతయు దయాస్వభావమును గలిగియుండెడివారనియును సంతోషముతోడను నాశ్చర్యముతోడను సంభాషించియుండిరి. 1873వ సంవత్సరమునం దాకాలమునఁ జెన్నపురంబున బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులువారిచేఁ బ్రచురింపఁబడుచువచ్చిన "శ్రీయాంధ్రభాషాసంజీవని" యనుపత్రికయందును, స్త్రీలకు విద్యగఱపుట యనర్హ్యకృత్యమని హితబోధనంబులు సేయుచువచ్చినయష్టావధానిగారి గంభీరోపన్యాసములకును



బ్రతిగ "యుద్దియు విద్దియు పెద్దకార్యమనుట ప్రసిద్ధ"మని యనేకపద్యములను గరంబు రసవంతముగ నుండునటులు రచియించి, వానిని, 'ఈం. వీ.' యనియును, 'స్వదేశాభిమాని' యనియును బృందావనపురమనఁబడుచుండెడి బందరునం బ్రచురింపఁబడుచుండెడు "పురుషార్థప్రదాయిని"కిం బ్రచురింపఁ బంపుచువచ్చిరి. అయ్యవి చదువరులకు హృదయాహ్లాదకరంబుగ నుండకమానవు; కావున, వానిం గొన్నింటినిమాత్రమిట నుదాహరించుచున్నాఁడను.

శా. శ్రీమార్తాండమరీచికోచి యనఁగా ♦ జెన్నై దిశాంధావళిం
బ్రామాగ్రాల్ పురుషార్థదాయినివతీ! ♦ పద్యాళిసంజీవనిన్
శ్యామాలోకము కెల్ల విద్యవలదం ♦ చష్టావధానాహ్వయుల్
శా నిరామాసము వెల్లడించుటలు మా ♦ దంబొప్ప వీక్షించితే.

క. దానిం గనుఁగొని తోఁచిన
వానిం బ్రత్యుత్తరముల ♦ వరుస నొసఁగెదన్
గాన మనముల ననూయలు
మానుఁడు మఱికేఁడుమేల్చ ♦ మది నారయుచోన్.

క. "మొదటనె పూర్వులు చెప్పిన
యది యనుగర్వంబుమానుఁ" ♦ డని నే నేమో
వదరి యనినాఁడ నంచును
జడు లేర్పడఁ బల్కినారు ♦ చక్కనిసుకులన్.

గీ. సరి! "పురాణమిత్యేవ న ♦ సాధుసర్వ"
మనుచుఁ దొల్లి మొ మాళవి ♦ కాగ్నిమిత్ర
మనెడు నాటకరాజంబు ♦ నందుఁ గాళి
దాసు పల్కుట వినరొకో ♦ ధన్యులార!

చ. మునుపటివారు చెప్పినది ♦ మొక్కలవున్నదిపూని సర్వమున్
గొనఁ జనదంచు నామతము ♦ కూడ లవంబును గాదు, కాని యీ

దను మనబుద్ధిహూడఁ గనుఁ ♦ దూరిచి యారయుచుంట ముఖ్యమై
చనును హితాహితంబుల ప ♦ సల్ గని దుష్కృత ముజ్జగింపఁగన్.

క. ప్రతిభావంతులు మిక్కలి
మతిమంతులుఁ గలరు మిగుల ♦ మనపూర్వులలో
సతతము వాదము సల్పిరి;
యతులితవాగ్గరిమఁ గొన్ని ♦ యంశంబులలోన్.

* * * * *

మ. అయిన న్మద్దియువిద్దియుంగుఱిచి యొం ♦ డైనం దగం దొంటియా
నయవేదుల్ తగ దంచు వాదములు పూ♦నం గంటిమే మీరవలెన్?
దయమీరంగను జెప్పుఁడయ్యా! యలసి♦ద్ధాంతంబు లెందైన మీ
నయనానందము చేసెనేమొ వినఁగ ♦ స్వాతూహలం బయ్యెడున్.

* * * * *

ఉ. "వారణయాన లెల్లనును ♦ బాటల నేర్తురు గాని వారిలో
నారయ వ్వానియర్థ మెఱు ♦ గైనను నేర్చినవారె" యంచు మీ
రూరక వాదులాడెద ర ♦ యో! మనపాటలయర్థ మంగనల్
నేరరె? యిట్లు మీ రనిన, ♦ నిక్కము లోకము తా నెఱుంగదే?

గీ. పాటలాధరల్ పాడెడు ♦ పాటలందుఁ
దప్పిదంబులు కుప్పలై ♦ యొప్పుఁగాన
వానియర్థముఁ దెలియరు ♦ వారటంచుఁ
జెప్ప నొప్పునే? యొప్పుల ♦ కుప్పలార!

* * * * *

ఉ. వింతగ వాద మేల యువి ♦ నేకులపోలిక; స్త్రీలవిద్య సి
ద్ధాంతము చేసినారు మన ♦ శాస్త్రులు పూర్వులు; వేద మొక్కఁటే



యింతులు చదువఁగూడ దని ♦ దింతే; పురాణచయంబు స్త్రీలకై
యొంతయుఁ జేయుటల్ స్మృతులు ♦ నెల్లపురాణము లొప్పి చెప్పవే?

* * * * *

గీ. భవ్యపురుషార్థదాయిని ♦ పత్రికాధి
నాథులార! యుమారంగ ♦ నాయకాఖ్యు
లార! ప్రచురింత్రు పత్రిక ♦ యందు దీని
ననుచు వేఁడుమిత్రుండు శ ♦ తావధాని.

అట్లా కోరంగియందున్న కాలంబుననె పాఠశాలలోని క్రిందితరగతులయందలి విద్యార్థుల యుపయోగార్థము "సంగ్రహవ్యాకరణము" "నీతిదీపిక" మొదలయిన గ్రంథములను రచియించి, వానిని 1875 వ సంవత్సరంబునఁ బ్రచురించియున్నారు. అప్పటికి స్వీయముద్రాక్షరశాల లేక యుండుటంజేసి, యాకాలంబున మృదుతరముగఁ దాము తెనిఁగించిన "జాన్ గిల్పిన్" సను తేటగీతములు చెన్నపట్టణమునందే ముద్రింపించియున్నారు.

గీ. కౌపరని యెడియింగ్లీషు ♦ కవివరుండు
హాస్యకృతిగాఁగ మును చేసి ♦ నట్టిదానిఁ
దేటగీతులతోడను ♦ దెనుఁగునందుఁ
గందుకూరి వీరేశలిం ♦ గకవి రచించె.

అని వ్రాసికొనినయీజాన్ గిల్పిన్ లోని

గీ. దానికపరిమితానంద ♦ మూని, యాతఁ
డట్టిసంతోషసమయంబు ♦ నందుఁ గూడఁ,
బ్రియవధూమణి తా మితే ♦ వ్యయమునందె
పెద్ద తవిలియుంటను మున్ను ♦ పెట్టుకొనియె.

* * * *

సీ. ఉండు బుట్టిబుట్టికి నొక్క ♦ యుంగరపుంజెవి,
దానిలోనుండి తెనపటు ♦ కాను దూర్చి,
రెండుప్రక్కలఁ దూకంబు ♦ నిండియుండఁ
బ్రక్కకొక్కటి ప్రేలాడఁ ♦ బడఁగఁ గట్టి.

* * * *

గీ. కుక్కలఱచెను వీథిలోఁ; ♦ గుఱ్ఱవాండ్రు
పెద్దకేకలు వైచిరి, ♦ పెద్దవారు
తమగవాక్షములను జేరి ♦ తగినయట్టు
లయ్యె వంచును గట్టిగా ♦ నఱచి రౌరా.

ఈపద్యములను గాంచినచో వీరి కాకాలమునందుఁ గలభాషాంతరీకరణసామర్థ్యము సులభంబుగ బోధపడకమానదు.

ఈ ౧౮౭౫ వ సంవత్సరమునం దక్టోబరు నెలయందు "శ్రీవివేకవర్ధని" పత్రికకు "శ్రీకందుకూరి వీరేశలింగకృతిసంగ్రహవ్యాకరణనీతిదీపికాప్రశంస" యనికీర్తిశేషులయిన బ్రహ్మశ్రీ వావిలాల వాసుదేవశాస్త్రులవారు తమయభిప్రాయమును పద్యగద్యాత్మకంబుగఁ బంపియున్నారు. పట్టపరీక్షం గృతార్థులయి, గీర్వాణాంధ్రములయందును, హూణభాషయందును సమానపాండిత్యమును సంపాదించుకొని యుత్తరరామచరిత్రాదినాటకరాజములను భాషాంతరీకరించి, యర్హవిమర్శకులుగఁ బరిగణింపఁబడఁదగిన యాబ్రహ్మశ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారును ఆసంవత్సరమునందే,

"అభినవతిక్కన యనఁగా
నభినుతి యిడివఱకె వడసె ♦ నందఱిచేతన్."

అని వీరేశలింగము పంతులవారికవితాసామర్థ్యముగూర్చి తమకుంగలసముచితాభిప్రాయంబును వెల్లడించియేయున్నారు.



అట్లింమఱింమగ నొకసంవత్సరము కోరంగియం దుపాధ్యాయుఁడుగ నుండఁ బిమ్మట, ధవళగిరి యనఁబడుచుండెడిధవళేశ్వరంబున నలువదినాలుగు రూపాయల వేతనంబు గలవారుగ నక్కడి పాఠశాలకుం బ్రథానోపాధ్యాయులుగ నిర్ణయింపఁబడిరి. ఇదియే యిక్కవిజీవితకాలమునందు గొప్పగొప్ప మార్పులను సూచించుచువచ్చిన పదునెనిమిదివందల డెబ్బదినాలుగవ సంవత్సరము: — 1874.

ఇట్లక్కడియాంగ్లోదేశభాషాపాఠశాలయందుఁ బ్రథానోపాధ్యాయపదంబును గైకొని, యేతత్పాఠశాలాధికారుల కనుకూలముగ నుండునటు లయ్యుపాధ్యాయత్వంబును గ్రమంబుగ నిర్వహించుచు, బాల్యమునుండియు నూరకుండని స్వభావంబు గలవారగుటచే నాయూర నొకసమాజము నేర్పరిచి, యుపన్యాసంబుల నిచ్చుచు; నాసమాజమునందలి యందఱకుం గ్రమంబుగఁ బత్రికావీక్షణానుభవమును, పత్రికోద్ధారణమునందు నధికాదరము గలుగునటులు చేయుచువచ్చిరి. ఆకాలమున వీరేశలింగముపంతులుగారితో సహవాసముచేసినవారు కొందఱు నేటికి నప్పటియుపన్యాసములబలిమిచేతనన్న నెప్పుడు భారతమునో భాగవతమునో లేక మఱియే యితరాంధ్రగ్రంథమునో చదువుచునుండవలయునను తమితోపమునకుం బాల్పడునటుల చేయుచున్నదని నాకనేకసారులు సంభాషణవశంబునఁ దెలియఁజేయుచున్నారు. పంతులవారిప్పటికే, ధవళేశ్వరమున నుండియున్న కాలముననే వారెట్టికార్యములను జేయుచువచ్చినదియు మీరెఱింగినచో, నయ్యవి యెట్టిలోకోపకారచింతను, నెట్టి పారమార్థికచింతను వెల్లడించుచున్నవియు మీకు సులభంబుగ బోధపడకమానదు. పంతులువారు బాల్యముననె పాఠశాలలం జదువుచుండెడికాలముననె యత్యధికముగ జనులయాచారవ్యవహారాదులనుగూర్చి యోజింగియున్న వారలయ్యును, నివియే యటుపిమ్మట వ్రాసి ప్రచురించిన

వచనప్రబంధములకుఁ గావలసినయన్ని యుపకరణములను సంపాదించిన దినంబులుగ నున్నవి. అప్పటికే పంతులవా రెంతచురుకుతనముతో, నెంతశ్రద్ధతో, నెంతలోకోపకారచింతతోఁ బాటుపడుచువచ్చినదియు, నప్పటి స్నేహితులలో నెవ్వరి నడిగిన నయ్యదియంతయు వారలెంతెంత యుత్సాహముతోఁ జెప్ప నారంభించెదరో చదువరు లెఱుంగఁదలఁచిన నయ్యది సులభంబుగ నెఱుంగవచ్చును.

"భగవద్భక్తి" "ఆస్తిక్యము" "వివేకము", "సత్యము" "అహింస", మొదలగుపరిశుద్ధమతసిద్ధాంతములను బోధించునుపన్యాస రత్నములచేఁ బ్రకాశించుచుండిన "వివేకవర్ధని", యాకాలంబున నెట్లుండెనో, 1875వ సంవత్సరము నవంబరు 20వ తేదిని బ్రహ్మశ్రీ వడ్డాది సుబ్బారాయఁడుగారు "కన్యాశుల్కము", అనుచిన్న యుపన్యాసంబునకుం బ్రారంభమున వ్రాసిన,

" శ్రీ గణాధిపతయే నమః.

బ్రహ్మశ్రీమహారాజశ్రీ వివేకవర్ధనీ పత్త్రికాధికారులగు కందుకూరి వీరేశలింగముగారిసన్నిధికి.

అయ్యా!

ద్విజరాజసమాశ్రయవిశ్రుతంబును, సకలలోకతమోహరణనిపుణంబును, నభంగభుజంగపుంగవాంతరంగోత్తుంగభీతావహంబును, విమతజనవితానమనోనళినముకుళనకరంబును, సుజనచకోరకాహ్లాదంబునై శరచ్చంద్రికాకామనీయకానుకారియగుచుం దినదినప్రవర్ధమానయై కకుప్పాలికాబాలికాకేళికావిహారణంబునం గ్రీడించుతావకపత్త్రికాపుత్త్రికామతల్లికాంగవల్లికావిలాసంబునకు మదీయరచితంబగునీసువర్ణమయవృత్తాంతమండనంబు నలంకరించి మన్నింపఁగోరుచున్నవాఁడ.

భవన్మిత్త్రుండు
విధేయుండు.
వడ్డాది సుబ్బారాయఁడు.

ది॥ 20 నవంబరు.
౧౮౭౫ సం.



అనుదానింగాంచిన బోధపడకమానదు. అట్లు "వివేకవర్ధని" పత్త్రికం బ్రకటించుచు, నాదటిమూఁడుపత్త్రికలలోఁ, బ్రచురించియున్న

సీ. అక్ష్యాదిబాహ్యేంద్రి ♦ యాగోచరుం డయి
యాత్మస్వరూపుఁడై ♦ యలరువాఁడు
సచరాచరం బైన ♦ సర్వసృష్టికి నాది
కారణుం డయి చాలఁ ♦ గ్రాలువాఁడు
దుష్టశిక్షణమును ♦ శిష్టరక్షణమును
నాత్మకృత్యములుగ ♦ నమరువాఁడు
సర్వజ్ఞుఁ డయి యుండి ♦ జను లెందుఁ గావించు
సుకృతదుష్కృతములఁ ♦ జూచువాఁడు
నిత్యుఁ డీశ్వరుఁ డభవుఁ ♦ డుండు నిర్మలుండు
నాదుపత్త్రికా రత్నంబు ♦ నాదరమునఁ
బ్రబలఁగాఁ జేసి యెల్లె ♦ డఁ బాసి కెక్క
నించుకంతదయ నను గ్ర ♦ హించుఁ గాత!

సీ. ఎవ్వనియిచ్చ మై ♦ నెల్లజగమ్ములుఁ
గలుగుచు వెలయుచుఁ ♦ బొలియుచుండు
నెవ్వనికట్టడి ♦ నెప్పొద్దు విడువక
విన్నున జుక్కలు ♦ వ్రేలుచుండు
నెవ్వనిగానముల ♦ నెంతవలంతులుఁ
గడముట్టఁ దెలియంగఁ ♦ గానకుంద్రు
రెవ్వనియానతి ♦ నించు కైనను మీరఁ
మీఁటక సంద్రముల్ ♦ మించి నిలుచు
నెవ్వఁ డాకసంబున నేల ♦ నెల్లనీళ్ళ
నెలఁగుపులుఁగుల మొగముల ♦ మీలగముల

దగినవిహారంబుఁ గలిగించి ♦ నెగడఁ జేయు
నట్టిదేవర మమ్ముఁ జే ♦ పట్టుఁగాత!

సీ. తనకృపారసవృష్టి ♦ దాసులతాపంబు
లణఁగించి నెగడించు ♦ ఘనుఁ డెవండు?
తనదివ్యతేజంబు ♦ నను భక్తజనతమో
నిచయంబు మాయించు ♦ నినుఁ డెవండు
తనశీతలాలోక ♦ మునఁ గువలయమును
వెలయించుచల్లని ♦ వేలు పెవఁడు?
తనజగద్వ్యాపక ♦ త్వంబుమై లోకాళిఁ
బాలించు నలజగ ♦ త్ప్రాణుఁ డెవఁడు?
అట్టిపరమేశ్వరుండు ద ♦ యాసముద్రుఁ
డాదరాయత్తచిత్తుఁడై ♦ హర్షమెసఁగ
మాదువిన్నప మాలించి ♦ మఱచిపోక
మమ్ము ననిశమ్మును భృశమ్ము ♦ మనుచుఁగాత!

అనుపద్యములను జదివి చూచినచో, వీరి కాకాలమునుండియుఁ గలిగిన నిర్మలపరిశుద్ధాస్తికమతోద్దేశములు, సుకరంబుగ వెల్లడిగాక మానవు. వీరుధవళేశ్వరంబున నుపాధ్యాయులుగ నున్న యా 1875వ సంవత్సరంబున సెలవుదినములు వచ్చివీలుపడినప్పు డెల్ల నీరాజమహేంద్రవరంబున నున్నసమాజమునకు వచ్చుచు మంచిమంచివిషయములను గూర్చి యుపన్యసించుచువచ్చిరి. అట్లుపన్యసించుచువచ్చినయుపన్యాసము లనేకములు గలవు.

ఈకాలమునందు „స్త్రీవిద్య”ను గూర్చి విశేషముగా నుపన్యసించుచు, ననేకపత్రికలకుఁ బద్యములతో నుపన్యాసములను వ్రాసి పంపుచువచ్చిరి. అట్లు వ్రాయఁబడినలేఖలలో బృందావనపుర మనిపిలువఁబడెడిబందరుపట్టణమునం దాకాలంబునఁ బ్రకటింపఁబడుచుండిన „పురుషార్థప్రదాయిని” యనుపత్రికలో నున్నయీక్రింది „స్త్రీవిద్య” యనులేఖ సామర్థ్యమును వెల్లడించుచు హృదయానందకరంబుగ నుండక మానదనుతలంపున నీక్రిందఁ బొందుపఱుచుచున్నాము.



గీ. పరమపురుషార్థదాయినీ ♦ పత్రికాధి
నాథులార! సువిద్యాన ♦ నాథులార!
సరగ మీపత్రికను నాదు ♦ జాబుకింత
తా వొసంగెదరే మిత్ర ♦ భావమునను.

* మత్తేభవిక్రీడితకందగర్భసీసము *

సీ. వినయ మొప్పారఁగ ♦ విన్నవించెద నిదే
న్యాయంబుగాఁ జూచి ♦ మీరెఱుఁ గడు
నదయులీలం దగ ♦ సారసాననలవి
ద్యాసంవివాదంబు ♦ లో సరళిగ
విజయ మెవ్వానికి ♦ వీక్షమైఁ గలిగెనో
సామాన్యధీమైను ♦ ధీమదేభ
నిచయముల్ మెచ్చఁగ ♦ నీతితో నుడువుఁడీ
జల్పాకులై సజ్జ ♦ నుల్పొసంగ
వెలఁదులకు విద్య గూడదు ♦ కలుగునఘము
దాన నిజముగా నవి యన ♦ దా రెలమిని
దలపడినను నార్యులు చెప్పు ♦ పలుకులనె వ
లయును గనఁబరుపన్ మాకు ♦ లక్ష్యములుగ.

* గర్భమత్తేభము *

మ. నయమొప్పారఁగ విన్నవించెద నిదే ♦ న్యాయంబుగాఁ జూచి మీ
దయలీలం దగ సారసాననలవి ♦ ద్యాసంవివాదంబులో
జయ మెవ్వారికి వీక్షమైఁ గలిగెనో ♦ సామాన్యధీమై నునే
చయముల్ మెచ్చఁగ నీతితో నుడువుఁడీ ♦ జల్పాకులై సజ్జనుల్.

* గర్భకందము *

క. వెలఁదులకు విద్య గూడదు
కలుగు నఘము దాన నిజము ♦ గా నని యనఁ దా
రెలమిని దలపడినను నా
ర్యులు చెప్పుపలుకులనె వల ♦ యును గనఁ బలుకన్.

క. మొదటనె పూర్వులు చెప్పిన
యది యన్నుగర్వంబు మానుఁ ♦ డని నే ననలే
దది వారే కల్పించిన
యుద్ధి యని నే నన్నయట్టు ♦ లనెవరు కంటే?

గీ. వీరియర్థంబు చేసెడి ♦ వెరవునకును
జాల మెచ్చంగఁ జనుఁ గాని ♦ యేల వీరు
నాదుపద్యంబులో నుండు ♦ నట్టిదానిఁ
"బదరి" యనుమాట నడఁచిరో ♦ పలుకవలయు.

గీ. పద్యముల నెందునే నొక్క ♦ పదము నణఁచి
యర్థ మొనరింపఁబూనిన ♦ నందుఁ గలుగు
నర్థ మెల్లను జెడిపోయి ♦ యంతతోడ
నాఁగక యెచట లేనియ ♦ పార్థ మొదవు.

ఆ. ఈమహాత్ముభావుఁ ♦ డెఱుఁగనివాఁకి
"బొంకవద్దన్న నఘము ♦ పొంద దధిప"
యనుచు నింతయర్థ ♦ మును జెప్పఁ గాఁబోలుఁ
బూర్వపదచయంబుఁ ♦ బోవనడచి.

క. పోలఁగ నావెనుకటిప
ద్యాలివలన నంతకుఘును ♦ పటు వ్రాసినయా
"వాలాయ" పదమునర్థము
నేలీల నెఱింగినారొ ♦ యీనవరసికుల్



క. ఈవాదములో నెందును
నావంతయు వాక్యసంచ ♦ యార్థవిమర్శల్
కావలె నన్నం గలిగెనె?
కేవలయుక్తిప్రయుక్తి ♦ కృత్యము దక్కన్.

గీ. "ఎంచఁగ నహల్యతారయుఁ ♦ బంచకన్య
లందు నిర్వురు" కారఁట! ♦ యల్లదాని
కర్థమును జేఁ "గటాక్షింప" నగువటు! సరి
యేఁ గటాక్షింపఁగా నేల ♦ యిపుడు మరల.

గీ. తొంటియష్టావధానులె ♦ తొల్లి "యుం క
హల్యతారలు పంచక ♦ న్యల నిరువు ర
టనుచు వినలేదె" యనినారి ♦ లర్థమే మొ
యచట వారె కటాక్షింతు ♦ రడుగరాదె?

సీ. ఏనె నామాటల ♦ కెఱుఁగనంటర్థంబు
తన్నుఁ దా నెఱిఁగినఁ ♦ దలఁచఁ డిల్లి
రామకృష్ణాచార్య ♦ రచితపద్యాళిని
దాను వ్రాసినయట్టి ♦ వ నిఁగాఁగ
నెంచునే తా నొక ♦ లెఱిఁగనే నిందుకు
దృష్టాంతముగఁజూడుఁ ♦ డెల్లవారు
నీయన "నేనె క ♦ ల్పించుచుఁ జనుఁదేర్ప
డఁ బలికితి నఁట" యం ♦ చుఁ బొనఁగంగ
"నేను వ్రాసినశ్లోకంబు ♦ లోన విద్య
యనెడుమాటయు వెదుకఁగాఁ ♦ గను నటంచుఁ
జాలఁ బల్కిరి వెదుకఁగా ♦ నేల దాన
నడఁగియున్నది చూపెన" ♦ నని రో లేదొ

పిత్రాతుంస్వీకరణంచ స్త్రీణాం
సరస్వతీప్రార్థనపూర్వ మాదౌ.

కందము గోమూత్రికాబంధము.

క. పారంగ వీరంగఁ గాని నను
వారలు మఱికఁ గూయఁదగదు ♦ పాదము పోలన్
గోరిన వీకఁ గను నిలను
గారవ మగుఁ గూడ దనదు ♦ గాఁ దలపోయన్.

గీ. భవ్యపురుషార్థదాయినీపత్రికాధి
నాథులార! యుమారంగ ♦ నాయకాఖ్యు
లార! ప్రచురింత్రు పత్రిక ♦ యందు దీని
ననుచు వేఁడెమతోఁటికి ♦ తావధాని.

ఈప్రకారముగాఁ బద్యములను బత్రికలకు వ్రాయుచు, స్త్రీవిద్యయత్యంతావశ్యక మనుతమసదుద్దేశమును వెల్లడించుచు వచ్చిరి. లోకములోఁ బ్రతిపురుషునకుఁబ్రతిస్త్రీకిని జ్ఞాన మావశ్యక మయియున్నది. జ్ఞానముదుఃఖవినాశనమునకుం గారణము. విద్యాభివృద్ధి జ్ఞానాభివృద్ధికిం గారణ మగుచుండును. విద్యవలన వినయవివేకాదిసద్గుణములు కలుగునన్నవిషయ మందఱకుం దెలిసియున్న దేకదా? పూర్వకాలమునుండియు హిందూసుందరులు విద్యావంతురాండ్రయియుండి రనుట కనేకనిదర్శనములు గలవు. స్త్రీవిద్య శాస్త్ర నింద్యమైనదియుం గాదు. మనకు శ్రుతి, స్మృతి, శిష్టాచారములును, ముఖ్యప్రమాణములు. అందు, శ్రుతికి విరుద్ధముకానిస్మృతియు, శ్రుతిస్మృతులకువ్యతిరిక్తము కాని శిష్టాచారమును గ్రాహ్యములు. స్మృతులయం దెచ్చోటను స్త్రీవిద్య నిషేధింపఁబడి యుండలేదు. స్మృతులయం దైన స్త్రీలు వేదమంత్రములను బఠియింప నర్హురాండ్రు గారని కొన్నింటియందుమాత్ర



మః గానఁబడుచున్నది. ఈప్రకారంబుగఁ గారణోదాహరణసహితంబుబుగ నుండున ట్లనేకోపన్యాసములను బ్రకటించుచుండుటం గాంచి, స్త్రీవిద్య యనర్థదాయకం బని, నిశ్చయించి, బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నముపంతులుగారు స్త్రీవిద్యాభిమానులు చేయునుపన్యాసములను ఖండించుటకుం గంకణము గట్టుకొని, తమయాంధ్రభాషాసంజీవనీపత్రికయందు స్త్రీవిద్య కూడదని విశేషముగా వ్రాసియున్నారు.

పురుషార్థప్రదాయినీపత్రికయందు వీరేశలింగముపంతులుగారు మిగులగంభీరధోరణిని వ్రాయుచువచ్చినపద్యరూపకోపన్యాసాదులకుఁ బ్రతిగ వేంకటరత్నముపంతులుగారును జేఁతనయినకొలందిని స్త్రీవిద్య దేశములో రూపుమాపఁ బ్రయత్నించినను, ధర్మమార్గమును మఱలించుట దుర్లభం బగుటం జేసి, యెట్టకేలకుం జేయునది లేక,

"బ్రహ్మశ్రీ, మహారాజశ్రీ, కందుకూరి వీరేశలింగముగారి సముఖమ్మునకు.

తమవిధేయాప్తుఁడు కొ. వేంకటరత్నము నమస్కరించి కావించువిజ్ఞప్తి.

సుహృదులగుసహృదయులారా!

తాము లిఖించి పంచినకమ్మం గాంచి కరంబు హర్షించితిని. ఎవ్వారే నాశ్రయించినవారి నాదరించుట ప్రాజ్ఞులకు స్వాభావికం బెగదా? కాఁబట్టి తాము పురుషార్థప్రదాయినీపత్రికిఁ దోడ్పా టొనర్చినది స్పష్టమే! ఇఁకఁ దమరు కులలలనాపఠనసిద్ధాంతమునకుం బూనుకొని వాదింపవలసినయావశ్యకము గలవారు గారని తలంచెదను. స్వస్థానవేషభాషా

మతాభిమానాపనీయత యే ప్రాజ్ఞులకు లక్షణము గద. ఇదివఱకు క్రొత్తపక్ష పక్షవిచక్షణులచే కృతకృత్యుల రైతిరి. ఇంకస్వాభావికభవ్యలక్షణ సంరక్షకత్వం బ్రస్తుతి కెక్కుట మిక్కిలి మంచిపని యని యెంచెదను. అందునకు సంజీవని సిద్ధముగానుండెనని తలంపుఁడు. ప్రభుత్వాంతర ప్రవృత్తివలన మొత్తిగిలిన ప్రాచీనసదాచారము లన్నియు నొక్కటొక్కటియు నిర్నామము లగుచున్నవి. ఈసమయంబున మనము యథాశక్తి న్యాయిం గాపాడుకొనవలసినవార మయి యున్నారము. కాని మనకును అన్యులవలె మన ప్రాచీనసదాచారముల నుపేక్షించుట యుక్తము గాదని కనుపట్టెను. మనము మనపూర్వికులకంటె జాగరూకులమును దూరదర్శులము నై యుండవలసినవారము. ఎందువల్లననఁగా వారికాలమునందు రక్షకు లుండిరి. ఇప్పు డప్పగిది లేరు. కాన మనము పూర్వాచారవాదకుల మనుదూరు గాంచఁ దూడదు. మనకేల యాపీడ? హిందువులు ప్రాచీనాచారమునే యనుష్ఠించుమూఢులన్ననిందావాక్యమునకైన నొప్పుకొనవచ్చుఁ గాని, వీరు ప్రాజ్ఞులై ప్రాచీనాచారమును వెళిచి నాగరికతఁ గాంచి రనునుతివాక్యముఁ బడయుట మెచ్చుకొనఁదగినది గాదని నాయభిప్రాయము. ఎందువల్లననఁగా మొదటినింద మహాజనులకు సంబంధించినది. రెండవప్రశంసయో కతిపయస్వేచ్ఛాచరణపరాయణులకు సంబంధించినది. ఈరెండవదానివలనం జెలువుగలిగెనా తప్పక స్వయంకృతాపరాధంబునకై వ్యథ సిద్ధంబుగ సిద్ధించుఁ గాన నిట్టి పెద్దఱికంబుఁ బూనుట నా కిష్టంబు గాదయ్యెడు. నాడంబరమాత్ర లగుటం దమకింతగ నిశ్శంకంబుగ విన్నవించితిని. మన్నింపుఁడు. తనుసీతిచంద్రికి నుద్రింపించుచున్నారుగద. * * * ఇంక నెన్నిదినములలో ముగియును? దానింజూడ వేడుక కడుంగ మఁగలిగెడు. కారణ మెట్టులుగ వైత్రిమే యుండనోపు. * * *



సూర్యాస్తమయంబునం జేసి నేను విన్నవించినయావిజ్ఞాపనపత్రము లోన, వ్యతిక్రమము లేవేనిఁ గానంబడిన, మన్నించిసదా పత్రముఖంబున యోగక్షేమంబులను దెలిపి తెలిసికొనుచుండ నేఁడుచున్నాఁడను.

చిత్తగింపవలయు.

| | |
|---|---|
| చెన్నపురి. | (ఇట్లు విన్నవించి నమస్కరించు |
| భావనామసం॥ అధికాషాఢ | భవిష్యద్భేయాపు (ఢు—) |
| శు ౫ గురువారము. | కొ. వేంకటరత్నము." |

అని యీప్రకారముగా మిత్రభావంబునం జేసినవినయహితబోధనంతను సంపూర్ణముగా వ్యతిక్రమంబుగ భావించియే వీరేశలింగము పంతులుగారు తరువాత నేమేమి వ్రాసియున్నారో కాని, వేంకటరత్నముపంతులుగారు గినుక వహించి వచింపవలయుననునుద్దేశముతోఁ బ్రకటింప నారంభించిన "హాస్యవర్ధని" యొక్క మొదటిసంపుటమునకు 1875వ సంవత్సరము అక్టోబరునెలయందు,

"సమాచారములు (నిజమో అబద్ధమో)

ధవళేశ్వరమునందు నున్న బొండలపాటి శేషయ్యశాస్త్రులవారు వివేకవర్ధనిలోఁ బ్రకటించిన జాబుపై చంద్రనగరమందుండెడు కూటాలగ్గరుడయ్యశాస్త్రులవారు ఖండన వ్రాయ చేతపట్టుకొన్నారట.—తేఁజని. స్త్రీవిద్యాభిమానులు నిజప్రయత్నము స్థాపింప గుద్దలి యెత్తుకొంటె పురుషవిద్యాభిమానులు గడ్డపార లెత్తుకొందు రఁట! గుణాగుణవిమర్శనీసమాజములో శతావధాను లెందఱు చేరుదురో కృతివిమర్శనీసమాజములో నందఱు సహస్రావధానులు చేరుదురఁట. కృతివిమర్శనీసామాజికులల్లో నెవ్వరేని పరలోకగతు లైన గుణాగుణవిమర్శనీసామాజికులు వారిమార్గమునే అనుసరింతు రఁట! విధవావివాహములు చేయ న్యూహారం బందఱ్లు చేయ బోము చాలలేదట! ఫలె? శ్మశానములు లేదా? కారడవులు లేవా? పాఠశాలలలో చదివి బహుకుమారులం హోం

భగ్రప్రసిద్ధురాండ్లయి యాడేరియత్తవారింటికిం బోయినయాడుబడుచులు పలకయెత్తినచేతితో చేటను, కలమెత్తికొన్నచేతితో చీపురుకట్టను, శిరాబుడ్డి యెత్తుకొన్నచేతితో పేణ్ణీళ్లకుండను, కాగిద మెత్తుకొన్నచేతితో అలుకుగుడ్డను, లెక్కలువేసినచేతితో ముగ్గులను, నూదులబట్టినచేతితో అటుకలను, తప్పులు దిద్దినచేతితో అంట్లుఅటికెలను, పట్టుకొనలేకయు, పొత్తముల నెత్తికొన నవకాశము లేకయు, తమకొజ్జలనేని గన్నెత్తి చూడజాలకయు, గలవాకిలి చేరిసేరకయు, బోనులలోతగులుకొన్నపులులవలె, నిట్టూర్పులు విడుచుచున్నారట. అట్టిచదివినపడుచులం బెట్టుకొని కాపురము చేయజాలక అత్తమామలు మొత్తుకొనుచున్నారట. చదివినలోలలోచనలు గొందఱుబాలికలకు చదువు చెప్పికొనినయెన గౌరవముగా స్వేచ్ఛగా మనవచ్చునని యెంచి తెగించి బంధుగులం ద్యజించి యెందేని బోవగోరుచున్నారట. బాలికాపాఠశాలోపాధ్యాయులు తమజీవనహానికై మిక్కిలి పొక్కుచున్నారట. విదుషులైనమదవతు లెక్కడ విడిలించుకొని వదలించుకొని యిచ్చకు వచ్చినట్లు లేచిపోదురో యని మగలు తమమగువలయడుగులకు మడుగులొత్తుచుచున్నారట.,, అని ప్రకటించుకొనియున్నారు.

ఇంచుమించుగా ముప్పదియారుసంవత్సరములకు బూర్వమున వ్రాసినపైవాక్యముల నిప్పుడు వేంకటరత్నముపంతులుగారు చదువుకొని యాలోచించి యేమిచెప్పెదరో కదా! వేంకటరత్నముపంతులుగారాకాలమునందు స్త్రీవిద్య నింద్యమనియెంతవ్రాసి ప్రకటించినను గాలముయొక్కసంస్కారప్రభావముచే దేశమునం దెల్లయెడలను బాలికాపాఠశాల లసంఖ్యాకములుగా స్థాపింపబడియున్నవి, స్త్రీలకువిద్య కాదనుట గూడ దని వాదోపవాదములు జరుగ నారంభించినయేడెనిమిది సంవత్సరములలోనే మనచెన్నపురిరాజధానిలోజేరినదేశములయం దెల్లను 552 బాలికాపాఠశాల లుండినవి. వానిలో 35048 గురుబాలి



కలు చదువుచుండిరి. బొంబయిరాజధానిక్రిందిదేశములలో 348 బాలికాపాఠశాలలుమాత్రమే యుండినవి. వానిలో 26266 గురుబాలికలు చదువుచుండిరి. బంగాళమునందు 1015 బాలికాపాఠశాలలుండి వానిలో 41349గురు బాలికలు చదువుచుండిరి. ఈప్రకారముగానే పంజాబు మొదలయినదేశములయందుగూడ ననేకబాలికాపాఠశాలలుండి బాలికలెందఱో చదువుచుండిరి. మొత్తముమీద నప్పటికే మనహిందూదేశమునం దున్నబాలికాపాఠశాల లన్నియు 3687; వానిలో జదువుకొనుబాలిక లందఱును 127066గురు. కాన గడచినయిరువదియేడుసంవత్సరములలో నిప్పటికి మనహిందూదేశమునందు గలబాలికా పాఠశాలలయొక్కయు, విద్యాభ్యాసమును గావించుచున్న బాలికలయొక్కయు సంఖ్య యెంతయు విశేషముగా నుండకమానదనునది సర్వజనవిదితమైనదియే కదా! కాని బాలికాపాఠశాలలయందు బురుషు లుపాధ్యాయులుగా నున్నంతకాలమును బాలికలకు గలుగవలసిన నిజమయినలాభము గలుగనేరదనియె మున్నాటికిని జెప్పవలసి యున్నది. ఈయుద్దేశమునే, వీరేశలింగముపంతులుగారు 1888వ సంవత్సరమునం బ్రకటింపబడిన వివేకవర్ధనియందు బ్రచురించిన ,,బాలికాపాఠశాలల కుపాధ్యాయినులు.,, అనుదానిలోనున్న ,,హూణప్రభుత్వము మనదేశమునందు బలపడి ముఖ్యపట్టణములలో నెల్ల బాలికాపాఠశాలలను స్థాపించిస్త్రీలగతిని బాగుచేయుచువచ్చినతరువాత ఇప్పుడిప్పుడు జనులు స్త్రీవిద్యాభ్యాసమువలని లాభములను తెలిసికొని నిరభ్యంతరముగా తమబాలికలను పాఠశాలలకు బంపనారంభించుచున్నారు. కాని యాబాలికలకు విద్యవలన గలుగవలసినలాభ మంతయు గలుగుచుండలే దని యొప్పుకోవలసినవార మయినందు కెంతయు జింతిల్లుచున్నాము. బాలికాపాఠశాలలకు స్త్రీలనే యుపాధ్యాయినులనుగా నియమించి వారిచేత పనిచేయించనంతవఱకును స్త్రీలకువిద్యవలన గలుగవలసిన

[illegible] అనుదానిని వ్రాసి చక్కఁగా చెల్లించియున్నారు.

1884 వ సంవత్సరమునకే మనయాంధ్రదేశములో స్త్రీవిద్య దినదినాభివృద్ధిఁ గాంచుచుండుట చూచి, సఫలీకృతమనోరథుల మగుచున్నాముగదా యని సంతసించుచు నాసంవత్సరమున "స్త్రీవిద్యాభ్యాసము" అనుశీర్షకక్రింద వ్రాసిన "స్త్రీలకుప్రత్యేకముగా నుపయోగించు పుస్తకములు లేకపోవుటకూడ కొంతవఱకు వారివిద్యాభివృద్ధికిఁ బ్రతిబంధకముగానున్నది. ఈకొఱఁతను తొలఁగించుటకయి తగినపుస్తకములను వ్రాయించవలయునని పూర్వోదాహృతసభవారు చెప్పియున్నారు. అటువంటిపుస్తకములను రచియింపఁబూనినవారికి దొరతనమువారు బహుమానముల నిచ్చుటయేకాక యాపుస్తకములను కొన్ని పరీక్షలకు పఠనీయగ్రంథములుగా నేర్పఱిచి ప్రతిబాలికాపాఠశాలలోను చదువునట్లు చేసినయెడల సమర్థులయినగ్రంథకర్తలకు ప్రోత్సాహము కలిగి శీఘ్రకాలములోనే పెక్కుపుస్తకములుత్పన్న మగుననుటకు సందేహము లేదు." అని వ్రాసినప్రకారముగా విద్యాశాఖవారు ప్రోత్సాహము నొసంగనారంభించుటచేతను, స్త్రీవిద్య శాస్త్రదూష్యముగాదనియును, అనర్థదాయకము గాదనియును దేశములోఁ జాలభాగము గ్రహింపనారంభించుటచేతను, స్త్రీలయుపయోగముకొఱకును, బాలికాపాఠశాలల యుపయోగార్థమయియును మృదుమధురసులభశైలిని ఇంగ్లీషుభాషనుండి కథలను వ్రాసియును, స్వతంత్రముగాఁ గొన్ని వచనప్రబంధములను రచియించియును స్త్రీవిద్యాభివృద్ధివిషయమున విశేషముగా పాటుపడియున్నారు. వీరు స్త్రీలయుపయోగార్థముగా రచియించినపుస్తకములలో "సత్యవతీచరిత్రము" "చంద్రమతీచరిత్రము" [illegible] [illegible] [illegible] "దేహారోగ్య



ధర్మబోధిని" యనునవి సర్వోత్కృష్టము లయినవిగా నున్నవి. తరువాత 5—6 సంపుటములుగాఁ బ్రకటింపఁబడిన వచనప్రబంధములును, కథలును, నీతికథామంజరియు నక్షరజ్ఞానముగలస్త్రీ లందఱును జదువఁదగినవిగా నుండి, ప్రతిబాలికాపాఠశాలయందు నుండఁదగినవిగా నున్నవని నిస్సందేహముగాఁ జెప్పఁగలను. ఆఱవసంపుటములోనున్న "స్త్రీనీతిదీపిక" లోనున్న "విద్య" యను శీర్షకక్రింద వ్రాయఁబడిన,

"గీ. విద్యవలనను జ్ఞానంబు ♦ వెలయుఁ గాన,
నవని 'నిదిమంచి' "యిదిచెడ్డ" ♦ యనుచుఁ దెలియ
బాలురును బోలెఁ దప్పక ♦ బాలికలును
విద్య నేర్వంగవలయును ♦ హృద్యముగను.

గీ. విద్య నేర్చినఁ, దొలుతను ♦ వినయ మబ్బు,
వినయమున సర్వసుగుణము ♦ లెల్లయు మిగుల,
వానిచేతను బతిభక్తి ♦ పాదుకొనును,
కావునను సుందరులు విద్య ♦ గఱవవలయు.

ఆ. వె. చదువు నేర్చికేని, ♦ సావిత్రిమొదలైన
పుణ్యసతులచరిత ♦ ములను జదివి,
వారియట్లతాము ♦ వర్తింపఁ జూతురు,
తెలివి విస్తరిల్లి ♦ తేఁగబోండ్లు.

గీ. చక్కఁదనమునకును దోడు ♦ చదువుకూడఁ
గలిగియుండిన, నందమా ♦ నలరునకును
దావి గలిగినపదువునఁ ♦ దనరు చంద్రు
పూవుబోండ్లు, విద్యాగంధ ♦ మునను గరము.

గీ. చదువులేమిని మూర్ఖత ♦ ముదిరియున్న
సుదతిని భార్యగాఁ గొని ♦ మనుటకన్న

నూఱు విడనాడి వనవాస ♦ మొనరుచుటయొ
వసుధలో వేసి యని ఱోచు ♦ గసికువకును.

ఆ. వె. ఇంతి చదివెనేని, ♦ యింటివెచ్చంబులు
బయల నడుక వేయు వస్త్రములును
ఖస్తు వ్రాయు చుండు ♦ భర్తకు వేఱుగ
శ్రమము గలుగ కుండ ♦ జలజగంధి.,,

అనుపద్యములవలన స్త్రీవిద్యవలనియావశ్యక మెంతచక్కఁగాఁ దేటతెలుఁగుమాటలలో వెల్లడింపఁబడినదియును బోధపడక మానదు.

ఈ 1875 వ సంవత్సరమునందొక్క "స్త్రీవిద్య,, ను గూర్చి మాత్రమే కాక, మనయాంధ్రదేశము నాశ్రయించుకొని యెన్నటికిని విడువక పీడించుచున్న దురాచారభూతములను సాధ్యమయినంతవఱకుఁ బారఁదోలవలయు నని యనేకోపన్యాసములను బూర్వకవికృతము లయినశ్లోకములను బద్యముల నుదాహరించుచుఁ బ్రకటించుచువచ్చిరి. ఆకాలంబున జారిణీసంభోగమే సత్కృత్యమని కొనియాడఁబడుచుండెను. కట్టుకొన్నయాలిని దుఃఖపెట్టి పరాంగనలం గవియువారుగణ్యులుగా నెన్నఁబడుచుండిరి. మఱి లంజెలు లేనివారు పెద్దమనుష్యులే కారని గణింపఁబడుచుండిరి. మీఁదుమిక్కిలి యేకభార్యావ్రతస్థులు పురుషులే కారనియు, నపుంసకులనియుఁ బరిహసింపఁబడుచుండెడువారు. ఎల్లరచే గొప్పవారని గౌరవింపఁబడుచుండినధనికు లయిన యధికారస్థులే వేశ్యల యింటిబంటులయి, వారికివశవర్తులయి యాభోగముచానల నాశ్రయించి తిరిగినవారినే గారవించుచుండుటచేత, సాధనికులయనుగ్రహము నపేక్షించి, వారివలన బాగుపడఁదలఁచి యాశ్రయించి యున్నవారందఱును, ఆచెడుగుపడఁతుకల యడుగులకు మడుగు లొత్త వలసినవారుగా నుండిరి. అందుచే నానారసుందరులు గంపమగిలి, క్రిందును మీఁదును గానక, కాలిమీఁదఁ గాలువైచుకొని కూరుచుండి, అగ్రజన్ము



లును, పెద్దమనుష్యులును వచ్చినను లేవక, దండముం బెట్టక యుండిరి. ఇట్టిస్థితిగతులను జక్కఁగా నాలోచించి, దానికి వెనలునట్లుగ "వేశ్యలు,, అని,

శ్లో. ఏతాహసంతిచ రుదంతిచ విత్తహేతో
ర్విశ్వాసయంతి పురుషం నతువిశ్వసంతి
తస్మాన్నరేణ కులశీలసమన్వితేన
వేశ్యాశ్మశానసుమనా ఇవవర్జనీయాః

శ్లో. జాత్యంధాయచ దుర్ముఖాయచ జరా జీర్ణాఖిలాంగాయచ
గ్రామీణాయచ దుష్కులాయచగళత్కుష్ఠాభిభూతాయచ
యచ్ఛంతీషు మనోహరం నిజవపు ర్లక్ష్మీ లవశ్రద్ధయా
పణ్యస్త్రీషు వివేకకల్పలతికా శస్త్రీషు రజ్యేతకః

చ. విషువక పుట్టుగ్రుడ్డునకు ♦ వృద్ధశరీరికిఁ గుష్ఠరోగికి
న్నిజునకు జాతిహీనునకుఁ ♦ జారునిజాంగము లొక్కరూకకై
కమవడి నిచ్చువారి గుణ ♦ కల్పలతల్ విదళించుకత్తులం
బడుపుపడంతులం దనవు ♦ భావముఁ జేర్చునె యెవ్వఁడేనియున్.

శ్లో. కశ్చుమ్బతి కులపురుషో వేశ్యాధరపల్లవం మనోజ్ఞమపి
చార భట చోర చేటక విట నట నిష్ఠీవన శరావమ్.

క. జార భట చోర చేటక
చార నటప్రభృతి నీచ ♦ జననిష్ఠీవా
ధారశరావము వార
స్త్రీరమ్యాధరము సంస్పృ ♦ శింతురె కులజుల్?

చ. పడిగము తమ్మలం బుమియు ♦ పల్లవకోటికి నోరు, వేశ్య యా
గడిసవరంబు, సంతసార ♦ కాయము లుబోడము, లచ్చురచ్చపా
వడి యెద, యూరువుల్ ♦ గమిడివాతియనంట్లులు, మోవిజన్మిగి
జ్జిడి, వెలయాలిజీవనము ♦ జీవనమే తలపోసిచూడఁగన్?

శ్లో. వేశ్యాసౌమదనజ్వాలా రూపేంధనవివర్ధితా
కామిభిర్యత్ర హూయన్తే యౌవనాని ధనానిచ.

క. రూపేంధనవర్ధితవే
శ్యాపంచశరాగ్నికీల । లందంగజపూ
జాపరతంత్రులు వేల్తురు
దాపుగఁ దమజవ్వనములు । ధనములుఁ గడఁకన్.

సీ. కమ్మవాతెరపాన । కమ్మలు చవి చూపి
నిద్దంపుఁజెక్కులు । ముద్దొసంగి,
కులుకుసిబ్బెపుఁగబ్బి । గుబ్బ లంటఁగ నిచ్చి
దట్టంపుఁగౌఁగిలిం । దలఁ బెనంచి,
తమిరేఁచి నీవిబం । ధములు విప్పఁగ నిచ్చి
జఘనసంస్పర్శనో । త్సవ మొసఁగి,
బహువిధరతికళా । మహిమలఁ జొక్కించి
జిలిబిలిసొలపుఁబ । ల్కులఁ గరంచి,
మెల్లమెల్లనె చేతిసొ । మ్మెల్ల లాగి,
తెల్లవాఱినఁ దమదెస । వెల్లిబెల్లి,
తల్లులను డాసి, గణికామ । తల్లు లిండ్ల
వెళ్లఁగొట్టించి రత్తఱిఁ । బల్లవులను.

అనుశ్లోకములతోడను బద్యములతోడను మిగులగంభీరధోరణి నిట్లు వ్రాసి, వేశ్యలతోడిసాంగత్యముకంటె గర్హణీయమైనపని మానవంతునకు వేఱొక్కటిలేదని మనసున నాటుకొనునట్లు చేసి యున్నారు.

ఎంతయో మనసున కెక్కునటుల రచియింపఁబడుచు వచ్చిన తమ యుపన్యాసముల బలిమిచేతనే పంతులవారక్కడివారందఱు ద్వార ధనముచేతి సాహాయ్యమొకింతయులేకయే, స్వయముగ నొకబాలికాపాఠశాలను స్థాపింపఁజేయునట్టి సామర్థ్యముగలవారుగ నుండియుండి



రని చెప్పుటకు నేనెంతయు సంతసించుచున్నాఁడను. స్త్రీలకు విద్యయనిన తోడనే కోపము రగులుకొనివచ్చి నాల్కలు పెరుకుకొనం జేయునట్టి యాదినములయందే, స్త్రీలకు విద్య చెప్పించుటవలన ననేకలాభములు గలిగి, దేశమధికక్షేమదశకు రాఁగలదని యొదతిచేఁ దమ యుపన్యాసములవలన మెప్పించి, యొప్పించిన పంతులవారిసామర్థ్య మెంతయుఁ బ్రశంసనీయముగ నున్నదని చెప్పకుండువారెవ్వరు? భోగభామినులకు వసువుల నొసఁగెడిదురాచారమును గూర్చి యనేకోపన్యాసముల నిచ్చి యట్టిదురాచారమును మొట్టమొదట ధవళేశ్వరమునను మాన్పియున్నారు. పంతులవారాకాలమునందాశుకవిత్వమునందమితసామర్థ్యము గలవారనియందఱు చాలకాలమునుండి యెఱిఁగియున్నారుగాన, నప్పటి స్నేహితులాద యనేకసారులు సభలు చేయించిరి. అష్టావధానమునందును, వ్యస్తాక్షరియందును పంతులవారికిఁగల సామర్థ్యమును గాంచి, వారికిఁగల యధికసామర్థ్యముం గూర్చి బహుభంగుల స్తోత్రము చేయుచువచ్చిరి.

ఈ 1874 వ సంవత్సరమునందు నీరాజమహేంద్రవరమునందే యున్న బ్రహ్మశ్రీ వావిలాల వాసుదేవశాస్త్రులవారు,

గీ. రాజమాన్యులు మఱి రాజ । పూజితులును
నాంధ్రగీర్వాణ కవితావి । శారదుండు
సూరి వీరేశలింగము । గారికడను
లీల ధవళేశ్వరంబున । న్యాలుకోన.

అని పైవిలాసము వ్రాసి సెప్టెంబరునెల 20 వ తేదిని పంపిన పద్యరూపమునం దున్న యుత్తరమునందలి,

క. అష్టావధాన మేమో
తుష్టిని మీ రందుఁ జేయు । దు రటంచును నా

యిష్టసఖునిచే వింటిని
స్పష్టముగాఁ దెలియఁజేయ ♦ వలయుంజుండీ!

అనుపద్యమును జూచిన వారాయావిషయములు సులభముగా బోధపడక మానవు. ఆయుత్తరమునందలి,

గీ. ఆయ హైస్కూలుపండితి ♦ యుంబు చూచు
టైనపిమ్మట వేగమే ♦ యంపవలయు
నది మదీయంబు గాదని ♦ యపుడు మీకుఁ
జెప్పి యుంటిని గాన వే ♦ జెప్పనేల?

అనుపద్యమును గాంచినచో, వీరేశలింగము పంతులువారటు లుద్యోగమునం దుండియే యెట్టిగ్రంథములను సంపాదించుచు నెట్లు స్వయంకృషివలననే జ్ఞానాభివృద్ధిని జేసికొనుచువచ్చినదియు మనకు సులభముగా బోధపడకమానదుగదా! ఇట్టివారి బాల్యమునుగూర్చి చదువరులిదివఱకే కొంచె మెఱిఁగి యున్నారుగాన నింకనక్కడ నుపాధ్యాయులుగనున్న యాయొకటి రెండుసంవత్సరములలో వీరు కాలమునెట్లువినియోగించుచు వచ్చినదియు నింకఁ గొంత వివరించెదను.

పాఠశాలయందు విద్యార్థులకు నాటినుండియు నధికముగా దేశము బాగుపడెడిస్థితినిగూర్చియు, మనము చేయవలసిన ప్రయత్నములను గూర్చియుఁ, బురాణాదు లసంభవములుగఁ గల్పితకథ లనుసంశయమును గూర్చియు, స్త్రీవిద్య యత్యంతప్రయోజనకరంబనియు, స్త్రీపునర్వివాహములు దేశక్షేమాభివృద్ధికరంబు లనియు నశాస్త్రీయములు గావనియు, నిట్టియనేకాంశములం గూర్చి యుపన్యసించుచువచ్చిరి. సమాజములను స్థాపించి [illegible] జనుల నందఱ నవనాగరికదశకుఁ దెచ్చుటకు ప్రయత్నించుచువచ్చిరి. పాఠశాలకు సెలవులువచ్చెడి దినములలో, సహజముగఁ దమశిష్యులతోఁ మాటలాడుటకుంగాని, యితరులయిండ్లకుఁ బోవుటకుంగాని యాటపాటలయందుఁగాని యంత



గా నిష్టములేని వారయ్యును, దోఁచని సమయములు సుబుసుపోకకుం దమమిత్రులయిండ్లకుంజని, చదరంగము, పేక మొదలయిన యాటలయందుఁ దమకధికంబుగ సామర్థ్యంబుండి యుండుటం జేసి వారలతో నాడుచు వచ్చిరి. వారలతో నాడునప్పుడు దృష్టి నంతయు నాటలయందే యుంచుచువచ్చిరని చదువరులనుకొనవలదు. పంతులవారిమనసు కన్నులయందును కర్ణములయందును సమముగ వర్తించుచునేయుండెను. కన్నులాటపయి నుండుచున్నను, చెవుల నెప్పుడింటనుండెడి యాఁడువారల సంభాషణంబులమీద నెయుంచుచు, విద్యావిహీనురాండ్రగుటం జేసి మాధ్యదేవతలనం జనునాడువారలసంభాషణంబుల నెల్ల నాలించుచు మూఢాచారవ్యవహారంబుల నెల్లను జక్కఁగఁ జూచుచువచ్చిరి. ఇవియే యిటీవల పంతులవారు "రాజశేఖరచరిత్రము" "బ్రాహ్మవివాహము" నను వివేకచంద్రికలవంటి గ్రంథములు రచియించుటకు ముఖ్యకారణములని నేఁజెప్పఁగలను.

ఇప్పటికి రమారమి రెండు సంవత్సరములనుండి చెన్నపురంబున బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నముపంతులవారిచేఁ బ్రచురింపఁబడుచువచ్చిన శ్రీయాంధ్రభాషాసంజీవని యనుపత్రికకుఁ జందాదారులగుటం జేసి క్రమముగ వచ్చుచుండెడి యాపత్రికనుగూర్చియుఁ దత్పత్రికాధిపతులం గూర్చియు నెంతయు సంతోషంబునఁ దమమిత్రులతోఁ బ్రశంసించుచువచ్చిన నందలి యనివార్యమ్మయినకఠినశైలింగూర్చి నేఁటికిని దమకుంగల విముఖత్వమును వెల్లడించుచునే యున్నారు. పాఠశాలలం జదువుచుండెడిదినములయందువలెనే, పురుషార్థప్రదాయిని మొదలయిన పత్రికలకు స్త్రీవిద్య మొదలయినయనేకవర్తమానాంశములంగూర్చి 'కం. వీ.' యనియును 'దేశాభిమాని' యనియును సంతకములు చేయుచుఁ బద్యగద్యాత్మకముగ మేలగునుపన్యాసములను, మృదుమధురసులభశైలిని వ్రాసి పంపుచు, బలువురచేఁ బొగడ్తఁ బొందుచునుండిరి. స్త్రీవిద్యను [illegible] యాకాలమున, వేంకటరత్నము పంతులవారు

తను సంజీవనియందు సదా స్త్రీవిద్యావిషయఖండనోపన్యాసములం బ్రచురించుచునేయుండిరి. కావున, నిరువురు పంతులువారలును బత్రికలలో స్త్రీవిద్య కూడునని యొకరును, గూడదని యొకరును లెక్కలేని విలువగలిగిన యుపన్యాసములను బ్రచురించి యున్నారు. వీరేశలింగముగారి యుపన్యాసములకుం బ్రతిగ నుపన్యాసములను బ్రచురించుచు వేంకటరత్నముపంతులవారి పక్షమునందుండి కలములు నూరుచుండిన యాకాలపువారలు వీరేశలింగముగారిమొదల నిప్పుడెంతె వినయవిధేయతలు గలవారలుగ మారియున్నారు! అప్పుడు, తాము చేసిన నేరముల నెల్లను క్షమియింపవలయుననియు వీరేశలింగముగారి యుపన్యాసములెల్లను దమమానసంబుల నమితసంతోషభరితంబులుగ నొనర్చిన వనియు, నేటివఱకును వారు వారు వ్రాయుచుండెడు నుత్తరముల ననేకములను గాంచి, పంతులవారి సామర్థ్యమునుగూర్చి యెంతయు సంతసించి యున్నాడను. ఒకకాలమునం దనుసంజీవని కందఱివలెం జందాదారులుగం జేరి, తమతో హాహా రాహాహాలని బత్రికలం బోరాడి, మనసు కంతయు మహాగౌరవంబున నించివేసిన వీరేశలింగముపంతులువారి నిప్పుడా వేంకటరత్నము పంతులవారు సర్వోత్కృష్టంబుగం దాము రచియించి ప్రకటించిన „బిల్వేశ్వరీయము,, నందు స్తుతించియున్నారని వినినతోడనే మన కెంతయానందంబు గలుగుచున్నది! ♦ వీరేశలింగముగారి సామర్థ్యమును గూర్చి యెట్టి యాశ్చర్యంబు మనంబున నుదయించుచున్నది!! అహా! కాలముయొక్క సంస్కారచాతురీ ధురంధరత యేమని కొనియాడంగలము!

వీరేశలింగముగారు తాము చందాదారులుగనున్న యాంధ్రభాషాసంజీవని పత్రికంగూర్చి బహుభంగులం దమమిత్రులకు స్తోత్రవాక్యము[illegible] వెల్లడించుచు, నప్పత్రికకు వారలు గూడ సహాయులుగ నుండవలయునని పలుమఱుం జెప్పుచువచ్చినను, [illegible]సామాన్యమున కంతగా సులభముగ బోధపడని యంతటి కఠినశైలి



నిగూర్చి తమకుం గలవిముఖభావమును వెల్లడించుచు, నిజముగ నేతత్పత్రికాధిపతులు దమయాంధ్రభాషాసంజీవని నన్వర్థంబుగం జేయదలంచిన చోం, దాము రసవంతము లగు ప్రబంధములనుగాని, మిగుల మృదుమధురధోరణిని వచనప్రబంధములనుగాని రచియింపవలయుననియుం దెలియంజేయుచు, జనసామాన్యమునకు సులభముగా బోధపడవలసినయంశములనుగూడ కావ్యశైలిని వ్రాయనారంభించునంతకాలము నాంధ్రభాషాసంజీవనినాంధ్రభాషాసంజీవనియని చెప్పుట కింతయు వీలుపడ దనియును దెలిపి,

సీ. భాషాభివృద్ధియే ♦ పత్రికఫల మని
చెన్నపురంబున ♦ నున్న తెలుఁగు
పత్రికాలేఖకుల్ ♦ ప్రకటించి వచనకా
వ్యములట్లు ప్రతిక ♦ వ్రాయు మనిరి
నాదుమతంబది ♦ కాదు భాషాజ్ఞాన
మలవర్చుకొంటకుం ♦ గలవు పెక్కు
పద్యకావ్యంబులు ♦ గద్యకావ్యంబులు
పత్రికల్ గ్రాంథిక ♦ పంక్తినున్నఁ
బండితులు గానివారికిఁ ♦ బనికిరావు
పత్రికోద్దేశమే కాఱు ♦ పనుపు దానఁ
గాన నెప్పుడు సర్వజనోప ♦ కార మొదవఁ
బామరులకును దెలియంగ ♦ వ్రాయవలయు.

అను తన యభిప్రాయమును బ్రారంభపుం బత్రికలయందే యుదాహరించి, శైలియందు భేద మొకింతయు నుండకయుండునట్లు „వివేకవర్ధని,, మొదలైన పత్రికలం బ్రకటించుచు వచ్చిరి. పత్రికలయందలి శైలి సులభముగ నుండవలయునని తమమిత్రులకు మాత్రమే తెలియంజేయుటయేకాక యొకటిరెండుసారులు తత్పత్రికాధిపతిగారికి

సహితము తమయభిప్రాయమును వెల్లడించుచు నుత్తరములను స్నేహపూర్వకముగా వ్రాయుచుండిరి. ఆయన నయ్యది యట్లు ప్రచురింపఁబడుచుండుటం గాంచియుఁ, జిరకాలమునుండి యనేకపత్రికల కుపన్యాసాదులను వ్రాయుట కత్యంత మలవాటుపడియుండుటం జేసియు, నేదియేని యొకపత్రికను బ్రచురింపఁ బ్రయత్నింపవలయునని తమమిత్రులతోఁ గొందఱితో నాలోచించి, యప్పటికిఁ దమపాఠశాలయందే సహోపాధ్యాయులుగ నున్నవారలయొక్కయుఁ, దమయం దధికానురాగము గలవిద్యార్థులయొక్కయుఁ దదితరులు స్నేహితులయొక్కయుఁ బ్రోత్సాహమున నెట్టకేల కొక్కపత్రికను బ్రచురింపనిశ్చయించుకొనిరి. చిరకాలమునుండి, మనదేశములో జనసామాన్యముయొక్క సుఖాభివృద్ధికి భంగకరములుగనున్న లెక్కలేనిదురాచారములను సాధ్యమయినంతవఱకుఁ దొలఁగింపఁబ్రయత్నింపవలయునన్న బుద్ధి యీశ్వరానుగ్రహంబువలనఁ జిరకాలంబు క్రిందటనె మనసున నంకురించియుండుటం జేసియుఁ, బ్రాయమధికమయినకొలఁదిని వీరిమనసున నుద్భవించినసంస్కారప్రసూనంబు చక్కగా వికసింప నారంభించుటం జేసియు నాయభిలాష బలపడుచుండుటం జేసియుఁ దమపత్రికకు "వివేకవర్ధని" యను పేరుపెట్టి, 1874 వ సంవత్సరము డిశంబరునెలలో మొట్టమొదటి పత్రికను వ్రాసి, యంతకుఁ గొంతకాలమునుండి, వేంకటరత్నము పంతులవారికిని దమకు నుత్తరప్రత్యుత్తరములమూలంబునఁ గొంత పరిచయముండుటం జేసి, యాపంతులవారు "వివేకవర్ధని" పత్రికను దమసంజీవనీముద్రాక్షరశాలయందు యుక్తకాలమునకు వెలువడునట్లు ముద్రింపించి, ప్రచురింపఁబడ నిటకుఁ బత్రికలను బంపుచుండెదమని వాగ్దానముఁ జేయుటం జేసి, వీరేశలింగముగారు తమపత్రికల నటకుఁ బంపి యయ్యవి ముద్రింపఁబడి తిరిగివచ్చినమీఁదట నాపత్రికలను సమచందాదారులకుఁ గ్రమ



ముగ నందఁ జేయుచువచ్చిరి. వీరుతమపత్రికకుఁ దిక్కనసోమయాజివిరచిత మగుభారతభాగమునందలి,

క. ఒరు లేయవి యొనరించిన
నరవర! యప్రియము దనమనంబున కగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మపథముల కెల్లన్.

అనుపద్యమును బత్రికాముఖమునఁ బ్రచురించి, "కొందఱితోడఁ దేటమాటలతోను, మఱికొందఱితోడం బ్రౌఢోక్తులతోడను, గొందఱితో వినోదంబులతోడను, గొందఱితో శాస్త్రప్రసంగములతోడను, గొందఱితో భగవద్విషయంబులతోడను, గొందఱితోఁ గవిత్వగోష్ఠితోడను బ్రొద్దుపుచ్చుచు నెల్లరయుల్లంబులరంజిల్లఁ జేయుచుండు." నను ప్రతిజ్ఞను జేసికొని, యట్లే పత్రికలను బ్రచురించుచుండుట మనమందఱమును గన్నులారఁ జూచియే యున్నారము.

సోమయాజివిరచిత మగుభారతభాగమునందలి పద్యసహస్రంబులలో నాకందపద్య మెన్నిసారులు శ్రీవివేకవర్ధనీ పత్రికాముఖంబునఁ బ్రచురింపఁబడి యెందఱెందఱిచే నెన్నిసారులు చదువఁబడి యెట్టినీతిబోధను జదువరులకుఁ జేసియున్నదియు నాంధ్రదేశమునఁ బలువు రెఱింగియే యున్నారు. శ్రీవివేకవర్ధనియొక్క ప్రారంభపుఁబత్రికలయందు వీరలు తమ్ముంగూర్చి,

సీ. బ్రాహ్మణుండను హూణ భాష నేరిచియుందు
నేఁ బ్రవేశపరీక్ష నిచ్చినాఁడ
నాంధ్రమున నొకింత యభిరుచి గలవాఁడ
దేశాభివృద్ధికై లేశమైనఁ

బ్రాలుమాలక పాటు ♦ పడ నిచ్ఛగలవాఁడఁ
గవితాపటిమ కొంత ♦ గలుగువాఁడ
నోపిక సర్వజ ♦ నోపయోగములైన
విషయమ్ములును నీతి ♦ విషయములును
సులభశైలి నందఱకును ♦ దెలియునట్లు
కఠినసంధులు లోనుగాఁ ♦ గలవి విడిచి
వ్రాయుదు నొకప్పు డన్యదే ♦ శీయములును
లోనుగాఁగల వానినిఁ ♦ బూని కూర్తు.

అని తమ చదువరుల కెఱిఁగించిన మార్గ మెంతయు సంతోషజనకముగ నున్నయది. ఆరంభంబునం దుద్దేశములను బ్రచురించినట్లే కార్యములను సహితము క్రమంబుగ నిర్వహించియున్నదియును మనమందఱమును జూచియున్నారముగదా!

అట్లొకటి రెండు పత్రికలు వెలువడిన పిమ్మటఁ, దమకుం జేతన యిన కొలఁదిని ధనసహాయ మొసంగెదమని బీరంబులు వలికినవారం దఱుఁ, దాము తల్లిదండ్రుల చాటుబిడ్డలమనియు, నెలకు నచ్చెడి యా పది పదునైదు రూపాయలను వారల చేతులలోఁ బడవేసినంగాని తమకు బ్రదుకు తెఱువు గానరాకున్నదనియు నిట్టి వెన్నియో చెప్పి, సాధకబాధకంబులనెల్లఁ జక్కఁగ యోచింపక, సహాయ మొసంగెద మని వాగ్దానములు చేసినందులకుఁ దమ్ము మిత్రవాత్సల్యమున క్షమింపవేఁడెద మనియుం జల్లచల్లగఁ జెప్పి యొక్కరొక్కరే క్రమక్రమముగాఁ దాము చేపట్టిన కార్యంబునుండి తొలఁగ నారంభించిరి. కావున, వ్యయప్రయాస భారంబంతయు వీరేశలింగముగారే వహింపవలసివచ్చెను. అంతరాంతరముల నెన్నెన్నియంతరాయములు గష్టంబులు వచ్చినను బూనినకార్యమును నిర్వహింపవలయు ననుపట్టుదల గలవారగుటచేఁ బత్రికను గ్రమముగఁ జెన్నపట్టణమునకుఁ బంపుచువచ్చిరి. వీరేశలింగ



ము పంతులుగా రెంత క్రమముగఁ బత్రికను వ్రాసి చెన్నపట్టణమునకు బంపుచువచ్చిన ననేక కారణముల నక్కడివారలు చేయునుపేక్షచేఁ బత్రికలు యుక్తకాలమునకు వెలువడకుండుటం జేసి, పంతులవారు చందాదారులకుఁ దమపత్రికలను గ్రమముగ నందఁజేయ నశక్తులగుచువచ్చిరి. కావునఁ, జాదాదారు లెట్టెట్టు పత్రికాధిపతిపేర నుత్తరములను వ్రాయుచుందురో, యందుమూలమునఁ బత్రికాధిపతు లెట్టెట్టు విచారముల కాలవాలములగుచుందురో చదువరులే సులభముగ యోచింపవచ్చును. వీ రాకాలంబున ననఁగా 1875వ సంవత్సరమున నవంబరునెలలో వెలువడిన వివేకవర్ధనిపత్రికయొక్క రెండవసంపుటముయొక్క రెండవసంచికయం దారంభమునం దున్న

"సదయహృదయులారా!

చిత్తగింపుఁడు—మే మీపత్రిక నెట్టివర్జ్యపువేళ నారంభించితిమో కాని మొదలుపెట్టిననాఁటంగోలె నేఁటివఱకును "విఘ్నేశ్వరుని పెండ్లికి వేయువిఘ్నములు" లన్నట్టు లేదోయొకలోపము తటస్థించుచునే యున్నది. లోకములో నొకమంచికార్యమును దలపెట్టినప్పుడు దానికెన్నో యంతరాయములు కలుగుచుండుట స్వభావసిద్ధమేయి యున్నది. "శ్రేయాంసిబహువిఘ్నాని" యని యుండుట యందఱకుం దెలిసినదే కదా. మొట్టమొదట మాపత్రికను ముద్రించినవారు ఆశ్వయుజమాసము మొదటనె పత్రికయొక్క ముద్రితప్రతులను మాకందించెద మని వాగ్దానముం గావించి కడకు మూఁడుమాసములు కడచినతరువాత మార్గశిరమాసముకడపట బహుకష్టముమీఁద మామొదటిపత్రికను మాకుం జేర్చిరి. ఆముద్రాశాలలో మూఁడుమాసములుమాత్రమె ముద్రింపఁబడి యాపిమ్మట [illegible] వచ్చుటం జేసి యిప్పుడు మఱలఁ గొంతయాలస్యమయినది. ఆయాలస్యముమాత్రము మొదటినుండియు మాపత్రికను విడువక యనుసరించి వచ్చుచు రాఁగా

రాఁగా దానియదృష్ట మెట్టిదోకాని మొన్నటియాశ్వయుజమాసపత్రిక మఱింతమసలి వెలువడినది. విషయమును బంపినమీఁదటఁగూడఁ గొన్నాళ్లవఱకుఁ గార్యాంతరభారమగ్నులయి ముద్రాశాలవారు మాపత్రికను ముద్రింపక జాగు చేసిరి; ముద్రించినపిమ్మట ముద్రాశాలాధికారులకుఁ గొంచెము దేహములో స్వస్థముతప్పియుండుటచేఁ బ్రోషణకార్యస్థానమునకుం గొనిపోవ నొకసేవకుఁ డాజ్ఞాపింపఁబడియు నట్లు కావింపమిచేఁ బత్రికలకట్ట తంత్రీవార్త బంపువఱకుఁ బెట్టెలోనె యట్టె యుండెను. ఈనడుమ నైదుధూమనౌకలు వచ్చినవి; ఒక్కదానిమీఁదను బత్రికలు రాలేదు—ఈయాలస్యమున కెవ్వరి నేమనను? తరువాతఁ బత్రికావిలేఖకులకుఁగూడ దేహములో వ్యాధి సంభవించి కార్తికమాసపత్రిక యిప్పుడు వెలువడవలసివచ్చినది. వివేకవర్ధనీముద్రాయంత్రము తెప్పింపఁబడినది గాని తెనుఁగక్కరములు వచ్చుటమాత్రము కొంతయవశిష్టముగా నున్నది. అవియుఁ గొన్ని దినములలో వచ్చిన యాయవశిష్టమును శీఘ్రకాలముననె తీఱఁగలదు. చైత్రమాసము మొదలుకొని పత్రిక స్వీయముద్రాశాలయందే ముద్రింపఁబడుచు బాకిపడియున్నపత్రిక లన్నియు వేగిరమే ముద్రింపఁబడి యాపిమ్మటఁ జందాదారుల కెప్పటిపత్రిక లప్పుడు క్రమముగా నందుచుండును. కాఁబట్టి లోకోపకారధౌరేయులును, గుణగ్రహణపారీణులు నగుమాచందాదారులెల్లం దమచందాధనములం గ్రొత్తసంవత్సరమునకు శీఘ్రముగా మాకందించి నిరంతరాయముగాఁ బత్రికలం గైకొన నెంతయుఁ బ్రార్థింపఁబడుచున్నారు.”

అనువిజ్ఞాపనముం గాంచిన వీరేశలింగముపంతులుగారెట్టిశ్రమలను బడుచుండినదియును బోధపడక మానదు. చదువరులహృదయములను జక్కఁగా నాకర్షింపఁజేయుటకుం జాలినతెలుఁగున విజ్ఞాపనము



లను వ్రాయుటయందుఁ గలసామర్థ్యము వెల్లడిగాకమానదు. అట్లు మనశ్శాంతియనునది లేకయున్నకాలంబున, వేంకటరత్నముపంతులుగారు తమయాంధ్రభాషాసంజీవనిని “కోదుభాషాసంజీవని” యను నామకరణము చేసి, పిలువనారంభించుటచేఁ గినిసియు, స్త్రీవిద్యనుగూర్చి పత్రికలలో దుస్సాధ్యంబుగ నుండునట్లు వ్రాయుచుండుటకుం జేయునదేదియు లేకయు, వీరేశలింగముపంతులుగారి కేవిధముగానైనను బరాభవింపవలయునని నిశ్చయించుకొని “ఆంధ్రభాషాసంజీవనియంకురము” అనితగునట్లుగా “హాస్యవర్ధని” యనుపరిహాసపుఁబత్రికను బ్రకటింప నారంభించి, యాపత్రికయొక్క మొదటిసంచికయందు,

శ్లో. అవ్యాద్వస్సామజాస్యోఽసౌ హాస్యోహాస్యైశ్వరోపితుం
కుర్వన్ తాండవమత్రిక్రి ఏష లంబోదరశ్చవ.

శ్లో. హాస్యప్రియులుచూడుండీ కొనుండీహాస్యవర్ధనిన్
బెల్లంబువలెబుట్టించుం జవింజూడంగఁజూడఁగన్.

అనుశ్లోకములతో, “వినోదసమయం బనునొకపట్టణంబు గలదు. అందుహాస్యప్రియుం డనురాజు గలండు. ఆరేనిసముఖములో వక్రదండుడు కుటిలదండుడు హ్రస్వదండుడు దీర్ఘదండుడు స్థూలదండుడు శుష్కదండుడు మహాదండుడు ఉద్దండుడు ననునెనమండ్రు అన్వర్థనామకులు ప్రధానమంత్రులు గలరు. వారారాజునకు వినోదార్థముగా నెప్పుడుం గథలు చెప్పుచుందురు. వాని నప్పుడప్పుడీహాస్యవర్ధని ప్రకటించుచుండును.” అని “ఖతారంబము”ను బ్రారంభించి, స్వీయచిత్తక్షోభను వెల్లడించుకొని,

“అవాచ్యదిశయందు విధవయైనతనకూతురుకి మఱియొకపెండ్లిచేసినం జాతిబహిష్కృతుండై ప్రసిద్ధికెక్కిన శేషయ్యంగారనుఘనుఁడు కొన్నిదినములకు మునుపు మళయాళదేశమునకు రాజధానియైన తిరువ

నందపురములోని శాస్త్రపాఠశాలకుం బోయి యందలివిద్యార్థుల కెల్ల
"తానుచెడ్డకోతి వనమెల్ల చెరిచెనన్నట్లు" విధవావివాహము కర్తవ్య
మనిదుర్బోధన చేయసాగెనఁట. ఆవిద్యార్థులీడువచ్చినవాండ్రయ్యు ప్రజ్ఞా
తిశయము చాలనివాండ్రైనందున నాతఁడు చెప్పినమాటలకు ప్రత్యు
త్తర మీయనేరక యూరకుండిరఁట. అందువల్ల ఆభ్రష్టవిధవాజనకుండు,
"నాలెజాండ్రసభామధ్యే సాతానిః పండితోత్తమః" అన్నట్లు విజృం
భించి తనతోడ వాదింపగలవాఁడెవ్వఁడును లేఁడని యేమేమోగప్పాలు
గొట్టుచుండెనట. అట్టియెడ ఆశాస్త్రపాఠశాలయందలిదేశభాషాపం
డితుం డొకశాస్త్రి పులివలెవచ్చి యీవిధవావివాహకర్తృశేషయ్యం
గారూ! శేషయ్యంగారూ! నోరులేనివాండ్రనుతులు చెరుప నేల
దుర్బోధన చేసెదరు? ఏలవాదబలము గలవారమని నిక్కెదరు? మీవిధ
వావివాహసాధకవాదబల మేమో విచారింతము. శక్తిగలదేని నాతో
వాదింపుఁడు. మన మిరువురము శపథము చేసికొని వాదింతము. మనకు
మధ్యవర్తులుగా దివానుమొదలైనవారుండుదురుగాక. అనియె నట! అం
తట శేషయ్యంగారు ఔద్ధత్యము మాని "మౌనం సర్వార్థసాధకం"
"శీఘ్రబుద్ధిః పలాయన" మ్మనుమాటలం బాటించి అప్పటికి తన కవకా
శము చాల దని చెప్పి తంత్రము చేసి తప్పించుకొని అదేపోతగా పోయె
నఁట. విధవావివాహవాదజయస్తంభములు విధవలా? విధవలమగలా?"

అని ప్రజ్ఞాతిశయముచాలనివాండ్రవలెఁ గాక, యత్యంతప్రజ్ఞాసం
పన్నులవలె వ్రాసి ప్రకటించుకొని యున్నారు. 35 సంవత్సరములక్రిం
దట మనపండితులకు స్త్రీపునర్వివాహసంస్కారవిషయమునుగూర్చి
యెట్టియభిప్రాయము లుండియున్నదియును పైవాక్యమువలనఁ గరతలా
మలకంబుగ మానసగోచరము గాక మానదు. పైవాక్యము లలంకార
ములుగాఁగల యీ "హాస్యవర్ధని" యొక్క మొదటిసంచికయందే "ఖ



రాంబనుము" క్రిందనున్న "వక్రదండకుటిలదండులు యిద్దరు వైద్దిక
మీర వద్దకూర్చుండి శంఖధ్వనితో రహస్యసంభాషణము లాడుచు
న్నారు. అన్నా—దేశభాషావార్తాపత్రికాధిపతులకు నానాటికి పెరు
గుచున్నది. ఏమి—లాభము. ఆరోగ్యమును లెక్కింప పరాపు లెక్క
డను దొరకవైరెరి. ఇంకేమి సేయవచ్చు. ఎంచకయే సంచులలోను
గోనెలలోను బోయవచ్చు. అవి చాలకపోయిన, ఇండ్లలోనే కుప్పలు
వేయవచ్చు. అందునకుం జోటుచాలకున్న, దొడ్లలోను ముంగిళ్లలోను
పాతళ్లు వేయవచ్చును. పాతళ్లకు నేలచాలదే! చాలకున్న నూతుల
లో పోయుదురు గాత. అవియున్నియు న్నిండిన, చెరువు లుండనే
యున్నవి. అవి నిండి అంతకుఁ బైమిగిలిన, ఏక్కెక్కడికిఁబోయినవి? సము
ద్రమునకు. సరి సరి. అట్లయిన సముద్రమే శరణము. ఓహో—
ఏమేమి—బ్రదుక లేక గుటుకిపడుటకా—కాదుకాదు. వార్తాపత్రికా
లబ్ధధనము దాఁచుటకు. * * * స్వదేశస్థులుస్వదేశభాషావా
ర్తాపత్రిల కిచ్చియిచ్చి బీదవారైరఁట * * * అట్టివా రేమి
చ్చిరి. రానిచ్చిరి. పోనిచ్చిరి. మననిచ్చిరి. ఉండనిచ్చిరి. ఓహో—
ఉండనిచ్చిరా—ఏముండనిచ్చిరి? ముండకాదు. ఉండకాదు. అట్టివారి
లోఁ గొందరు తమపేళ్ల నిచ్చిరి. మఱికొందరు జాబుల నిచ్చిరి. ఇంకఁ
గొందరు పుచ్చుకొన్నపత్రికలమరల నిచ్చిరి. వారికంటె దాతలయినవా
రు తత్పత్రికలం దీసికొని దిగమ్రింగి కాసీక యెగవేసిరి * * *
కొందరు పత్రికలఁ దీయవలయు తీయవలయు నని చెప్పుచున్నారుగాని
వారికిపుణ్యదివసము కుదురలేదు. పత్రికాధిపతులు పత్రికల దీయవల
యునే కాని వారు తీయునట్లు లేదు. తీసికొనిరో తీపులుతీసికోవలసిన
దే. మరికొంద రీజన్మమున దేశభాషాపత్రికలనే తీసికొనమని ప్రతిజ్ఞ చే
సికొన్నారట. మరియుం గొందరు వానిజూడ మని శపథము చేసుకొ

న్నారట. ఇంక కొందరువానిపేరే వినమని వ్రేళ్ళుపెట్టుకొన్నారట. వారికంటెలోకోపకారులైనవారు తమకాప్తులైనవారితో నీపత్రిక లేల యనియు తీసుకోవలదనియు చెప్పుచున్నారఁట." అనియీప్రకారము గాఁ బత్రికాధిపతులకుం గలకష్టసుఖంబులను వెల్లడించుకొని యున్నారు కాని, యీసంచికయందేపైవాక్యములకుందరువాతనున్న "సోమయాజకోడలుకథ వేంకటరత్నముపంతులుగారివంటిపండితోత్తములు వ్రాసి ప్రకటింపఁ జనునా యని చింతింప వలసియున్నది.

స్వకీయమగు ముద్రాయంత్రము లేమింజేసి, పంతులవారి కింతింతని చెప్పుటకవకాశములేని యారాటంబు మనసు నాశ్రయింప నారంభించి యుండవచ్చును. దానంజేసి, పంతులవారి మనసంతయు ముద్రాయంత్రమును దెప్పించుటయందే లీనమయి యుండెను. ఈసంవత్సరమువసంతాము వెనుక 1873వ సంవత్సరమున రచించియుంచిన "నీతిచంద్రిక, విగ్రహము"ను జెన్నపురమున ముద్రాంకితంబు గాంచిరి.

బ్రహ్మశ్రీ వావిలాల వాసుదేవశాస్త్రులవారి కీరాజమహేంద్రవరమునకు 'నీతిచంద్రిక, విగ్రహము' యొక్క వ్రాఁతపుస్తకమునే పంపియున్నారు. పుస్తకమును సావకాశంబుగఁ బరిశీలించిచూచి,

*　　*　　*　　*　　*　　*　　*

క. మీపుస్తక మొకపఱి నే
నేపారం జూడఁగానె ♦ యిట్టి దగునె? వ
హ్వా! పూర్వ మాంధ్రభాష మ
హాపుణ్యముఁ గాంచెఁబోలు ♦ ననిపించె మదిన్.

*　　*　　*　　*　　*　　*　　*

సీ. వాటంబుగా నిడ్డ ♦ తేటమాటలచేత
నొప్పుమీఱెను శైలి ♦ యొక్కచోట



సంస్కృతపదములు ♦ చాలఁ గ్రాలఁగ నింపు
గ్రక్కుధోరణిమెఱ ♦ యొక్కచోటఁ
గనరాని కలయిక ♦ కలరెండు భాషల
సూక్తులఁ దగురీతి ♦ నొక్కచోటఁ
బొదరిల్లువిధమున ♦ మృదులతాకీర్ణమై
యలరు నగుపడక్కవే ♦ యొక్కచోటఁ
గాఁగ నాయాయిష్టులఁ ♦ గరము వింత
గొలుపుచును సజ్జనార్థుల ♦ కొప్పు లెల్ల
సఫలములు గాఁగఁ బొడముకో ♦ శంబు నాఁగ
వెలయు నీనీతిచంద్రికా ♦ విగ్రహంబు.

క. ఎచ్చటఁ జూచిన శ్లేషలు
పిచ్చలవిడిఁ గానఁబడెను ♦ వింతగఁ దెలుఁగం
దిచ్చెప్పిన ద్వ్యర్థగతుల
నెచ్చోఁ గానంగఁ గలమె ♦ యెన్నికఁ జూడన్?

అని, సముచిత మగుతమయభిప్రాయమును శాస్త్రులవారు వెల్లడించియున్నారు. ఇదియే 1874వ సంవత్సరము.

చెన్నపట్టణంబున 1872వ సంవత్సరమున వేంకటరత్నము పంతులవారును 'నీతిచంద్రిక, విగ్రహము'ను బ్రచురించియున్నారు. కావున, నేఁటికి రెండువిగ్రహతంత్రము లుండియున్నవని చదువరులందఱుదివఱకే యెఱింగియుండవచ్చును. వేంకటరత్నము పంతులవారి 'నీతిచంద్రిక, విగ్రహము' రెండుసంవత్సరములకు వెనుకనె ముద్రింపఁబడియున్నను, వీరేశలింగముగారి 'నీతిచంద్రిక, విగ్రహము' ప్రచురింపఁబడిన తరుణంబుననె విద్యాశాఖవారు రెండుగ్రంథములను బరిశీలించి, వీరేశలింగముగారి 'నీతిచంద్రిక' ని 1876వ సంవత్సరమునఁ బ్రవేశపరీక్షకుం బఠనీయగ్రంథముగ నియమించి, రెండుగ్రంథములలోఁ బ్రాముఖ్యత నీనీతి

చంద్రికకై యొసంగి, యందుమూలమునం దత్కర్తకుఁ దగిన యమితో ప్రోత్సాహమును గలుగఁజేసియున్నారు. ఆ సంవత్సరంబుననె వీరేశలింగముగారు తమ నీతిచంద్రికకుఁ డీకను బ్రచురించిరి. నేఁటికీవిగ్రహము రెండుమూఁడుసారులు ప్రవేశపరీక్షకుఁ, బ్రథమశాస్త్రపరీక్షకుఁ బఠనీయగ్రంథముగ నియమించియున్నారు.

అట్లు వీరేశలింగముగారి నీతిచంద్రిక పఠనీయగ్రంథముగ నియమింపఁబడిన యొకటిరెండుసంవత్సరములకుఁ బిమ్మటనె, వేంకటరత్నము పంతులవారి నీతిచంద్రికనుగూడ పఠనీయగ్రంథముగ నియమించి, విద్యాశాఖవారు తత్కర్తకుంగూడ సంతోషమును గలుగఁజేసియున్నారు. గ్రంథములను రచియించిన వారలె తమ పుస్తకములకుం డీకను బ్రచురింపవచ్చునా కూడదాయను సంశయం బవిచారణీయాంశంబె యయియున్న, నట్లుచేయుట వీరేశలింగముగారి కనుచితంబనియు, పరిహాసపాత్రంబనియు వేంకటరత్నముపంతులవారు ప్రచురించియుండుటం జేసి, తామింకఁ దమవిగ్రహంబున కర్థము వ్రాసి ప్రచురించినచో స్వవచనవ్యాఘాతము సంభవింపకమానదను తలంపున, వేంకటరత్నముపంతులవారు దామె టిప్పణంబును లిఖియించి, యద్దానిం దమ ప్రియశిష్యులలో నొక్కరి పేరిటఁ బ్రచురించిరి. టీక వ్రాసినది వేంకటరత్నము పంతులవారేయని నిర్ధారణచేసినవిధంబు వీరేశలింగముగారి సామర్థ్యంబును సూక్ష్మగ్రహణశక్తిని వెల్లడింపకమానదు. విగ్రహనామంబు సార్థకంబగునటులు నీతిచంద్రికలను రచియించినయిరువుర గ్రంథములం గూర్చి నగడచినగాథలు వ్రవ్వ నాకింతయు నిష్టము లేకయున్నను, వేంకటరత్నము పంతులవారియెడ నాకుంగల యమితగౌరవము నాకలమును వెనుకకు లాగుచున్నను, సాధారణముగ గ్రంథకర్తలయమితసామర్థ్యంబును, బుద్ధివిశేషంబును నాయాగ్రంథకర్తలితరుల గ్రంథములపై ముఖ్యంబుగఁ బట్టువడలతో వ్రాసెడు విమర్శనములం బట్టియే మనము నిర్ణ



యింపవలసి యుండుటచేత, నద్దానింగూర్చి యించుక చదువరు లెఱుంగుట యావశ్యకంబని తలంచి, నీతిచంద్రికలను విమర్శనంబులను సావధానంబుగం గాంచిన నేను వానింగూర్చి సూక్ష్మముగ నిటఁగొంత వివరించెదను.

వీరేశలింగము పంతులువారి యీ 'నీతిచంద్రిక' విగ్రహమును బాల్యమునుండియు నేనెన్నిసారులు చదివినదియు నేనిప్పుడు చెప్పఁజాలను.

విగ్రహతంత్రమును రచియించి ప్రకటించినపిమ్మట వీరేశలింగముపంతులుగారు చెన్నపట్టణమునం జూడ సరిగినప్పు డక్కడిపండితు లొకసభ చేసి పంతులుగారిసామర్థ్యమునకుఁ గరంబు సంతసించి యొకవెండిపాత్రమును బహుమానంబుగ నొసంగి గౌరవించి యున్నారు.

నేనీవిగ్రహమును జదువుచుండుటం జూచిన నాస్నేహితులలోఁ గొందఱు, వేంకటరత్నముపంతులవారి నీతిచంద్రికను సహితము చదివి, యీ రెండుగ్రంథములకుం గల తారతమ్యమును దమకుం జెప్పవలయునని పలుమఱు నన్నందులకు మైత్రిం బురస్కరించి, నియమించిన నందుల కసమర్థుండనని నేనెఱింగినవాఁడనయ్యును, రెండుగ్రంథములకును గల వ్యత్యాసము నెఱుంగవలయునన్న యుత్సాహము నాకంతకు మున్న మనమున నుదయించి యుండుటం జేసి, వేంకటరత్నము పంతులవారి విగ్రహమును సహిత మాద్యంతముగ జదువవలసినవాఁడ నయితిని. అప్పటికి 'కొక్కొండ వేంకటరత్న కవికృతవిగ్రహతంత్రవిమర్శనము' గాని, 'కందుకూరి వీరేశలింగకవికృతవిగ్రహతంత్రవిమర్శనము' గాని, మఱియు "వేంకటరత్నకవికృతవిగ్రహతంత్రవిమర్శనవిమర్శనము" గాని యుండియున్నవని నేనెఱుంగనే యెఱుంగను. ఇక గ్రంథములం గూర్చియు, విమర్శనములంగూర్చియుఁ గొంతనుడివెద.

ప్రారంభమున, పరవస్తు చిన్నయసూరిగారు నీతిచంద్రికయొక్క పూర్వార్థము నత్యంత స్తోత్రపాత్రంబగునటుల రచియించి, 1852వ సంవత్సరమునఁ బ్రచురించియున్నారు. ఆనీతిచంద్రిక నందఱెఱింగియే యున్నారు. పూర్వార్థమును సావకాశముగఁ బరిశీలించుచు, జదివెడు వారలలో నెవ్వ రింపలి,

ఉ. చిన్నయసూరి కీర్తి తెవఁ జేరిచి సారెకు గారవింపఁగా,
మున్ను రచించిమించె, సగము స్వచనంబుగ నీతిచంద్రికన్
సన్నుతికెక్క దానికిదె సాటియటంచు బుధుల్మనంబులం,
దన్నఁగ నిప్పుడెను రచియించెదఁ దక్కిన యుత్తరార్థమున్.

“దానికిదె సాటియటంచు” నను గ్రంథకర్తగారియొక్క యభిప్రాయముతో గాని, “చిన్నయసూరిగారిదానివలె” నని ప్రచురింపఁబడిన పురుషార్థప్రదాయినీ పత్రికాధిపతుల యభిప్రాయంబుతోఁ గాని యేకీభవింప కుండురనియే నాయభిప్రాయముగానున్నది. ఇట్లు చెప్పుటచే, చిన్నయసూరిగారి నీతిచంద్రిక వీరేశలింగము పంతులవారి నీతిచంద్రిక కంటె సర్వోత్కృష్టంబుగ రచియింపఁ బడినదనిగాని, వీరేశలింగము పంతులుగారి నీతిచంద్రిక చిన్నయసూరిగారినీతిచంద్రికకన్న సర్వోత్కృష్టంబుగ రచియింపఁబడినదనిగాని నాయభిప్రాయము గాదు; కాని, యానీతిచంద్రికతో నీ నీతిచంద్రికనుకాని, యీనీతిచంద్రికతో నానీతిచంద్రికనుగాని పోల్చుట కెంతమాత్రమును వలనుపడని యుత్కృష్టంబులగు రెండు వెవ్వేఱు శైలులయందు రెండు నీతిచంద్రికలును రచియింపఁబడినవనియే నాయభిప్రాయము. ఈవిగ్రహతంత్రముంగూర్చి తమయభిప్రాయము నిచ్చుచుఁ బలువు రియ్యది మిగులఁ గఠినంబుగ రచియింపఁబడియున్నదని చెప్పుచున్నారు; పంతులవారును దమనీతిచంద్రిక కఠినంబుగనే రచియింపఁబడినదని, యందుపయిం దమకుంగల నిరసనభా



వము ననేకసారులు గనుపరచియున్నారు. కాని, నేనాయభిప్రాయములతో నేకీభవింపఁజాలను. గ్రంథములం జదివినకొలఁదిని, యింక నెన్నియో యింతకఠినంబుగ వచనకావ్యములు రచియింపఁ బడవలెనను నభిప్రాయముకుదప్పక యొసంగఁజేయునంతటి కఠినంబుగ వచనకావ్యములు రచియింపఁబడుచుండెడి కాలమునందలి వచనకావ్యములతో నియ్యది పోల్చిచూచినచో నిందలిశైలిం గఠినశైలినిగాఁ దలంప సాహసింపరుగాని, పంతులవారిటీవల వ్రాయుచున్న యనేకగ్రంథములతో నిద్దానితోడను బోల్చిచూచినప్పుడు మాత్ర మీవిగ్రహము కఠినముగ నున్నదని చెప్పెదరనియే నేఁజెప్పఁగలను. వచనకావ్యములను రచియింపవలయు ననునధికోత్సాహమును నాకుంగలుగఁ జేయుచు, నన్నుఁ గరంబు వచనరచనకుం బురికొల్పుచువచ్చిన యొకటిరెండు ప్రధాన వచనకావ్యములలో నిదియే మొట్టమొదటిదిగా నుండియున్నది. కావున వచనరచనయం దధికాదరముగలవార లందఱు నీ “నీతిచంద్రిక, విగ్రహము” ను సహితము సావధానముగఁ జదివినచో యుక్తియుక్తంబగు మధురమయినవచనరచన పట్టువడక మానదని నేను దృఢముగాఁ జెప్పఁగలను. ఇంక నిరువురు పంతులవారల నీతిచంద్రిక, విగ్రహములం గూర్చియు, నిరువురి పరస్పర విమర్శనంబులంగూర్చియు, నొకరి నొకరు లోఁగఁజేయవలయునని స్థాపించిన “హాస్యవర్ధని” “హాస్యసంజీవి” న్యనుబంధపత్రికలం గూర్చియుఁ గొంత ముచ్చటింతము.

వీరేశలింగముపంతులవారు, తమ నీతిచంద్రిక, విగ్రహమును వేంకటరత్నముపంతులవారి నీతిచంద్రిక, విగ్రహము ప్రచురింపఁబడిన యనంతరమునఁ బ్రచురించి నంతమాత్రమున, వా పంతులవారి నీతిచంద్రికం, జూచి యియ్యది వీరేశలింగముగారు రచియించిరని చెప్పుటకేమూలాలను నెట్టినిదర్శన మొక్కటియయినను యుక్తమయినది గానరాకయుండఁగా, వీరేశలింగముగా రేమిచేయఁగలరను నుద్దేశమున వా

నిజమయిన సామర్థ్య మింకను నంతగాఁ బయలఁబడకుండుటం జేసి, యెంతయు సంతాపకరంబును నమితకోపసంజనితంబు నగునటు లోకింతయు వెనుదీయక, "విశేషభాగము హీనమైన దండాన్వయము కాదన్నను నిస్సందేహముగా బంతులవారి విగ్రహము ననుసరించియే యెంతమ చేతి వ్రాఁతగా వ్రాయఁబడినట్టి" యనియిటులు వేంకటరత్నముపంతులవారు ముందుగఁ బ్రకటించుట యింతయు సమీచీనంబుగ నుండునాయని చెప్పుటకెంతయు జంకించుచున్నాఁడను. అయ్యది చూచినతోడనే, మనకే యింతవిచారంబుగ నుండఁగా గ్రంథకర్త కెట్లుగా నుండునో మీరలే యోచింపఁగలరు. ఈవిమర్శనంబునందలి యొక్కవాక్యంబును జూచెడువారలు సహిత మయ్యది మహాకోపశాణంబునం గరుణారసంబున సానపట్టిన కలమున రచియింపఁబడిన దని చెప్పక మానరు. ఇట్లు వ్రాయుటచే వీరేశలింగముపంతులవారి 'నీతిచంద్రిక, విగ్రహము'నకును వేంకటరత్నముపంతులవారి 'నీతిచంద్రిక, విగ్రహము'నకును హస్తిమశకాంతరంబులు వ్యత్యాస మున్నదని చెప్పకమానరు. రెండునీతిచంద్రికలను గాంచువారలు దీనిని ప్రథమంబుగఁ బరిగణింపక మానరని మాత్రము ధైర్యముతోఁ జెప్పఁగలను. ఇరువుర విమర్శనములం జక్కఁగఁ గాంచిన నీవిమర్శనంబున కయ్యది యనేక విషయములఁ దప్పక తీసిపోక మానదని యేకింగాని తోఁచక మానదు.

నిజమయినకృతివిమర్శనము లన్న నేమియో యెఱుంగని మన యాంధ్రభాషయం దిట్టిగ్రంథము లుండుట యత్యంతావశ్యకమని నేనిట వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. కావున, నీ "కొండ వేంకటరత్నకవికృతవిగ్రహతంత్రవిమర్శనము"ను మఱల గ్రంథరూపంబుగఁ బ్రకటించినచో నయ్యది మార్గప్రదర్శకముగ నుండి, చదువరులకును గ్రంథకర్తలకును జ్ఞానదాయకంబుగ నుండక మానదని పంతులవారి కిందుమూలముగాఁ దెలియఁజేయుచున్నాఁడను.



పిమ్మటఁ గొంతకాలమునకు, వీరేశలింగముగారు 'నీతిచంద్రిక, సంధిని' సహితము ప్రకటించియున్నారు. ఈసంధిని జదివినవారలా చిన్నయసూరిగారిశైలియందు చనువు నప్పటికను మఱుపు రాకమానదని చెప్పక మానరు. ఇందలిశశకపింజలంబులకథ యెంత స్వభావసిద్ధంబుగ నున్నయది! అయోధ్యానగరనివాసి యగు దేవశర్మయను బ్రాహ్మణుని కథ యెంత యాహ్లాదకరంబుగ నున్నయది! బలవర్ధనునికథ యెంతహృద్యంబుగ నున్నది! వేయేల? ఈసంధి యాద్యంత మొక్కవిధమయిన మధురసులభశైలిని రచియింపఁబడిన దని సాహసంబునఁ జెప్పుట కెంతయు సందియము లేదు. ఇయ్యది, పాఠశాలలలోని క్రిందితరగతులకుఁ బఠనీయగ్రంథముగ నియమింపఁబడి యుండెను. సులభముగా బోధపడునట్టుల రచియింపఁబడి యుండుటం జేసి, యిది బాలుర కెంతయు సంతసంబును, భాషయం దధిక మగు నభిరుచిని బుట్టింపక మానదు. ఈసంధి నిక్కడి రాజకీయసర్వకళాశాలాధ్యక్షులుగనున్న 'ఎవ్వస్ట పార్ మెట్కాఫ్ యమ్. యే., దొరవారికిం గృతజ్ఞతాసూచకముగ నంకితము చేసియున్నారు. నేఁటికీసంధి యేడుసారులు ముద్రింపఁబడియున్నది.

వేంకటరత్నము పంతులవారు, తమ నీతి చంద్రిక విగ్రహమున "ఇందు విగ్రహంబు సంధియేర్పరింపఁబడె" అని వ్రాసియున్నను, సంధి నింకను బ్రకటింపకుండుటకుఁ గారణమేమియో నేనిటఁ జెప్పఁజాలను. ఆపంతులవారును సంధిని వ్రాసినఁ జక్కఁగనుండునని తలంచుచు నట్లు చేయుటకుఁ గడంగెదరని నెమ్మనమున నమ్ముచున్నాఁడను. ఇంక, ననుబంధపత్రికలం గూర్చి యొకింత వినుండు.

వీరేశలింగము పంతులవారు ప్రకటించిన రోషసంజనితమ్ము మసఛనవిమర్శనముల కమితకోపసముద్దీపితులయి, వేంకటరత్నముపంతులవారు, 'వివేకవర్ధని'ని దత్పత్రికాధిపతులను చేతనయినకొలఁదిని నిస్సారము లగువాక్యముల లాఘవమునందఁ జేయవలయు నని తలంచి, వివేకవర్ధని

యొకపత్రికగొందలాపఁ జనదని తలంచి, వివేకవర్ధని యని యున్న దానికి 'హాస్యవర్ధని' యను పేరిట నవీనముగా నొకపత్రికనుగల్పించి యద్దానిని దమ సంజీవని పత్రిక కనుబంధముగఁ బ్రకటింప నారంభించిరి. అయ్యది ప్రాయఁబడుచుండెడిరీతిని గనుట కొక్కపత్రికయైన దొరకునేమోయని యనేకవిధములం బ్రయత్నించితినిగాని, యట్టిపత్రిక చాలకాలమువఱకొక్కటియయినను లభింపనందుల కెంతయుఁ జింతించితిని. కాని 1902 వ సంవత్సరమున మహారాజశ్రీ గోగులపాటి వీరేశలింగముపంతులుగారు కష్టపడిసంపాదించి, దయచేనాకుంబంపిన "హాస్యవర్ధని" యొక్క మొదటి సంపుటముయొక్క మొదటిసంచిక నామూలాగ్రంబుగఁజదివి యందలిపరిహాసపాత్రమయిన వ్రాతకుమిగులఁ జింతించితిని. ఆపత్రికనొక్కసారి యిప్పుడు వేంకటరత్నముపంతులుగారు చదువుకొనినచో నెట్లు తలంచెదరో! వేంకటరత్నముపంతులవారు తమహాస్యవర్ధనియందు దిరుప్రక్కల రెండెలుకలను గలిగియున్న యేకదంతునివిగ్రహము నుంచి, యేతత్పత్రికయందు వీరేశలింగముపంతులవారినీతిచంద్రిక, విగ్రహమునుగూర్చియు, వివేకవర్ధనినిగూర్చియు, నేవేవియో ప్రకటింప నారంభించిరని మన మూహింపవలసి యున్నది. ఇది యంతయు జరిగినది 1875వ సంవత్సరముగ నున్నది. పిమ్మట, వీరేశలింగముపంతులుగారును వారిసామర్థ్యమునకుఁ దీసిపోవునట్టిస్వభావముగలవారు గాకుండుటం జేసియు, నప్పటికింక నాంధ్రప్రపంచమునందు వీరిసామర్థ్యాతిశయంబు వెల్లడిగాకుండుటం జేసియు, యౌవనకోపానలంబు నార్పనశక్యం బగుటం జేసియు, నూరక యుండనేరక 'ఆంధ్రభాషా సంజీవని' యని యున్న దానికి 'హాస్యసంజీవని' యని పేరుపెట్టి దానిం దమ వివేకవర్ధని పత్రికకనుబంధముగ 1876వ సంవత్సరమున మార్చినెలయం దారంభించి, మూఁడుమాసముల కొకసారి ప్రకటింప నారంభించిరి. హాస్యవర్ధనిపత్రికాధిపతు లుంచిన యేకదంతునివిగ్రహమునకుం బ్రతిగ, సుభముద వర్ధమా



నుసటులు గొన్ని సంకేతాక్షరముల నడుగునఁ గలిగియున్న శ్రీమార్జారద్వయాశ్రిత త్రస్తభుజనృసింహమూర్తివిగ్రహము నుంచి, పత్రికాముఖమున స్వకీయముఖ్యాభిప్రాయమును వెల్లడించునటు లేదియో యొక శ్లోకమునో లేక పద్యమునో ప్రకటించుట వాడుక యయియుండుటం జేసి,

శ్లో. సింహవక్త్రం మహాకాయం విఘ్నేశ్వర వరాధిపమ్
పశ్యసంజీవనీనాథంమార్జాలయుగళాశ్రితమ్. పూజ్యపురాణము.

అను శ్లోకమును వ్రాసి, పిమ్మట,

క. క్రొత్తగ విఘ్నేశ్వరి ను
వ్వొత్తుగఁ, బెండ్లాడి జోడు ♦ పిల్లుల నరణం
బిత్తుఁ జేఁ బొంది ముదంబునఁ
దైత్తెయియని నాట్యమాడు ♦ దేవ నృసింహా!

అను పద్యమున నిజేష్టదైవము నుద్దేశించి, హాస్యప్రబంధమగు 'అఘోర్యోపాఖ్యానము'ను మొట్టమొదటఁ బ్రకటింప నారంభించి, పిమ్మట మఱికొన్ని హాస్యసంజీవనులను విసుగువిరామము లేక ప్రకటింపనారంభించిరి. పిమ్మట వేంకటరత్నముపంతులవారు మైత్రిం బురస్కరించి, వీరేశలింగము పంతులవారిపేరిట నుత్తరములు వ్రాయుచుండుటం జేసి యట్టి హాస్యసంజీవనులు ప్రకటింపఁబడకుండెను; కాని, వీరేశలింగముపంతులవారు మొన్నమొన్నటివఱకు నేదియో యొక హాస్యసంజీవనిని బ్రకటించుచునే యుండిరి. లెక్కలేనిజనుల నాబాలవృద్ధంబుగ నమితాహ్లాదభరితాంతరంగులుగఁ జేయునట్టియిట్టిహాస్యసంజీవనులకుం బ్రధానకారణులు వేంకటరత్నము పంతులవా రగుటం జేసి, మనమందఱ మాపంతులవారి మూలంబున నిటులు లెక్కలేనిదురాచారములు వెల్లడింపఁబడుచుండుటం జేసి, యాపంతులవారి కెంతెయుఁ గృతజ్ఞులమయి యుండవలసియున్నది. ఆకాలముననె, వేంకటరత్నము పంతులవారు

"వివేకవర్ధని' యను పేరును "నిర్ధనకవేవి"యని తల్క్రిందుచేసి యందలి విశేషార్థమును వెల్లడించి, యందుమూలమున నీపత్రిక యిరుదెఱంగుల సార్థకమయినదని యందఱకును దెలియఁజేసి, యాకారణమున వీరేశలింగము పంతులవారికి మఱియుఁ గీర్తిని సమకూర్చుటయేకాక, మీఁదుమిక్కిలి తమబుద్ధివిశేషంబును సహితము వెల్లడించుకొని యున్నారు. ఇందులకు మనమందఱ మెంతయు సంతసింపవలసియే యున్నయది. జీర్ణించినయాంధ్రభాషను మఱల నుద్ధరించుతలంపున బయలువెడలఁదీసినయాంధ్రభాషాసంజీవనిపత్రికపేరు నర్థంబుత్తఱి వివేకవర్ధనియందే యుండియున్నదని చెప్పుటకుం బెక్కునిదర్శనములు గలవని నే వేఱుగఁ జెప్పనక్కఱలేదు.

* * * * * * *

బాల్యమునందే శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచననైషధ మనుమహాకావ్యమును, రసికజనమనోరంజనమను శృంగారప్రబంధమును రచియించి, పిమ్మట పలువిధములగు గ్రంథములను రచియించుచు, నభిజ్ఞానశాకుంతలము, ప్రబోధచంద్రోదయము మొదలగు నాటకరాజములను సర్వోత్కృష్టంబుగ నుండునటులఁ దెనిఁగించిన వీరేశలింగముపంతులవారి నేవిషయమునందును వేంకటరత్నముపంతులవారితోఁ బోల్చిచూచుటకు లేశమైనను వీలులేకయున్నను, నిరువురు నొక్కగ్రంథమును 'నీతిచంద్రిక, విగ్రహము'ను రచియించి యుండుటఁజేసి యిట్లింతగాఁ బెంచి వ్రాయవలసివచ్చినది.

* * * * * * *

పత్రికలయం దిరువు రిత్తెఱంగున వ్రాసికొనుచువచ్చిన కాలమునందు వీరేశలింగము పంతులవా రాసంవత్సరమున గ్రంథకర్తల కెంతయు నీతిబోధకములుగను, జ్ఞానదాయకములుగ నుండునటులు "నీతిప్రబోధము" అను పేరిట,



ఉ. కారణయుక్తమౌనటులు ♦ కావ్యవిమర్శన మాచరింపఁగా
నోరువలేక కూళకవి ♦ యొక్కఁడునోరికివచ్చినట్లు దా
గారణహీన మైనవెడ ♦ కాఱు లటంచును వానిఁ బ్రేలు ని
ష్కారణ మాత్మదోషములు ♦ చాల బయల్పడె. నన్నచింతచేఁ.

క. తనపుస్తకమే సత్కృతి
యనుకొని గుణదోషములను ♦ నారయువారిన్
వినరానికాఱు లఱచెడి
జనకంటకు మించునట్టి ♦ జముఁ డిలఁ గలఁడే?

చ, కతిపయమిత్రసత్తములఁ ♦ గాంచి కడుం బొగడించుకొంటనే
యతులితసత్ప్రబంధ మగు ♦ నా చెడుపొత్తక మెన్నఁడేనియున్?
నుతు లొకలక్షమానుసులు ♦ నోరికి వచ్చినరీతిఁ జేసినన్
క్షితి శునకం బొకప్పుడును ♦ సింహముగాఁగలదే గుణప్రథన్?

అను మూఁడుపద్యములను రచియించి, వివేకవర్ధనిపత్రికయొక్కయుపరితలపత్రమునం బ్రకటించి యున్నారు.

తరువాతఁ జాలకాలమునకుఁ బిమ్మట వేంకటరత్నము పంతులుగారు తాము రచియించిన "బిల్వేశ్వరీయము"నందుఁ బైనీతిప్రబోధమునుజ్ఞప్తియం దుంచుకొనియే.

క. తన మొగము దనకు నగపడ
దనువుగ నద్దమునఁగాక ♦ యటులగుట మహా
ఘనుఁడైనను గవియొరుచే
తన తెలిసికొనంగఁ దగును ♦ దనతప్పొప్పుల్.

గీ. నెమ్మిమైఁ గనఁ గృతిని గు ♦ ణమ్ము లెల్ల
నగపడుం బగవాఁ డైన ♦ నన్నిదోష
ము లగుఁగావున నారెంటి ♦ మొనయ కాత్మఁ
గృతివిమర్శకు లగువారు ♦ హితులు కవికి.

అనుపద్యములను రచియించి యుండవచ్చు నని మనము నిశ్చయింపవల
సి యున్నది.

ధవళేశ్వరపుపాఠశాలయందుఁ బ్రధానోపాధ్యాయులుగ నున్న యీ 1875వ సంవత్సరమున వీరేశలింగముగారికిని దత్పాఠశాలాధ్యక్షులకును గొన్నివిషయములఁ గలతసంభవించుటం జేసియుం దామును చెన్నపురమునకుం జని, ముద్రాయంత్రము నొకదాని నటకుం దెచ్చి "శ్రీవివేకవర్ధని" పత్రికను గ్రమముగ జరుపుచు స్వచ్ఛందముగ జీవనము నడుపనిశ్చయించి యుండుటం జేసియు, నాపనిని వదలుకొని, యిటకు వచ్చి, యీ సంవత్సరముననె తా మొక్కరు చెన్నపురమునకుం జనిరి. అప్పటికే వీరేశలింగముగారి నెఱింగినవారలు చెన్నపురమున ననేకులుండిరి. చెన్నపురమును జూడవలయు ననునభిలాష పంతులవారికిఁ జిరకాలమునుండి మనసునగాటంబుగ నాటుకొని యుండుటం జేసి, ధూమశకట మెక్కినది మొదలుకొని పట్టణము నెన్నఁడు చూతునాయనియును, నుత్తరప్రత్యుత్తరముల మూలంబుననె యమితమైత్రిని సంపాదించినవారల నెదుట నెన్నఁడు చూతునా యనియు ననుకొనుచుండ మూఁడునాలుగు దినములకుఁ జెన్నపురమునఁ బ్రవేశించిరి అప్పుడు ధూమశకటమునుండి దిగునప్పుడు పంతులవారి మనసునఁ గలయధికోత్సాహ మిట్టిది యని చెప్ప నెవరికి నలవిగాదు. అక్కడి ప్రియమిత్రులందఱు వీరిరాకకు నిరీక్షించియుండుటం జేసి, ధూమశకట వచ్చినతోడనె మిత్రవాత్సల్యాతిశయమున నధికానందమగ్నులయి, పంతులవారిని గనుంగొని యింటికిఁ గొనిపోయి, భోజనాదిసదుపాయముల నరసి తగినగృహమున విడియించిరి. ఆకాలమునం దక్కడి మిత్రులలో బ్రధానులయిన కాగ్మంచి సుబ్బరాయలునాయఁడుగారు, పిమ్మటఁ దమపుత్రిన శాప్రధానపట్టణమున నున్న చిత్రాతిచిత్రముల నెల్లఁ గ్రమంబుగఁ జూపుచు నొకదినమునఁ దమమిత్రులగు కొల్లా సుబ్బారాయలుశెట్టిగా



రియింటికిఁ గొనిపోయిన, వారలు వీరేశలింగముగారిని సముచితసత్కారంబుల సంభావించి, కుశలప్రశ్నపూర్వకంబుగ గ్రంథవిషయంబులం గూర్చి సంభాషించుచుఁ, సందర్భవశమున శ్రీమదాంధ్రభారతమును శుద్ధాంధ్రంబున సంగ్రహంబుగ రచియించిన నెంతయు బాగుగ నుండునని యందఱేకీభావంబునఁ దమయభిప్రాయమును పంతులవారికిం దెలిపిన నయ్యది తామిదివఱకే యాలోచించియుండుటంజేసి, వారలకోరిక నంగీకరించి, సంతోషపూర్వకముగ వారలకు వాగ్దానంబొసంగి, సెలవుగైకొని, పిమ్మటఁ గొన్నిదినంబు లప్పట్టణమున నుండి, ముద్రాయంత్రము మొదలయినవన్నియు బేరముచేసికొని, రాజమహేంద్రవరమునకుం జని సామ్యానంపెదనని తమమిత్రుల కెఱింగించి, యందఱికడ సెలవు గైకొని, మిత్రుల కందఱకు కతివిచారకరంబగునటులు ధూమనౌక నెక్కి యుక్తకాలమున సురక్షితంబుగ రాజమహేంద్రవరంబునకు మఱలివచ్చిరి.

అప్పటికి ముఖ్యపాఠశాలగా నున్నయీసర్వకళాశాలయందలి క్రిందితరగతుల కొకయుపాధ్యాయుఁ డగత్యముగాఁ గావలసి యుండుటచే, నాపనిని వీరి కొసంగిరి. పిమ్మట నాయుపాధ్యాయత్వంబును గ్రమంబుగ నిర్వహించుచుఁ, గొందఱు మిత్రులునుం దామునుగలిసి తెప్పించిన స్వకీయముద్రాయంత్రమునుండి "వివేకవర్ధని" పత్రికను సాధ్యమయినంతవఱకు యుక్తకాలమునకు వెలువడునటులు చేయుచుఁ బరిశ్రమమునకు వెనుకదీయక కాలమంతయు విలువగలుగునటుల వినియోగించుచుండ, నట్లించుమించుగ రెండుమూఁడు సంవత్సరములు గడచెను. ఈమధ్యకాలమునఁ జెన్నపురమునందలి స్నేహితులు భారతసంగ్రహమును శీఘ్రముగా రచియించి యటకంపినచో నద్దానిని బ్రచురించెదమని, యనేకసారు లుత్తరములు వ్రాయుచువచ్చిన నితరగ్రంథము లనేకములు వ్రాయనారంభించి యుండుటంజేసియు, దేహమునం దస్వా

స్థంబుగ నుండుటంజేసియు, 1878 వ సంవత్సరము డిశంబరు సెలవులు వఱకును దీనిని వ్రాయనారంభించుట కెంతమాత్రమును వలనుపడక పోయెను. సెలవులారంభించు సమయమునకు సెలవులలోనైనను దీనిని ముగింపవలయునని మఱిమఱి యుత్తరములు వచ్చుచుండుటంజేసి, చేసినవాగ్దానమును చెల్లించెదనని వారలకుం బ్రత్యుత్తరములువ్రాసి, వ్రాయనారంభించిన యితరగ్రంథముల నాఁపివేసి, శుద్ధాంధ్రభారత సంగ్రహమును రచియింప నారంభించి, మిగుల వేగముగానించుమించుగ రెండుమూఁడుమాసంబులలో ముగించి, 1879వ సంవత్సరంబునఁబుస్తకమును చెన్నపురమునకుం బంపిరి. అయ్యది వారలంద ఱాద్యంతము సావధానంబుగఁ బరిశీలించి, గ్రంథకర్తసామర్థ్యాతిశయమును బహుభంగులఁ గొనియాడుచుఁ బుస్తకమును ముద్రింపించుచున్నార మని పంతులవారికిం దెలియఁజేసిరి.

కన్నులకుఁ బెనుఁబండువయొనర్చి, మనసున కమితసంతోషమును గలుగఁజేసిన చెన్నపట్టణమును గూర్చియు, నేతత్పట్టణవాసులగు కొల్లా సుబ్బారాయలుసెట్టిగారు తమ్మొ శుద్ధాంధ్ర భారత సంగ్రహమును వ్రాయఁగోరుటను గూర్చియు, నందులకుం దామియ్యకొనుటను గూర్చియు, నిందలిపీఠికయం దీక్రింది పద్యములను వెల్లడించి యున్నారు.

చ. అడవిమెగంబు లందమగు ♦ నట్టిపులుంగులు నున్నకోట యె
క్కడఁ గనువారి వేడ్కకయి, ♦ కన్నులపండువుగాఁగ నుండు; నే
కడఁ బలువింత లెల్లఁ జని ♦ కాంచెడివారికిఁగాఁగఁ గూరుపం
బడిన వెడందసాల చెలు ♦ వంబుగఁ జూపఱకన్నువిందుగాన్.

ఉ. ఎక్కడఁ గూడి నాయముల ♦ నేర్పురుతేర్చెడుగొప్పకొల్వు వే
ఱెక్కడ నీడు లేక తగు; ♦ నెక్కడఁ బిల్లల కన్ని విద్దెలుం
జక్కఁగ నేర్పి తేటపఱుఁగ ♦ జాలినవిద్దెలసాల యొప్పుఁ; దా
నెక్కడ, గొప్పకోట యొకఁ ♦ డింపగు ధామములు నిండియుండఁగాన్.



సీ. ఏవీటితూర్పున ♦ నెసఁగును సంద్రంబు
డాయరానియగడ్త ♦ యోయనంగ
నేపోలినుండి తా ♦ మింటిలోఁ బొగబండు
లెల్లెడలకు నిచ్చ ♦ లేగి వచ్చు
నేనేలఁ బొగయోడ ♦ లించుకలో దీవి
వారినైనను గొని ♦ వచ్చి నిలుచు
నెచ్చోట నాణెము ♦ లచ్చొత్తుచుండెడు
జానుమీఱెడుటంకె ♦ సాల యుండె
రాణిగారికి మాఱుగా ♦ రాచఱికము
వెలయఁ జెల్లించుదొర తన ♦ కొలువువారి
తోడ నెచ్చట నెప్పుడుఁ ♦ గూడియుండు
నట్టిచెన్నపట్టణమున ♦ కేలరు వేడ్క.

సీ. ఏనొకపనిమీఁద ♦ నేగియున్నపుడు నా
కూరిమినెయ్యుఁడై ♦ కారుమంచి
సుబ్బరాయలునాయఁ ♦ డబ్బుర మగువాని
నెల్ల నా కావీట ♦ నెలమిమీఱఁ
జూపుచు నొకనాఁడు ♦ సుబ్బరాయలుసెట్టి
గారియింటికి నన్ను ♦ గారవమునఁ
గొనిపోవ దవ్వుగ ♦ గురుసామిసెట్టియు
నన్నయు నెదురుగా ♦ నరుగుదెంచి

గీ. మేడమీఁదికిఁ గూరిమి ♦ మీఱ నన్ను
నెలమిఁ గొనిపోయి తమ్ముల ♦ మ్ముల నొసంగి
కరము మరియాద యొనరించి ♦ సరస నొక్క
కుర్చిమీఁదఁ గూర్చుండనీ ♦ నచ్చి యవల.

గీ. సేమ మారసి మఱికొంత ♦ సేపు వేడ్క
ముచ్చటలతోడ నచ్చటఁ ♦ బ్రొద్దుపుచ్చి

మాటవెంబడి పాండుకొ ♦ మాళ్ళకతను
గొలఁదిగాఁ దెనుఁగునఁ జేయఁ ♦ గోరుటయును.

క. కొల్లావారలు పెల్లుగ
నల్లెడలను బేరువడుట ♦ నెన్నన్నియొచా
వళ్ళను బలునత్తరువులఁ
గొల్లగ నిలుపుటయు నెంచి ♦ కొంకనిమదితోఁ.

గీ. నేను నీకొని యీమాడ్కి ♦ దీని వ్రాయఁ
బూనినాఁడను దెలుఁగునఁ ♦ బొలుపుమీఱ
వారి కెప్పుడు మేలును ♦ గోరునట్టి
కందుకూరి వీరేశలిం ♦ గ మనువాఁడ.

ఈశుద్ధాంధ్రభారతసంగ్రహమును సావధానముగ నంతయుఁ జదివినచో నిందుభారతకథయంతయు నెంతె హృదయాహ్లాదకరం బగునటు లెట్టిరసపుష్టి గలిగిన మృదుమధురసులభమైనయనర్గళ మగుశైలిని దెలుపఁబడియున్నదియు నుకరంబుగ గోచరము గాక మానదు. ఇందలి ప్రవాహశైలి,

సీ. శ్రీరస్తుశుద్ధాంధ్ర ♦ భారతసంగ్రహ
ము వినుఁడి ఇది చెన్న ♦ పురిని మిగుల
వాసినిగన్న కొ ♦ ల్లా సుబ్బారాయలు,
సెట్టియు గురుసామి ♦ సెట్టియు నను
వారి కంకితము ♦ వసుధలోఁగలపట్ట
ణంబులలోన గ ♦ ణ్యతకు నెక్క
గౌతమీనదితూర్పు ♦ గట్టున నలలారి
రాజమహేంద్రవ ♦ ర మనుపేర
నమరుపట్టణరాజంబు ♦ నందు నుండు
కందుకూరి వీరేశలిం ♦ గ మనునాఖ్యఁ



బరగుకవిచేతఁ బండిత ♦ పామరులకు
నింపు పుట్టునట్టుగ రచి ♦ యింపఁబడియె.

అనురీతిని, గ్రంథోపరితలపత్రమునందుండియు నారంభమయి యున్నయది. అట్లుపైపద్యమునందును, దాము తెనిఁగించిన తర్కసంగ్రహము నందలి,

క. అన్నంబట్టకృతంబయి
సన్నుతిఁగన్నట్టి తర్క ♦ సంగ్రహమునుదీ
నిన్నేఁటి బాలురకొఱకుఁ
గ్రన్నన వీరేశలింగ ♦ కవి తెనిఁగించెఁ.

అనుపద్యమునందును, "శ్రీమత్కందుకూరి వీరేశలింగకవికృత... * * అని సత్యహరిశ్చంద్రనాటకమునందును, స్వసామర్థ్యముంగూర్చిన దృఢనిశ్చయము గలిగియున్నవార లగుటంజేసియే. "కవి" యని తమకుందామె వీరేశలింగము పంతులవారు వెల్లడించుకొనియున్నారు. కాని, సముచితముగ నుండుటంజేసి యెందులకుం బ్రతిగ మన మేమియుం జెప్పఁజాలము. సావకాశముగా గ్రంథమునంతయుం బరిశీలించి, చూచిననాకిందలిమనోహరమయి యతిసులభమయినశైలికిం గలిగిన వడికి, వీరురచియించిన యేయితరమగునచ్చతెనుఁగు గ్రంథమునందలి శైలికింగలవడియును సరిరాదనితోఁచియున్నది. అందులకుం బ్రధానకారణము పంతులవారంతకు ముందుగఁ గొన్నియచ్చతెనుఁగు గ్రంథములను వ్రాసియుండుటయుఁ, దిక్కనసోమయాజివిరచిత మగుభారతభాగము నంతయు ననేకసారులు చదివియుండుటయు, దీనిని సాధ్యమయినంత శీఘ్రకాలములోనే ముగింపవలసివచ్చుటయు ననియే నేఁజెప్పఁగలను.

ఈకాలమునం దచ్చతెనుఁగు గ్రంథములను జక్కఁగా నేకరీతిశైలిని రచియించి ప్రచురించిన వారలొక్క వీరేశలింగము పంతులవారు మాత్రమే కానఁబడుచున్నారు. శుద్ధాంధ్రమునందు గ్రంథములను

రచియించుటంతగా సులభసాధ్యముగాదని నేనిట వేఱుగఁ జెప్పనక్కఱ లేదు. ఆకారణముచేతనే, తమయాంధ్రకవులచరిత్రముయొక్క ద్వితీయభాగమునందుఁ, గూచిమంచి తిమ్మకవి రచియించిన యచ్చతెనుఁగు పుస్తకములకంటెను మాత్రమే శ్రేష్ఠతరముగానున్నదని చెప్పఁదగునటులు "యయాతిచరిత్రము"ను రచియించిన పొన్నికంటి తెలగనార్యుని చరిత్రమున, "అచ్చతెలుఁగునందు గ్రంథములు రచియించుట మిక్కిలి కష్టము" అని వ్రాసి, స్వానుభవమును వెల్లడించుకొనియున్నారు. పూర్వకాలమునందు సహితము కవులు కొందఱుమాత్రమే తమకృతులలో నక్కడక్కడ నొక్కొక్క యచ్చతెలుఁగు పద్యమును వేయుచు వచ్చిరి. అట్టికవుల సామర్థ్యంబును జూచియే జనులత్యాశ్చర్యపడుచుండిరి. ఈయంశము కృతిపతియన్నట్లుగా యయాతిచరిత్రముయొక్క పీఠికయం దీక్రిందిపద్యముతోఁ జెప్పి, తెలగనార్యుఁడు తనసామర్థ్యంబు నభినందించుకొనియున్నాఁడు.

ఉ. అచ్చతెనుంగుపద్దె మొక ♦ టైనను గబ్బములోన నుండినన్
హెచ్చని యాడు చుందు రది ♦ యెన్నుచుఁ బెద్దలు పొత్త మెల్లని
ట్లచ్చ తెనుంగున న్నొడువ ♦ నందులచంద మెఱుంగువారు నిన్
మెచ్చరొ యబ్బురంబనరొ ♦ మేలనరో కొనియాడరో నినున్.

* * * * *

ఇందలి,

చ. అటువలె నారగించి కలి ♦ వాఱఁగ నత్తువపట్టి లేచి మి
క్కుటముగఁ దొంటివంటకమె ♦ కూర్చినబండిని నెక్కి రక్కసుం
డటుకునఁ జేరి మాఱుకొని ♦ తన్నియుఁ గ్రుమ్మియు నట్టకేలకుం
బెటపెట నెమ్మొకల్ విఱిచి ♦ పీఁచమడంచెను నొక్కవ్రేల్మిడిన్.

ఉ. హత్తులఁ గత్తలానులను ♦ నందపుఁగోవిఱిఁబోండ్ల జాళువా
మొత్తముఁదెచ్చియిచ్చి సతి ♦ మున్నది మెచ్చుచుఁగొల్చుచుండుదుర్



క్రొత్తగ నాల్గుసంద్రముల ♦ కుఁ దనువుం గలరాచసింగముల్
మొత్తములై యటుం గొలువ ♦ తోవల నొప్పెడు నేలదాలుపుర్.

శా. ఏలా వేఁడివెలుంగు నేలకును ని ♦ క్లైతెంచు చున్నాఁడు నేఁ
డో లేఁబాయపుబిడ్డలార, కనుఁ డం♦ చొక్కొక్కచో మానుసుల్
గేలుందోయి తెమల్చి గుంపు లయి యో ♦ లిం జూడరా నింగియుం
గ్రాల న్నారదుఁ జేగుదెంచెఁ గడువే ♦ డ్కం గవ్వడిం జూడఁగన్.

సీ. పలుమానికపుఁగోళ్ల ♦ పసిడిమంచముమీఁద
నంచపాన్పునఁ బవ్వ ♦ ళించునీవు
కటకటా! యిటువంటి ♦ కటికినేలఁ బరుండ
నోర్చితి వెట్లు? దు ♦ ర్యోధనుండ!
వేనవే లెప్పుడు ♦ వెనుకముందులఁ జేరి
కొలువు సేయుచు నుండ ♦ నలరునీవు
బాయ లుబ్బఁగ నక్క ♦ టా! యొంటిఁ బడియుండఁ
జాలితి వెట్లు? దు ♦ శ్శాసనుండ!
యొండకన్నును వాసక ♦ న్నెఱుఁగ కెపుడుఁ
గడమపడ కుంతుసుకములఁ ♦ గాంచుమీరు
వావకును నండకును నెల్లు ♦ వరుస సైఁచి
కుందకున్నారు? నాముద్దు ♦ కుఱ్ఱలార!

సీ. దుస్సలనిమ్మాసి ♦ దొసఁగులపా ల్సేసి
చనితివే? మనుఁ బాసి ♦ సైంధవుండ!
నిను నమ్మదుర్యోధ ♦ నునకుఁగా నుసురులఁ
దొఱఁగితే? ద్రోణుండ ♦ తోడువచ్చి
యొజ్జలంచును నైన ♦ నొక్కింతమోమాట
మెన్నక కెడపిరే ♦ నిన్ను నేఁడు?

మఱచెనొకో మేన ♦ మామను మాటయు
తల్లియుండ నినుఁ జంపు ♦ జమునిపట్టి
తండ్రిపోయినబిడ్డలఁ ♦ దగఁగఁ బెంచి
చదువుసాములు చెప్పించి ♦ సాకినట్టి
నిన్నుఁ బక్షనేయఁ జేయాడె ♦ నే? యకటకట!
పాండునికొమాళ్లకోయి భీ ♦ ష్మండ! యిట్లు.

సీ. మడిసినమగలపైఁ ♦ బడి సొమ్మసిలి లేచి
యార్పులు మినుముట్ట ♦ నఱచువారుఁ
బొలిసిన చెలికాండ్రఁ ♦ దిలకించి కస్తిమ్మెఁ
బుడమిమీఁదను బడి ♦ పొరలువారుఁ
గన్నబిడ్డలమేను ♦ గాకులు పొడువంగఁ
గనలేక మొద మోఁదు ♦ కొనెడువారుఁ
జాఁపకట్టుగఁ బడ్డ ♦ సైదోడుల్లనుగాంచి
మొత్తఁద ప్రయ్యలువాఱ ♦ నేడ్చువారు
నగుచు వగ చెడుమగువల ♦ యడలు టులివు
పుడమియును నాకసంబును ♦ ముంచుకొనియె
నేమి చెప్పుదు నధిగన్న ♦ నెట్టిరాతి
గుండెవానికి వగ పుట్ట ♦ కుండ దప్పదు.

ఉ. వారిని జూచి వారు తెగు ♦ వం గలయంబడి రెండుపాయలై
పోరికొలంది నొండొరుల ♦ నూఱులు వేలును ప్రేలుకొంచు నె
వ్వారిని జీకిం గొనక ♦ వాఁడితనంబునఁ బోరి యొడ్డునం
గోరముగాఁగ నేలపయిఁ ♦ గూలుచు నీల్గిరి తెల్లుదెబ్బలన్.

సీ. తమ్ములు నిల్లాలుఁ ♦ దా తల్లి వచ్చి పాయఁ
దా నొక్కటియు వెంటఁ ♦ దవిలి యుండి



తను నమ్ముకొని వెంటఁ ♦ జనుదెంచినట్టియా
పేదిని నడవిలో ♦ విడువఁ జాల
నను నెప్డుఁ గనిపెట్టు ♦ కొని యున్నవారిని
వడవులపాల్చేసి ♦ యరిగి నేను
సుఖముండుచుండుట ♦ తగ దౌనె? నేనును
దప్పక యాకాన ♦ దపసి నగుచు
నుండి దీని నరయుచుండు ♦ నో? తె మిడుదుఁ
బిదప నిన్ను మెప్పించి నే ♦ వెనుక వత్తు
వేల్పుటమ్మున కిప్పుడో ♦ వేల్పుతేఁడ,
యరదమును గొంచు గ్రమ్మఱ ♦ నరుగు మీవు.

అను నీపద్యములం గాంచిన నిందల్లి ప్రయత్నమనునది లేశమును గానరాని మృదుమధురసులభమయిన యనర్గళకవితాధార వెల్లడికాకమానదు.

ఈ గ్రంథమును, విద్యాశాఖవారు చూచి, ప్రశంసించి, ప్రథమశాస్త్రపరీక్షకుఁ బఠనీయగ్రంథముగ నిర్ణయించి, యందుమూలంబున గ్రంథకర్తకుఁ బ్రోత్సాహమును గలిగించియేయున్నారు. వర్తమానకవులలో నితరు లెవ్వరయిన నీశుద్ధాంధ్రభారత సంగ్రహముంబలె శుద్ధాంధ్రభాగవత సంగ్రహమును సహితము రచియించి, తమకుఁగలసామర్థ్యంబును వెల్లడించుకొని, చదువరుల కమితానందంబును గలుగఁజేయఁ బ్రయత్నించెదరుగాక!

ధవళేశ్వరములోని యాంగ్లేయ పాఠశాలాప్రధానోపాధ్యాయత్వమును వదలుకొని 1876 వ సంవత్సరమున శ్రీరాజమహేంద్రవరమునకు వచ్చిరి. బాల్యమునుండియు ముఖ్యముగ ధవళేశ్వరముననున్న కాలమున మనహిందూమతాచారవ్యవహారములయందుఁ జిరకాలమునుండి యున్న దురాచారపుంజమును వెల్లడించి, యందుమూలమున నిప్పటివారలకుం జేతనయిన యుపకారము నొనర్చుచు నుద్దేశమున నొకవచనప్రబంధ

మును రచియించు నుద్దేశమున నందులకు వలయు నుపకరణములనెల్ల సమకూర్చుకొని యుండుటం జేసి, "రాజశేఖరచరిత్రము"ను పేరిట నొక కథనత్యంత చమత్కారంబుగఁ గల్పించి, గ్రంథమును రచియించుచు, దానిని ముందుగఁ దమ వివేకవర్ధని పత్రికయందుఁ బ్రచురింపఁ గడంగిరి. అయ్యది చూచిన వారలందఱు దాని నతిశీఘ్రకాలములోననె ముగింపవలయునని పత్రికాధిపతిగారి పేరిటఁ బలుమఱు లేఖలను వ్రాయఁదొడంగిరి. పలువురట్లు వ్రాయుచువచ్చిన లేఖలు పంతులవారి కమితోత్సాహంబును గలుగఁజేయ దీనిని సాధ్యమయినంత శీఘ్రకాలముననె యనఁగా మూఁడు నాలుగు మాసములలోననె ముగించి ప్రచురించిరి. ఇందలి కథను కల్పించుటయందు గోల్డుస్మిత్తను నింగ్లీషుకవీశ్వరునిచే రచియింపఁబడిన "వికారాఫ్ వేక్‌ఫీల్డు"ను గ్రంథసాహాయ్యంబును గొంతఁ బొందినను, దానికిని దీనికిని విశేషసంబంధమేదియు లేదనియు, నిందలివిషయములన్నియు నూతనములయినవే యనియును దీనిం గూడఁ జదువువారలకు సులభంబుగఁ దెలియకమానదు. ఇయ్యది పదునైదు ప్రకరణములుగ విభజింపఁబడియున్నది. ప్రతిప్రకరణారంభంబునందలి ముఖ్యాంశంబులు సూక్ష్మముగా ముందు వివరింపఁబడియున్నవి. హిందూమతానుగుణ్యంబగునటులెంతయు స్వభావసిద్ధంబుగ నుండి, వివేకచంద్రిక యనం జననెంతయు సర్వోత్కృష్టంబుగ గ్రంథమును రచియించిన తత్కర్త సామర్థ్యాతిశయంబు నెట్లు శ్లాఘింపవలసియున్నదియు నేనెఱుంగనేరకున్నవాఁడను. ఇట్టి వచనప్రబంధమును రచియించుట వర్తమానమునం దితరులకు సులభసాధ్యంబుగా నేరదనుట నిర్వివాదాంశమే కాని, మఱియొకటిగాదు. పంతులవారిటీవల రచియించిన యుపన్యాసాద్యుపనదుల కిది యొకమహానదియని చెప్పవచ్చును. ఇందలి ప్రథమవాక్యంబీచరిత్రాంగనకుఁ దిలకముగ విలసిలుచున్నది. ఏతద్వాక్యరత్నమును దిలకించువారలకీ గ్రంథకర్తకుఁ గలవర్ణనాచమత్కృతి తేటపడకమానదు.



ఈచరిత్ర మాకాలంబున సర్వకళాశాలావిద్యావిధాయకులుగ నున్న కర్నల్ రాబర్టు మెకంజిమెక్‌డానల్డు దొరవారి కంకితము చేసిరి. పిమ్మట నిది మెగ్డానల్డు దొరవారిమిత్రులలో నొకరగు జె. రాబర్టు హచ్చినదొరవారిచే "ఫార్చ్యూన్సు వీల్" అను పేరిట నింగ్లీషుభాషకుఁ జక్కగా భాషాంతరీకరింపఁబడి మొట్టమొదట 1886వ సంవత్సరమునఁ జెన్నపురమునందలి క్రిస్టియన్ కాలేజీమ్యాగజీనునందుఁ బ్రచురింపఁబడి, పిమ్మట 1887వ సంవత్సరమున గ్రంథరూపముగ ముద్రింపఁబడి యున్నది. మఱియు నిది కన్నడభాషకు సహితము భాషాంతరీకరింపఁబడి యున్నయది. కావున వీరేశలింగముగారి ప్రఖ్యాతి యొక్కమనయాంధ్రదేశంబుననే కాక హూణదేశంబునసహిత మల్లుకొనియున్నది. ఇంచుమించుగఁ బ్రపంచమునందంతటను వ్యాపించియున్న హూణభాషకు భాషాంతరీకరింపఁబడియున్న యీగ్రంథ మితరదేశభాషలకు సహితము మార్పఁబడియుండక మానదు. కరంబు హృదయరంజకంబుగ నుండునటులు రచియింపఁబడిన యిట్టివివేకచంద్రికను బరిశీలించి, విద్యాశాఖవారు దీనిని బాఠశాలల నుపయోగింపకుండుట జూడ నెంతయుఁ జింతింపవలసియున్నది.

ఈరాజశేఖరచరిత్రంబున నున్న "చిన్నప్ప డెప్పుడో చచ్చిపోయి నమగఁ డున్నట్టుకొని వేధించుచున్నాఁడన్న సిద్ధాంతికొమార్తె పెద్దదయి బ్రతికియున్న మఱియొకమగఁడు మిక్కిలిమక్కువతో తన్నాశ్రయించి మోహింపఁజేయఁగా నాతని వెంట నింటదొరికిన సొత్తునెత్తుకొని లేచిపోయి చెడి కడపట దాసియయి తమకన్నుల ముందరనే గ్రామములోఁ దిరుగుచుండుటయు, బాల్యదశలోనే భర్తలను బోఁగొట్టుకొన్న భాగ్యహీనురాండ్రయిన ముద్దియలు పడుకష్టములును, అట్టివారు దురతిక్రమణీయ మయినకామబాధకుఁ దాళఁజాలక యింద్రియచాపల్యము

ళ దుష్టపురుషులవలలలోఁబడి పాడగుచుండుటయు, కొందఱు కులము వారికి వెలిచి రహస్యముగా శిశుహత్యలు గర్భపాతములు మొదలయిన ఘోరపాతకముల కొడిగట్టుచుండుటయు, ప్రతిదినమును కన్నులారఁ జూచి మనసుకరఁగి యట్టిబాలవితంతువులదుర్దశను తొలఁగించుటకేమయినఁ జేయవలయు నని పలుప్రయత్నములుచేసియు; మూఢశిరోమణు లయినజనులయొక్కయు నాచారపిశాచావేశసన్యస్తవివేకు లయి యున్నపండితులయొక్కయు మనస్సులను మళ్ళింపశక్తులుగాక విఫలప్రయత్ను లయి రాజశేఖరుఁడుగారు కొంతకాలమునకు లోకాంతరగతు లయిరి." అనువాక్యమే, యిప్పటికి రెండుమూఁడువందలసంవత్సరంబులకు వెనుకనె కాలానుసారంబుగఁ గొన్నిమార్పులావశ్యకములని యెఱింగి, స్త్రీపునర్వివాహంబులఁగూర్చి పండితులతో నుద్దండలీలలఁ బ్రసంగములు సల్పిన అప్పయ్యదీక్షితులవారిం గూర్చియు, నాకాలమున స్త్రీపునర్వివాహంబులు నెఱవేర్పవలయునని గ్రంథకర్తకుంగల దృఢనిశ్చయమును గూర్చియు వెల్లడించుటకుం జాలియుండును.

సంస్కారవిషయమునం దిట్టియుద్దేశములు వీరేశలింగముపంతులుగారి కున్నట్లు వేంకటరత్నముపంతులుగారు గ్రహింపఁజాల కుండుటచేతనే పాప క్రిందియుత్తరమును వీరేశలింగముగారిపేర వ్రాసియున్నారు.

బ్రహ్మశ్రీ మహారాజశ్రీ కందుకూరి వీరేశలింగముగారి సముఖమునకు.

తమవిధేయాప్తుఁడు కొ. వేంకటరత్నము నమస్కరించి కావించువిజ్ఞప్తి.

సుహృత్తములగుసహృదయులారా!

విశాఖపట్టణములోనుండెడు శ్రీపరవస్తు వేంకటరంగాచార్యులయ్యవారలుంగారు నవనాగరికాగ్రేసరులై వితంతువివాహము కర్తవ్య



మని యొకచిన్నపొత్తముం బ్రకటించిరిగద. తద్విషయమున మనము మిన్నకుండవచ్చునా? తమకుందోఁచినట్లు ఖండనవ్రాసి పంపుఁడీ! నేను నిందస్మృత్సభాసదులతోఁ దద్ఖండనపరాయణుండనై యున్నాఁడను. నాస్తికతాహార్మ్యసోపానవిష్టపరులైన వారు దుష్టులుగాక శిష్టులగుదురా? మనవారి స్వాచారానాదరమును దురాచార నిషేధకరణోపేక్షయు నిట్టిదశకుఁ దెచ్చె. మనము నిట్టియెడ మౌనమూనుటమానుగాదు. నవనాగరికులకున్న స్వాతంత్ర్యము మనకుఁ గలదు. జంకనేల? తోఁచినది ధర్మము నిక్కముగా వక్కాణించుటకెల్లరును స్వతంత్రులు? కాఁబట్టి తాము దురాచారమర్దనమునకు నడుగిడుఁడు. దైవము మనకుఁ దోడ్పడుఁగాక! మనము కించిజ్జ్ఞల మని శంకింపంబనిలేదు. సర్వజ్ఞుఁడు భగవంతుఁడొక్కఁడే. కానఁ బ్రాచీనాచారదూషకులగు నవనాగరికులు మనకు జయ్యులుగాఁదగుదురు. ఎందువల్లననఁగా వారు స్వోక్తియుక్తిప్రమాణవాదులు. మనమో ప్రాచీనమహానుభావనివిష్టకార్యభారులము. కావున మన మన్యులచేత జయ్యులమైనను, పరాజయము మనకేనాఁడును గలుగనేరదు. ఒకవేళ మనకంటె విధవావివాహవాదులు బలవంతులైనను మనము భీష్మానుయాయుల మగుదముగాక! మనప్రతిపక్షులు భార్గవప్రతిభు లగుదురుగాక! ధర్మమే జయము. చింతయేల? మనమందఱము గూడుకొన్నఁ బ్రతివాదులు విత్తమత్తులైనను, మత్తగజంబులు శృంఖలాబద్ధంబులై కదలకుండు చందంబున నగుట సిద్ధము.

"శ్లో. బహూనామల్పసారాణాం సమవాయోదురత్యయః
తృణైర్విరచ్యతేరజ్జు ర్బధ్యంతేనదంతినః"

అనియుండుట జగత్ప్రసిద్ధముగద! తమసదుత్తరము ప్రతిక్షణము ప్రతీక్ష్యమాణంబు.

ఇట్లువిన్నవించి నమస్కరించు,
భవద్విధేయాప్తుఁడు
కొ. వేంకటరత్నము.

భావనామ సం॥ అధికాషాఢ
శు 5 గురువారము.

అట్లు రాజశేఖరచరిత్రమును రచియించుచుండి, హిందూవివాహములయందు వ్యాపించియున్న దురాచారముల నెల్ల వెల్లడించుతలంపున "బ్రాహ్మవివాహము" ను నాటకమును రచియించిరి. చదువరులమొగములం దప్పక యమితహాసకాసారములుగఁ గావింపకమానని యీనాటకమును స్వంతముగఁ జూచితీఱవలయునుగాని యిట్టిదియని చెప్పుటకు సాధ్యముగాదు. పలువురీబ్రాహ్మవివాహమును 'పెద్దయ్య పెండ్లిపుస్తక'మని వ్యవహరించుచుందురు.

ఈనాటక మేడంకములుగ విభజింపఁబడియున్నది. అందుప్రథమాంకమున సాధారణముగాఁ గొందఱుదంపతులకుఁ గలవైకమత్యాభావమును చిన్నతనములో వివాహముచేయుటకును, పెద్దవారి కిచ్చుటకును చెప్పు నుచ్చితహేతువులును, పెండ్లిబేరమును, కుదిర్చెడువారు చేయుకుతంత్రములును, శాస్త్రమిషమున స్వకపోలకల్పితములయిన శ్లోకములను చదివి చేసెడిమోసమును, కొంతసంగ్రహముగాఁ జెప్పఁబడినవి; ద్వితీయాంకమున ముసలివాండ్రు తాముచిన్నపిల్లలను వివాహమగుటకుఁ జెప్పెడుకారణాభాసములును, వివాహకార్యములలో జ్యోతిష్కులుచేయుమాయలును, రాయబారులుగా నుండువారు ధనార్జనమునకయి చేయుకపటకృత్యములును కొంతవఱకు వివరింపఁబడియున్నవి; తృతీయాంకమున నిశాలగ్నము పెట్టుటవలన సంభవించెడి యిబ్బందులను, పాతివ్రత్యము నేర్పఁదగిన యాకాలములో లంజెలచేత సొమ్మువ్యయపెట్టి, బూతుపాటలుపాడించుదురాచారమును, ఉపదుపుకన్నెల నుంచుకొన్నవారు పిలువనిదేవచ్చి దంభమునకయిపసుపు నొసఁగుటయు, తదితరులుకూడ నొసగు లిచ్చుటచేతఁ గలిగెడినష్టములును తెలుపఁబడినవి; చతుర్థాంకమున సభాతాంబూలములు సభాపతులని పిలువఁబడెడి నిరక్షరకుక్షు లయినబ్రాహ్మణనామధారకులకు ముట్టుటయు అపాత్రసంభావనక్రింద విశేషధనము వ్యర్థపఱచియు, తిట్లుతిని, యప్పులపాల



యి, పాడగుటయు, వర్ణింపఁబడినవి; పంచమాంకమున భోజనములకు వచ్చువారు వ్యర్థడంబమునకయి లాంతరులు మొదలగువాని కొఱకు ప్రయాసపడుటయు, వేళకు రాక పలుమాఱుపిలిపించుకొనుటయు, ఎంతసేపువఱకును రానితప్పిదమును తమయొద్దనుంచుకొని, మీఁదిమిక్కిలి తొందరపడియున్నవారు భోజనమునకుఁ గూరుచున్న చోకోపపడి లేచిపోవుటయుఁ, జెప్పఁబడినవి; షష్ఠాంకమున రాత్రికాలమున నూరేగుటవలన పెండ్లివారికిని, పరులకునుగూడ, నిద్రాభంగము మొదలయినవి సంభవించి కలిగెడిచెడుగులును, వసంతోత్సవసమయమునఁ బెండ్లివారిలోనే కాక యితరులలోఁగూడ జరిగెడియనాగరికము లైనమోటుపనులును మానవప్రకృతి కనర్హము లైనపరిహాసకములును, సంతోషసమయ మైనయప్పగింతలవేళ నేడుపు మొదలుపెట్టుబుద్ధిహీనతయు, ముత్తయిదువ లనువారిస్థితియు వాకొనఁబడినవి; సప్తమాంకమున ముసలివాండ్రకు పిల్లనిచ్చెడివారికి పుట్టుతలఁపులును, వారిచేష్టలును, ముసలివాండ్రను జేసికొన్నవారికిఁగడపటలభించుగతియును, జీవితకాలములో వారిచర్యలును తేటపఱుపఁబడినవి. వేయేల? ఇందువ్రాయఁబడిన ప్రతివాక్యమును నేదోయొక దురాచారమును వెల్లడిచేయుకొఱకే యుద్దేశింపఁబడియున్నది; కాన, దీనిం జదువువారు వట్టివేడుకకొఱకుమాత్రమే చదువక దానియుద్దేశమునుగూడ శ్రద్ధతో విచారింపఁ గోరఁబడుచున్నారు. దేశాభిమానులయిన వారలిందలిభాగములను కొందఱికి నేర్పించికాని, పుస్తకమును జూచియైనఁ జదివించికాని, జనసమూహము ముందఱనాడించినచో, నిందులో వివరించినరీతిగల యక్రమములకు లోనగువారు కొంతవఱకు సిగ్గుపడి, ముందు తమ ప్రవర్తనమును జక్క చేసికొందురనుటకు సంశయముండదు.

ఇప్పటికిం గుతుకంబుననున్న కవితాసాహితీపటిమంబు పంతులవారి ననేకగ్రంథములు రచియింపఁ బురిగొల్పుచుండ, నొకసమయమున

"మున్న నన్యసాధ్యంబగునట్టుల "శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధ" మను మహాకావ్యరత్నమును, రసికజనమనోరంజన మనంజన "రసికజనమనోరంజన" మను నొక ప్రబంధరత్నంబును, మఱియు నింకను గొన్ని గ్రంథములు రచియించితిఁగదా! యింక సంస్కృతగ్రంథము నొకదాని నాంధ్రీకరించి శాశ్వతమగు యశమును సంపాదింపవలయు" ననితలంచి, హిమగిరి పరిసరసానుతలచరచ్ఛింహకిశోరం బున్మదగజగండపిండనిర్దళనపరతం జెంగునలంఘించుఁ గావునఁ జయ్యన నతులితశ్లోకముక్తాఘనీగర్భీకృతకాళిదాసమహాకవికుంభికుంభం బనం జనునాయభిజ్ఞానశాకుంతలముం దెనిఁగింపగమకించియుండ, నంతకుఁగొంతకు పూర్వమున నె శ్రీవివేకవర్థనితోడనె యాంధ్రభాషాయోషారత్నంబునకుం గవలపిల్లవడువున జనియించి విశాఖపట్టణమునం బ్రచురింపఁబడుచుండెడి "సకలవిద్యాభివర్ధని" యనునొక మాసపత్రికయం దాంధ్రాభిజ్ఞానశాకుంతల మొకటి ముద్రింపఁబడుచుండుట తమ మిత్రులవలన నెఱింగి, యొక్క హిందువులుమాత్రమే కాక, నాగరికాగ్రేసరు లయినపశ్చిమఖండ పండితులు సహితము నాటకరాజ మని శిరసావహించిన యభిజ్ఞానశాకుంతలముగాని మఱివేఱుగాదని, తలంచి, యద్దానిం జూచి, యియ్యది రసవంతముగా నాంధ్రీకరింపఁబడుచుండినచో దామహాకృషి మిక యనువారుగానుండఁ దలంపులేనివారలగుటచే, నానాటకమును మాని, మఱిదేని నేనియుం దెనిఁగింపఁదలంచి, యానాటకము ప్రచురింపఁబడిన సకలవిద్యాభివర్ధని ప్రతులం గొన్నిఁటిని సంపాదించి, యందు మూప్పాతిక మున్నీసములు కాళిదాసునిశ్లోకము లాంధ్రంబునఁ బద్యరూపము లంద భాషాంతరీకరింపఁబడిన విధంబంతయుఁ గన్నులార విలోకించి, యియ్యది యట్లు తెనిఁగింపఁబడిన నంతగా రసవంతముగా నుండ దని మనసున సిద్ధాంతీకరించుకొని, తామానాటకమును మిగుల రసోదంచితంబుగ నుండునటులు తెనిఁగింపవలయు ననునుత్సాహము మనసున నుద్దీపింప, భిన్నదేశంబులనుండి బహు



ప్రతులను సంపాదించి, వానిని మిగుల యోపికతోడం బరిశీలించి చూచి, గ్రంథమాధుర్యం బెట్టి దని క్లుప్తీకరించి చెప్ప నశక్యం బగునటుల కాళిదాసునియాశబ్దార్థగౌరవంబు నాలలితపదమాధుర్యంబు నాతల్పనాసౌరభ్యంబు నర్థగుంభితంబు గాక, మృదుతరద్రవనవనీతతులితపదసలలితపద్యగద్యంబుల గుప్పగుప్పనందావి తెలుసంగు కప్పురంబు, వడువున నర్థంబంతయు సరళంబుగఁ దేటపడ నాద్యంతము మేలుముత్తియంబులలీలం బద్యంబులు చెలువువహించి, ప్రకాశింపఁ గరంబు సర్వజనాహ్లాదకరం బగునటులు నాటకమును ముగించిరి. ఈనాటకము ననేకసమాజములవారలు తమతమ రంగస్థలంబులఁ బ్రయోగించి, చూపరకందఱ కమితాహ్లాదమును గలుగఁజేసి, పంతులవారికెంతయుఁ బ్రఖ్యాతిని సమకూర్చియున్నారు. ప్రప్రథమమునం దీనాటకమిప్పురంబునఁ బ్రయోగింపఁబడుతఱి నిందలిపాత్రంబులం గైకొనినవారలనేకులు నేటికాదినములు గడచి రమారమి పదిసంవత్సరములు గావచ్చినను నేటివఱకుం దాముసుజూపఁజు నప్పుడనుభవించిన యమ్మహానందము మొగంబుల వెల్లిగొలుపఁ ముచ్చటించుచుండఁ బలుమాఱులు నేఁజూచియున్నాఁడను.

అత్యంతశ్లాఘాపాత్రంబును, నాతికఠినమృదుమధురపదసంభరితసప్తాంకవిలసితమును నగునీయభిజ్ఞానశాకుంతల మొకయమూల్యసప్తమణిహార మనియు, నిందత్యంతశోకశృంగారరససంపూరితం బగు నాల్గవయంకము నాయకమణియనియుం జెప్ప నొప్పును. అట్టినాటకరాజమును భాషాంతరదర్పణంబునఁ బ్రతిబింబంబుచందంబున నాంధ్రీకరించినదియు నేనిదియు గ్రంథద్వయంబును విమలాంతరంగ విమర్శకావలోకనంబుల విలోకించినం దేటపడకమానదు. ప్రారంభమునం దానాటకము నాంధ్రీకరింప నారంభించినది దినదిన ప్రవర్ధమానంబుగఁ బండిత మండలాగ్రగణ్యులని ప్రఖ్యాతినిగాంచియున్న మహామహోపాధ్యాయ బిరు

దాంక విలసిల్లు నగు శ్రీపరవస్తు వేంకటరంగాచార్యులయ్యవారలుగారు. ఆచార్యులవారు తెనిఁగించినరీతిని సూచించుట కందుండి స్థాలీపులాకన్యాయంబుగ మూఁడునాలుగుపద్యములను మాత్ర మిట నుదాహరింపఁ దలంచియున్నారు.

*　　*　　*　　*　　*

మహాకవియయిన కాళిదాసునిసామర్థ్యాతిశయంబంతయు నాందియందే కానఁబడుచున్న దిగదా! ఆయాచార్యులవారు నాందినంతయు ముఖ్యముగా నారంభమునందలి శివస్తోత్రంబగు

యాసృష్టిస్స్రష్టురాద్యావహతి విధిహుతం యాహవిర్యాచహోత్రీ
యేద్వేకాలం విధత్తశ్శ్రుతివిషయగుణా యాస్థితావ్యాప్యవిశ్వం
యామాహుస్సర్వభూతప్రకృతిరితి యయాప్రాణినః ప్రాణవంతః
ప్రత్యక్షాభిః ప్రపన్నస్తనుభిరవతు వస్తాభిరష్టాభిరీశః.

అను శ్లోకము నెట్లు భాషాంతరీకరించిరో చూడవలయు నను కుతుకంబు మనమున నుదయింప “సకలవిద్యాభివర్ధని” జూచినతోడనే, యయ్యది, నాటకమంతయుఁ దెనిగించినయనంతరమునఁ దెనిఁగింపవలయు నని యూహింపఁబడుటచేఁగాఁబోలు! ప్రచురింపఁబడక, మూలమునందలి “తతః ప్రవిశతి మృగానుసారీ చాపహస్తో రాజా రథేన సూతశ్చ” అనుదానికి “అంతన్ బ్రవేశింపుచున్నాఁడు శరచాపహస్తుండయి మృగంబు ననుసరింపుచున్ రాజును, రథంబుతో సూతుఁడును.” అని. పఱగనుండుటలిట్లొక విచిత్రసంపూర్ణవాక్యంబున కర్త కర్మ క్రియలతోఁగాక, క్రియ కర్మ, కర్తలతో నాటకము ప్రారంభింపఁబడియున్నది. ప్రథమాంకమునందలి,

గ్రీవాభంగాభిరామం ముహురనుపతతి స్యందనే బద్ధదృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్టశ్శరపతనభియాభూయసాపూర్వకాయం



దర్భైరర్ధావలీఢైశ్శ్రమవివృతముఖభ్రంశిభిః కీర్ణవర్త్మాన్
పశ్యోదగ్రప్లుతత్వాద్వియతి బహుతరం స్తోక ముర్వ్యాం ప్రయాతి.

అనుశ్లోకంబును,

మ. పలుమాఱున్ వడివచ్చుతేరుపయిఁ గ్రీ ♦ వం ద్రిప్పి యీక్షింపుచున్
బోలుపారన్ శరపాతభీశ్రిత తనూ ♦ పూర్వార్ధమై సుశ్రమ
స్ఖలదాస్యాపత దర్ధ జగ్ధకుశసం ♦ క్రాంతాధ్వమై యుత్ప్లుతా
కలనంగొంచెము భూమి నెక్కుడు దివిన్ ♦ గాఁ బర్వెఁ ఁగంటివే?

అనియును,

నఖలు నఖలు బాణస్సన్నిపాత్యోయ మస్మి
న్మృదుని మృగశరీరే పుష్పరాశా వివాగ్నిః
క్వ బత హరిణకానాం జీవితం చాతిలోలం
క్వ చ నిశితనిపాతా స్సారపుంఖా శ్శరా స్తే.
తత్సాధు కృతసంధానం ప్రతిసంహర సాయకం
ఆర్తత్రాణాయ వశ్శస్త్రం నప్రహర్తు మనాగసి.

అనుశ్లోకరత్నంబులను,

చ. వలవదు చెల్లదీమృదుల ♦ బాలమృగాంగముపై శరంబు పే
శలతరపత్రరాశిపయి ♦ సంజ్వలదగ్నియనాగ నేయ జం
చలమృగబాలజీవన వి ♦ చారము లెక్కడ తీక్ష్ణపాతముల్
కులిశసమానసారములు ♦ ఘోరము లెక్కడ నీదుబాణముల్.

క. గాన నరనాద కృత సం
ధానంబగు శరము సంహృ ♦ తము సేయఁ దగున్
దీనులఁ బాలింపంగా
దే నిర్దోషులను జంప ♦ నే మీశరముల్.

అనియును భాషాంతరీకరించి యున్నారు. పైశ్లోకములను పద్యములను సావధానంబుగ విమర్శించి చూచిన సంస్కృతంబున నెంతటిపండితు

లయిన సాంధ్రగ్రంథవిరచనంబునం జిరకాలపరిశ్రమం బొందినఁగాని గ్రంథములు భాషాంతరంబుల నింతయు హృదయరంజకములుగా నుండనేర వని చెప్పవలసి యున్నయది.

పంతులవా రిప్పటి కాంధ్రకవితా విరచనపటిమాపారగులగుటం జేసి, శివస్తోత్రం బగు మొదటిశ్లోకము నెంతయు సరిగనుండి మిగులహృద్యంబుగనుండునట్లు

ఉ. ఎయ్యది యాద్యమౌ నజుని ♦ సృష్టికి, హవ్యము నేది తోల్చుఁ, దా
నెయ్యది సోమయాజి, మఱి ♦ యేయవి కాలవిభాగ మిచ్చు రెం;
డెయ్యది తోల్చి శబ్దగుణ ♦ మెల్లెడ నుండును, హేతుభూతమౌ
నెయ్యది సర్వభూతముల, ♦ కెయ్యది ప్రాణము ప్రాణికోటి కెం,
దయ్యతులాష్టదేహముల ♦ నందుశివుం డిడు మీకు భద్రముల్.

అనుపద్యముగాను, మిగిలినశ్లోకములను మృదుమధురపదసమ్మిళితే నిజశైలీ స్వభావానుగుణ్యంబు లగు,

చ. వడిఁ బఱతెంచు తేరిదెసఁ ♦ బల్మఱుమాఱు మెడ వెట్టిచూచుచుం,
గడు శరపాతభీతిఁ దన ♦ కాయము ముందుకుఁ గుంచి, యెంతయుం
బడలిక నోటినిం దెఱచి, ♦ మార్గమునిండ సగంబు తిన్నద
ర్భలు పడ, మింటఁ బాఱెడు ధ ♦ రం బద మూనక, పెద్దదాఁటులన్

గీ. వలదు వల దల్లబాణంబు ♦ వదలఁబోకు
మృదువయినయీకురంగంబు ♦ మేనిమీఁద,
దారుణంబుగ మండెడు ♦ దహనుశిఖను
విరుల మొత్తంబుమీఁదను ♦ విడుచునట్లు,

గీ. వజ్రసారంబు నిశితని ♦ పాతఘోర
మట్టినీమార్గణం బేడ? ♦ యక్కటకట!



యరసిచూడంగ నత్యంత ♦ తరళ మైన
యీహరిణపోతజీవితం ♦ బిదియు నేడ?

గీ. కాన నిప్పుడ, మనుజేంద్ర! ♦ కార్ముకమునఁ
జక్కసంధించినశరంబు ♦ సంహరింపు;
ఆర్తులను గావఁ బుట్టిన ♦ యట్టినీదు
శరము నిరపరాధులమీఁదఁ ♦ జనఁగఁ దగునె?

అనుపద్యములుగాను తెనిఁగించి యున్నారు.

"కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకుంతలా,"

యని ప్రఖ్యాతి గలదుగదా! దానంజేసియే నాటకములు రమ్యము లయిన వనియేగాక, నాటకములలో నెల్ల నభిజ్ఞానశాకుంతలము రమ్యతమమయిన దని తెలియవచ్చు చున్నది.

"కవయః కాళిదాసాద్యాః కవయో వయ మప్యమీ
పర్వతే పరమాణౌ చ పదార్థత్వం వ్యవస్థితమ్."

పర్వతమందును, బరమాణువునందును, బదార్థత్వ మేర్పడునట్లు కాళిదాసాదులును గవులే; మేమును గవులమే యనిమీమాంసాప్రవర్తకు లగు భట్టపాదులవలనను,

"తస్మా దాలోచితాశేషలోకశాస్త్రేణ ధీమతా
కర్తవ్యం కాళిదాసాదేః కావ్యానాం పరిశీలనమ్,"

సమస్తశాస్త్రముల నెఱింగినవా రైనను, కాళిదాసాదులకావ్యంబులఁ బరిశీలింప నగు నని ప్రాక్తనాలంకారికులవలనను,

"కాళిదాసగిరాం సారం కాళిదాసః సరస్వతీ
చతుర్ముఖోథవా సాక్షా ద్విదు ర్నాన్యే తు మాదృశః,"

కాళిదాసకవి వాక్కులసారము కాళిదాసకవియెఱుంగును. మఱి యెఱింగినయెడ, సరస్వతియు, బ్రహ్మయు నెఱుంగుదు రేమో! అంతియకాని,

నాబోంటివారికిఁ దెలియ దని పదవాక్యప్రమాణపారావారపారీణ మహామహోపాధ్యాయు లైన కోలచలమల్లినాథసూరివలనను,

"పురా కవీనాం గణనాప్రసఙ్గే కనిష్ఠికాధిష్ఠితకాళిదాసా
అద్యాపి తత్తుల్యకవే రభావా దనామికా సార్థవతీ బభూవ,,

మ న్నొకప్పుడు కవులను లెక్కపెట్టం బ్రసక్తి కలుగఁగాఁ జిటికెనవ్రేలితోఁ గాళిదాసుపేరు లెక్కపెట్టఁబడియెను. ఇప్పుడు నాయనకు సమానుఁ డైనకవి లేనికారణంబున ననామిక (అనఁగాఁ బేరులేనిది) సార్థకం బయ్యె నని యొకానొకకవీంద్రునివలనను, నింక నిట్లనేకవిధంబుల ననేకులవలన శ్లాఘింపఁబడుచుండి, పశ్చిమఖండవాసులలో నెల్ల నాగరికాగ్రేసరు లని ప్రఖ్యాతిని గాంచుచున్నయింగ్లండుదేశనివాసు లీహిందూదేశమునకు వచ్చినదాదిగ విశేషంబుగ "హిందూదేశపుషేక్స్పియ" రని యెన్నికఁ గాంచి, పిలువఁబడు చున్నకాళిదాసమహాకవిచే సర్వరసోదంచితంబుగ రచియింపఁబడినయభిజ్ఞానశాకుంతలనాటకము నిప్పటి కైదుగురు భాషాంతరీకరించి ప్రకటించియున్నారు.

ఆంధ్రీకృతనాటకములు లేనికాలమునం దనఁగా ముప్పదిముప్పదియైదుసంవత్సరములకుం బూర్వము వీరేశలింగముపంతులగారివలనను, 1894వ సంవత్సరమునందుఁ జన్నపురీక్రైస్తవసర్వకళాశాలాంధ్రపండితులుగ నున్న రాయదుర్గము నరసయ్యశాస్త్రులుగారిచేతను, 1896వ సంవత్సరమునఁ గ్రిస్టియన్ కాలెజ్ సంస్కృతప్రధానపండితు లగు వేదము వేంకటరాయశాస్త్రిగారిచేతను, 1898వ సంవత్సరమునం దేలూరిలో మొదటితరగతిన్యాయవాదిగనుండి, యిప్పుడు లోకాంతరగతు లైన దాసు శ్రీరాములుగారివలనను, 1906వ సంవత్సరమునం దిక్కడిదొరతనమువారి మొదటితరగతి బోధనాభ్యసన కళాశాలయందు నాంధ్రోపాధ్యాయులుగా నున్న వడ్డాది సుబ్బారాయఁడుగారిచేతను రచియింపఁబడి యాంధ్రాభిజ్ఞానశాకుంతలనాటకములు ప్రకటింపఁబడియున్నవి.



భాషాకాఠిన్య మనునది యంతగా లేక, భావగాంభీర్యంబునే కలిగియున్న యభిజ్ఞానశాకుంతలనాటకముయొక్క యాంధ్రభాషాంతరముల నన్నిటినిం జక్క యోపికతోఁ జదివిచూచినవారల కాయాభాషాంతరముల యందలిసమర్థతాసమర్థతలు సులభముగా వెల్లడిగాక మానవు. కాని,

గీ. మొదట మేఘసందేశముఁ ♦ బిదప విక్ర
మోర్వశీయముఁ, దెలిఁగించి ♦ యుంటిఁ గాన,
గలితపరిచయుఁడను గాని ♦ కాళిదాసు
కబ్బములకేను గ్రొత్తను ♦ గాను; వ. సు. డ.

ఆ. వె. పెక్కువ్యాఖ్య లెట్ల ♦ భిజ్ఞానశాకుంత
లమున కమరభాష ♦ లాభకరము
లట్టు లాంధ్రమందు ♦ నవతరణంబు ల
నేకకవికృతంబు ♦ లెంతొ మేలు.

ఆ. వె. శాక మొక్కఁ డయినఁ ♦ బాకభేదంబులు
క్రొత్తక్రొత్తచవులఁ ♦ గొలుపుఁగాదె?
సరసహృద్య మయిన ♦ శాకుంతలమున కాం
ధ్రీకరణబహుత్వ ♦ మాకరణిదె.

సీ. వసురాయకవి తాను ♦ రసవదభిజ్ఞాన
శాకుంతలము తెల్గు ♦ నల్పె నన్న
కథను గర్ణాకర్ణి ♦ గా విని గుంటూరు
పురవాసి నాటకా ♦ భిరుచి గలుగు
తరుణవయోవణి ♦ గ్వరుఁడు డాచేపల్లి
కులుఁడు రామబ్రహ్మ ♦ గుప్తుఁ డెలమి
వచ్చి రాజమహేంద్ర ♦ వరమున కక్కవి
దర్శించి తత్కవి ♦ త్వమున కలరి

ఘోమి చెప్పదు నతనిదా ♦ తృత్వగౌర
వాదరాము లీప్సితభావి ♦ యశముఁ దెల్పు
క్రొత్తరూపమ్ముల్ మున్నూఱు ♦ కుప్ప వోసి
గొబ్బునను బ్రకటింపుఁ డీ ♦ శబ్ద మనియె.

అని తమభాషాంతరమున వ్రాసికొనినవడ్డాది సుబ్బరాయకవిగారిభాషాంతరముననుండి యొక్కొక్కయంకమునుండి యొక్కొక్కపద్యమును వీరేశలింగకవికృతపద్యములను, ముందుగా నుదాహరించెదను. పిమ్మట నందఱిభాషాంతరములనుండియు మూఁడేసిపద్యములను మాత్రముదాహరించిన నసముచితంబుగ నుండు నని తలంచి, యట్లు చేయుచున్నాఁడను.

అంకము. వీరేశలింగకవి.

1.ఉ. కుండనుబూన ఘూఁపులవి ♦ క్రుంగెను, హస్తతలంబు లెఱ్ఱనై
యుండె,వడంకఁజొచ్చెఁగుచ ♦ యుగ్మము,మిక్కిలియయ్యె శ్వాసముల్
నిండెను మోమునందుఁ జెవి ♦ నిడ్డశిరీషము వాఁడఁ జెమ్మటల్,
వెండ్రుకలుం గలంగె ముడి ♦ వీడఁగఁ దా నొకచేతఁ జెర్వటన్.

సుబ్బారాయకవి.

1 ఉ. పూనఘటంబుఁ గ్రుంగెఁగడు ♦ మూఁపులు; గేలెఱుపెక్కెమిక్కిలిన్;
మానము మీఱె నూర్పు ఘరు ♦ మానదు చన్గవయిప్పుడున్; చెవిం
బూనుశిరీష మంటుకొన, ♦ మోమునఁ జెమ్మట గ్రమ్మెఁ గ్రస్తమై
వేవలి వ్యస్తమౌ సెఱులి ♦ వే ముదువంబడు నొక్కచేతితోన్, సు.

2 ఉ. వాసనచూడనట్టి పస ♦ వంబు, నఖంబులఁ ద్రుంపవట్టినూ
తన్నమపల్లవంబుఁ, బరు ♦ లానని క్రొవ్విరి తేనె, నూచివి
న్యాసము లేనిరత్నము, మ ♦ హాతతపుణ్యఫలంబుఁ బోలునా
భాసురగాత్రిసోయగ మె ♦ వంతు భుజింప విరించి వ్రాసెనో! వీ.

2 ఉ. కానిరత్నకంధళము, ♦ కైకొన గిల్లనిపల్లవంబు, మూ
ర్కొనిలపత్రిరూప మెవ ♦ రున్ రస మానని యట్టి క్రొత్తపూఁ



అంకము.

దేనె, యఖండ మైనసద ♦ దృష్టఫలంబును బోలె నొప్పెమీం
బూననియామె రూపె వనిఁ ♦ బొందఁగఁ జేయునొ ధాతయిమ్మహిన్.

గీ. గోర గిల్లనిచిగురు, మూ ♦ ర్కొననిపువ్వు,
చవి గొననిక్రొత్త తేనె: తొ ♦ లువనిరతన
మామె రూప మఖండపు ♦ ణ్యఫల మనఘు
నొంద నిట విధి యెవనిఁ జే ♦ యునొ యెఱుంగ. సు.

3. ఉ. చల్లనివై శ్రమం బడఁపఁ ♦ జాలినతామరపాకు వీవనల్
మెల్లనఁగొంచు వీచుదునొ ♦ మిక్కిలి శీతలమైనవాయువున్?
సల్లలితారుణాబ్జసదృ ♦ శం బగునీచరణద్వయంబు నో
పల్లవపాణి! నాతొడల ♦ పై నిడి హాయిగఁ బట్టువాఁడనో. వీ.

3 చ. శ్రమము హరింపఁగాఁ దగిన ♦ చల్లనితామరపాకుఁదాళవృం
తములను నార్ద్రవాయుచల ♦ నం బొలయన్ మెల్లమెల్ల వీతునా?
నిముసము,పద్మతామ్రములు ♦ నీయడుగుల్ గదియించి మ్రాముకాం
కముపయి,నీకు నొత్తులును ♦ ఖం బటుపట్టుదునా వరోరుహా! సు.

4 చ. ఒకదెస నస్తశైలమున ♦ నోషధినాథుఁడు పోవుచున్నవాఁ
డొకదెస భాస్కరుం డుదయ ♦ మొందె నసూరుపురస్సరంబుగా
నొకసమయంబునందె వ్యస ♦ నోదయముల్ గనె రెండు తేజముల్
ప్రకటసుఖంబు దుఃఖమును ♦ బ్రాణుల కిట్లని తెల్పుకైవడిన్. వీ.

4 చ. అరిగెడు నోషధీశుఁ డిదె ♦ యస్తధరాగ్రము మీఁది కొక్కచో,
నరుణపురస్సరుం డగుచు ♦ నర్కుఁడు దోఁచు నిదే మఱొక్కచో
సరి యిరుజోతి కిట్టు లొక ♦ సారిగ నౌవ్యసనోదయంబులన్
గర ముపదిష్ట మయ్యెడు జ ♦ గంబు స్వకీయదశాంతరాప్తి నాన్. సు.

5 గీ. పుట్టినింటనె పతిగల ♦ పొలఁతి యున్న,
జనులు శంకింతు రన్యథా ♦ సాధ్వి యైనఁ;

అంకము.

గావునను దద్ప్రియ నైనఁ ♦ గాంత నెవుడు
బంధుజను లుంచఁ దలఁతురు ♦ భర్తకడనె. వీ.

5 చ. అనిశము పుట్టినింట మగ ♦ వాలు వసించిన, సాధ్వి నేని యున్
జనములు వేఱుభంగిని మ ♦ నంబున నెంచెద రట్లు కానఁ, దా
రనువుపడన్ స్వబంధులు ద ♦ దప్రియ నైనను బ్రాయపుంజెలిం
బెనిమిటియొద్దనే యునుపఁ ♦ బ్రీతి వహించెద రాతతంబుగన్. సు.

6 ఉ. ఒల్లఁడు రమ్యవస్తుతతి ♦ యుఁ, గొలువియ్యఁడు మంత్రికోటికిన్
డొల్లిటియట్ల ప్రత్యహము, ♦ దొర్లుచుఁ బాన్పున నిద్రలేక వ
రిల్లును రాత్రు, లంతిపురిఁ ♦ దిమ్మరు కొమ్మలపేరు మార్చి రం
జిల్లు సదర్థవాక్యములు ♦ చెప్పి కడున్ వెఱఁగొందులజ్జచేన్. వీ.

6 చ. వలవఁడురమ్యముల్;ప్రకృతి ♦ వర్గముకొల్వుగొనందునిచ్ఛముల్
బలెఁ; బొరలాడుచిట్టునటుఁ ♦ బాన్పునఁ,బుచ్చువినిద్రుఁడై చురా
త్రులు;తగుపల్కుపల్కియవ ♦ రోధముల్ మొగమోటగోత్రసం
స్ఖలనమునొందుచున్ దడవు ♦ గానఁబడున్ బిడియంపునివ్వెఱన్. సు.

7 చ. పులినములందు హంసయుగ ♦ ము ల్విహరించెడుమాలినీనదిన్,
బలుహరిణంబు లున్నతదు ♦ ప్రాంతపవిత్రహిమాద్రిపాదమున్,
వలువలు గట్టుశాఖలను ♦ వర్తిలువృక్షముక్రింద నిల్చికొ
మ్మలఁదనకన్నుగోఁకికొను ♦ ముగ్ధమృగిన్,లిఖయింపఁగోరెదన్ వీ

7 చ. పులినములందుహంసయుగ ♦ ముల్ గలమాలిని, దానియోర జిం
క లెలయుమంచుఁగొండయున ♦ ఘుస్తుతపాదములున్ లిఖింప నా;
వలతురచింపఁ, గొమ్మలను ♦ వల్కము లారెడుమ్రానిక్రింద, దా
పలికను జింకకొమ్మునకొన ♦ పైజిల ప్రోవఁగ రాయులేడినిన్. సు.

ముప్పదిముప్పదియైదు సంవత్సరముల క్రిందట రచియింపఁబడినవీరేశలింగము పంతులుగారి పద్యములవలనను, ముప్పదిముప్పదియైదు సంవత్సరము



లకుం దరువాతరచియింపఁబడిన సుబ్బారాయఁడుగారి పద్యములవలనను నిరువురకుం గల భాషాంతరీకరణసామర్థ్యముల తారతమ్యములు పైపద్యములవలనం జాలవఱకుఁ దెలిసికొనవచ్చును. వీరేశలింగముపంతులుగారు, తమనాందియందు సూత్రధారుఁడు నటితో, "ఓసీ! ఈసభ విద్వాంసులతో నిండియున్నది. ఇప్పుడు మనము కాళిదాసునిచేతఁ గ్రొత్తగా రచియింపఁబడిన యభిజ్ఞాన శాకుంతల మనునాటకముచేత వీరిని సేవింపఁ దగును. కాఁబట్టి సావధానముగా దానిప్రయోగమును నడపవలెను." అని చెప్పినట్లుమాత్రమే వ్రాసియున్నారు. సుబ్బరాయఁడుగారు తమనాందియందు సూత్రధారుఁడు నటితో భాసురాంగీ! పూర్వము గీర్వాణ భాషయందుఁ గాళిదాసమహాకవిచేత విరచిత మయి యిప్పు డభినవముగా వడ్డాది సుబ్బారాయకవిచేత నాంధ్రీకృత మయిన యభిజ్ఞాన శాకుంతల మనునాటకరాజముచేత నభిరూపజనభూయిష్ఠమైనసభను మన ముపాసింప వలయును. అని చెప్పినట్లు వ్రాసియున్నారు. వీరేశలింగముపంతులుగారు తమభాషాంతరమునందు గద్యములను వ్రాసికొనియే యుండలేదు. సుబ్బరాయఁడుగారు తమ భాషాంతరమునందు "ఇది శ్రీపరమేశ్వర వరప్రసాదలబ్ధసరసకవితా ధురంధర వడ్డాది సాధువంశక్షీర నీరాకరరాకాసుధాకర & c." అనుమొదలగురీతిని దీర్ఘములగుగద్యములను వ్రాసికొని యున్నారు. భావగాంభీర్యమును విశేషముగాఁ గల యాయాపద్యములు చదువరులకు సులభముగా బోధపడునట్లు సుబ్బారాయఁడుగారు తమనాటకమునందే యాయాపద్యముల క్రింద భావములను జక్కగను విపులముగను వెల్లడించి చదువరులకు మహోపకారమును గావించి యున్నారు. మఱియుం దమ పీఠికయందు "నాకంటె నెక్కుడుసామర్థ్యముగలవా రనేకు లీవఱలో నీయభిజ్ఞాన శాకుంతలమును వేఱువేఱుగాఁ దెలిఁగించి ప్రకటించిరి

యున్నారు. కాని వానియందు సందిగ్ధస్థలముల భావవివరణాదులు లేనందుచేత, మూలమునందలిచమత్కారము లనేకములు గ్రహించి యానందించుభాగ్యము పెక్కండ్రకు దుర్లభ మగు చున్నందువలనఁ గొందఱు మిత్రులు ప్రోత్సాహపఱుపఁగాఁ బూర్వోక్తరీతిని లఘుటీకా సమేతముగా దీనిని ముద్రింపించి ప్రకటించితిని." అని చక్కఁగా వ్రాసి యున్నారు. మఱియుం దమయిష్టదేవతాప్రార్థనాదికమునందు,

ఉ. ఎందఱొ తెల్గు చేసిరది ♦ యేఁ దెలిఁగించుట వీటిపాటు నా
కిందుఁ బరీక్ష చేసి, కొనుఁ ♦ డీ గుణ మూఁడిసఁ బండితుల్! రస
స్యందినిఁ గాళిదాసకృతి ♦ నందఱు దూఱుఁడు, దానిదోషమే
యుందఱబుద్ధి కిచ్చె శ్రమ ♦ మీదృశ మున్నదె నాటకంబులన్?

అని సరసముగా విచారణీయంబుగ నుండునట్లు వ్రాసి యున్నారు. సుబ్బరాయఁడుగా రభిజ్ఞానశాకుంతలమును భాషాంతరీకరించుటకుం బూర్వము కాళిదాసమహాకవివిరచిత మగు "మేఘసందేశమును", నమ్మహాకవిచేతనే రచియింపఁబడిన "విక్రమోర్వశీయనాటకము"ను భట్టనారాయణకవిచే రచియింపఁబడినరౌద్రరసప్రధానంబై యష్టరసాశ్రయంబయిన "వేణీసంహారనాటకము"ను హృదయరంజకములుగఁ దెలిఁగించి యున్నారు. ఆంధ్రీకృతవిక్రమోర్వశీయనాటకమునందలి యిష్టదేవతాప్రార్థనాదికములో,

చ. దిరిసనపూలమాదిరి వ ♦ తిమ్మదిమంబులు, కాళిదాసస
త్తురరసమంజనించినప ♦ దంబు లివంటివఁ గందునాళ్, తెం
పరినయి, తెల్గులోనికిని ♦ మార్పఁ దలంచితి విక్రమోర్వశిన్,
సరళపుఁద్రోటకంబు రస ♦ సంభరితం బిది యే మొసర్తునో:

అని వ్రాసి, భాషాంతరీకరించిన యావిక్రమోర్వశీయ నాటకమునందలి



ఉ. రయమున నీవు మానస స ♦ రస్సున కానకఁ బోదుగాని, నీ
పయనము కంచుఁ జంచువునఁ ♦ బట్టినబత్తెపుఁదమ్మితూఁడు వెం
డియుఁ గొనవచ్చుఁగాని తరు ♦ ణీమణివార్తను దెల్పి కావుమీ
దయఁ, బరకార్య మెక్కుడుగ ♦ దా నిజకార్యముకన్న వేదికిన్.
చ. కొడుకుమొగంబుఁజూచి మదిఁ ♦ గుందక యుబ్బరటఁజెంది యుండఁగాఁ
బడతుక! నీవియోగ మని ♦ వార్యత నిప్పుడె సంభవించెగా!
మిడిమిడిగ్రీష్మతాపము శ ♦ మింప నవాంబుదవృష్టి గాంచి యె
ప్పెడుతఱిఁ జెట్టుపైఁ బిడుగు ♦ భీకరభంగిని బడ్డకైవడిన్.

ద్విపద.

కటిభారమున మంద ♦ గమనంబుదానిఁ
బటు వైనయిఱుగుబ్బ ♦ పాలిండ్లదాని
వలపించునిండుజ ♦ వ్వన మున్నదానిఁ
బలుచనితనువల్లి ♦ భాసిల్లుదానిఁ
గలహంసలకు నడ ♦ కలు దిద్దుదాని
సులలితం బగువేడి ♦ చూపులదాని
నీకాఱుటడవిలో ♦ నేగెడుదాని
లోకసుందరిని సా ♦ లోకించితేని
హరిణమా! యావేల్పు ♦ టతివఁ జూపింపు
విరహాబ్ధినుండి న ♦ న్నోస నుద్ధరింపు.
ఆ. వె. చూచినావఁటయ్య! ♦ సుదతిని గానలో
నాలకింపు మాన ♦ వాలు సతికిఁ
బెద్దకనులతోడఁ ♦ బేర్మి నీప్రియురాలు
చూచునట్టె చూచు ♦ సుందరియును.

అనుపద్యములలోనికవిత్వమువలెనే, పదకాఠిన్యముగాని, యన్వయకాఠిన్యముగాని, లేక, భావములు, నిర్మలమ్మయినదర్పణమునందలి ప్రతిబిం

బమువలెనే కానఁబడుచుండినచో, సందర్భోచితముగా లోకానుభవసిద్ధములు, స్వభావావిరుద్ధములు, జ్ఞాననీతిప్రతిపాదకములు, మనోహర శృంగారహాస్యకరుణాదిరసోపబృంహితములు, ననల్పకల్పనాచమత్కారవంతములు, గంభీరభావసమృద్ధములు, సహృదయహృదయాహ్లాదజనకములునయియొప్పునట్లు కాళిదాసమహాకవి రచియించినయభిజ్ఞానశాకుంతలముయొక్క సుబ్బరాయఁడుగారి భాషాంతరము సర్వజనహృదయాహ్లాదకరంబుగ నుండియుండునుగదా యని చెప్పవలసియున్నది.

ఇంక నభిజ్ఞానశాకుంతలనాటకరాజములోని,

శ్లో. పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం యుష్మాస్వపీతేషు యా
నాదత్తే ప్రియమండనాపి భవతాం స్నేహేన యా పల్లవమ్
ఆద్యే వః కుసుమప్రసూతిసమయే యస్యా భవత్యుత్సవ
స్సేయం యాతి శకుంతలా పతిగృహం సర్వై రనుజ్ఞాయతామ్.

(ఎవతె మీరు త్రాగకుండ ముందు నీరు త్రాగఁ గోరదు; ఎవతె అలంకారమున నిచ్ఛగల దయినను మీ మక్కువచిగురు గోరదు, మొదటి మీపూలపుట్టువేళ ఎవతెకుఁ బండుగగును, ఆయీశకుంతల పెనిమిటి యింటి కరుగుచున్నది. మీ రందఱు సెలవిండు.)

శ్లో. అస్మాత్పరం బత యథాశ్రుతి సంభృతాని
కో నః కులే నివపనాని కరిష్యతీతి
నూనం ప్రసూతివికలేన మయా ప్రసక్తం
ధౌతాశ్రుశేష ముదకం పితరః పిబంతి.

(అయ్యో! నిక్కము. అనపత్యుఁడ నగునేను, విడిచినతర్పణోదకమున నీవంశమున వీనియనంతరము, ఎవఁడీయఁగలఁ డని తొరఁగుకన్నీరు కడుగ, మిగిలినదానిని పితరులు త్రాగుదురు.)

శ్లో. ఆలక్ష్యదంతముకుళా ననిమిత్తహాసై
రవ్యక్తవర్ణరమణీయ వచఃప్రవృత్తీన్



అంకాశ్రయప్రణయిన స్తనయాన్ వహంతో
ధన్యా స్తదంగరజసా మలినీభవంతి.

(ధన్యులు, కారణములేనినవ్వుల పలుమొగ్గల నించుక కనఁజేయుచు నస్ఫుటము లగునక్షరముల నానందకరము లగుమాటలాడఁ దొడఁగుచుఁ గూరుచుండ నలవడినకొడుకుల నెత్తికొని, వారిమేనిదూలివలన మాలిన్యము నొందినవా రగుదురు.)

అనుశ్లోకరత్నముల నాయాభాషాంతరీకరణకర్తలేయేప్రకారముల నాంధ్రీకరించినదియు నీక్రిందిపద్యములవలన బోధపడకమానదు.

5. వడ్డాది—సుబ్బారాయఁడుగారు.

ఉ. పోయక మీకు నీ రెవతె ♦ పూనదొ ముందుగఁ ద్రావ, దేని కానో మొద యుష్మదాద్యకుసు ♦ మోదయవేళను బండు వేడ్కతా గోయదొ మీయిగుర్నగను ♦ గోరియుఁగూరిమి, భర్తయింటికిన్ బోయెడు నాశకుంతల; య ♦ నుంగున కంద అనుజ్ఞ యీరయా రే?

ఉ. వీనికిఁ బిమ్మటన్ నిగమ ♦ విధ్యుచితంబుగ వంగసంబునం, దాను నివాపముల్ మఱి యొ ♦ నర్చును మా కెవఁ డంచు మత్పితల్ సూనుఁడు లేనినావిడుచు ♦ చుక్కలఁగొన్నిటధౌతబాష్పులై యానుదు రల్పశేష ముగు ♦ నంబువు నక్కట! నిక్క మింతయున్.

చ. తమయనిమిత్తహాసముల ♦ దంతపుమొగ్గలు దోఁప, నస్ఫుటత్వమధురవర్ణముల్ చెవుల ♦ పండువుగాఁ బలుకాడుచున్ నిజాంకమునయుఁ గోరువందనుల ♦ గ్రక్కున నెత్తి తదంగధూళిచేత మలినగాత్రు లయ్యెదరు ♦ ధారుణిలో నతిధన్యపూరుషుల్.

4. దాసు—శ్రీరాములుగారు,

చ. మొనయెడు మీరు ద్రాగుటకు ♦ ముందర నీళులు ద్రావఁ గైకొనం దనుమదు మీపనన్ సొనరు ♦ తో నగల్లాసనట్లాలిమైన ధా

మొనరుచు నబ్బబ్బముగ ♦ నోపిక మీతొలుపూఁతకాఁ జేసే
చను మగనింటికిన్ వెలవె ♦ సంగుఁడు మీరు శకుంతలమ్మకున్.

ఉ. ఎవ్వఁడు వీనికిం బిదప ♦ నీతనికోఁపను మాకుఁ దప్పనా
లివ్వఁగలండటంచు దుర ♦ టిల్లుచు, బిడ్డలు లేని నేను బల్
నెవ్వగఁ గన్నులం దొఱఁగు ♦ నీళ్లడుగన్ మిగులైన నీళ్లలన్
రువ్వినఁ ద్రావుచుంద్రు పిత ♦ రుల్ నిజ మింతయు నక్కటక్కటా!

చ. పకపక నూఱకే నగిన ♦ పల్మొగడల్ కనవచ్చి యొప్పఁగా
తికమకవచ్చి రానిబడి ♦ దేరనిపల్కులు ముద్దుగుల్కఁగా
చకచకలాడుచుం దొడల ♦ చక్కని వేడుక లిచ్చుచుండఁగా
వికవిక మేనిదుమ్మొలయ ♦ బిడ్డల నెత్తిన మేలు చాలుటా.

3 వేదము—వేంకటరాయశాస్త్రిగారు.

ఉ. త్రాగ దేవర్తె డస్సినదె ♦ త్రావక యుండ జలంబు మీరు మున్,
ద్రాఁగయిసేఁత కే నెవతె ♦ దాఁకద కూరిమి మీప్రవాళమున్,
సాగును బండు వెవ్వతెకుఁ ♦ జయ్యన మీతొలుపూవు నూతిచే,
నేఁగెడు నాశకుంతల యి ♦ దే మగనింటికి వీడుకొల్ప రే.

చ. ఎవ రిఁక వీనివెన్క మన ♦ కీకులమం దకటా! యథావిధిన్
నివపన మిచ్చువార? లని ♦ నిక్కము మత్పితృదేవతల్ ప్రసూ
తివికలితుండ నే నిట వి ♦ తీర్ణము సేయునివాపనీరమున్
నెవులునఁ ద్రావుదుర్నయన ♦ నీరవిశోధనకృత్యశేషమున్.

మ. అనిమిత్తోదయహాసభాసురము లై ♦ యంతంత పల్గొన్న నల్
కననౌనస్ఫుటవర్ణజల్పనమనో ♦ జ్ఞవ్యాహృతివ్యగ్రులన్
అనపాయాంకసతృష్ణుల న్సుతులఁ గ్రో ♦ డావాసులం జేసి పు
ణ్యవిధు ల్తద్వపురాత్తపాంసుభృతి ధ♦న్యత్వంబుఁ గాంతు ర్వెసన్,



2. రాయదుర్గము—నరసయ్యశాస్త్రిగారు.

గానకళ.

తొలుతం గ్రావఁగ నెవ్వతె పూనదు ♦ తోయము మీరలు గాన కున్నని
జెలిమిం బ్రియమండనయయ్యును మీ ♦ చివురుల నెవత గ్రహింపదు మీ
తొలునన కాలు నిజోత్సవముగ సం ♦ తోసిల్లు నెవ్వత యట్టిశకుం
తల ప్రాణేశ్వరుపాలికిఁ జనుఁ గా ♦ న నీ్వడ్కోలుఁ ఫరె మీ రెల్లన్.

చ. ఇతనియనంతరంబు మన ♦ కెవ్వరు వంశమునం దయో యథా
శ్రుతివిధిగా నివాపములు ♦ థూఢి నొసంగెడివార లంచు సం
తతివికలుండ నై పెనుపు ♦ దక్కిన నే విడునట్టినీళ్లలం
బితరులు త్రావుచుందు రొకొ ♦ పెల్లుగ జాఱెడునశ్రుధారతోన్

చ. అలఁతిగ నిర్నిమిత్త మగు ♦ హాసములం గనవచ్చు మొగ్గపం
డ్లలరుపఁ దొక్కువర్ణముల ♦ నిం పగుపల్కులఁ బల్కు చంకముం
బొలుపుగఁ జేర వేడ్కపడు ♦ పుత్త్రులఁ దాల్చుచు వారియంగకం
బులఁ గలధూళుల న్మసట్లఁ ♦ బొందుచు నుందురు ధన్యులౌ జనుల్.

1. వీరేశలింగకవి.

చ. ఎవతె జలంబు మీ కిడక ♦ యెన్నడు త్రాగదు తాను ముందుగా
నెవరితె ప్రేమచేఁ జిగురు ♦ దీప్సితభూషణ మయ్యు మీ చిగు
ళ్లెవతెకు మీరు తొల్త నన ♦ లెత్తుట పండువుగాఁగ నుండు నా
ప్రవిమలగాత్రి యేఁగఁ బతి ♦ పజ్జకు నంద అనుజ్ఞ యీయరే.

ఉ. అక్కట! నాయనంతరము ♦ నందు యథావిధిగాఁగఁ దర్పణం
బిక్కులమందు నిచ్చునతఁ ♦ డెవ్వఁ డటంచును సంతులేమిచేఁ
బొక్కుచు నింక నే విడువఁ ♦ బోయెడునశ్రులలోన ఁదుడ్వఁగాఁ
జిక్కిననీరు త్రాగుదురు ♦ చేదపడి మాపితరుల్ నిజంబుగన్.

ఉ. హేతువు లేనినవ్వుల నె ♦ కించుక చూపుచు లేతదంతముల్
వాతెఱచిందనందముగఁ ♦ బల్కుచు స్పష్టము కాని వాక్కులన్

భూతలధూళి దేహమునఁ ♦ బూయుచు మైలయొనర్చుపుత్త్రిలం
బ్రీతిని ధన్యు లెత్తి తొడ ♦ మీఁదను జేర్చి సుఖింతు రెంతయున్.

పైపద్యములను బట్టి యీయాంధ్రభాషాంతరీకరణకర్తల కవిత్వతారతమ్యములు సులభముగా బోధపడక మానవుగదా!

శ్రీమదాంధ్రమహాభారతగ్రంథరాజమును రచియింపఁగల నిరుపమానసామర్థ్య వ ణ యుండిన తిక్కనసోమయాజికవికులసార్వభౌముఁడు సహితము తననిర్వచనోత్తరరామాయణమునందు,

తే. ఎట్టికవి కైనఁ దనకృతి ♦ యింపుఁ బెంపఁ
జాలుగావునఁ గావ్యంబు ♦ సరసు లైన
కవులచెవులకు నెక్కినఁ ♦ గాని నమ్మఁ
డెందుఁ బరిణతి గలుగక ♦ వీశ్వరుండు.

అని చక్కఁగా వ్రాసియున్నాఁడు. చక్కని తెలుగుపదములతో సలక్షణ మయిన కవితాధోరణిం బంచతంత్ర మను పద్యకావ్యమును రచియించిన దూబగుంట నారాయణకవి తన పంచతంత్రమునందు,

ఉ. చెప్పిన నాకవిత్వము రు ♦ చింపనితావులు చూచి చెప్పఁడీ
తప్పులు లేనిచో నవుఁగ ♦ దాయని తీర్పఁడు మాటిమాటికిన్
జెప్పఁగఁ దొప్పఁ దప్పురుచుఁ ♦ జెప్పఁగ నేర్చినవాని కొక్కచోఁ
దప్పులు లేక మాన వనిత ♦ తజ్జ్ఞు లెఱుంగుఁడు మీకు మ్రొక్కెదన్.

అని యెంతయు సమంజసంబుగ వ్రాసియున్నాఁడు. మఱియును, మిక్కిలి ప్రౌఢు లగుప్రబంధకవీశ్వరులలో నొకఁడును, సాహిత్యమునందుమాత్రమే కాక, సంగీతమునందును బ్రవీణుఁ డయిన కనుపర్తి అబ్బయామాత్యకవిశిఖామణి, "పిల్లవసుచరిత్ర" మనుసమర్థనామమునం బరిగణింపఁబడుచున్నతన "కవిరాజమనోరంజన" మనుప్రబంధరత్నమునందుఁ, గవిత్వముంగూర్చి వ్రాయుచు,



ఉ. ఎవ్వరి కెంతబుద్ధి పర ♦ మేశుఁడు దాఁ గృపచేసె నట్టిదై
నివ్వటిలున్ గవిత్వరుచి ♦ నేరుపు చాలినఁ జాలకుండినన్
నవ్వక వర్తమానకవి ♦ నాథులు చేకొనరయ్య! మత్కృతిన్
బువ్వులు గందకుండ రస ♦ ముం గొనుతేటులలీల నేర్పునన్.

అని వ్రాసి, యంతటం దనియక,

ఉ. తనుఁ దా మెచ్చుకొనంగ నేటికిఁ గవి ♦ త్వప్రౌఢి యాంధ్రీఘన
స్తనకుంభస్ఫురణన్ నవీనమృదుచి ♦ త్రశ్రీపదాచ్ఛాదనా
భినవాలంకరణార్థసూచనల సం ♦ ప్రీతిన్ మనోవీథులం
జొనుపంగల్గిన నింపుతో విని రస ♦ జ్ఞుల్ మెచ్చినం జాలదే?

అనియుంగూడ వ్రాసియున్నాఁడు. మనయాంధ్రకవులలో ననేకులాత్మశ్లాఘాప్రియులును, బరకవిహేళనప్రియులు, నీర్ష్యాదుస్స్వభావదూషితులు ననేకులు నున్నారుగాని లేకపోలేదు. కాని, యాంధ్రాభిజ్ఞానశాకుంతలమును రచియించి ప్రకటించిన రసికులును, జతుర్భాషాపాండిత్యభూషణు లగు వేదము వేంకటరాయశాస్త్రిగారివలె

ఉ. అంకెకుఁ దార్చె నేరసికు ♦ నంగలభారతి ప్రౌఢనీతి నా
కింకిరి నాంధ్రి ద్రావిడియుఁ ♦ గేరుచు దైవియుఁ గూడి రెవ్వనిన్,
జంకు కళంకు లేనికవి ♦ చంద్రుఁడు తోషితకోవిదేంద్రుఁడా
వేంకటరాయశాస్త్రికృతి ♦ వెంగలిమూక కెఱుంగ శక్యమే?

అని వ్రాసికొనినయాంధ్రకవి యొక్కఁ డయిన నున్నాఁడా యని సంశయింపవలసియున్నది. కాని, యీశాస్త్రిగారింతింత యని చెప్పుటకు వీలుగా కుండునట్లుగా, స్వోత్కర్షప్రకటనముం గావించుకొనినపరిహాసాసక్తుఁ డయినయొకప్రౌఢకవి వ్రాసినట్లు,

చ. ఒకనికవిత్వమం దెనయు ♦ నొప్పులు తప్పులు నాకవిత్వమం
దొకనికిఁ దప్పుఁ బట్టఁ బని ♦ యుండదు; కాదని తప్పుఁ బట్టినన్

మొకమాటు క్రిందుగాఁ దిగిచి, ♦ మొక్కలు ప్రావునినుంపక త్తిశో-
సిక మొదలింటఁ గోయుదును ♦ జెప్పునఁ గొట్టుదు మోముఁ దన్ను దుః.

అనురీతిని వ్రాయ కుండినందుల కెంతయు సంతసింపవలసి యున్నది. ఈ వేంకటరాయశాస్త్రిగారు, తమయాంధ్రాభిజ్ఞానశాకుంతలమునందుఁ గాళిదాసమహాకవి కున్న "మహాకవి" యనుబిరుదునే బిఱబిఱఁ జేర్చుకొని సూత్రధారునిచే "శ్రీమహాకవి వేదము వేంకటరాయశాస్త్రులవారు తమబాల్యయౌవనసాక్షియగునాంధ్ర దేశముమీఁది యభిమానముచే నాంధ్రదేశీయులకు, హృదయానందముగా నాంధ్రభాషయందుఁ దాము శ్రీమహాకవికాళిదాసవిరచితాభిజ్ఞానశాకుంతలనాటకమును రచియించి యస్మద్భరతవిద్యాకౌశలాభినందితులై మనకు దయచేసినారు గదా!" యని పలికించుకొనియున్నారు. వీరిభాషాంతర మంతవఱకు "ఆంధ్రదేశీయులకు హృదయానందముగా" నున్నదియును బాఠకులే చెప్ప నర్హులని మాత్రము చెప్పుచు నావిషయము నిప్పటి కింతటితో విడిచిపెట్టుచున్నాను. నాటకారంభమునందు "మహాకవి,, ననియనిపించుకొనిన యాశాస్త్రిగారు, తమనాటకముయొక్క చిట్టచివర నేడవ యంకమునకుం జివరనుమాత్రమే వ్రాసికొనిన "ఇది శ్రీవేంకటరాయకవి విరచితం బయినయాంధ్రాభిజ్ఞానశాకుంతలము సమాప్తము," అనుగద్యమునందు, "శాస్త్రి" పదముం దొలఁగఁద్రోసి, వట్టి "కవి" యని మాత్రమే యేల వ్రాసికొనిరో నే నూహింపఁజాల కున్నాను.

వీరేశలింగముపంతులుగా రభిజ్ఞానశాకుంతలముం దెనిఁగించి, ప్రకటించినయనేకసంవత్సరములకుం దరువాత నభిజ్ఞానశాకుంతలనాటకముం దెలిఁగింప సాహసించిన రాయదుర్గము నరసయ్యశాస్త్రిగారు, తమయభిజ్ఞానశాకుంతలమునందు,

క. శ్రీయుతమిల్లరుసర్వక
ళాయతన సమృద్ధిరంగ ♦ యత్రశ్రేష్ఠిసఖుం



డై యొప్పు నెవఁడు సర్వ
జ్ఞాయతమస్తకకలాప ♦ హారి బుధధృతిక్.

సీ. రాయదుర్గకులాబ్జ ♦ రవి కాశ్యపసగోత్రుఁ
డవులక్ష్మినరసయ ♦ యెవనితండ్రి
సాధ్వీలలామ నా ♦ సన్నుతిఁ గాంచిన
సుబ్బలక్ష్మమ్మ యే ♦ సుజనుతల్లి
శ్రీబుద్ధు లొసఁగిన ♦ చెంగమపతి దేవ
తాశిరోమణి యెని ♦ తల్లితల్లి
శ్రీవత్సగోత్రసు ♦ శ్రితి మహాదేవయ
మద్దూరియతఁ డేని ♦ మాతులుండు
రామచంద్రసీతాపతు ♦ లహిఁ బిడతల
వారు కౌశికగోత్రజు ♦ లూర్సారు లెవని
పెద్దతల్లికొమారు లై ♦ పేర్మిఁ గాంతు
రట్టినరసయ రచియించె ♦ నాంధ్రభాష.

అని వ్రాసికొని, వినమ్రతను వెల్లడించుకొనియున్నారు. వినయసౌశీల్యములు గలయీశాస్త్రిగారిభాషాంతరమునందు గద్యములు వ్రాయఁబడకయే యున్నవి.

సంగీతశాస్త్రమునందుఁ బాండిత్యాభిరుచులు గల దాసు శ్రీరాములుగారు రచ్చతెనుంగునకు భాషాంతరీకరించినయభిజ్ఞానశాకుంతలనాటకమునకుం జిట్టచివరఁ బదునెనిమిదిటొమిరీలను వ్రాసి, కీర్తనలతో నాటకముం బ్రదర్శింప నభిలాషగలవారల కానందమును గలిగించియున్నారు.

అభిజ్ఞానశాకుంతలము నాటకములలో నెల్లను సర్వోత్కృష్టమయిన దగుటచేత నే, మనయాంధ్రకవులలోఁ గొందఱు తమతమపుస్తకములలో నిమంచిభాగము లనేకములు కాళిదాసునియభిజ్ఞానశాకుంతల

నాటకమునుండి తెనిఁగించియున్నారు. అందులకు నిదర్శనంబులుగాఁ గాళిదాసమహాకవివిరచితము లగు

శ్లో. యాస్యత్యద్య శకుంత లేతి హృదయం సంస్పృష్ట ముత్కంఠయా
కంఠ స్తంభితబాష్పవృత్తికలుష శ్చింతాజడం దర్శనమ్
వైక్లబ్యం మమ తావదీదృశ మహో స్నేహా దరణ్యౌకసః
పీడ్యంతే గృహిణః కథంను తనయావిశ్లేష దుఃఖై ర్నవైః.

శ్లో. శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీవృత్తిం సపత్నీజనే
భర్తు ర్విప్రకృతాపి రోషణతయా మాస్మ ప్రతీపంగమః
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే భాగ్యేష్వనుత్సేకినీ
యాంత్యేవం గృహిణీపదం యువతయో వామాః కులస్యాధయః.

అను శ్లోకరత్నములను, శకుంతలాపరిణయమును రచియించినప్రబంధకవి యగుకృష్ణకవి,

చ. కనుఁగవ బాష్పపూరములు ♦ గ్రమ్మెడు గద్గదభిన్నమై యెలుం
గనువునరాదుసూహృదయ ♦ మాకులమయ్యెడు మేను మాన్పడుం
జెనిచినవాని కింతవగఁ ♦ బిమ్మటిఁ గ్రమ్మెడుఁ గన్నవారలుం
దనయను బంపలేక పరి ♦ తాపభరంబున నెట్లుసైతురో?

మ. గురుశుశ్రూషలు సేయుమీ సవతుల ♦ న్గూర్మి న్విలోకింపుమీ
పరివారమ్ములఁ బ్రోవుమీ సిరుల గ ♦ ర్వస్ఫూర్తిఁ గైకొనకుమీ
పురుషుం దూరకుమీ సతుల్ నడచునే ♦ ర్పల్కీకు సూచించితిన్
తరుణీలోకమతల్లి! చేకొనవె మా ♦ తల్లీ! మదీయోక్తులన్.

అనిభాషాంతరీకరించి యున్నాఁడు.

పైని వివరింపబడిన యైదుగురు భాషాంతరీకరణకర్తలకును వచనరచయందుఁ గలసామర్థ్య మభిజ్ఞానశాకుంతల నాటకముయొక్క ద్వితీయాంకారంభమునం దున్న నిట్టూర్పువిడిచి విదూషకుఁడు పలికిన చింతాభరితమనోహరభాగమువలనం దేటతెల్లము గాక మానదు. మఱి



యుం జదువరుల కాయాగ్రంథకర్త లుపపదముల నుపయోగించిన విధములును, భావములను వెల్లడించుచువచ్చిన వివిధమార్గములును గోచరము లయి,యాయాగ్రంథకర్తల సామర్థ్యమును నిర్ణయించుట కవకాశము గలుగుచుండు నని చెప్పవలసియున్నది. వేయేల? భాషాంతరములున్న గ్రంథముల కందులో రసవంత మగుభాషాంతర మున్నగ్రంథమును భాషాంతరీకరించుటయందు గ్రంథకర్త లెట్టికష్టము ననుభవించెదరో తెలిసికొనుటకును జక్కనియవకాశము గలుగుచుండు నని ముఖ్యముగా నిటఁ జెప్పవలసియున్నది.

భాషాంతరము లన్నఁ బరిహాసాస్పదంబుగ నున్న కాలమునందెంతయు సర్వోత్కృష్టముగా నుండునటులు కాళిదాసునంతటిమహాకవి రచియించిన యయ్యభిజ్ఞానశాకుంతలముయొక్క యీభాషాంతరమును సావకాశంబుగఁ బరిశీలించి చూచువారలకుఁ బంతులవారాంధ్రంబునం గాళిదాసని తోఁచకమానదు.

ఈనాటకరాజమునందలి చతుర్థాంకమునం దున్న,

ఉ. కొందల మందె డెందము శ ♦ కుంతల తానివు డేగునం చయో
గ్రందుగ బాష్పరోధమునఁ ♦ గంఠమునం జెడె దృష్టిమాంద్యముం
బొందె; నొకింత పెంచినత ♦ పోధనులే యిటులుండ, నెంతగాఁ
గుందుదురో తమంతఁ గను ♦ కూఁతులఁ బాయుగృహస్థు లక్కటా!

ఉ. మమ్ములసత్తపోధనుల ♦ మాన్య! భవత్కులమున్, స్వబంధులన్
సమ్మతివేడ కీమె యెటో ♦ సల్పిన నీపయికూర్మి, నెంచి మా
కొమ్మను నేలుకొమ్ము సరి ♦ కొమ్మలతో సమగౌరవంబునన్;
బిమ్మటిదెల్ల భాగ్య మగుఁ ♦ బేర్కొనరా దది యింతిబంధువుల్.

గీ. పర్ణశాలకు వాకిట ♦ బలికిఁగాను
దల్లి! నీవిడ్డనివ్వ ♦ రిధాన్య మడరి

కలయ మొలచిన మొలకలు ♦ గనఁగ, నాకు
వితతశోకోపశమన మే ♦ గతినిఁగలుగు?

గీ. కన్య యెప్పుడుఁ బరుసొత్తె ♦ కాన, దాని
నిప్పుడు ప్రతిగ్రహీతకు ♦ నప్పగించి,
న్యాసధనంబు స్వామికిఁ ♦ దార్చినట్టు
లెంతొ నిర్మల మయ్యె నా ♦ యంతరాత్మ

అనుపమరత్నములంగాంచిన పంతులువారికింగల సహజసరసవాగ్ధారా సమ్మిళిత కవితాసామర్థ్యము సులభంబుగ బోధపడక మానదు.

ఈనాటకరాజమును సావకాశంబుగఁ జదివిచూచినవార లందఱుందదలి యత్యంతసులభమృదుమధురశైలికి మిగుల సంతసింపక మానరు. పురుషసరస్వతి యనియును, గవికులశేఖరుండనియు బిరుదులువడసిన కాళిదాసుని యభిజ్ఞానశాకుంతలమును, మఱికొన్ని యితర సంస్కృతనాటకములను భాషాంతరీకరించుటకుం బూర్వముగ నెంతయు ధారాళమయిన మృదుమధుర కవితాధోరణి నలవఱచుకొనిన వీరేశలింగము పంతులవారుగాక తదితరు లెవ్వరయినను తెనిఁగించినచో నయ్యవి యిందలిశైలితో సమానముగ నుండుటకుంగాని, దీనినిమించుటకుంగాని తగినవిగాకయే యుండునని, వర్తమానమునం దాంధ్రీకరింపఁబడియున్న నాటకరాజముల నెల్లను సావకాశంబుగఁ బరిశీలించి చదివియున్న నేనిప్పుడును దృఢముగాఁ జెప్పఁగలను. సాంస్కృతికభాషాంతరమునందలి యీకృతిశైలి, తేటతేనియ లొలుకుపలుకుల శ్రీమదాంధ్రరామాయణమహాకావ్యమును రచియించిన మృదుమధుర రసవంత కవిత్వసంపన్నురాలగు మొల్లయను కులాలవంశజాత తనరామాయణ ముఖం దెంతయు హృదయరంజకంబుగ నుండునట్లు చెప్పిన,

క. మును సంస్కృతంబు తేటఁగ
దెనిఁగించెడిచోట నేమి ♦ తెలియక యుండన్



దనవిద్య మెఱయఁ గ్రమ్మఱ
ఘనముగ సంస్కృతము చెప్పఁ ♦ గా రుచి యగునే?

ఆ. తేనె సోఁక నోరు ♦ తియ్యనగురీతిఁ
దోడ నర్థ మెల్లఁ ♦ దోఁచకున్న
గూఢశబ్దవితతి ♦ కొట్లాటపని యెల్ల
మూగచెవిటివారిముచ్చ ♦ టరయ.

క. కందువమాటల సామెత
లందముగాఁ గూర్చి చెప్ప ♦ నది తెనుఁగునకుం
బొందై రుచియై వీనుల
విందై మఱికానిపించు ♦ విబుధుల కెల్లన్.

అనురీతి నంద మగుచందమున నుండునని సూచించుటకింక నాలుగు పద్యములను మాత్రమిట నుదాహరించుచున్నాఁడను.

గీ. పద్యము రచించుచున్న యీ ♦ పద్మనయన
బొమలు పైకెత్తి చింతించు ♦ ముద్దుమొగము
పులకితము లైనయట్టిక ♦ పోలములను
దెలుపుచున్నది నామీఁదఁ ♦ గలుగువలపు.

గీ. తరులు ఫలసమృద్ధిని నమ్ర ♦ తనువహించు
మేఘములు నవోదకముల ♦ మిగులవంగు
సత్పురుషు లుద్ధతులు గారు ♦ సంపదలను
బటుపరోపకారులకు స్వ ♦ భావ మిదియె.

గీ. తల్లిచనులపాలు నగలు ♦ త్రాగి కుడుచు
చున్న సింహపుఁబిల్లను ♦ పొమ్మటంచుఁ
గేసరములు గట్టిగఁ బట్టి ♦ క్రీడకొఱకు
నొకట బలవంతముగ నీడ్చు ♦ చున్నవాఁడు.

చ. గురులకు సేవఁ జేయు మనుఁ ♦ గుంగతిఁ జూడుము సీనపత్నులన్;
వరుఁ డలుక వ్వహించినను ♦ భర్తృవిరుద్ధవు గాకు మానునన్
పరిజనులందుఁ జూపుము కృ ♦ పం గడుఁ బొందకు భాగ్యగర్వమున్.
తిరిగిన నిట్లు కాంతురు స ♦ తీత్వము కాంతలు; నింద్యలొందుచోన్.

పంతులవారీనాటకముం దెనిఁగించుటకుం గొంతకాలమునకుం బూర్వమునం దమ చింతామణీ పత్రికయందుఁ గరం బరుదగునట్టులు రమారమి పదిపుటలు నింపిన జన్మాంతరరాహిత్యముం గూర్చిన యుపన్యాసమున కనుగుణ్యముగా నుండునటులు నిజమతానుసారంబుగఁ దెనిఁగింపక కాళిదాసుని.

ప్రవర్త్తతాం ప్రకృతిహితాయపార్థివ
స్సరస్వతీశ్రుతిమహతాం మహీయతాం.
మమాపి చ క్షపయతు నీలలోహితః
పునర్భవం పరిగతశక్తి రాత్మభూః

అనుశ్లోకమును,

చ. ప్రజలహితార్థమే నృపుఁడు ♦ వర్తిలుఁగావుత మెల్లయప్పుడున్
సుజనులవిద్య పూజ్యయయి ♦ శోభవహించునుగాక యెల్లెడన్!
నిజకృప నీలలోహితుఁడు నిత్యుఁడు ♦ శక్తిధరుండు నైనయా
గజదనుజారి నోసడఁచుఁ ♦ గావుత నాకును మాఱుజన్మమున్!

అని భాషాంతరీకరింపనేల యని కొందఱడుగవచ్చును; కాని, యీనాటకము సత్యహరిశ్చంద్రనాటకమువలె స్వకపోలకల్పితంబుగా నుండుటం జేసియు, భాషాంతరీకరింపవలసిన దగుటం జేసియు, మాతృకనుండి యిట్టియంశంబుల భేదించుట తెనిఁగించువారల కింతయు శ్రేయోదాయకంబుగా దని నే నిట వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. పంతులవారిందలిపీఠికయందు నొకవేళ జనుల కీపుస్తకము సంతోషజనకముగానే యున్నయెడల, ఇందు నాకల్పన మేమియు లేక సర్వమును కాళిదాసునిదే



యగుటవలన నామహాకవిని మెచ్చవలయునే కాని నన్ను శ్లాఘింపవలసినపని యెంతమాత్రమును లేదు" అని వ్రాసియున్నారుగాని, యయ్యది గ్రంథమంతరసవంతముగా రచియించుటచే, మనసునకుం గలిగినమోహాత్సాహముచే వచ్చినసంగతిగాని మఱివేఱుగాదనియును, నిజకవితానైపుణ్యం బెఱుకపడ మాతృకను రచియించిన కాళిదాసుని, సంస్కృతపదబహుళంబుగాకుండకయుండి, యన్వయకాఠిన్యంబనునది యించుకయును లేకుండునట్లు, కడుప్రౌఢంబుగ భాషాంతరీకరించిన పంతులవారిని చోసెనాంధ్రమగుటం జేసి ముందుగా శ్లాఘింపక శ్లాఘించుట నుమతంబుగాదనియు నేఁదలంచుచున్నాఁడను.

* * * * *

ఈనాటకము గ్రంథరూపంబుగ మొట్టమొదట ప్రచురింపఁబడిన రమారమి పదిసంవత్సరములకు విద్యాశాఖవారు, దీనిని, 1891వ సంవత్సరమున జరిగినప్రథమశాస్త్రపరీక్షకుం బఠనీయగ్రంథముగా నిర్ణయించియున్నారు.

గ్రంథములుపరీక్షలకుఁ బఠనీయగ్రంథములుగా నిర్ణయింపఁబడినంగాని, యమ్ముదువ్రాఁతల యేకలలోని వార్తగా నున్న మన తెనుఁగుదేశమునందు జనసామాన్యముచేత నే, విశేషముగాఁ గొనఁబడుచున్న పంతులవారిగ్రంథములు పరీక్షలకుఁ బఠనీయగ్రంథములుగా నిర్ణయింపఁబడినచో నయ్యది గ్రంథకర్తకుఁ బ్రోత్సాహకరంబుగా నుండునని చెప్పుటకన్న, హృదయరంజకములగు భాషాంతరములే యంతగా లేనియీకాలమునందు విద్యార్థులకు హృదయానందమును గలుగఁ జేయక మానదని చెప్పుటయే యెంతయు సముచితముగా నుండు నని హృదయపూర్వకముగాఁ జెప్పఁగలను. ఆయాయంశము లెల్లను, పీఠికయందే సులభముగా సూచింపఁబడియుండున ట్లీభాషాంతరముయొక్క రెండవకూర్పునందు,

"నేనీనాటకమును తెనిఁగించి 1881వ సంవత్సరాంతమునందు మొదటిసారి ముద్రింపించినాఁడను. ఆకూర్పు ప్రతులన్నియు సంవత్సరముకుఁ బటనే వ్యయపడినవి. పరీక్షలకు నిర్ణయింపఁబడనిగ్రంథములను కొనువారేయరుదుగా నున్నయీ తెలుఁగుదేశమునందు మొదటికూర్పు ప్రతులు నాలుగుసంవత్సరములలోపల నయినను విక్రయింపఁబడినందునకే యెంతయు సంతోషింపవలసియున్నది." అని వ్రాసియున్నారు.

ఈయనకీకుఁ జాతశాలలం జదువుకొనుచుండెడికాలమునుండియు మనతెనుఁగుదేశమునందుఁ దామే స్త్రీపునర్వివాహములను జేయింపవలయు ననుముఖ్యోద్దేశముగలదని ధైర్యంబునఁ జెప్పుటకు 'రాజశేఖరచరిత్రమే ప్రబలమయిన యాధారంబుగనున్నది. ఆయుద్దేశ మీయనమనమున దినదినక్రమంబున నభివృద్ధిఁ జెంద నారంభించి యయ్యది, యెట్టకేలకుఁ బునర్వివాహముల విషయమయి యొకయుపన్యాసమును 1879వ సంవత్సరమున సెప్టెంబరునెలయందు చేయఁగఁ బురికొల్పెను. ఈయనకు స్త్రీపునర్వివాహముల విషయమయిన యభిప్రాయము లెంతయుష్ణతను శిరస్సునం దుదయింపఁజేయుచు వచ్చెనో చెప్పుట కాకాలమునందనఁగా 1879వ సంవత్సరము ఆగస్టునెలయందుఁ బ్రచురింపబడిన శ్రీవివేకవర్ధనీపత్రికయందుఁ బ్రచురింపఁబడిన "స్త్రీపునర్వివాహసభానాటకము" నందలి కొన్నిపద్యంబుల నిట నుదాహరించిన నయ్యది తేటతెల్లంబుగాకమానదని తలంచి, యట్లు చేయుచున్నాఁడను.

* ద్విపద *

శ్రీకరగుణజాల! ♦ శ్రితజనపాల!
శోకాబ్ధివాతూల! ♦ సుజనౌఘలోల!
కారుణ్యమయశీల! ♦ ఘనధీవిశాల!
క్రూరజనాభీల! ♦ కుతుకాలవాల!



సర్వజ్ఞ! సర్వేశ! ♦ సర్వకారుణ్య!
సర్వశక్త్యాత్మక! ♦ సర్వనియంత!
త్రికరణశుద్ధిగా ♦ దేవాదిదేవ!
సకలార్తిహార! నిన్నుఁ ♦ జాలఁ బ్రార్థింతు;
సిద్ధిసుఖదాయక ♦ మిది దుఃఖబహుళ
మిది పరిత్యాజ్య మి ♦ య్యది గ్రాహ్య మనుచు
మానవు లెల్లను ♦ మనసులోఁ దెలిసి
పూనికతో సత్య ♦ మునె యనుష్ఠింప
వలయు నంచును బుద్ధి ♦ వారి కందఱకుఁ
గలుగునట్లుగ వేగఁ ♦ గరుణింపవయ్య!

* * * * * *

సీ. వినవయ్య చెప్పెద ♦ విస్పష్టముగ నీకు
మనదేశమందలి ♦ మగువలందు
వైధవ్యదశ నొందు ♦ వారలదురవస్థ
గనుఁగొన్న నెంతటి ♦ కఠినునకును
హృదయంబు నీరయి ♦ యెంతయు దుఃఖంబు
పుట్టును వారిలో ♦ ముఖ్యముగను
బాల్యకాలమునందె ♦ పతిహీన
లయినట్టియబలలదుర్దశ ♦ లాత్మలోనఁ
దలఁచుమాత్రన దేహంబు ♦ జలదరించి
వారియాపద వార్పింప ♦ వలయు ననెడు
బుద్ధి పుట్టకపోవదు ♦ భూమిలోన
మానవశరీర మెత్తిన ♦ వాని కెల్ల.

* * * * * *

గీ. దీర్ఘకాలమునుండి యీ ♦ దేశమందు
స్త్రీలకుఁ బునర్వివాహంబు ♦ చేయునట్టి
మంచివాడుక పోయిన ♦ మహిమచేత
నకట! యాచారమె ప్రధాన ♦ మనెదువారు.

ఉ. బాలవితంతుసంతతి వి ♦ వాహము లేక యథేష్టలీలలన్
జాలఁగ సంచరించుటను ♦ సంభవ మయ్యెడుకీడు లైనఁ దా
మేల యెఱుంగలేరు? పతి ♦ హీనలబాధలఁ జూడ వారికిన్
జాలి యొకింత పుట్టదే? ని ♦ జంబుగ వారివి ఱాతిగుండెలే?

గీ. భర్తృహీనలకయి కుంద ♦ ఫలము గలదే?
దైవ మీరీతిఁ బతిలేని ♦ తరుణీమణుల
దుఃఖపడుఁ డని మూఁడుబం ♦ తులను వ్రాయ
దానిఁ దప్పింప నెవ్వరి ♦ తరము చెపుమ?

గీ. అయ్యయో! సర్వకారుణ్యుఁ ♦ డయినయట్టి
యీశ్వరుఁడు స్త్రీల దుఃఖంబు ♦ నెనయుకొఱకె
యువనిమీఁదను సృజియించె ♦ నందు మేని
దైవదూషణ మగుఁగాదె ♦ తప్పకుండ?

క. కరుణానిధి యగుదైవము
ధరణీస్థలి దేని నైనఁ ♦ దరుగని వెతలన్
బొరసెడుకొఱకు సృజించునె?
దురితం బగునతనిమీఁద ♦ దోషము మోపన్.

* * * * * *

సీ. కూపకూర్మముమాడ్కిఁ ♦ గూర్చుండియొకచోట
జగ మెల్లహిందుదే ♦ శంబె యనుచుఁ
దలఁచియుందువు నీవు ♦ కల నైననిప్పటి
భూగోళశాస్త్రంబు ♦ ముట్టకుంట



నవనీతలం బెల్ల ♦ నైదుఖండములుగ
భాగింపఁబడియుండుఁ ♦ బ్రస్తుతమున;
నట్టిఖండంబుల ♦ యందు నొక్కటియైన
యాసియాఖండంబు ♦ నందు నున్న
దేశములఁ బదియాఱింటఁ ♦ దెలిసిచూడ
హిందుదేశంబు నొక్కటి ♦ నింతెనుమ్ము
స్త్రీలకుఁ బునర్వివాహంబు ♦ చేయునట్టి
యిట్టియాచార మిటఁ దక్క ♦ నెందు లేదు.

సీ. ఈదేశమున నైన ♦ నితరమతస్థులౌ
హూణమహమ్మదీ ♦ యుల ప్రశంస
యటు లుంచినను గొల్ల ♦ లాదిగాఁగలహిందు
జనులలోపలఁగూడ ♦ వనితలకును
మాఱుపెండ్లి చేయు ♦ మంచియాచారంబు
పెంపొంది యున్నది ♦ తెంపులేక
పెద్దపట్టణముల ♦ ద్విజు లెక్కువగనున్న
సంఖ్యయందును హీన ♦ జాతివారె
మిగుల హెచ్చుగ నుందురు ♦ మెట్టుమీఁద
ద్విజులలోఁ గూడ మనహిందు ♦ దేశమందు
యువతులకును బూర్వము పుణ్య ♦ యుగములందుఁ
బరిణయము గ్రమ్మఱను జేయఁ ♦ బడుచు నుండె.

* * * * * *

అను మొదలయినరీతిని నాటకముయొక్క ప్రథమాంకము మాత్రమే యిప్పటికి ప్రచురింపఁబడియున్నది. ప్రకృతిజన్యమగువివేచనాశక్తిని విడనాడి, మనపూర్వులందఱును, సర్వజ్ఞులు, నశేషానుభవశాలు లనుగాఢ

మగువిశ్వాసమును గలిగియుండి, యీశ్వరదత్తపుస్తకము లని యంథప్రాయముగా విశ్వసింపఁబడుచున్న ఋషిప్రోక్తంబు లగు వేదశాస్త్రాదుల నెల్లను విమర్శనాభావమనస్కులయి విశ్వసించుచు నందు సముచితంబుగఁ గాలానుగుణ్యంబులుగ నుండునట్లు చెప్పఁబడినవన్నియు నాచరణీయంబు లని సర్వదా ప్రచండవాదములను సల్పుచుండెడు పండితమండలాగ్రగణ్యుల వజ్రహృదయములనయిన నిట్టివి కరిగింపక మానవు. మతాచారవిషయములనుగూర్చినసులభావగాహము లగు గ్రంథములు విశేషముగా నుండవలసిన మనయాంధ్రదేశమునం దట్టిగ్రంథములు ప్రచురింపఁబడినచో నయ్యవి గ్రంథకర్తలస్వభావజన్య మగుపరమదయార్ద్రహృదయంబును వెల్లడించుచు లోకోపకారకరకార్యవిదితంబులుగా నుండక మానవుగదా!

* * * * * *

ఈ 1880 వ సంవత్సరమునందు, హూణభాషయందుఁ బలువిధములయిన నాటకరాజములను విరచించిన హూణకాళిదాసని ప్రసిద్ధి విగాంచిన షేక్స్పియరు మహాకవిచే రచియింపఁబడిన "మెర్చెంటాఫ్ వెనీస"ను నాటకమును "వినీసువర్తకచరిత్ర"మను పేరిట ద్విపదరూపముగా రచియింపఁ నారంభించి, యందుఁ బ్రథమ ద్వితీయాంకములను మాత్రము ముగించి ప్రచురించియున్నారు. మృదుమధురంబుగనుండి, నాతికఠినంబుగనుండునట్లు ద్విపదకావ్యములను రచియించుటయందు వీరలకుఁగలఁ నిరుపమానసామర్థ్య మీభాషాంతరము వెల్లడింపక మానదు. అయ్యది సూచించుటకిందు "ఆంటోనియో" యను వానితో "షైలాక్" అను వర్తకుఁడు పలికినభాగమునిందుఁ బొందుపరుచుచున్నాను.



నమ్మిక చెడ నాథ ♦ నమ్మను గూర్చి
వడ్డినిగూర్చియుఁ ♦ బలుమాఱు నన్ను
నడ్డ నేయక తిట్టి ♦ నరివారిలోన
నవమానపఱిచితి ♦ వంగళ్ళవాఁడ
అవియెల్లసహియించి ♦ యడఁగియున్నాఁడ
శాంతమే యొందు మా ♦ జాతివారికిని
గ్రాంతి నిచ్చెడియులం ♦ కారంబు గాన
నాయిష్ట మగురీతి ♦ నాసొంతసొమ్ము
హాయిగా వాడిక ♦ చేయుతప్పవకె,
యంతఁగా 'నాస్తికుఁ ♦ డా' యంచు మఱియు
'గొంతుకలను గోయు ♦ కుక్క' యటంచుఁ
బిలిచిపైఁ జితి వుమ్మి ♦ వలువలమీఁద
బళి! నీకు నిపుడు నా ♦ వలనితోడ్పాటు
కావలసినయట్లు ♦ కానిపించెనును
నీవద్దకేయేల? ♦ నీవునాకడకుఁ
జనుదెంచి యిట 'మాకు ♦ ధనము కావలయు'
ననుచును మఱిమఱి ♦ యడుగుచున్నావు.
వెనుక గడ్డముమీఁద ♦ వెస నుమ్మి వైచి
చని లోన దూఱిన ♦ శునకంబు నుకటఁ
దన్నినగతి నన్నుఁ ♦ దన్ననీవె
వెన్నాడి ఋణ మియ్య ♦ వేఁడుచున్నావు.
ఈయెడ నీకు నే ♦ నేమియుత్తరము
నీయంగవలయును? ♦ "ఓయి! యెందైన
శునకంబునొద్దను ♦ సొమ్ముండునయ్యా!
పనికిమాలినకుక్క ♦ బదులుగా మూఁడు

వేలమాడల నియ్యఁ ♦ జాలునే? యంచు
నీల నేఁ బలుకంగఁ ♦ బోలదే యిపుడు?
ఏను నీకెట వంగి ♦ భృత్యరావముల
రానీక యాపితి ♦ నైన దిగ్గఱగ
వినయంబుతోఁ దప మె ♦ ల్లనివాక్యములను
ఘనపుణ్య! బుధవార ♦ మున మొన్న మీరా
ఁలోక తేప నామీఁద ♦ నమ్మి పైఁ బెట్టిరి;
ఒకనాఁడు తన్నితి ♦ దూరక నన్ను;
మఱియొక్క దినమున ♦ మన్నించి నన్నుఁ
బిడ్డకుక్క యటంచుఁ ♦ బిలిచినవారు;
మీరు చేసినయట్టి ♦ గౌరవాధిక్య
కారణంబున నియ్య ♦ గలవాఁడ ఋణము
వని చెప్పుమనె నేను ♦ హర్షంబుతోడ?

*　　*　　*　　*　　*

తరువాతఁ గొంతకాలమున కనఁగా 1878వ సంవత్సరము సెప్టెంబరు నెల 22వ తేదిని వీరితల్లిగారగు పున్నమ్మగారు కాలధర్మము నొందిరి. కుమారుఁడించుమించుగా నాలుగైదుసంవత్సరముల ప్రాయము నందున్న కాలముననే తండ్రిగారు కాలవశులగుటం జేసి, తమక్షేమాభివృద్ధుల కంతగాఁ బూనిపాటుపడు సోదరులు మొదలయినవారలు లేక యుండుట మొదలయినకష్టములకు వగచి, చేయునది వేఱేదియును లేదు గావున, మించినప్రయాసమునకు లోనయి, కుమారునకు విద్య చెప్పించుకొని, యందఱు బుద్ధిమంతుఁ డని సంతసింప దేశమునం దెంతయుఁ బ్రఖ్యాతిని సంపాదించుచు, సుఖముగా జీవయాత్రను గడుపుచున్న కుమారునిఁ గన్నులారఁ జూచి సంతసించుచునే తల్లిగారు మరణము



నొంది యుండవచ్చునుగాని, యిటులు గౌరవనీయంబుగ జీవితకాలమును గడుపుటకుం జాలినసామర్థ్యాతిశయమును గలుగ ననేకవిధముల నయభయములు గలిగి సుఖజీవనము చేయుచువచ్చిన కుమారునిం గనుఁగొనుచువచ్చినతల్లిగారిమరణమునకు వీరెంత సంతాపమునొంది యుండవలయునో మీరలే యూహింపుఁడు. తల్లిగారు మరణమొందునప్పటికి వీరలు రమారమి ముప్పది సంవత్సరముల ప్రాయముగలవారలయి యున్నను, వయసునకు మించిన ప్రపంచానుభవమును గలవారగుటం జేసి, పంచభూతపరిణామాత్మకమయిన జీవసామర్థ్యమునకు జననమరణాదులు ప్రపంచక ధర్మములగుటం జేసి, వీరలు చింతారాహిత్యముగల స్వభావముగలవారలనియే చెప్పవలసియున్నది.

ఎటులయినను, పెంచి, పెద్దవానిని జేసి, విద్యాబుద్ధులు చెప్పించి, సమస్తవిధములఁ బ్రాణపదముగాఁ గాపాడినప్రాణాధికురా లయిన ప్రియజనని లోకాంతరగతురా లయినప్పుడు వీరేశలింగముపంతులుగారు దుఃఖసముద్రములో మునిఁగియుండి రనియే చెప్పవలసియున్నది. ఆకాలమునం దంతకుఁ బూర్వము వీరురచియించిన.

ద్విపద.

మునుమున్న దేవతా ♦ పూజలు సల్పి
మననిమిత్తము చాల ♦ మహిఁ గష్ట మొంది
తొలుత గర్భంబునఁ ♦ దొమ్మిదినెలలు
వలనొప్ప మనలను ♦ వహియించి కాంచి
కన్నపిమ్మటఁ గూడఁ ♦ గడగండ్ల కోర్చి
చన్నులపా లిచ్చి ♦ సతతంబుఁ బ్రోచి
యుయ్యేలలో నుంచి ♦ యూఁచి లాలించి
యొయ్యెడ నొక్కింత ♦ యేడ్చినఁగాని

పరుగెత్తికొని వచ్చి ♦ పాటలుపాడి
యురమునఁ జేరిచి ♦ యోదార్చి పిదప
ననుఁగన్నతల్లి! ♦ యోనాచిన్నిపాప!
యని పిల్చుచును జెక్కు ♦ లాస్యంబు నోరు
ముద్దాడి శిరమును ♦ మూర్కొని యవలఁ
దద్దయుఁ బ్రేమంబు ♦ దైవారఁగాను
మును బొమ్మమీఁదను ♦ బుజములమీఁద
వెనుకతట్టున నిడి ♦ వేడ్క మోయుచును
నవ్వించి యాడించి ♦ నయము చూపుచును
బవ్వాళించినయట్టి ♦ వట్టున నైన
నేమఱి యుండక ♦ యెడనెడ వచ్చి
నేమంబుతో నుంట ♦ చేరి చూచుచును
దన కిష్టమైనట్టి ♦ దానినిగూడఁ
దనప్రాణసమముగ ♦ దాఁచి పెట్టుచును
దేహమున నొకింత ♦ తెవులు చూపట్ట
నాహారనిద్రల ♦ నవలఁ బోద్రోచి
పరితాప మొందుచు ♦ బహువిధంబులను
పరసఁ బాయక యుప ♦ చారముల్ చేసి
కాయము స్వస్థతఁ ♦ గాంచినదాఁక
హాయిగా నుండక ♦ యటమటించుచును
మనబాగె యెప్పుడు ♦ మదిని గాంక్షించి
చనవున బలిమిని ♦ సమయోచితముగ
మంచిబుద్ధులు నేర్పి ♦ మనవర్తనమునఁ
గొంచె మేనియు నిలఁ ♦ గొదవ లేకుండ
వర్తించునటు చేయ ♦ వడిఁ బాటుపడుచుఁ



గీర్తికెక్కెడుమాత ♦ కేవల మిలను
మనపాలిఁటికి వేల్పె ♦ మాట లేమిటికి?
మనమామెమాటను ♦ మఱి తప్పఁ దగదు;
భయభక్తులను జూపి భజియింప వలయు
దయతోడఁ జూచుచుఁ ♦ దల్లి నెల్లప్పుడు;
మనమూలమున నామె ♦ మది నొచ్చె నేని
మన కది శ్రేయస్సు ♦ మఱి కాదు సుమ్ము.

అను "మాతృపూజ"ను గాంచునప్పు డయ్యది యెట్టియవశ్యావలంబనీయ మగుహితబోధను గావించుచున్నదియును గోచరముగాక మానదుగదా! కాని, "జాతస్యమరణంధ్రువ" మ్మనుప్రమాణవచనానుసరణంబుగ నుండునటులు "సత్యహరిశ్చంద్రనాటకము" నందు,

ఉ. భీరుఁడు చావుచావనుచు ♦ వేమఱునున్ మరణార్తి నొందెడున్;
ధీరుఁడొ యొక్కసారియె మృ ♦ తిం గనునప్పుడు బాధ నొందెడున్;
ధారుణి దేహధారులకుఁ ♦ దప్పక చా వెప్పుడైన నుండఁగా,
నూరక చావుకై వగపు ♦ నొందఁగ నేటికి మాటిమాటికిన్?

అనుపద్యమును రచియించియున్నారు. స్వభావసిద్ధములుగా నుండి సులభావగాహము లగుటం జేసి, హృదయరంజకము లయినభాషాంతరముల యందారి తేరిన వీర లిటీవల ప్రబోధచంద్రోదయ మని చెప్పఁదగునటులు తెలిఁగించినప్రబోధచంద్రోదయము నందలి,

ఉ. దారిని బాంథు, లేటివలఁ ♦ దర్ దరుకాండము, లాకసంబునన్
వారిదముల్, సముద్రమున ♦ నావికులున్, వడిఁగూడి పాయున
ట్లారయఁ దల్లిదండ్రులును ♦ నాత్మజులున్ సఖులున్ సహోదరుల్
చేరుచుఁ బాయుచుండు టిది ♦ సిద్ధము; ప్రాజ్ఞుల కేడ శోకముల్?

మ. జనకుండో సుతుఁడో సఖుండొ తనువుం ♦ జాలింప, ధీశూన్యు లి
మ్మనశోకాగ్నిఁ దపింతు రెంతయునుర ♦ మ్ము ల్మోదుకొంచొక్కటన్;

కన సంసార మసార మంచు శమసౌ ♦ ఖ్యంబుం గడుం బెంచుచుం
ఘనధీమంతుల కావియోగచయమే ♦ కల్గించు వైరాగ్యముల్.

అనుపద్యములయందుఁ జెప్పఁబడిన ప్రధానోద్దేశమే వీరల కాకాలము నందు మనశ్శాంతిని గలిగించియుండవచ్చు నని నేను నిశ్చయముగాఁ జెప్పఁగలను.

* * * * * *

నిత్యసత్యవచస్కు లని చెప్పవలసినమహనీయులు చార్వాకాదులు చెప్పినచొప్పున జ్ఞానసంపన్నులచే శుష్కప్రలాపము లని పరిగణింపఁబడఁదగినశాస్త్రచోదితములగు కర్మల నెల్లను, వీరుబాల్యము నుండియు నెంతటిసంస్కారజ్ఞానప్రియు లయినను, మతబహిష్కృతు లయిన యిటీవలికాలమునందువలెనే యాకాలమునందును తల్లిగారియుత్తరక్రియలను శాస్త్రయుక్తముగ నాచరించియే యున్నారుగాని మఱి వేఱుగాదు. సంస్కార మనునది యెట్టివానియందును గాలక్రమంబు నంగాక, యొక్కసారిగ నుదయించి, యభివృద్ధిస్థితియం దుండునది గాదు. మనసునందలి నిజమగునుద్దేశములస్వభావమే మతమని చెప్పవలసియున్నను, మనసు ననుసరించి యాచరించుటమాత్ర మంతగాఁ సాధ్యము గానేర దని యెల్లవారలును విశ్వసింపవలసియే యున్నదికదా!

* * * * *

చిరకాలమునుండి, యాంధ్రదేశమునందుఁ బ్రధానసంస్కారాగ్రేసరు లని పేరెన్నికఁ గాంచుచున్న యీవీరేశలింగముపంతులుగారు తాము పాఠశాలలయందు విద్యాభ్యాసము చేయుచువచ్చినకాలము నుండియుం దెలుఁగుపత్రికలను నిరంతరము చదువుటయందు విశేషముగాఁ గాలమును గడుపుచు వచ్చి రని మనము నిశ్చయింపవలసి యున్నది. ఆకాలమునం దాంధ్రదేశమునందుఁ బ్రకటింపఁబడుచుండిన తెలుఁగుపత్రికలయందును, బొంబాయి కలకత్తా మొదలగు నితరరాజధానులలోని ముఖ్యపట్టణంబులలోఁ బ్రకటింపఁబడుచు వచ్చినదేశభాషాపత్రికలయందును, ఆంగ్లేయభాషాపత్రికలయందును స్త్రీపునర్వివాహములను గూర్చి విశేషముగా ముచ్చటింపఁబడుచుండుటను స్వయముగాఁ జదువుచును, ఇతరులవలన నాకర్ణించుచు నట్టిసత్కార్యమును మనదేశమునం దాచరణములోనికిం దేవలయు ననుసచ్చింత వీరిమనసున వీరితల్లిగారు జీవించియున్నకాలమునందే యుదయించియున్న దని చెప్పవలసియున్నది; కాని, తల్లిగారు జీవించియున్నకాలమునం దట్టి చిరకాలాగతాచారవిరుద్ధకార్యమును నిర్వహించుటకుం జాలినసాహసము వీరికి లేకున్నందులకుం గారణము,



“ మనమూలమున నామె ♦ మది నొచ్చెనేని
మన కది శ్రేయస్సు ♦ మఱి కాదు సుమ్ము ”

అనువాక్యమునందలి భావమే యని చెప్పవలసియున్నది. మఱియుం దల్లిగారియెడ వీరికిఁగలభయవినయము లనియుఁగూడఁ జెప్పవలసియున్నది. వీరు, పునర్వివాహలోకహితకార్యనిర్వహణమునకయి నడుముగట్టుకొని నిజముగా నిలిచి లెక్కలేనిసభలలో ననేకోపన్యాసము లొసంగినకాలము వీరితల్లిగారు లోకాంతరగతులయిన 1878 వ సంవత్సరము సెప్టెంబరునెల 22 వ తేదికిం బిమ్మటిదియే యని చెప్పవలసియున్నది. స్త్రీపునర్వివాహములంగూర్చి, యటుపిమ్మటనే, యెన్నివ్యాసములయినం గానవచ్చుచున్నవి. “ స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము ” “స్త్రీపునర్వివాహవిషయకప్రథమవిజ్ఞాపనము.” “ స్త్రీపునర్వివాహవిషయకద్వితీయవిజ్ఞాపనము.” “స్త్రీపునర్వివాహశాస్త్రసంగ్రహము.” అనుననేకోపన్యాసము లన్నియువిశేషముగా వ్యవధిలేని వేఱువేఱుకాలములయందే లేశమును భయమును జంకును లేనిమనస్సుతోడనే వ్రాయఁబడిన వని, యాయాఖండనోపన్యాసములయందలి రచనాసాహసముంబట్టి మనము నిశ్చయించుకొనవచ్చును.

నేను వ్రాసిన పైవాక్యములయందలిసత్యమును నిర్ణయించుకొనఁ దలంపుగలవారలు వీరిచేఁ బ్రకటింపఁబడిన "స్త్రీపునర్వివాహశాస్త్రసంగ్రహము" నందున్న యుపసంహారములోనివాక్యములం గాంచిన, నందులో, ముఖ్యముగ "నేను 1879 వ సంవత్సరమునందు, రాజమహేంద్రవరమున నీవిషయమున నుపన్యాసములను జేయ నారంభించి భగవదనుగ్రహమువలన నిప్పటికి రెండువివాహములను జేయింపఁగలిగినాఁడను." అనువాక్యముం గాంచిన వెల్లడిగాకమానదు. వీరింతింతని చెప్పుటకు వీలులేనిసంక్షోభములో 1881 వ సంవత్సరము డిశంబరు నెల 11 వ తేది రాత్రి రాజమహేంద్రవరమున స్వగృహంబున మొదటి స్త్రీపునర్వివాహమును జరిగించియున్నారు. వీరీస్త్రీపునర్వివాహవిషయమునం దెన్నికష్టములనయినం బడి, కష్టములకించుకయును సరకుసేయక, సఫలీకృతమనోరథులయియుండుటం జూడ వీరికింగలపట్టువిడువనిస్వభావముం జూడ, నెంతయు సంతోషము నాశ్చర్యమును గలుగక మానవు.

కాని, రెండుమూఁడుస్త్రీపునర్వివాహములను జరిగించినపిమ్మటఁ జెన్నపురంబున కరిగి యక్కడ జరిగినయొకగొప్పసభయందుఁ జదివిన "రాజమహేంద్రవరస్త్రీపునర్వివాహచరిత్రము" లోనున్న

"ఆకాలమునందు పెద్దాపురములో నుండతటస్థించినయొకమిత్రునిసాహాయ్యముచేత, మే మాచిన్నదానియింట పనిచేసెడియొకకుట్టవానిగుండ నుత్తరప్రత్యుత్తరములను జరప నారంభించితిమి. వయస్సులో నున్నవారికి, నిరంతరవైధవ్యదుఃఖమునకంటె మరణమే శ్రేష్ఠముగా నగపడును గనుక, తా నేలాగునైన దుస్సహబాధనుండి బయలుపడ సుఖింపఁగోరి, యాచిన్నదే తన్నుఁ గొనిపోవుటకుఁ గలవివిధమార్గములను మాకుపదేశించినది. ఆమె చెప్పినయుపాయముల ననుసరించి, తగినంతమందిని పల్లకిమోచువారిని నియమించి, ఆపల్లకితో మామిత్రుని నొకనిని, కొందఱుభటులను సాయమిచ్చి పంపి, సంకేతస్థలమున రాత్రివేళ ఆచిన్నదాని కలిసికొని, యామెను పల్లకిలో నెక్కించుకొని తెల్లవారునప్పటికి రాజమహేంద్రవరము తీసికొనివచ్చి విడుచునట్లు తగినయేర్పాటు లన్నియు చేసితిమి. * * * మాయుత్తరప్రత్యుత్తరములసంగతి మాత్ర మెవ్వరికిని తెలియక మిక్కిలి రహస్యముగానే యుండినది. మేము మఱియొకయుపాయము నాలోచించి, మావర్తన మెవ్వరికిని భేద్యము కాకుండునట్లు గోప్యముగా నిర్వహించి, పరమనిపుణుఁడును, మాకు పరమవిశ్వాసియు నయినయొకమనుష్యుని పెద్దాపురమునకుఁ బంపితిమి. అతఁ డెవ్వరికి ననుమానము కలుగకుండ మార్గస్థునివలె నటించి, రాత్రి వారివీథియరుగుమీఁదనే పరుండి, తన సందేశము నాచిన్నదానికి తెలిపి, నేర్పుతో పనిచేసెను. అమావాస్యనాఁడు, రాత్రి రెండుజాములవేళ మబ్బుపట్టి చినుకులు పడుచుండఁగా, తనతండ్రికి తలనొప్పివచ్చుటచేత నుపచారములు చేయుచున్నతల్లిమొదలయినవారి నేమఱించి, లఘుశంకకుపోవుమిషమీఁద వీథిలోనికి వచ్చి, యాచిన్నది మామనుష్యులతో తాను వచ్చుటకు సిద్ధముగానున్నసంగతి తెలిపెను. అతఁడు వెంటనే యాచిన్నదానిని వెంటఁగొని బయలుదేఱి యాచిన్నదాని కావలను తీసికొనిపోయినబట్టలు కట్టి, పురుషవేషము వేసి, పగలు చూచుకొనివచ్చినమాఱుమూలదారిని గాఢాంధకారములో, వానలో తడియుచు పరుగెత్తి, కొంతదూర మాచిన్నదానిని నడిపించియు, కొంతదూర మెత్తికొని మోచియు, తెల్లవారునప్పటికి రెండామడలు నడచి, అక్కడ బండిచేసికొని, మఱునాఁడు రెండుజాములవేళ నామెను మాయింటికిఁ జేర్చెను." అనువాక్యములను గాంచి, సంతానవంతుఁ డయినగృహస్థులు చేయఁగలుగునా యనియును, వీరేశలింగముగారు దయాదాక్షిణ్యములు లేనివారనియును, వీరేశలింగముగారు గావించినవి రహస్యబలాత్కా

రపునర్వివాహము లనియును జెప్ప నారంభింపవచ్చునుగాని, దూరదృష్టి నించుక యోచించి చూచినచో, వీరేశలింగముపంతులుగారు, సంతానవంతులు గాకయే యున్నను, బాల్యముననే మృతభర్తృకలయి సమస్తసుఖములకును దూరురాండ్రుగాఁ జేయఁబడి, సమస్తకష్టములకును లోఁబఱుపఁబడెడునిర్భాగ్యురాండ్రయిన యబలలదుర్దశను జూచి మనస్సు నీరయి వారిదురవస్థ నెట్లయినను నివారించుటకయి చేసినప్రయత్నములు సర్వవిధముల శ్లాఘాపాత్రము లయిన వనియే చెప్పక మానరు. మఱియు నాస్త్రీపునర్వివాహచరిత్రమునందే యున్న

“పెండ్లికొమారునియొక్క తల్లి మొదలగుబంధువులు మాయింటికి వచ్చి, యేడ్చియు, కేకలు వేసియు, బెదరించియు, బుద్ధులు చెప్పియు బతిమాలియు, వాగ్దానములు చేసియు పెండ్లికొమార్తెను మరల తీసికొనిపోవుటకై నానావిధముల పాటుపడిరి కాని, వారిప్రయత్నములన్నియు విఫలములైనందున, వారు నిరాశులై వెనుక మరలవలసినవారయిరి.” అనువాక్యమును జూచునప్పుడు, వీరు, నిర్దాక్షిణ్యస్వభావుల యెడల నెట్టికఠినహృదయులుగ నుండుననియును, నిరంతరదుఃఖనిమగ్నహృదయులగునసహాయదీనానల యెడల నెంతదయార్ద్రహృదయులుగ నుండుననియును బోధపడక మానదు.

* * * * * *

స్త్రీపునర్వివాహముల విషయమయి, వీరలు చెన్నపట్టణము, బెంగుళూరు, కాకినాడ, నరసాపురము, విశాఖపట్టణము మొదలయిన యనేకపట్టణములయందనేకోపన్యాసముల నొసంగియున్నారు. ఆయా యుపన్యాసములన్నియు నేటికినేకసారులు ప్రచురింపఁబడి విశేషముగా నమ్ముడుపోవుచునేయున్నవి. మొదటియుపన్యాసమీయఁబడిన తరుణమునందే యనఁగా 1879 సంవత్సరము అక్టోబరునెల 12 వ తేది, ఆదివారమురోజున నీయఁబడిన “స్త్రీపునర్వివాహ విషయకద్వితీయ విజ్ఞాపనము” 1884వ సంవత్సరము మేనెల 28వ తేదీని నరసాపురమునందలి సెంట్రల్ స్కూల్ హాలులో నొసంగఁబడిన స్త్రీపునర్వివాహవిషయక తృతీయోపన్యాసమగు “స్త్రీపునర్వివాహవిషయ కోపన్యాసము”ను సావధానంబుగఁ బరిశీలించి చదివెడు వారలకందఱకును వీరేశలింగము పంతులవారెట్టిసచ్చింతకు స్వభావసిద్ధముగాలోనయి యున్నదియును వెల్లడియగుటయే కాక, వారికింగలగంభీరోపన్యాస ధోరణియును బైటపడక మానదు. 1885వ సంవత్సరము జూన్ నెల 9వ తేదీని, చెన్నపురి పెద్దినాయనిపేట గోవిందప్పనాయని వీథిలోని బాలికాపాఠశాలామందిరమున నీయఁబడిన “రాజమహేంద్రవర స్త్రీపునర్వివాహ చరిత్రము”ను జూచువారలకు వీరేశలింగముపంతులవారును దదితరులును స్త్రీపునర్వివాహముల విషయమయిపడిన ప్రయాసమంతయు సంతాపకరంబుగ మనసున గాఢంబుగ నాటుకొనక మానదు.

ఈస్త్రీపునర్వివాహమహాకార్యమునకు మూలాధార మహాపురుషుఁడని నిస్సందేహముగాఁ జెప్పవలసిన శ్రీపైడా రామకృష్ణయ్యగారి మరణానంతరమునందనఁగా 1886వ సంవత్సరము మార్చినెల కిటీవల వీరేశలింగము పంతులవారు వ్రాసి ప్రచురించిన “స్త్రీపునర్వివాహవ్యాపారముయొక్క భూతవర్తమానస్థితు”లను నుపన్యాసమునందలి,

“ప్రప్రథమమున నే నీస్త్రీపునర్వివాహ విషయమున కృషికారంభించినప్పుడెవ్వరో యొక్క రిద్దఱు తప్ప ఇప్పుడున్న యీ సామాజికులలో నెవ్వరును నాకుసహాయులుగా నుండలేదు. న్యాయపతి సుబ్బారావుపంతులుగారప్పుడీపట్టణమునకు క్రొత్తగావచ్చియుందురు. ఆరంభించిన రెండుసంవత్సరములకుఁగాని ఆత్మూరి లక్ష్మీనరసింహముగారీపట్టణమునకు రానేలేదు. బసవరాజు గవర్రాజుగారు మాత్రము నాకు తోడుపాటుగానున్నారు. కాని నాకుముఖ్యప్రోత్సాహకులుగానుండి యీకృషిలోనన్ను ప్రవేశపెట్టి నాచేతపనిచేయించినవారు నాసహపా

రియు మిత్రులునయిన చల్లపల్లిబాపయ్యగారు. లౌక్యాధికార ధూర్వహుఁడను ధనికుఁడను విద్యాధికుఁడను గాని నేనీమహాకార్యమును నిర్వహింపఁజాలనని యధైర్యపడి నిరుత్సాహుఁడను కాఁగా నాకుఁధైర్యముచెప్పి పురికొల్పి నన్ను వెంటఁగొని బయలుదేఱి శ్రీపునర్వివాహమయమున భోజనములకు వచ్చెద మని ముప్పదిమంది బ్రాహ్మణగృహస్థులచేత వ్రాళ్ళుచేయించి నాకంతను మహాశ్రద్ధతో పనిచేసిన దీయనయే. ఈయన ప్రోత్సాహముచేతనే 1879వ సంవత్సరము జూలయి నెలలో శ్రీవిజయనగరపు మహారాజుగారి బాలికాపాఠశాలయందు నేను శ్రీపునర్వివాహవిషయమై నామొదటియుపన్యాసమును జేసినాను. కాఁబట్టి యిప్పు డంకురించి పెరుగుచున్న శ్రీపునర్వివాహ క్రియావృక్షమునకు బీజావాపము చేసినవారు శ్రీచల్లపల్లిబాపయ్యగారనియే చెప్పవలసియున్నది. * * * *

ఈకృషియారంభమయిన కొన్నివారములకు నాకుపరిచితులయిన శ్రీబారు రాజారావుపంతులుగారు శ్రీపైడా రామకృష్ణయ్యగారీపట్టణమునకువచ్చినప్పుడు నాకు వారితోడి మైత్రిని కలిగించినారు. వారప్పుడీపనినిమిత్తమయి తాముముప్పదివేలరూపాయల నిచ్చెదమని వాగ్దానముచేసినారు. ఈశ్వరుఁడుమాకీగొప్పప్రాపుకనఁబఱిచినందున మాకు మఱింత యుత్సాహముకలిగి, మేముతొంటికంటె ద్విగుణధైర్యముతో పనికిఁబూనితిమి. * * * మాలోఁ జేరినవారు ప్రాయశ్చిత్తములు చేయించికొని యొక్కరొక్కరే మమ్ము చేయి విడుచురాఁగా 1884వ సంవత్స రారంభమున కోదండరామయ్యగారి వివాహ మగునప్పటికి పయివారిలో కొటికలపూడి రామేశ్వరరావుగారును, బసవరాజు గవ్వరాజుగారును నేనును ముగ్గురముమాత్రమే యీ సమాజములో నిలిచియున్నాము. ఇప్పుడు మొదటివారుగాక తక్కిన యిద్దఱముమాత్రమే యున్నాము. రామకృష్ణయ్యగారు మాప



వ్యయములక్రింద నాకిమ్మని జూన్ నెల డెబ్బదియైదురూపాయలును సెప్టెంబరు మొదటితేదివఱకును నాకుముట్టనేలేదు. ఇట్లు మాసవ్యయములక్రింద డెబ్బదియైదురూపాయల చొప్పున వచ్చుచున్నను వానిలోనుండి నెలజీతములును రొక్కముగా నిచ్చెడుసొమ్మునుతప్ప మఱియేమియు వ్యయపెట్టలేదు. భోజనాదివ్యయముల నన్నిఁటిని నాసొంతసొమ్ములోనుండి నేనేవహించుచుంటిని. నల్లగొండ కోదండరామయ్యగారే 1882వ సంవత్సరము జూలయినెలలో ప్రాయశ్చిత్తము చేయించుకొని మాయింటినుండి వెడలిపోవువఱకును తానే వెచ్చమంతయు వాడి లెక్కవ్రాసెను. వంటబ్రాహ్మణులులోనుగాఁ గలవారు కొందఱు సంవత్సరములకొలఁదిని కొందఱు నెలలకొలఁదిని మాయింటనేయుండి భోజనములు చేయుచు వచ్చెడువారు. * * * * 1884వ సంవత్సరము జనేవరు నెలలో నల్లగొండ కోదండరామయ్యగారి వివాహమగువఱకును సామాజికులకును వివాహములు చేసికొన్నవారికిని ఐకమత్యమునకేమియు కొఱంతరాలేదు. కోదండరామయ్యగారి వివాహము నిమిత్తమయి కన్యనుతీసికొని రావలసినదని నేను పులవర్తి శేషయ్యగారిని పంపినప్పు డాయన సంకోచింపక పెండ్లికూఁతురివారివస్త్రములను సహితము కొంతదూరము సంతోషపూర్వకముగా మోచుకొని వచ్చుట యీయైకమత్యమున కొకనిదర్శనముగా చెప్పవచ్చును. * కోదండ రామయ్యగారి వివాహమయిన రెండుమూఁడు మాసములలో కొన్ని కలహకారణములుకలిగినవి. లోకములో వైరమునకును నేరములకును ఏవి కారణములుగానుండునో తెలిసినవారికీవైరమునకుఁ గలకారణమును తెలుపవలసినపని యుండదు. * * *" అను మొదలయినవానిఁజూచినప్పుడును, 1885వ సంవత్సరము జూనునెల 9వ తేదిని, చెన్నపట్టణమునందలి బ్లాకుటౌనులోని బాబూగారి బాలికాపాఠశాలామందిరమున నొసంగఁబడిన "రాజమహేంద్రవర శ్రీపునర్వి

వాహచరిత్రము,, నందలి భ్రూణహత్యాదులుపశమించి స్త్రీపునర్వివాహ
ములు నిరాతంకముగా జరుగుచు బాలవితంతువులు తమ ద్వితీయభర్తల
తో సుఖించుచుండ గా చూడవలెనని నాకెంతయభిలాష యుండెను,
ఒక్కసారిగా ఇంతటి గొప్పమార్పునిమిత్తమయి ప్రయత్నము చేయుటకు
నాకు సాహసము పుట్టలేదు. * * * ఈప్రకారముగా సత్య
బలమును దైవబలమును నాపక్షమునందుండుటచేత నాకు ధైర్యము
హెచ్చి నేనుత్సాహముతో పనిచేయఁగా పండితు లుపన్యాసములు చే
సినసభ నాడు నాప్రతివాదములను విన్నమీఁదట జనులకందఱకును
పండితులవాద మసారమనియు స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతమనియు
అభిప్రాయముకలుగనారంభించెను. * * నేను మొట్టమొదట
నిచ్చిన యుపన్యాసము ప్రకటింపఁబడఁగానే తెలుఁగుదేశమునందంతటను
స్త్రీపునర్వివాహవిషయమైనవాదము లే ప్రబలి మండనవాదులునాపుస్త
కమునాధారముచేసికొని శాస్త్రమును యుక్తులును చెప్పఁబూనుటయు
ఖండనవాదులు బహువిధముల పూర్వపక్షములు చేయఁబూనుటయు
కొంతకాలము జరిగెను. గుంటూరునుండి భువనగిరి పరదేశసోమయా
జులుగారును, బాదరునుండి శ్రోత్రముకోటీశ్వరశాస్త్రులుగారును, చెన్న
పురినుండి కొక్కొండ వేంకటరత్నముపంతులుగారును, వర్తమానర
త్నాకరవిలేఖకులును, కాకినాడనుండి ఓగిరాల జగన్నాథముగారును,
విశాఖపట్టణమునుండి దంతులూరి నారాయణ గజపతిరాజుగారును,
రాజమహేంద్రవరమున వేదము వేంకటరాయశాస్త్రులుగారును, ఇంక
ను ననేకులును నాప్రథమోపన్యాసముమీఁద ఖండనగ్రంథములందలి
ముఖ్యాంశములకును, రాజమహేంద్రవరమునందలి పండితులు చెప్పిన
యంశములకును ఉత్తరంబుగా నేను మరల శ్రీవిజయనగరముమహారా
జుగారి బాలికాపాఠశాలలో జరిగినమహాసభలోనే నాద్వితీయవిజ్ఞాపన
మునుపన్యసించి, ప్రకటించినాను. ఇదిగాక బహుస్థలములయందీవిష



యమై వ్రాయుచువచ్చిన ప్రతివాదులవాదముల కెల్ల నుత్తరములు
ప్రకటించుచువచ్చినాను. తీఱికయున్నప్పుడితర స్థలములకుపోయి యుప
న్యాసములు చేయుటకును ప్రయత్నించుచువచ్చినాను. నేను మొట్ట
మొదట కాకినాడకుపోయి యుపన్యాసముచేసినప్పు డక్కడి బ్రాహ్మ
ణులు నామీఁద రాళ్లు వేయుటకును యత్నించినారు. * * *
ఈరెండవవివాహమయిన మఱునాఁటినుండియు జనులవలని బాధలంత
కంతకు ప్రబలసాగినవి. ఈవివాహములను చేయించినవారిని చేసికొన్న
వారిని భోజనములకుపోయినవారిని మాత్రమేకాక చూడఁబోయినవా
రిని సహితము పలువిధముల బాధపెట్టనారంభించిరి. ఈశుభకార్యము
లయందుకొంచెము సంబంధమున్న వారినందఱిని వారు కాపురమున్న
యద్దెయిండ్లలోనుండి లేవఁగొట్టిరి; కాపురముండుటకెవ్వరు నిండ్లనియ్య
కుండిరి. నూతులలో నీళ్లుతోడుకో నియ్యకపోయిరి; నీళ్లుతెచ్చు బ్రా
హ్మణులను తేకుండఁజేసిరి. శుభాశుభకార్యములకు పురోహితులను
బ్రాహ్మణులను రాకుండఁజేసిరి. దేవాలయములకు పోనియ్యకపోయిరి.
బంధువులు మొదలయినవారిని పోకుండఁజేసిరి. కనఁబడినచోట్ల మొగ
ముముందఱనే దూషింపసాగిరి. మఱియు నింక నెన్నివిధముల వారా
యాసపెట్టఁగలుగుదురో యన్నివిధములను శ్రమకలుగఁజేయసాగిరి.
* * * పాఠశాలలోనుపాధ్యాయులుగనున్న యెడల వారి నా
కొలువులనుండి తొలఁగింపవలయునని విశ్వప్రయత్నములు చేసిరి. *
* * ఈబాధలిట్లుండఁగా కొన్ని దినములలో ముప్పదిమందికి శ్రీ
శంకరాచార్యస్వాములవారియొద్దనుండి బహిష్కారపత్రికలుకూడ వచ్చి
నవి. ఆపత్రికలనుజూచి పరమానందభరితులయి శ్రీవిజయనగరము
మహారాజుగారిబాలికాపాఠశాలలో సభచేసి, అదివఱకిచ్చకములాడుచు
చిత్తము చిత్తమని యనుగ్రహమును వేచి తెలుఁగు ననామధేయ ఒకరాం
తము కంటె నెక్కువవారి పేరులను గౌరవసూచకముగున గాంచుమాట

మైన చేర్పకుండ నుచ్చరించి లాఘవపఱచి మహాజనమధ్యమున వారిని వెలివేసితిమనియు శుభాశుభకార్యములయందు వారియిండ్లకెవ్వరును పోకూడదనియు వారిని పిలువకూడదనియు వారిని దేవాలయములకు పోనియ్యకూడదనియు కేకలు వేయుచు బల్లలమీఁద నెక్కి గంతులువేసిరి. * * * ఆకాలములో స్వాములువారు విధవావివాహములనెంత నిషేధించుచువచ్చినను ఘోటకబ్రహ్మచారులయిన వారి శిష్యులుమాత్రము రండలతోడ రాత్రు లమంత్రకములయిన వివాహములను రహస్యముగా జరుపుచునేవచ్చిరి. పాఠశాలలోని విద్యార్థులు కొందఱీసంగతిని కనిపెట్టి యొకనాఁటిరాత్రి వేచియుండియొక బ్రాహ్మణవిధవతో సంసారము చేయుచున్న బ్రహ్మచారిశిష్యుని పట్టుకొని ఆ యపూర్వదంపతులను వీథిలోని కీడ్చుకొనివచ్చి యెల్లవారికిని చూపి యవమానపఱిచిరి. * * * చేతిలోని పాత్రలను నీటిలోఁ బోఁగొట్టుకొన్న యపాత్రులయిన యాశిష్యులను వెంటఁబెట్టుకొనిపోయి రక్షకభటులు వారిస్వాములవారితోఁ జెప్పిరి. స్వాములవారు శిఖాయజ్ఞోపవీతములను విసర్జించినను రాగద్వేషములనుమాత్రము విసర్జింపనందున శిష్యులకు సంభవించిన దుర్దశనిమిత్తమై కొంతసేపు విలపించి యావిద్యార్థులను శపించి యూరిలోనివారు తమ్మువచ్చి ప్రార్థించి యలుకతీర్చెదరేమోయని పీఠమునువిడిచి లేచిపోయెద నని వారికిని వీరికిని సమాచారములు పంపెను. * * *

ఆకాలములో నిరువదిరూపాయల యుద్యోగములోనుండి ప్రవేశపరీక్షం దేఱి బంధుజనమునువిడిచి మాతోఁ జేరియున్న యొకరు నల్లగొండ కోదండరామయ్యగారు. నేనీచెన్నపురము రావలెనని బయలుదేఱినప్పుడు నాకు సహాయుఁడయి వంటచేసిపెట్టుటకు సహితము పూనుకొని నేను సముద్రములోని పొగయోడను చేరుటకయి పడవనెక్కఁ



బోవునప్పుడు ఝంఝామారుతము ప్రబలముగా వీచుచు సంతతధారగా వర్షము కురియుచు సముద్రతరంగములు పర్వతోపమానముగా నుండుట చేత మిత్రులు బహువిధముల పోవలదన్నను మానక నావెంట సంతోషపూర్వకముగా చిన్నపడవలో సముద్రమునందయిదుమైళ్లు ప్రయాణము చేసి యా భయంకరస్థితిలో ధూమనౌకాధికారి యపాయకరమని యెంచి మమ్మెక్కించుకొనక నిరాకరించుటవలననే వ్యసనముతో వెనుక మరలినసంగతి మీరు విన్నయెడల విద్యార్థులెంతటి ధైర్యోత్సాహములును విశ్వాసమును కార్యనిర్వహణాసక్తియు లోకోపకారచింతయు కలవారయి యుండిరో మీరే తెలిసికోవచ్చును. వారే యర్ధరాత్రమున నెంతదూరముననున్న యేగ్రామమునకుఁ బోయి యెవ్వరితో మాటాడి యేకార్యమును చేసికొనిరమ్మన్నను మాఱుమాట చెప్పక చెప్పినట్టు చేసికొనివచ్చుచుండిరి. ఇటువంటివారితోడ్పాటుచేతనే మేమనేకకార్యములు నిర్వహింపఁగలిగితిమి. * * * * *

మొదటిరెండు వివాహములునయినతరువాత బహువిధ మనస్తాపములు సంభవించిన కాలములోనే వివాహితయైన రెండవవితంతు కన్యయొక్క తండ్రి లోకాంతరగతుఁడగుట తటస్థించెను. అప్పుడు వాహకులెవ్వరును దొరకకపోయినను మాలో మేమే శవమును శ్మశానవాటికకు తీసికొనిపోయి దహనసంస్కారము జరిగించి, పుస్తకముచూచి చదివి యపరక్రియలను నేనే జరిగింపవలసినవాఁడనయినాను. వంటబ్రాహ్మణులు మొదలయిన వారు బెదరించి లేచిపోవుచురాగా, అటుతరువాతజరిగిన యయిదవవివాహమునకు నాభార్యయే గోదావరినుండి నీళ్లుమోచుకొనివచ్చి వంటమొదలయిన పనులెల్లను నిర్వహింపవలసినదాయెను. * * * అను మొదలయిన వానిం జూచునప్పుడు పలువురజ్ఞులు వెల్లడించు దురుద్దేశము లెంతవఱకు సత్యములనుగఁ బరిగణింపవలయునో చదువరులే యూహించుకొనవచ్చును. "ఈ స్త్రీపునర్వివాహసత్కార్య

ములకు పదివేలురూపాయలునుగాక, మొదటిరెండు వివాహములకును యిన సమస్తవ్యయములను వహించుటయేకాక, ఈయనయే కొన్ని గృహములను సహితము పునర్వివాహదంపతులు కాపురముండుటకయి సమాజమువారి వశమునను౦చియున్నాఁడు. పరోపకారశీలుఁడైన యీదయాశాలియొక్క యీయోగ్య దానమును నేను వర్ణింపవలసిన పనిలేదు ఈ యిచ్చినధనముపోయినను, తనువులుపోయినను మఱియేమి పోయినను ఈయనకీర్తి యీ భూమండలములో స్థిరముగా నుండకపోదు నావంటివారు కొందఱుపనిముట్లవలె కొంత యుపయోగపడినను, ఈకార్యస్థాపనమున కీయనయే ముఖ్యకారణుఁడు. మన హిందూదేశమందలి ధనికులలో నిటువంటి పరోపకారచింతగల దానశీలురు మఱి పదిమందియున్నయెడల, ఈభరతఖండ మత్యల్పకాలములోనే తొల్లింటి మహోన్నత దశకువచ్చి బాగుపడుననుటకు సందేహము లేదు. ఇటువంటి లోకోపకారధురీణు లనేకులు శీఘ్రకాలములోనే మనదేశమున కలంకార భూతులుగాజనించి యీభరతఖండముయొక్క పునరభివృద్ధికితోడుపడుదురుగాక!" అని శ్రీపైడా రామకృష్ణయ్యగారిని గూర్చి యీస్త్రీపునర్వివాహ చరిత్రమునందు వ్రాసియున్నారు. ఒకసత్కార్యమునకు విఘ్నములు కలుగఁజేసెడి యవకాశము కొంచెము లభింపగానే దానిని సందుచేసికొని గోరంతలు కొండంతలుచేసి ద్వేషాగ్నిని ప్రజ్వలింపఁజేసి కార్యవిఘాతమయినప్పుడు చూచి సంతోషింపవలెనని కనిపెట్టికొనియుండు మహానుభావులు లోకములో ననేకులుందురు. అట్టివారి దుర్బోధలువిని చెడిపోక బీటలువాఱుచున్నయైకమత్యదుర్గమును స్వలాభముకొఱకెల్లవారును మరల శాంతిసుధతో నతికింపఁజూతురని నమ్ముచున్నాను. యుక్తకాలములో నట్లుచేయకపోయినయెడల కార్యముమించినతరువాత పశ్చాత్తాపపడిన ప్రయోజనము లేకస్వయంకృతదోషము ననుభవింపవలసివచ్చును.



1882వ సంవత్సరము జ్యేష్ఠమాసమునందు చెన్నపురిలో నొసరఁగఁబడిన "స్త్రీపునర్వివాహ శాస్త్రసంగ్రహము" ను సాంతముగాఁ జదివి చూచువారలకు శ్రుతిస్మృతిపురాణేతిహాసాదులనుండి యెంతెంతకష్టపడి యోపికతోడనేర్చి యీయుపన్యాసమును వీరలు వ్రాసియున్నదియును సులభముగా బోధపడకమానదు. స్త్రీపునర్వివాహ విషయమునుగూర్చి వీరలు ప్రచురించిన యన్నియుపన్యాసములను ఓపికతోడం జదివించి చూచినచోఁ గ్రంథకర్తయొక్క హృదయపూర్వకమైన పరోపకారచింతకలిగియున్నదియును కరతలామలకంబుగ గోచరముకాకమానదు. 1879వ సంవత్సరము అక్టోబరునెల 12వ తేదిన ఆదివారమునాఁడు శ్రీవిజయనగరపు మహారాజులవారి బాలికాపాఠశాలామందిరమున జరిగినసభలోఁ జదువఁబడిన యీ "స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము", నందలి,

"అస్మద్దేశీయులగు దయార్ద్రహృదయులారా! సమస్తసద్గుణహారావళికిని దయయే నాయకమణియని మీరందఱు నెఱిఁగియేయున్నారుగదా! ఈశ్వరునియొక్క సమస్తకల్యాణగుణములకును దయయే శిరోభూషణమై సృష్టియందెల్లెడలను బ్రకాశించుచున్నది. లోకములోని సమస్తజీవరాసులును తమయల్పాయుష్కాలములో నపారసుఖమును బొందుచుండుటకు భగవంతునికి వానియెడలఁగల నిర్హేతుకజాయమాన కటాక్షముతప్ప వేఱుకారణమేదియున్నదని మనమూహింపఁగలము? ఒకరియాపదను జూచినప్పుడు దయార్ద్రహృదయుఁడై యాపన్నివారణమునకుఁ దగిన సదుపాయమును జింతించువాఁడెవఁడో వాఁడొక్కఁడే నిక్కమైనమానవుఁడు గాని, తక్కిన దయాశూన్యులు మనుష్యరూపముననున్న ఘాతుకమృగములే యగుదురు. ఎట్టి ఘాతుకమృగమయినను తన యాహారమునిమిత్తము ఇతరజాతిమృగములను హింసింపదు. తెలివిలేని మృగములయందు సహితమిట్టిమేర యొకటి గనఁబడు

చుండఁగా జ్ఞానసంపదచే నత్యధికులయిన మనుష్యులయందు తమకు లేశమయినను మేలు లేకపోయినను వెనుకటివారు, బాధపెట్టుచువచ్చిరను హేతువునుబట్టి యనాథలైనయబలల హింసపెట్టుగుణముండుట ధర్మమగునా? మనము ప్రతిదినమును గరుణఁజూపుమని సర్వకారుణ్యుఁడయిన ఈశ్వరునిఁ బ్రార్థించుచు, మనముమాత్రమట్టి కరుణనేల దిక్కుమాలినయనాథలయందుఁ జూపరాదు? శాస్త్రమో సమస్తవిధముల స్త్రీపునర్వివాహమును విధించుచున్నది. ఐనను శాస్త్రమునకు కుత్సితార్థములను గల్పించి యనాథలయిన స్త్రీలను బాధింపఁ గంకణముఁగట్టుకొన్న పండితమండలాగ్రగణ్యులును అందందు పలువురుందురు. నిద్రపోయెడివానిని లేపవచ్చునుగాని మేలుకొన్నవానిని లేపుటశక్యము కాదు; కాఁబట్టి యట్టి పండితసత్తములను బోధించుటకు బ్రహ్మయైనను శక్తుఁడు కానేరఁడు. ఎద్దుపుండు కాకికి ముద్దుకానట్టు, అనాథస్త్రీలకష్టములును వారిమనసులను గిరగింపఁజాలవు. ఆరంభదశయందెంత మంచి కార్యమునుగాని కొందఱు దూషింపుచునేయుందురు. పామరుల దూషణమును పాటిగాఁ బట్టక సాహసించి, బాల్యముననే భర్తలను పోఁగొట్టుకొన్నవారి జనకులును లోకోపకార చింతగలవారును కార్యమునకుంజొచ్చినచో నిప్పుడు దూషించువారే పిదప భూషించెడి కాలము వచ్చునుగాని రాకపోదు. శాస్త్రనిషిద్ధకార్యమని భ్రమపడి వివాహమును జేయుట మానుకొని, అందువలనఁగలిగెడుప్రత్యక్ష ఘోర పాతకములైన గర్భపాతములను శిశుహత్యలనుజూచి యూరకుండుట యిహపరసుఖదాయకమగునా? కన్నబిడ్డలకు శాస్త్రీయముగా వివాహములుచేయక స్వయంకృతాపరాధమువలన వారు చెడుతెరువులఁ బ్రవర్తింప సన్మార్గమునం బ్రవర్తించుమార్గమును జూపక మీఁదుమిక్కిలి విటులను జంపింపఁజూచుట మనుష్యకృత్యమగునా? సద్వంశమునజనించి కన్యలు ద్వితీయ వివాహము లేకపోవుటచే నిల్లువిడిచి లేచి



పోయి బహిరంగముగా వ్యభిచరించుచు జాతిభ్రష్టలగుచుండఁ జూచుచు నూరకుండుట మనకు గౌరవావహమగునా? రాజదండనమునకు వెఱచి కన్నబిడ్డలను జంపక చండాలురు మొదలగువారికియ్యఁగా ఉత్తమజాతులయందుఁ బుట్టినయట్టిబాలురు చండాలురై చెప్పరాని పనులను జేయుచుండఁగాఁ జూచుట మనకు లాఘవముకాదా? ఇట్టి గణనాతీతములయిన దుష్కృత్యముల గొడిగట్టుటకంటె సమస్తదోషనివారకమును శాస్త్రీయమునైన వివాహమునే చేయరాదా? ఓజనులారా! భగవంతుఁడు మనకు జ్ఞానమును దయచేసియున్నందుకు దానిని సార్థకపఱచి, లోకముయొక్క మేలును జింతించి ప్రస్తుతమున రజస్వలకాకమునుపుభర్తలనుపోఁగొట్టుకొన్న స్త్రీలకయినను పునర్వివాహమునకనుజ్ఞనియ్య మిక్కిలి ప్రార్థించుచున్నాను. మీకట్టిసద్బుద్ధి నుదయింపఁజేయుటకయి కరుణానిధియైన పరమేశ్వరుని త్రికరణశుద్ధిగాఁ బ్రార్థించి, ఇప్పటికీవిషయమునింతటితో విరమించుచున్నాను." అనునది యందులకొక ప్రబలనిదర్శనముగాఁ దోఁచక మానదు. ఆంధ్రదేశమునం దంతట నేటికించుమించుగ నిరువదియిరువదియైదు స్త్రీపునర్వివాహంబులు జరుపఁబడి యున్నయవి. ఈరాజమహేంద్రవరముననే మొదటి స్త్రీపునర్వివాహము 1881వ సంవత్సరము డిసెంబరునెల 11వ తేది రాత్రి జరిగినది. అందఱకును మార్గప్రదర్శకు లగునటులఁ బ్రథమంబుగ నట్టివివాహమును జేసికొనినవారు గోఁగులపాటి శ్రీరాములుగారు వీరలిప్పుడు క్రైస్తవమతావలంబులయి విశాఖపట్టణమునం దుద్యోగమునం దున్నారు.

* * * * * *

స్త్రీపునర్వివాహములు మొట్టమొదటఁ జేయఁబడిన యీ 1881వ సంవత్సరమున వీరేశలింగము పంతులవారి తండ్రితల్లిగారగు కామమ్మగారు జీవించియేయున్నారు. స్త్రీపునర్వివాహమశాస్త్రీయమనియు,

దురాచారమనియు నెన్నెన్నివిధములనో మనుమని నట్టికార్యములనుండి మఱలింప నెంతయుఁ బ్రయత్నించి, యెట్టకేలకు నిల్లువిడచి వేఱుగనుండెదనని భయపెట్ట నారంభించి, యొకటిరెండు దినములు మాత్రము వేఱుగ వండుకొని తిననారంభించి, యట్టికార్యంబులిఁక జరుగక మానవను దృఢనిశ్చయంబునను, దమకుఁదోడు పడువారింట నింక నెవ్వరు లేకయుండుటం జేసియుఁ బెద్దకాలమగుటం జేసియు నట్టికార్యంబులు పరమశ్రేయోదాయకంబులని తమకుఁదామయొప్పుకొనుచు మఱల నెప్పటివలెనే వీరేశలింగముపంతులవారు మొదలయిన వారలతోడం గలసి భోజనంబులు చేయ నారంభించెను. పంతులవారింక మతమునుండి వెలివేయఁబడుదురని వారియత్త వారలలోని యనేకులును బంధువులనేకులును స్త్రీపునర్వివాహంబులు చేయఁబడనున్నవని తెలిసికొని, రాజ్యలక్ష్మీదేవిగారి నెంతనిరుత్సాహపరిచి బహువిధముల హితోపదేశంబులు చేయనారంభించినను నట్టివారల మూర్ఖోపదేశంబులనెల్లఁ బెడచెవిబెట్టి యిల్లువిడువక, యట్టి సత్కార్యాచరణంబున వీరేశలింగముపంతులవారి కెంతయుఁ బ్రోత్సాహంబును గలుగఁజేసినయామె ప్రశంసనీయంబగు చారిత్రంబు నే నేమనియభినందింపఁగలను? ఎట్టులైన నిట్టివారలొరుల నిరుత్సాహకరములయిన కార్యములకులోనయి తమపూనిన కార్యంబులనుండి తొలఁగు స్వభావముగలవారలుగాకయే యుందురు గదా!

శాస్త్రజ్ఞాన రహితులును, నిర్దాక్షిణ్యస్వభావులు నగునట్టి వారలచే నశాస్త్రీయంబులుగను ననాదరణీయంబులుగను బరిగణింపఁబడుచు వచ్చిన యీస్త్రీపునర్వివాహములు జరుపఁబడిన యీ 1881 వ సంవత్సరముననే వీరేశలింగముపంతులవారు మొదలగువారలనేకులు జగద్గురువులని చిరకాలమునుండి పరిగణింపఁబడుచువచ్చిన శ్రీశంకరాచార్యస్వాములవారిచే మతమునుండి బహిష్కరింపఁబడిరి. ఆహా! నీతి



బాహ్యమును దయాశూన్యమునగు మతమీకలికాలమునందు మూర్ఖులను సంతసింపఁజేయుటకై యెట్టియకార్యకరణంబులను ధైర్యమను నది లేశమును లేక యాచరించుచున్నది! సత్కార్యమని తాము హృదయపూర్వకముగ నమ్మి పరోపకారార్థంబుగ స్త్రీపునర్వివాహములను దేశమునందు శక్తివంచనంబాకింతయు లేక పాటుపడి వ్యాపింపఁజేయుచున్న వీరేశలింగము పంతులవారికిట్టి నిరర్థకములగు బహిష్కారములవలనఁ గలిగెడి యగౌరవమునుగాని, నష్టముగాని నే నూహింపఁజాలకున్నాను. బహిష్కారాంశమునుగూర్చి యిట విశేషముగ వ్రాయుదమనిన మునీకాలంబున మతగురువుల వలని ప్రయోజనమేమియో నాకు లేశమును గానరాకున్నది. కాలమున కనుగుణ్యంబుగ నుండునటులు శాస్త్రములను గల్పించినవారలు చిరకాలము క్రిందటనే కాలవశులైయున్నారు. అట్టి జ్ఞానసీయులందఱీకాలంబున జనులఁజిరజీవులనుగఁ జేయఁగలిగినయెడ దేవుని యనుగ్రహంబుననైన నీకాలంబున నివసింపఁగలిగినచో స్త్రీపునర్వివాహంబులు పరమసమ్మతములనియే విధులను గల్పింపక మానరను గట్టినమ్మకముగలవాఁడనగుటం జేసియు, శాస్త్రము లచేతనపదార్థంబులగుటం జేసియు నట్టిజ్ఞానసంపన్నుల మరణమునకుఁ గరంబు చింతించుచు, హృత్పీడాకరములగు పరమహాస్యాస్పదములయిన వాక్యంబుల నిటఁ జొనపక కాలముయొక్క యుక్తాయుక్తపరిజ్ఞానవివేకవిహీనతం గూర్చి మాత్రము కరంబుఁ జింతించెదను. దేశక్షేమాభివృద్ధినపేక్షించి, సత్కార్యములను నెలకొల్పఁ బ్రయత్నించుచున్న వీరేశలింగము పంతులవారితోడను మఱియట్టివారలతోడను గలిసి భోజనములు చేయుటవలన నేమి నష్టముగలుగునని బహిరంగముగాఁ జెప్పుటకైనను సాహసించుచున్న సంస్కారజ్ఞానప్రియులగు పలువురు విద్యార్థులనీతిగౌరవంబున కెంతయు సంతసింపవలసియేయున్నది. స్త్రీపునర్వివాహంబులు దేశక్షేమదాయకములను నిశ్చితాభిప్రాయముగల విద్యార్థులందఱట్టి వీరేశలింగము

పంతులవారితోఁ గలిసి భోజనములను జేయుటవలన వచ్చెడు నష్టములేవియో యను వంశమునుంగూర్చి యించుక సదుద్దేశంబున యోచించెదరుగాక!

* * * * *

ఆదిశంకరులవారుకాని, ఆయనతరువాతపీఠమునకువచ్చిన యతులుగాని, పదునాలవశతాబ్దమునందు పీఠమునకువచ్చిన విద్యారణ్యులనఁబడెడు మాధవాచార్యుల కాలమువఱకును ఎవ్వరును గజాశ్వాందోళనాదులు పల్లకులు మొదలయిన రాజచిహ్నములను వేనిని కలిగియుండక యత్యాశ్రమమున కనుకూలములయిన కాషాయవస్త్రాదులను మాత్రమే ధరించి పాదచారులై దేశయాత్రచేసి మతవ్యాపనము చేయుచువచ్చిరి. కావున, జగద్గురువులనఁ బ్రసిద్ధివహించిన శ్రీశంకరాచార్యస్వాములవారింకనయినను గేవలనాస్తికమతమునందు మునిఁగియున్న యీ తెనుఁగుదేశమునందు మూఢజనులనిగ్రహానుగ్రహములను లేశమైనను పాటింపక, పరిశుద్ధాస్తిక మతమును వ్యాపింపఁజేయఁ బ్రయత్నించి, లోకోపకార ధురీణులయి జగద్గురువులను బిరుదునామమును సార్థకముగఁ జేయఁ బ్రయత్నించెదరని వేడుచున్నాను.

ఈలోకములో నిట్టిఘనకార్యముల నాచరించుటకుం బట్టుదలయును, నిర్భయస్వభావమును, ముఖ్యముగాఁ జాలినంతధనంబు నావశ్యకము లయియుండును. జ్ఞానసముద్రం బనిచెప్పనొప్పెడు "ప్రబోధచంద్రోదయ" నాటకమునందలి.

మ. ధన మార్జించెద నంచుఁ, బ్రాప్తమగువి♦త్తం బింక హెచ్చింతు నం
చును, లాభంబును వృద్ధిఁ గూరిచెద నం♦చున్, సొమ్మెధ్యానింతు నీ
వనిశంబున్, గన వన్నిటెందినెడియా ♦ యాశాపిశాచంబు గ్ర
క్కున లోభాంధతమోవృతున్ నిను మెసఁ♦గున్ బల్మిసంచక్కటా!



అనుపద్యమునం జెప్పఁబడినయట్లుగాక, స్వలాభాపేక్షయనునది లేశమును లేక, లోకోపకారచింతయే ప్రధానోద్దేశముగాఁ జేసికొని, లోభగుణంబనుదాని నెఱుంగక, యత్యంతధారాళహృదయముతో విశేషధనసాహాయ్యంబు నొసంగిన శ్రీపైడా రామకృష్ణయ్యనామకవైశ్యశిఖామణియొక్క సన్మార్గప్రదర్శకస్వభావంబును,

"I, Pyda Ramakrishnayya of Cocanada, son of Pyda Chalamayya do hereby entrust you with two Hundies executed by Rajah Venkatadri Apparow Bahadur Garu on the 3rd March 1886 to the value of Rs. 10000 (Rupees ten thousand only) and request you to act as trustee for Widow Marriage Association so that you may use the interest to be realised from the above sum in the support of remarried widows and their husbands and their children and for bringing about Widow Maraiages; but not a single pie should be spent from the principal. I further request that you should do this business to the best of your ability and discretion for the improvement of the Widow Marriage cause and that you should make such arrangements that the object might be carried on in perpetuity even after your demise.

18th March 1886, Cocanada. } (Signed) P. RAMAKRISHNAYYA, (True copy)

A. LAKSHMI NARASIMHAM,
Trustee."

అనుమరణశాసనముంబట్టి కనుఁగొనఁగలము. కాకినాడపట్టణమునం దట్టియత్యంతౌదార్యస్వభావసంపన్ను లొకకాలమునం దుండిరి కదా యని సంతోషము గలుగుచున్నది. అట్టిదయార్ద్రభావాశాలిహృదయులమరణమునకు లోకము సంతాపము నొందక మానదుగదా!

ఈస్త్రీపునర్వివాహమహాకార్యములనుగూర్చి యోచించునప్పుడీయనచే జనసామాన్యమునకును ముఖ్యముగాఁ బాఠశాలలలోని క్రిందితరగతులయందలి బాలురకును బాలికలకు నత్యంతోపయుక్తముగా నుండునటులు మృదుమధురశైలిని రచియింపబడి పటములతోఁగూడఁ బ్రకటింపబడిన నీతికథామంజరియొక్క ద్వితీయభాగమందలి,

గీ. ఇంటనూరక కూర్చుండి ♦ యెంద ఱైనఁ
గానఁబడుదు రుపాయముల్ ♦ కలవువారు;
కాని, కానరా రొక్కరుఁ ♦ గష్ట మైన
పనిని చెయివేసికొని చేయు ♦ బాహుబలులు.

అనుపద్యము తలపునకు రాకమానదు. వీరలిట్లాంధ్రదేశమునందంతట గొప్పమార్పులను గలుగఁజేయఁ బ్రయత్నించుచువచ్చినయా 1881వ సంవత్సరమునందే, గీర్వాణభాషయందు శ్రీహర్షదేవునిచే మిగుల హృదయరంజకముగా నుండునటులు రచియింపఁబడిన "రత్నావళి" యను నాటకమును నాతికఠినమృదుమధురశైలిని దెనిఁగించియున్నారు. ఈభాషాంతరము, మొట్టమొదట చింతామణిపత్రికయందుఁ బ్రకటింపఁబడి, యందు ముగింపఁబడినది. మొదటికూర్పునందు నాంది తెనిఁగింపఁబడియుండలేదు. ఈనాటకమీ 1894 వ సంవత్సరమునందుఁ బ్రథమశాస్త్రపరీక్షకుం బఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడియున్నది. అన్వయకాఠిన్యమనది లేశమును లేక యించుకపదకాఠిన్యముగల శ్రవణానందకరమగునవీనమగుకవిత్వశైలిని గరంబబ్బురంబుగనుండునట్లుదయింపఁజేసినప్రబోధచంద్రోదయనాటకము తెనిఁగింపఁబడిన కాలంబునకిటీవల



వ్రాయుటచేతనే యీరత్నావళి నాటకమునందలి నాందియందలి కవిత్వము చదువరుల కొకవిధమయిన యానందమును ఆశ్చర్యంబును మనసునకుఁ గలిగింపకమానదు. ఈనాటకమునందుఁ జెప్పఁబడిన సంగతులలో స్వభావవిరుద్ధమయినదేదియుఁగానఁబడదు. దీనివలనఁ బూర్వకాలమునందు హిందూసుందరులకెంత స్వాతంత్ర్యముండెడిదో వారెంత నాగరికురాండ్రుగాను విద్యావతులుగానునుండి భర్తలతోఁగూడ సభలకు సహితము వచ్చెడి యాచారము కలిగియుండెనో స్పష్టపడుచున్నది. ఈరత్నావళినాటకమును దాను శ్రీరాములుగారు సహితము పద్యగద్యాత్మకంబుగఁ దెలిఁగించి ముద్రింపించియున్నారు.

వీరేశలింగకవి కృతాంధ్రరత్నావళినాటకమునందలి రచనాసౌలభ్యము నించుక సూచించినఁ జదువరులకానందము గలుగక మానదని తలంచియుండి కొన్నిపద్యముల నిటనుదాహరించుచున్నాను.

సీ. మద్యపానముచేత ♦ మత్తెక్కి యాడెడి
భామినులయురోజ ♦ భారమునను
వంగిననడుమును ♦ వగపుతో వీక్షించి
యాబాధకును మూల ♦ మయినయట్టి
వక్షస్స్థలంబును ♦ శిక్షించుగతి హార
ములుమాటికిని యొమ్ము ♦ మోదఁదొడఁగె
కనుఁగొనఁగా లేక ♦ కాంతిహీనములౌచు
సరగున విరిసరుల్ ♦ జాఱఁజొచ్చె
తాళుమాటౌచుఁ గేశబం ♦ ధంబువీడి
వ్యాకులతఁ జెందఁగాఁ జొచ్చె ♦ నతిశయముగ
పాదములమీఁదవ్రాలి కం ♦ పంబు మిగుల
ద్విగుణముగ నందియలు మొఱ ♦ వెట్టఁ దొడఁగె.

చ. అరతెగి క్రిందవ్రేలుమెడ ♦ యందలిబంగరుగొల్సు లీడ్చుచున్
బరువడి ద్వారముల్గడచి ♦ పాదములం జిఱుగంటచాల్ మనో
హరముగ మ్రోయ స్త్రీలుజడి ♦ యం జెడువానర మశ్వపాలకుల్
తురగపుసాలనుండి వడిఁ ♦ దోలఁగ రాజగృహంబుఁ జొచ్చెఁ దాన్.

మ. ఇదిసంపంగులపంక్తి; యీవలివనం ♦ బే సిందువారాళి; యి
య్యది చూడన్ వకుళావనీజములగుం ♦ బోఁ; బాటలశ్రేణి యి
య్యదియే యంచును దావిచేఁ దెలిసె నా ♦ హా దారి స్పష్టంబుగా
నిదె వృక్షంబులచేతఁ జీఁకటికదున్ ♦ హెచ్చయ్యెఁ బూర్వస్మృతిన్.

చ. వదనము చంద్రుఁడు; కను ♦ వల్నయనంబులు; పాణులబ్జముల్;
కదళిక లూరువుల్; భుజయు ♦ గంబును దామరతూండ్లు నీకు నో
సుదతిరో! కౌఁగిటం జొనిపి ♦ నూనశరాగ్నిని గాలియున్న నా
ప్రిదిలినయంగకంబులను ♦ ప్రేమను జల్లపడంగఁ జేయుమా.

సీ. పద్మాసనస్థుఁడై ♦ బ్రహ్మదేవుండదె,
యొకచోట వెలుగొందు ♦ చున్నవాఁడు
శంకరుం డల్లదె ♦ చంద్రకళావతం
సుండయియొకవంక ♦ సొబగుమీఱు
దైత్యారి యతఁడె గ ♦ దా చక్రఖడ్గకా,
ర్ముకములతో నాల్గు ♦ భుజములందు
నైరావతం బెక్కి ♦ యతఁడె దేవేంద్రుండు
తిన్నఁగాఁ గన్పడు ♦ చున్నవాఁడు
చరణములనూపురములు సు ♦ స్వరము లీన
దేవతాసుందరులతోడ ♦ దివమునందుఁ
దక్కఁగలయట్టియమరబృం ♦ దంబు లివిగొ
నృత్య మొనరించెదును గదు ♦ నేర్పుమీఱ.



ఉ. జ్వలన! ప్రశాంతిఁ బొందుము; ప్రశాంతిని బొందుము; ధూమమార్పుమీ
నిలువకమంటగుంపులను నీవిటు లేటికిఁ బేర్చెదవు మైఁ?
దలఁపఁ బ్రియావియోగశిఖి దగ్ధుఁడఁ గాక చెలంగుచున్న నీ
విల నిఁక నేమిచేయఁగల వీప్రళయాగ్నిశిఖాసమృద్ధిచేన్?

* * * * *

ఈ 1881వ సంవత్సరమునందే 'కామడి ఆఫ్ ఎఱ్ఱర్సు' అను నాటకకథ ననుసరించి 'చమత్కారరత్నావళి' యను కథను మొట్టమొదట వ్రాసియున్నారు. హూణభాషయం దనేక నాటకరాజములను రచియించి, హూణకాళిదాసని ప్రసిద్ధివహించుచున్న షేక్స్పియ రను మహాకవి రచియించిన నాటకముల ననుసరించి మిగుల హృదయ రంజకముగా నుండునటులు ఛార్లసు ల్యాం బనువానిచే వ్రాయఁబడిన నాటకకథల ననుసరించి నేఁటికి పదునాఱుకథలనుమాత్రము వీరు రచియించి ప్రచురించియున్నారు. అయ్యవి జనసామాన్యమునకు, పాఠశాలలోని క్రిందితరగతులయందలివిద్యార్థులకును మిగులనుపయుక్తములుగానుండుననుటకు సంశయములేదు. బాలురీనాటకకథలన్నింటినిం జదివినచో, మిగుల మనోహరములగుకథలపుస్తకములంతగా లేని మనతెనుఁగుభాషయందు వారలకొకవిధమయిన యనురాగము గలుగకమానదు. ఇప్పటికి, 'కామడి ఆఫ్ ఎఱ్ఱర్సు' అనునాటకకథననుసరించి 'చమత్కారరత్నావళి' యును, 'మెర్చెంటు ఆఫ్ వెనీస్' అను నాటకకథ ననుసరించి 'కురంగేశ్వర వర్తకచరిత్రము' ను, 'సింబలైన్' అనునాటకకథ ననుసరించి 'కళావతీపరిణయము' ను, 'టేమింగాఫ్దీష్రూ' అను నాటకకథ ననుసరించి 'గయ్యాళిని సాధుచేయుట' యును, 'పెరికిల్సు' అను నాటకకథ ననుసరించి 'రఘుదేవరాజీయము' ను, 'కింగులియర్' అను నాటకకథ ననుసరించి 'చిత్రకేతుచరిత్రము' ను, 'దివింటర్సు టేల్' అను నాటకకథననుసరించి 'సుమిత్రచరిత్రము' ను, 'టిమన్ఆఫ్ ఏథె

న్సు' అనునాటకకథననుసరించి 'దానకేసరివిలాసము, ను' ఆలిజ్ వెల్ దటెండ్సువెల్, అను నాటకకథననుసరించి 'సతీమణివిజయము, ను, ఆజ్ యులైక్ ఇట్, అను నాటకకథ ననుసరించి 'వైదర్భీవిలాసము, ను, 'మచ్ అడో ఎబౌట్ నథింగ్, అను నాటకకథననుసరించి 'భానుమతీకళ్యాణము, ను, 'ట్వెల్ఫ్తునైట్, అను నాటకకథ ననుసరించి 'రసమనోభిరామము, ను, 'దిటూజెంటిల్మెన్ ఆఫ్ వెరోనా, అనునాటకకథ ననుసరించి 'కుమారద్వయవిలాసము, ను, మెజర్ ఫర్ మెజర్, అను నాటకకథననుసరించి 'ధర్మకవచోపాఖ్యానము, ను, ఒథెల్లో, అను నాటకకథననుసరించి 'పద్మినీప్రభాకరము, ను, 'రోమియో అండు జ్యూలియట్, అను నాటకకథ ననుసరించి 'మాలతీమధుకరము, ను రచియింపఁబడి, మనోహరములుగ నుండుటంజేసియే యయ్యవి జనసామాన్యమునందు విశేషముగ నమ్ముఁడుపోవుచున్నవి.

ఈ 1883వ సంవత్సరమునం దేప్రిల్ నెలయందు స్త్రీల యుపయోగార్థమై "సతీహితబోధిని,, యనుపేరిట. నొక మాసపత్రికను పుస్తకరూపముగాఁ బ్రచురింప నారంభించిరి. ఇందు, మనుస్మృతియందుఁ జెప్పఁబడిన,

" శ్లో. అరక్షితాగృహేరుద్ధాః పురుషైరాప్తకారిభిః
ఆత్మానమాత్మనాయాస్తు రక్షేయుస్తాస్సురక్షితాః

ఆప్తులైనపురుషులచే గృహమున నిర్బధింపఁబడుస్త్రీలు రక్షితురాండ్రు కారు; ఏస్త్రీలుతమయాత్మను తామే కాపాడుకొందురో వారే సురక్షితురాండ్రు." అనువాక్యరత్నములు పత్రికాముఖంబున వెల్లడింపఁబడియున్నయవి. ఈసతీహితబోధినియందు స్త్రీలకుపయోగించు పాటలును, నీతిబోధకములయినచిత్రకథలును, పుణ్యసతీచరిత్రములును, జ్ఞానాభివృద్ధికరము లయినయితరవిషయములును ప్రకటింపఁబడుచువచ్చెను. ఈపత్రిక రమారమి మూఁడునాలుగు సంవత్సరములు ప్రకటిం



పఁబడుచుండెను. ఇందుఁ బ్రచురింపఁబడుచువచ్చిన రఘుదేవరాజీయము మొదలగు కథలును సత్యాద్రౌపదీసంవాదము, మాతృపూజ, పితృపూజ మొదలగునవియును ప్రత్యేకముగాఁ బుస్తకములుగ ముద్రింపఁబడియున్నవి. ఈ 1883వ సంవత్సరమునందు శ్రీరిపన్ ప్రభు స్వాగతమునుగూర్చి,

ఉ. శ్రీమహనీయసత్కృపను జీమ మొదల్ ద్విరదంబుదాఁకఁ దా
నీమహిఁ గల్గుజంతువుల నెల్ల సతంబు సమానదృష్టితోఁ
బ్రేమను బ్రోచునీశ్వరుఁడు విశ్వగురుండు రిపన్ప్రభూత్తమున్
క్షేమచిరాయురున్నతులఁ జెన్నువహింపఁగఁ జేసి ప్రోచుతన్.

సీ. ఎలమిలో నెవ్వఁడీ ♦ హిందువులకు స్థాని
కస్వపాలన మియ్యఁ ♦ గట్టుచేసె
నాంగ్లేయు లపరాధు ♦ లైనను శిక్షింప
నెవఁడిచ్చె నధికార ♦ మిచటిప్రజకు
పరదేశముననుండి ♦ సరకులు తెప్పింప
కిచటివృత్తు లెవఁడు ♦ వృద్ధిపఱచె
నుప్పుమీఁదను పన్ను ♦ నొకకొంత తగ్గించి
యెవఁడు బీదలకష్ట ♦ మింకఁజేసె
నెవఁడు వృత్తాంతపత్రిక ♦ కిచ్చె స్వేచ్ఛ
నెవఁడు యత్నించె విద్యాభి ♦ వృద్ధిగూర్ప
నట్టిఘనుఁడు రిపన్ప్రభు ♦ వరుగుదెంచు
నేఁడు మనరాజధానికి ♦ నెలఁతలార!

ఉ. కావున నిట్టిగొప్పయుప ♦ కారము లెన్నియొ చేసినట్టియా
ధీవిభవున్ నృపప్రతిని ♦ ధిన్ మన మెల్లను గాంతలార! సం
భావన చేసి మంగళము ♦ పాడి కృతజ్ఞతఁ జూపఁజెల్లు ము
న్నావరపాలురున్ మనకు ♦ నంపినవారలయందుఁ గూరిమిన్.

నాథనామక్రియ రాగము—చాపుతాళము.

పల్లవి—మంగళమ్—మహిపాలచంద్రా! మంగళమ్—

అనుపల్లవి—మంగళమ్—కరుణాంత ♦ రంగ దుర్జనభంగ
రంగదఖిలమహా ♦ రాజసంసేవితా—మంగళమ్-

చరణములు—1. శ్రీరిపన్ ప్రభునకు ♦ ధీరునకు నతని
దారకు విమలవి ♦ చారకు ఘనునకు
మారున కతనికు ♦ మారునకును మిత్ర
వారమునకు బంధు ♦ వర్గంబునకు నిల...మంగళమ్,

2. అవని శ్రీ విక్టోరి ♦ యా మహారాజ్ఞికి,
యువరాజున కతని ♦ యువతికి సుతలకు,
సువివేకులగు రాణి ♦ సుతులకు సుతలకు,
సవినయులగువారి ♦ సతులకుఁబతులకు...మంగళమ్

3. ఈమహాప్రభువరు ♦ నిచటకుఁ బంపిన
ధీమంతు లగుమంత్రి ♦ తిలకుల కచ్చటి
శ్రీమహాసభకును ♦ చెలఁగ నీదేశపు
క్షేమముచూచెడు ♦ స్థిరపుణ్యమతులకు...మంగళమ్

అనుపద్యములను, కీర్తనమును వ్రాసి యీసతీహితబోధినియొక్క అక్టోబరు నవంబరు నెలల సంచికయందుఁ బ్రచురించియున్నారు.

ఈ1883వ సంవత్సరమునందు బాలికాపాఠశాలల యుపయోగార్థమయి సత్యవతీచరిత్ర మనునొకవచనప్రబంధమును రచియించి దీని నిమొట్టమొదట సతీహితబోధినియందుఁ బ్రచురించియున్నారు. ఈసత్యవతీచరిత్రమును వివేకదీపిక యనఁబఱఁగిన రాజశేఖరచరిత్రమున కొక యుపశాఖయని చెప్పనొప్పును. ఇది పదునైదు ప్రకరణంబులుగ విభజింపఁబడి యున్నయది. ఇయ్యదిమెట్టిమనోహరమగు స్వభావసిద్ధమయి నశైలిని రచియింపఁబడియున్నదియు నిందలిమొదటి ప్రకరణంబును



జూచినంతనె యయ్యది సులభంబుగ బోధపడకమానదు. ఇదిబాలికాపాఠశాలలయందుఁ బఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడి యున్నయది. ఇది యిప్పటికినాలుగైదుసారులు ముద్రింపఁబడి యున్నది. ఈకూర్పుల యొక్క సంఖ్యనుబట్టియే యీ సత్యవతీచరిత్రము జనసామాన్యమునం దెంత యాదరమును మనోజ్ఞతను జెందియున్నదియును సులభముగా వెల్లడిగాకమానదు.

* * * * * * *

పిమ్మట 1884వ సంవత్సరమునందుఁ చంద్రమతీ చరిత్రమును రచియించియున్నారు. ఇదియును బదునైదు ప్రకరణంబులుగ విభజింపఁబడియున్నది. ఇదినేఁటికి నాలుగుకూర్పుల నందియున్నది. ఇందలిశైలి యును మిగుల హృదయాహ్లాదకరంబుగనే యుండును. ఇందుమొదటి ప్రకరణమునందున్న విద్యావిషయముంగూర్చిన విద్యాసముద్రుని యుపన్యాస మెంతహృదయరంజకముగా నున్నది! ఇదియును బాలికా·
శాలలయందువిశేషముగా వ్యాపించియేయున్నది. ఇట్లేసేశా
శాలలయుపయోగార్థమయి 1887వ సంవత్సరమునందు
యనుమతియొకవచన ప్రబంధమును రచియించియున
ది ప్రకరణంబులుగ నేర్పఱుపఁబడియున్నది. ఇదియు·
కథనే కలిగియున్నది. కాని శైలియందు సత్యవ
ద్రమతీచరిత్రమునకును దీసిపోవుచున్నదని చె
మూఁడుపుస్తకములును బాలికాపాఠశాలల కత్య
నుండుననుటకు లేశమయినను సంశయము లేదు.

తరువాత నీ1884వ సంవత్సరము మ
మహేంద్రవరము లిటరెరీ డిబేటింగు సమాజ
ను నుపన్యాసము పంతులవారిచే సేయఁబడినద

నష్టము లీయుపన్యాసమునందు మిగుల యుక్తియుక్తముగా వాకొనఁ బడినవి. నిజంబగు నుపన్యాసధోరణి యన్న నేమియో యెఱుంగని మన యాంధ్రభాషయం దట్టిశైలి నుపన్యాసములను మొట్టమొదట వీరలే వ్రాసియున్నారు. ఈవేశ్యాకాంతల యుపన్యాసమునందు, వేదాంతశాస్త్ర ప్రణీతయైన వ్యాసులయొద్ద బ్రహ్మవిద్యనభ్యసించిన విజితేంద్రియుం డనియును, దృఢచిత్తుఁడనియు పేరుపొందిన జైమినిమహర్షి కథ యెంతచక్కగా వక్కాణింపఁ బడియున్నది! ఈయుపన్యాసము నేఁటికి నేక పర్యాయములు ముద్రింపఁబడి మఱలముద్రింపఁబడనున్నది. వీరిట్లప్పుడప్పుడిచ్చిన యుపన్యాసములు నేఁటికి రమారమి యిరువదియైదు కానఁబడుచున్నవి. అయ్యవి, వేశ్యకాంతలు, అతిబాల్యవివాహము, విగ్రహారాధనము, ఐకమత్యము, ఈశ్వరదత్తపుస్తకములు, దానములు, స్త్రీపునర్వివాహ చరిత్రము, స్త్రీపునర్వివాహవిషయ కోపన్యాసము, స్త్రీ
పునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము, స్త్రీపునర్వివాహ విషయక
నువిజ్ఞాపనము, స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము, స్త్రీపునర్వి
పారముయొక్క భూతవర్తమాన స్థితులు, సహాయకష్టకర్మ
పభయు దానియుద్దేశములు, జన్మాంతరము, స్వయం
నము, శంకరాచార్యులు, హిందూమతములు, ప్రా
, విద్యాధికుల ధర్మములు, వర్ణము, జీవితము
వానినిపొందుమార్గము నయి యున్నవి. ఇయ్యవి
యందప్పుడప్పుడు చిన్నచిన్న యుపన్యాసము
ండునట్లు రచియించి ప్రచురించుచు వచ్చియు
యొక్కయావశ్యకము, ఆస్తిక్యము, ఆత్మయొ
ములు, భగవద్విషయకధర్మములు, దైవ
మయు కరుణాళుత్వమును, ఈశ్వరభక్తి,
ఖములు, యథార్థజ్ఞానము, నీతి, కాలమును



సద్వినియోగమునకుఁ దెచ్చుట, అభ్యాసము, మిత్రులు, సంభాషణము వ్యభిచారము, సాధువర్తనము, పాటుపడుట, సుగుణదుర్గుణములు, అసద్గ్రంథములు అనునవి. "ఉపన్యాసమంజరి" యొక్క ప్రథమభాగము గా ముద్రింపఁబడినవి. ఈప్రథమభాగముయొక్క మొదటికూర్పు ప్రతులన్నియు విక్రయింపఁబడినందున నీప్రథమభాగమిప్పుడు మరల ముద్రింపఁబడిసిద్ధముగానున్నది. ఇట్లే మఱిరెండుభాగములుగూడ ముద్రింపఁబడి విక్రయమునకుసిద్ధముగా నున్నవి.

పిమ్మట నీ1885వ సంవత్సరమునందుఁ గాళిదాసునిమాళవికాగ్నిమిత్రమును దెనిఁగించియున్నారు. ఈమాళవికాగ్నిమిత్ర మయిదంకముల నాటకము. ఇందలికథ మిగులహృదయాహ్లాదకరంబుగ నుండును. 1896వ సంవత్సరమునఁ బ్రథమశాస్త్రపరీక్ష తరగతికింబఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడినది. పదకాఠిన్యముగాని యన్వయకాఠిన్యముగాని లేశమయినను గానరాని శైలియం దెన్నికగాంచినపంతులవారి యిందలిశైలినిజూచి చదువరులానందించుట కీనాటకమునుండి కొన్నిపద్యముల నిటనుదాహరించుచున్నాను.

ఉ. కొందఱు విద్య నస్యులకుఁ ♦ గోవిదు లయ్యును నేర్ప లేరిలన్;
గొందఱు బోధ సేయుదురు ♦ గొప్పగఁ గొంచెమె తాము నేర్చియున్,
బొందుగ రెండిటం దెలివిఁ ♦ బొంది వెలింగెడుబుద్ధిశాలులే
యెందును నగ్రగణ్యులని ♦ యెన్నిక గాంతురు శిక్షకాళిలోన్.

గీ. మేఘగర్జనశంకచే ♦ మెడలనెత్తి
మద్దెలరవంబుతోడ నె ♦ మళ్ళు కూయ
మధురముగ బర్హిణాంగనల్ ♦ మలసిచేయు
మధ్యమస్వర మలరించె ♦ మదుల నిపుడు.

ఉ. అంచలు కన్నుమూసెనను ♦ నంబుజపత్రమునీడ డిగ్గియున్;
మించినవేడిఁ, జేర వవె ♦ మేడలచూరుల పావురంబులున్;

కాంచి నెయిళ్ళు పోయెడు ద ♦ వీసి జలయంత్రముచేర నీటికై,
మించెఁ బ్రతాపపూర్ణుఁడయి ♦ మీవలెనే రవియు న్నృపాలకా!
చ. తరుణులు వేడ్కతోఁ బ్రథమదర్శనకాలమునందుఁ దద్దయున్
బురుషులరూపముల్ నయనముల్తనియంగను జూడఁ గోరియుఁగా
ధరఁ దరళాయతాక్షులు మనఃప్రియులం దిలకించువట్టులన్
గరమును విప్పి కన్గొనెనరుగా కనుదమ్ములనిండ నెప్పుడున్.

* * * * * *

తరువాత నీ 1885 వ సంవత్సరమునం దిక్కడినాటకోజ్జీవక సమాజమువారికోరికమీఁద "ప్రహ్లాదనాటకము"ను రచియించియున్నారు. ప్రహ్లాదచరిత్రము భక్తిరసప్రధానమని సుప్రసిద్ధము. ఇది మైదంకములుగల కేవలవచనరూపనాటకము. ఇందక్కడక్కడ కొన్ని పద్యములునుగలవు. ఇదిభక్తిరసప్రధానమయినదయినను నిందుభక్తిరసముకంటె హాస్యరసమే విశేషముగాఁ గానఁబడు చుండును. ఇందలి యించుమించుగా నన్ని భాగములును జదువరుల కాహ్లాదమును, నవ్వును బుట్టింపకమానవు. హిందూమతమునందలి దురాచారములిందు విశేషముగా వెల్లడింపఁబడియున్నవి.

* * * * * *

ఇందలి శ్రీమహావిష్ణువుయొక్కయపరావతారమని యెన్నఁబడు నృసింహమూర్తియొక్క—

శ్రీమహావిష్ణుండ ♦ సింహముఖంబును
నరరూపమునుదాల్చి ♦ కరుణతోడ
భక్తుని గావంగ ♦ వచ్చితి విచటకు
వినరయ్య జనులార! ♦ వీను లలర
దుడ్డునామము పెట్టి ♦ తులసిపేరులు దాల్చి
మ్రొక్కుమాత్రనె మీకు ♦ ముక్తి లేదు



నాపాదభక్తులై ♦ సమ్మదప్పఁ జేయంగ
దలఁతురేనియు మీరు ♦ తెలియ వినుఁడు
ముందుగా మీరలు ♦ భూతకోటులయందు
దయగల్గి సత్యంబు ♦ తప్ప కెపుడు
కామాదుల జయించి ♦ కరుణాప్రపూర్ణులై
పరవంచనము లేక ♦ పరవనితల
పోడఁబుట్టినవారిఁ ♦ బోలెమానవులను,
సోదరులట్లును ♦ జూచుకొనుచు
నీతిమార్గంబున ♦ నిత్యాదరముతోడ
మీ రెల్ల నిరతంబు ♦ మెలఁగవలయుఁ
జిత్తశుద్ధి లేని ♦ సేవచే నింతయు
ఫలము లేదు గాన ♦ భక్తితోడ
నన్నుఁ గొలుచుచుండి ♦ నాకుఁ దృప్తి నొనర్చి
పనులు సలిపి ముక్తి ♦ పదవి గనుఁడు.

అను సీసమాలికం గాంచిన మతవిషయములయందు గ్రంథకర్త యెట్టి యభిప్రాయములు గలిగియున్నదియును గరతలామలకంబుగ గోచరము గాక మానదు.

ఈ 1885వ సంవత్సరమునందుఁ జెన్నపురంబున జరిగిన కాలంబున, బ్రహ్మసమాజముయొక్క చరిత్రసార మని చెప్పఁ దగునట్లు "బ్రాహ్మోపాసనాప్రతిష్ఠాపనము" గూర్చి,

ఉ. శ్రీకరుఁ డైనయీశ్వరుఁడు ♦ శ్రేయములం దయ చేసి కూరిమిం
జేకొని ప్రోచుఁగాత గుణ ♦ గణ్యులఁ బుణ్యుల సత్యశీలురన్.
ప్రాకటభక్తియుక్తులను ♦ బ్రాహ్మసమాజమతావలంబులన్
లోకచయోపకారులఁ బ్ర ♦ లోభవిదూరుల ధర్మభావులన్.

చ. మునుమనహిందుదేశమున ♦ మూఢత మిక్కిలిపర్వి యెల్లెడన్
జనములు విగ్రహంబులనె ♦ చాలఁగఁ బూజలు సల్పుచుండఁగాఁ
గని యదిమాన్పఁగోరి బహు ♦ కష్టములం బడి తొల్త రామమో
హను లిలమీఁద బ్రహ్మమత ♦ మల్లన స్థాపన చేసె దక్షుఁడై.

చ. అటువలె నొక్కయీశ్వరునె ♦ యర్చన మానసికంబుగాభువిన్
బటుమతిఁ జేయుపద్ధతిని ♦ భాసిల నేఁబదియేండ్లక్రిందటన్
ఘటన యొనర్చి దేశమునఁ ♦ గల్గుజనంబుల కెల్లఁ జాటియా
దట నొనరించె నాతఁడు మ ♦ తంబున కెల్ల మహోపకారమున్.

మ. ఘనుఁ డాతండుదివంబు జేర ♦ వెనుకం ♦ గాపాడి యద్దానిఁ బొం
దెను సత్కీర్తిమనీషు లెల్లఁ బొగడన్ ♦ దేవేంద్రనాథుండహో
వినుతింజెందదె యాదిబ్రహ్మమతమన్ ♦ పేరన్ జగంబందు నీ
యన స్థాపించినసత్సమాజ మిపు డొ ♦ య్యస్సర్వ సమ్మాన్యమై.

ఉ. ఈయన పండితోత్తముల ♦ నేపునఁ బంచెను వారణాసికిన్
బోయి సమస్తవేదచయ ♦ ముం బఠియింపఁగ వారు వచ్చి యా
మ్నాయములం బరీక్షగ వి ♦ మర్శ యొనర్పఁగనందు దోషముల్
పాయక కొన్ని కన్పడియెఁ ♦ బాసెను వానిప్రమాణభావమున్.

చ. వెనుకను బ్రహ్మధర్మ మను ♦ పేరను గ్రంథమొకండుచేసె నీ
యనఘుఁడె తా శ్రుతిస్మృతుల ♦ యందలివాక్యము లేర్చి కూర్చి యీ
యన ఘనకీర్తిఁ గాంచి ముద ♦ మారఁగఁ గేశవచంద్రసేనులున్
ఘనతరభక్తిఁ జేరెను ఘ ♦ నంబుగ బ్రాహ్మసమాజము న్వడిన్.

చ. ఇతఁడు ప్రసంగముల్సలుప ♦ నెల్లర రంజిలఁ జేయ దక్షుఁడై
ప్రతిభ మెయిం జగంబునను ♦ బ్రాహ్మసమాజము వన్నె కెక్క నం
చితగతిఁ జేసి శ్లాఘ్యతను ♦ జెంది సమాజముకార్యదర్శియై
యతులితసాహసంబున స ♦ హాయులఁగూడి త్యజించె వర్ణమున్.



ఉ. కేశవచంద్రసేను లిటు ♦ కేవలధైర్యముతోడ వర్ణమున్
పాశము త్రెంచి యాదిమపు ♦ బ్రాహ్మసమాజమువారు తన్నుఁ గ్రూ
రాశయులై వడి న్విడువ ♦ నంతట వీడియు వారినెయ్యపుం
బాశము హిందుదేశపుస ♦ మాజము స్థాపన చేసె వేఱుగన్.

శా. హిందూదేశపుబ్రాహ్మసంఘమును స్థా ♦ పించెంగదా యంతకున్
ముందే కేశవచంద్రసేను లెలమి ♦ న్మన్నెక్కపర్యాయ మొ
ప్పం దా నీపురి కేగుదెంచి యిచటం ♦ బచ్చప్పవిద్యాలయం
బందుం బ్రహ్మమతంబుఁగూరిచి యుప ♦ న్యాసంబు చేసెం దగన్.

శా. ఈలీలన్ మృదుమాధురీమహిమతో ♦ నెన్నో యుపన్యాసముల్
లీలం జేసిన నాలకించి మది హ ♦ ర్షిం జెంది శ్రీరాజగో
పాలాచార్యులులోనుగాఁ గలఘనుల్ ♦ బ్రహ్మంబు సేవింపఁగాఁ
బోల న్వేదసమాజము న్నిలిపి రీ ♦ ప్రోలందు సద్భక్తితోన్.

ఉ. ఈతఁడె తత్త్వబోధినిని ♦ నిప్పురమందున ద్రావిడంబులో
నాతరువాతఁ బూన్కిమెయి ♦ నాంధ్రమునం బ్రచురించి చాలఁ బ్ర
ఖ్యాతి వహించె ద్రావిడుల ♦ యందలిమూఢత పోవునట్లు స
ద్ధేతువు లిచ్చి పుస్తకము ♦ లెన్నియొ తా రచియించె దక్షతన్.

ఉ. ఈయనకు న్సహాయుఁ డయి ♦ యెంతయు నిశ్చలభక్తితోడ సు
బ్రాయలు సెట్టిపాటుపడి ♦ వన్నెకుఁ దెచ్చె సమాజ మెంతయున్
బోయినఁ గొంతకాల మిటు ♦ పుణ్యశరీరులు వీర లిర్వురున్
గాయములం దొఱంగిరి యి ♦ కంట సమాజము పెంపు తూలఁగన్.

ఉ. ఈగతి వీర లిద్దఱును ♦ నీశ్వరసన్నిధిఁ జేరఁ బిమ్మటన్
వేగమ తాను శ్రీధరులె ♦ వేదసమాజముకార్యదర్శియై
బాగుగఁ గార్యనిర్వహణ ♦ భారము నైకొని బ్రాహ్మధర్మమున్
లోగక ద్రావిడంబునఁ దె ♦ లుంగుననున్ రచియించె దేటగన్.

ఉ. బ్రహ్మమునే భజింపుచును ♦ వచ్చుట దక్షిణహిందుదేశపుం
బ్రాహ్మసమాజ మంచు నవ ♦ నామము దీనికిఁ బెట్టి యిచ్చటన్
బ్రహ్మమతంబు శ్రీధరులు ♦ వ్యాపన మించుక జేసి యింతలో
బ్రహ్మపదంబు జేరెఁ దగు ♦ వాత సమాజము చెందె క్షీణతన్.

చ. తగినసహాయముం గనక ♦ తద్దయు క్షీణత నొందుచుండఁగా
మగుడనిభక్తితోఁ గడగి ♦ మన్నవబుచ్చయపంతు లెంతయున్
దగుపని చేసి తానొకవి ♦ థంబున నిల్పె సమాజ మియ్యెడం
దిగువను దేశముల్ తిరిగి ♦ తెచ్చి ధనంబును సుస్థిరంబుగన్.

చ. నిలిపెను బ్రహ్మమందిరము ♦ నిత్యుని నిర్మలు నీశుఁ గొల్వఁగా
నలిపెను సాయ మీపనికిఁ ♦ జాలఁగఁ దా శివనాథశాస్త్రియున్
వెలయునుఁగాక చెన్నపురి ♦ పేరను జెన్నగుసీపురంబునన్
సలలితభక్తి నొక్కఁడగు ♦ సామిని గొల్చెసుపుణ్యమీవయిన్.

అనుపదునాలుపద్యములను "బ్రాహ్మపద్యచంద్రిక,, యను పేరిట మిగుల హృదయరంజకంబుగ నుండునట్లు రచించియున్నారు. ఇయ్యవి చెన్నపురమునం దొకకాలంబున నెంతయు బ్రఖ్యాతినిగాంచిన "బ్రహ్మప్రకాశిక,, యనుపత్రిక కనుబంధంబుగ నొట్టమొదటఁ బ్రచురింపఁబడియున్నవి.

ఈ 1880 వ సంవత్సరమునందు "రాగమంజరి" యను నొకపద్యగద్యాత్మకంబగు నాటకమును రచియించియున్నారు. ఇది "షెరిడ" నను నింగ్లీషుకవిచే రచియింపఁబడిన "డ్యూయన్నా" యను నాటకమునకు భాషాంతరము. ఇందలికథయంతయు నించుమించుగ భానుమతి యొక్కవివాహమునుగూర్చినకథయే యగుటంజేసి, దీనికి "భానుమతీపరిణయ" మను నామమే యుండవలసియున్నను నిందలిప్రధానపాత్ర మగు భానుమతిపాత్రము నంతయును భానుమతియొక్కపరిచారికలలో నొకతె



యగు "రాగమంజరి" యనుదానివలన గుప్తంబుగ నుండునట్లు నడుపఁబడి యుండుటం జేసి, యీనాటకము "రాగమంజరి" యని పేరొసఁగఁబడినది. ఇది బహువిధరసప్రధానమయిననాటకము. నిజంబుగనిది యొకవింతయయిననాటకమే యగును. ఇందలి రాగమంజరివసుకాముల సంభాషణములును, సుదర్శనర్మనసుకాముల సంభాషణములును గన్నులార చూచితీఱవలయునే కాని యిట్టివియని చెప్పుటకు లేశమయినను వీలు పడకయున్నది. దేవాలయములలోని పరమసోమరులయిన యర్చకులనఁబడువారలయొక్క మోసపుఁగార్యము లెంతయుఁ జక్కఁగా నిందు వెల్లడింపఁబడియున్నవి, ఇందలి,

ఉ. పుత్రిక లుద్భవిల్లినను ♦ పోవును సౌఖ్యము కొంత తండ్రికిన్
చిత్రము! శాంతి యుండదిటు ♦ చిత్తములో క్షణకాల మేనియున్;
ధాత్రిని నిర్వహేంప్లుకడ ♦ దాఁచెడులోనను చెప్పబుద్ధులన్
బుత్రిక లిట్లుమీఱి కర ♦ మున్ వెతఁ గూర్తురు కన్నవారికిన్ .

గీ. కటకటా! తండ్రికెంత దుః ♦ ఖంబుకలుగు!
తిరుగఁబడుచును గన్నీరు ♦ తెచ్చుకొనుచుఁ
బలుకు వినకుండఁ బుత్రికల్ ♦ మెలఁగిరేని,
కటకటా! తండ్రి కెంతదుః ♦ ఖంబు గలుగు!

ఉ. యుక్తులుపల్కి మించుదుర ♦ హా నెఱప్రాయము రాకమున్నె;యా
సక్తిని బుత్రికల్ ప్రియుల ♦ చక్కికిఁ బుచ్చి కలంతు రుల్లమున్;
యుక్తవిచారముల్ సలిపి ♦ యొక్కటఁ దండ్రి కుదుర్చుసద్వరున్
శక్తికొలంది వంకలిడి ♦ చారుగతిన్ వలదందు రేమ్చుచున్.

* ద్విపద *

కాలమా! ఱెక్కలు ♦ గట్టుకొనఁ జీవ్రు
హేలాగతిని నిల్వ ♦ కెగసెద వంచు

నేకవి నిన్నుఁ దొల్త ♦ నిలను వర్ణించె
నూతాని యాతఁ డీ ♦ యుర్విలోఁ దాను
ప్రియురాలి నెన్నఁడుఁ ♦ బెడఁబాయనట్టి
వయసువాఁడయి యుండ ♦ వచ్చు సత్యముగ
దిన మొక్కఁటేనియుఁ ♦ దిన్నఁగాఁ దాను
బెనుపొందువలపుతోఁ ♦ బ్రియురాలిఁ బాసి
విరహాగ్ని వేఁగిన ♦ వెంగలి యెవఁడు
వరుగెత్తువటంచుఁ ♦ బలుకును నిన్ను?

* ద్విపద *

అనుతాపశబ్దంబు ♦ లనయ మెల్లెడల.
వినఁబడుచుండంగ ♦ వెలయుమరంబ
నీయొద్ద సెలవిదె ♦ నేఁ బోయి వత్తు.
పాయక యెప్పు డీ ♦ పాడింట నుండి
మ్రొక్కులకును స్తోత్ర ♦ ముల కేప్పులకును
నొక్కటె నలవడ్డ ♦ యోగినులార!
సెలవియ్యఁగదరమ్మ ♦ చెచ్చెరనాకుఁ
జింతలమఠమును ♦ శీఘ్రంబ విడిచి
సంతోషభూమికిఁ ♦ జనుచున్న దాన.

అను పద్యములను, ద్విపదలనుగాంచిన వీరలకు స్వకపోలకల్పితంబుగ నుండువల్లు భాషాంతరీకరించుటయందుఁ గలనిరుపమానమయినరచనా నైపుణ్యము వెల్లడిగాకమానదు. ఇంగ్లీషు షెరిడననువానిచేత నేహూణభాషయందు వ్రాయఁబడిన "ది రైవల్స్" అను నాటకమునను సరించి "కళ్యాణకల్పవల్లి" యను కేవలవచనరూపనాటకము నైదంకములుగ రచియించి 1894 వ సంవత్సరమునందుఁ బ్రచురించియున్నారు. ఇంద



క్కడక్కడ పద్యములుసహిత ముండినచో నియ్యది యింతకన్నను మిగుల నానందజనకంబుగ నుండియుండును.

ఈ రాగమంజరి రచియింపఁబడుచువచ్చినయీ 1886వ సంవత్సరమునందే శ్రీమదాంధ్రభారతమునందలి దక్షిణగోగ్రహణకథను నాటకరూపంబుగఁ బద్యగద్యాత్మకంబుగ రచియించి, ముద్రింపించియున్నారు. ఇదిచదువరుల కానందజనకంబుగ నుండి నీతిబోధకంబుగ నుండకమానదు. ఇందలికవిత్వమెట్టి యపూర్వపదలాలిత్యంబును గలిగియెంత ప్రౌఢంబుగ నున్నదియు నిందలి,

మ. బక కిమ్మీర హిడింబముఖ్యదనుజ ♦ వ్రాతంబు నెవ్వాఁడు మ
త్తకరీంద్రంబులఁ ద్రుంచుసింహముగతిన్ ♦ దాఁ ద్రుంచె; నెవ్వాఁడుయా
చకభంధున్ భుజవీర్యసింధుని జరా ♦ సంధున్ హతుంజేసె; నా
ప్రకటస్థేముని భీమునిం దలఁప నా ♦ ప్రాణంబు భీతిల్లెడున్.

ఉ. భానుఁడు నైజతేజమును ♦ బాసిన, శీతకరుండు వేఁడిమిం
బూనిన, నగ్ని చల్లపడి ♦ పోయిన, వార్ధిజలంబు పౌరతన్
మానిన, వ్యాఘ్రసింహములు ♦ మాంసముతింటఁ బరిత్యజించినన్,
దా నిల ధర్మనందనుఁడు ♦ ధర్మవు తప్పఁ డొకించు కేనియున్.

మ. లయకాలాంతకభీషణాకృతిని లీ ♦ ల న్నీదుసేనాటవిన్
రయమారంగ శరార్చులం బొదివి తీ ♦ వ్రప్రక్రియం గాల్చుచున్
భయదాస్త్రింబుల నవ్విరాటుఁడు నినున్ ♦ దర్పోద్ధతిందాఁకఁ ద
ద్దయుఁ బ్రాణంబును మానమున్ రణమునం ♦ దక్కించుకోనేర్తువే?

చ. వనితరో! గ్రీష్మతాపమున ♦ వాఁడినపూసరమట్టులున్న యీ
తనువును దుఃఖవహ్నినిటు ♦ తాపమునొందఁగఁ జేసెదేల? నె
మ్మనమునఁ దాల్మిపూని యిఁక ♦ మానుముశోకము; నిన్నుఁజూచి నీ
తనయులు, నేముఁ గుందెదము; ♦ ధైర్యమువన్మము నూఁడింపుమా.

చ. పతివి నెనేని ప్రాణముల ♦ పైనలుగున్; జను లింతచూచివన్
క్షితిపయి మానుషంబుచెడుఁ; ♦ జింతమెయిం గులకాంత విన్నచో

బ్రతుకు త్యజింపఁజూచుఁ; దల ♦ వంపులగు న్నరివా రెఱింగినన్;
వెతయగుఁగాక! సౌఖ్య మొక ♦ వించునె యన్యసతీరతంబెటుల్?
ఉ. గోపకులార! చింతపడ ♦ కుం డణుమాత్రము మీరుదీనికిన్;
దూపు లనెన్ని మీయెడల ♦ దూఁటెను వానికి నూఱురెట్లుగాఁ
దూపులు వానిదేహమునఁ ♦ దూర్చెదఁ, గార్చెద నెత్రుటేరులన్.
బాపెద మీపరాభవము; ♦ వంపెద నంతకుచెంతకు న్నృపున్.

అనుపద్యములంగాంచినఁ దేటతెల్లంబుగాకమానదు,

ఈ 1886 వ సంవత్సరమునందు ‹‹అపూర్వబ్రహ్మచర్య ప్రహసనమును రచియించియున్నారు. ఇందలి కథానాయకుఁడగు రామాశాంతము పంతులుగారిచర్య యొంతయుఁజక్కఁగా వెల్లడింపఁబడియున్నయది. నేఁటికివీరు ‹అపూర్వబ్రహ్మచర్యప్రహసనము› ‹విచిత్రవివాహ ప్రహసనము› ‹మహాబధిరప్రహసనము› ‹పునర్మరణప్రహసనము› ‹బలాత్కారగానవినోద ప్రహసనము› ‹కలహప్రియాప్రహసనము› ‹మహామహోపాధ్యాయ ప్రహసనము› ‹యోగనిద్రా ప్రహసనము› ‹మహావంచక ప్రహసనము› ‹అసహాయశూర ప్రహసనము› ‹వేశ్యాప్రియ ప్రహసనము నను పదునొకండు ప్రహసనములను రచియించియున్నారు. ఇంచుమించుగానివియన్నియు నింగ్లీషుప్రహసనముల ననుసరించియే వ్రాయఁబడియున్నను సాధారణంబుగ నివి యన్నియు నిందలిరచనాచాతుర్యమునుబట్టి చదువరులకు స్వకపోలకల్పితములుగనే కానఁబడుచుండును. ఇంచుమించుగా నీప్రహసనము లన్నియు నొక్కవిధమయిన మనోహరమగుశైలినే వ్రాయఁబడియున్నయవి. ఇయ్యవి జనసామాన్యముచేతనే విశేషముగాఁ గొనఁబడుచుండును. పిమ్మట పాఠశాలలోని క్రిందితరగతులవిద్యార్థుల కత్యంతోపయుక్తంబుగ నుండునట్లు ‹‹దేహారోగ్య ధర్మబోధిని›, ని బ్రచురించియున్నారు. ఇయ్యది ‹వాయువు, ‹జలము, ‹భోజనము, ‹దేహగేహ పరిశుద్ధతలు, దేహపరిశ్రమవిశ్రాంతులు నని యయిదు ప్రకరణంబులుగ విభజింపఁబడియున్నది. ఇది బాలురకును బాలికలకును జనసామాన్యమునకును గూడ మిగుల ప్రయోజనకారియనుటకు సందియము లేదు. ఇదిపాఠశాలలయం దుపయోగింపఁబడుచు వచ్చినచో విద్యాశాఖవారు విద్యార్థులకు మహోపకారముచేసినవారలగుదురనుటకు సందేహము లేదు. ఈదేహారోగ్యధర్మబోధిని పంతులవారిచే నిటీవల రచియింపఁబడిన ‹‹శారీరశాస్త్రసంగ్రహము” నకొక యుపోద్ఘాతముగాఁ గానఁబడుచుండును.



పిమ్మట నీ 1887 వ సంవత్సరమునందు శ్రీవిక్టోరియా మహారాజ్ఞిగారియొక్క యేఁబదిసంవత్సరములధర్మపరిపాలముంగూర్చి యించుమించుగాఁ బ్రపంచమునం దెల్లయెడలను జరిగిన మహోత్సవమును గూర్చి ‹‹శ్రీవిక్టోరియాజూబిలీనవరత్నము” లనుపేరిట,

క. శ్రీకరుఁ డగుపరమేశుఁడు
ప్రాకటకరుణాప్రపూర్ణ ♦ భావముతోడన్
జేకొని ప్రోచుత గుణర
త్నాకర విక్టోరియామ ♦ హారాజ్ఞిమణిన్.

సీ. ఏసాధ్వి తాఁ బదు ♦ నెన్మిదివందల
పందొమ్మిదవయేఁటఁ ♦ బ్రభవ మొందె
నేరాణి పూజ్యయై ♦ తా రాజ్యము వహించెఁ
బందొమ్మిదవయేఁటఁ ♦ బ్రజలు పొగడ
నేతల్లి గృహిణియై ♦ యేవురుకూఁతులఁ
దనయుల నలువురఁ గనియె నేలమి
నేమాత యేఁబది ♦ యేండ్లనుండియు భూమిఁ
బాలింపుచున్నది ♦ ప్రౌఢలీల
నేసతి దశాబ్దములక్రింద ♦ హిందుదేశ
చక్రవర్తినిపట్టంబు ♦ సంగ్రహించె

సట్టివిక్టోరియారాజ్ఞి ♦ నాదిదేవుఁ
డాయురారోగ్యముల నిచ్చి ♦ యరయుఁగాత!

సీ. బాల్యకాలమునందె ♦ బహుభాషలను నేర్చి
యతులవిఖ్యాతి యే ♦ యమ్మ గాంచె
వృక్షశాస్త్రమునందు ♦ వివిధప్రకృతిశాస్త్ర
వితతి నేయమ్మ ప్ర ♦ వీణ యయ్యె
సంగీతసాహిత్య ♦ సరసచిత్రవిలేఖ
నాదులఁ బ్రౌఢ యే ♦ యమ్మ యయ్యె
దేశచరిత్రలఁ ♦ బేశల ధర్మార్థ
శాస్త్రాళి నేయమ్మ ♦ జాణ యయ్యె
కుట్టుపనియందు నేయమ్మ ♦ కుశల యగుచుఁ
గొడుకుబిడ్డల కిచ్చుఁ దాఁ ♦ గుట్టినవియె
యిన్నివిద్యలఁ బాండిత్య ♦ మిట్లు వడసి
యున్నయాయమ్మ నీబల ♦ మెన్నఁ దరమె?

ఉ. ఏయమ రాణి యయ్యు స్వమ ♦ హీస్థలి బీదలయాకుటిండ్లకున్
బోయి ధనౌషధంబులును ♦ బుట్టములు న్నిఱుపేదవారికిన్
గేయముగాఁగ నిచ్చి తగ ♦ క్షేమము లారసి వచ్చుచుండునో
యాయమసద్గుణాళిఁ గొని ♦ యాడఁ గలండె సహస్రవక్త్రుఁడున్?

సీ. ఈకుటుంబిని రాజ్య ♦ మేలుచున్నట్టి
పంచాశదుత్తమా ♦ బ్దములలోన
భరతఖండమునకు ♦ బహుబాధలు తొలంగి,
సకలసౌఖ్యంబులు ♦ సంఘటిల్లె.
ధూమనౌకలశక్తిఁ ♦ దురగయానసమంబె
యయ్యె ద్వీపాంతర ♦ యాన మిప్పుడు



తంత్రీముఖంబున ♦ దవ్వులవార్తలు
క్షణములో శ్రవణయో ♦ గ్యంబు లయ్యె
ధూమశకటబలంబున ♦ దూరదేశ
యాత్ర లత్యల్పకాలసా ♦ ధ్యంబు లయ్యె
నహహా! పొగడంగఁ దరమె? రా ♦ జాధిరాజ్ఞి
యైనవిక్టోరియారాజ్య ♦ యాత్రమహిమ!

సీ. నదులుకాల్వలువాఱఁ ♦ బెదచౌటిపట్టులు
కలమధాన్యము పండు ♦ పొలము లయ్యె
బెబ్బులులకుఁ జోర ♦ వితతికిఁ దావులౌ
వనవాటములు పెద్ద ♦ బాట లయ్యె
దుష్ప్రభుత్వము పోయి ♦ తుల్యమౌన్యాయంబె
యెల్లవారికిఁ గల్గె ♦ నెల్లయెడల
విద్యాలవము లేని ♦ వివిధజాతులవారి
కమలవిద్యాప్రభా ♦ వములు గలిగె
గఱువులకుఁ జూడఁగాఁ బెద్ద ♦ కఱవు వచ్చె.
నరబలు ల్సహగమనముల్ ♦ నాశ మయ్యె
స్థానికప్రభుత్వ మొక్కింత ♦ జనుల కొదవె
మేలు! విక్టోరియారాజ్య ♦ కాలమునను.

క. మున్నెన్నఁడు లభియింపని
సన్నుతసత్పాలనంబు ♦ సమకొనుచుండన్
మిన్నంది యెల్లయెడలను
జెన్నారదె రాజభక్తి ♦ సేతువువఱకున్?

సీ. సత్రముల్ మీపేర ♦ సమకొల్ప నొకచోట
విద్యాలయము లుంచ ♦ వేఱుచోట

పట్టణభవనముల్ ♦ గట్టింప నొకచోట
వృత్తిశాలలు నిల్ప ♦ వేఱుచోట
జనమహోద్యానముల్ ♦ స్థాపింప నొకచోటఁ
బెనుబావులను ద్రవ్వ ♦ వేఱుచోట
నీటియంత్రంబుల ♦ నెలకొల్ప నొకచోట
బీదగృహము లుంచ ♦ వేఱుచోట
పట్టణములందు మీపేరు ♦ పాదుకొల్ప
యత్నములు సాగుచున్న వీ ♦ యవనియందు
నేఁబదేఁడులు రాజ్య మీ ♦ రేలి రన్న
సంతసమున విక్టోరియా ♦ సాధ్వి! నేఁడు.

సీ. ఏమూలఁ జూచిన ♦ నింపైనపందిళ్లు
నేతట్టునను గన్నఁ ♦ గేతనములు
నేవంక వీక్షింపఁ ♦ బూవులతోరణా,
లేపట్టునను గన్న ♦ దీపచయము,
లేకడఁ దిలకింప ♦ నాకాశబాణంబు
లేనట్టునను గన్న ♦ గానములును
పట్టణంబులు మొదల్ ♦ పల్లెలవఱకును
వెల్లిగొనుచు నున్న ♦ వెల్లయెడల
నఖిలజనమనోహారిణి ♦ వైననిన్ను
స్థిరతరాయురారోగ్యను ♦ స్థితుల నిచ్చి
యీశ్వరుం డేలుఁగావుత ♦ నెలమితోడ,
రాజ్ఞి విక్టోరియాదేవి! ♦ ప్రమద మెసఁగ.

అనుపద్యములను రచియించి, యీ 1887 వ సంవత్సరము ఫిబ్రవరినెల 15 వ తేదిని ప్రచురించియున్నారు. ఇందు స్వభావవిరుద్ధము లయిన యపూర్వకల్పనము లేవియుఁ జొప్పింపఁబడియుండలేదు.



తరువాత నీ 1887 వ సంవత్సరమునం దాంధ్రకవులచరిత్రము యొక్క ప్రథమభాగమును బ్రకటించియున్నారు. చిరకాలమునుండి యున్నయీకొఱంతను నివారింపఁ బ్రయత్నించినబ్రహ్మశ్రీ గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు కొందఱిచరిత్రములనుమాత్రమే "కవిజీవితము" లను పేరిట వ్రాసియున్నారుగాని యవకాశము లేక కాఁబోలును వారిటీవల వ్రాయుట మానివేసినారు. ఆంధ్రకవులచరిత్రములను నిట్టిచిన్నగ్రంథము నాంధ్రభాషయందు మొట్టమొదటఁ గల్పించినది శ్రీరామమూర్తిపంతులవారే యయినను, ఈయాంధ్రకవులచరిత్రము శ్రీరామమూర్తిపంతులవారికవిజీవితములకంటె ననేకకారణములచే నెక్కుడుప్రాశస్త్యమును గాంచి యున్నదని చెప్పవలసియున్నది. కాలనిర్ణయమును జక్కఁగాఁ గారణోదాహరణసహితంబుగ నుంచునట్లు చేయుటయు, నిపుణతరంబుగ గ్రంథములపై నభిప్రాయంబుల నీయుటయు. శ్రీరామమూర్తిపంతులవారు తమకవిజీవితములను గొన్నింటిని చిరకాలము క్రిందటఁ బ్రచురించియున్నారు. అయ్యవి బాల్యంబునను నిటీవలను నేననేకసారులు చదివియున్నాను. ఆంధ్రభాషయందుఁ జరిత్రములు లేనిలోపమును శక్తికొలందిని గొంతనివారింప నన్ను బాల్యమునుండియు బురికొల్పుచువచ్చిన వీకవిజీవితములే యని నేనిటసంతోషపూర్వకంబుగ వెల్లడించుచున్నాఁడను.

ఇక్కడివి రచియించినయన్ని గ్రంథములలో ననన్యసులభసాధ్యం బగునదియు, నాంధ్రభాష కత్యంతోపకారకరం బగునదియు, జదువరుల కధికానందమును గలిగించునదియు నీయాంధ్రకవులచరిత్రమే యని చెప్పవలసి యున్నది. ఇది, వీరియన్ని గ్రంథములసంపుటములలోఁ బదియవసంపుటముగా నున్నది. పూర్వకవులు, మధ్యకవులు, నాధునికకవులు నని మూఁడుభాగములుగా విభజింపఁబడినయీగ్రంథమునందు, వరుసగా నిరువదియిరువురుకవులచరిత్రములును, నేఁబదియైదుగురుకవు

లచరిత్రములును, నూటముప్పదియెనమండుగురుకవులచరిత్రములును, మొత్తముమీఁద రెండువందల పదునైదుగురుకవులచరిత్రములు గానవచ్చుచున్నవి. మఱియు, ద్వితీయభాగాంతమునందు, "హూణశకము 1650వ సంవత్సరమునకుఁ బూర్వమునందున్నట్లు నిశ్చయముగా తెలిసినకొందఱుకవులగ్రంథనామములు తెలిసినను, నాకాగ్రంథము లిప్పుడు లభింపనందున గ్రంథకర్తలచరిత్రములను గూర్చికాని వా రుండినకాలమునుగూర్చికాని నే నిప్పు డేమియు వ్రాయుటకు శక్తుఁడను గాకున్నాను. గ్రంథకర్తలనామములు సహిత మనేకములు తెలియ రాలేదు. తెలిసినవారు నాకావిషయమును తెలుపుదు రన్నయపేక్షతోను, ఇతరు లట్టిగ్రంథసంపాదనమునకయి కృషిచేయుదు రన్నవిశ్వాసముతోను, ఆగ్రంథములపేరులనుమాత్ర మిందుఁ జెప్పి వానిలోనుండి దొరకినపద్యముల నుదహరించుచున్నాను.", అని వ్రాసి "చరిత్రము తెలియని యితరకవులగ్రంథము" లని, యప్పకవీయాది లక్షణగ్రంథములలో నుదహరింపఁబడిన పదునేడుగ్రంథములనామముల నుదాహరించుచు నాయాగ్రంథములనుండి మనోహరములగు కొన్నికొన్ని పద్యముల నుదాహరించి యున్నారు.

ఈచరిత్రమునం దుదాహరింపఁబడినకవులు రచియించినగ్రంథములస్వభావముల నించుక యోచించిచూచువారలకుఁ బురాణములను రచియించినవారలను, స్మృతులను దెలిఁగించినవారలను, ప్రబంధములను రచియించినవారలను మాత్రమే కవులనుగాఁ బరిగణించి యట్టివారలచరిత్రములను మాత్రమే యిందు వ్రాసియున్నా రని తోఁచక మానదు. శతకములను రచియించిన వారలనుగాని, నాటకములను దెనిఁగించినవారలనుగాని, స్వతంత్రముగ నాటకములను వచనప్రబంధములను రచియించినవారలనుగాని, వీరేశలింగముపంతులుగారు, కవులనుగాఁ బరిగణించియుండలే దనియే చెప్పవలసి యున్నది.



ఈయాంధ్రకవులచరిత్రమును రచియించుటయం దెన్నిముద్రితగ్రంథముల నేమి, యెన్నియముద్రితశిథిలతాళపత్రగ్రంథముల నేమి చదివి విశేషముగా శ్రమపడియున్నా రని యించుక యోచించి చూచువారలకు సులభముగా బోధపడక మానదు. చరిత్రము లనివ్రాయఁబడిన యారెండువందలపదునైదుగురు కవులలోను, కుమ్మర మొల్ల, ముద్దుపళని, తరిగొండ వెంకమ్మ, యనుముగ్గురుమాత్రమే స్త్రీలు కవులుగఁ గానవచ్చుచున్నారు. ఇందు, పంతులుగా రాయాకవులచరిత్రములనుగూర్చి వ్రాయుచు, నాయాకవుల కవితాసామర్థ్యములనుగూర్చి వ్రాసిన విశేషాంశముల నించుక జాగరూకతతో యోచించి చూచినచో, మొత్తముమీఁద నాయాకవులసామర్థ్యములకు సంతసించునట్టిస్వభావముగలవార లని వెల్లడి గాక మానదు. గౌరవభావంబునకు లాఘవంబు గలుగకయుండునట్లుగను, బరులను బరిహసించి వంచింపకుండుస్వభావ మంతగా లేకయుండునట్లుగను, రచనాప్రణాళికను నిర్ణయించుకొనియే యీచరిత్రము రచియింపఁబడిన దని నిశ్చయముగాఁ జెప్పవలసియున్నది.

కాని, వీరు, సాధారణముగాఁ బలువురవలె నేదియేని వ్రాయునప్పుడు విశేషముగా నాలోచించి వ్రాయుటకుఁ జాలినవ్యవధి లేమిం జేసియో, యాకాలమునం దెంతయు నవ్వనుగలుగఁ జేయునట్లుగ హాస్యసంజీవనులను వ్రాయుచుండుటచేతనో కాని, పాపము, గణపవరపు వేంకటకవినిగూర్చిమాత్ర మెంతయు సంతాపకరంబుగ నుండునట్లు వ్రాసియున్నారు. ఆంధ్రభాషామహాసౌధంబునకుం బునాదు లని చెప్పఁదగునట్లుగఁ దారావళులు, యమశతకము, శృంగారరసమంజరి, కృష్ణమల్లకథ, బాలరామాయణముద్విపదము, చాటుపద్యములు, లింగనిర్ణయము, ఆంధ్రప్రతాపరుద్రీయము, ఆంధ్రరసమంజరి, ఆంధ్రనిఘంటువు, ఆంధ్రకౌముది, గణయతిప్రాసలక్షణసీసమాలిక, ఆంధ్రప్రయోగరత్నాక

తము, రేఫఱకారనిర్ణయము, షట్ప్రత్యయప్రస్తావసరణి, ఇరువదాఱు ఛందములవచనము, అలంకారసారము, పరమభాగవతచరిత్ర, ఆంధ్ర ద్విరూపకోశము, కల్పితకల్పలత, ఆంధ్రవసంతతిలకభాణము, కవిసహ్రా సశతకము, ఆంధ్రప్రక్రియాకౌముది, జాంబవతీవిలాసము, చండవిద్యా పతీదండకము, చక్రవాళతారావళి, పురాణసారము, ప్రబంధరాజవేంక టేశ్వరవిజయవిలాస మను గ్రంథములను రచియించినవేంకటకవి యొక పండితకవి యని పైగ్రంథములలోని కొన్నిగ్రంథములనామములను బట్టి నిర్ణయింపఁబడఁదగియుండి, యక్కవిసామర్థ్యము వేవిధంబుల వె ల్లడి యగుచుండఁగా, నాతనిఁగూర్చి వ్రాయుచు, "ఈకవి తానుచేసిన పుస్తకములు లోకమునకుపయోగపడవలె నన్నయుద్దేశముతోఁ గాక తనసర్వతోముఖపాండిత్యప్రకర్షము లోకమునకుఁ బ్రకటింపవలె నన్న యుద్దేశముతో విశేషముగాఁ జేసినందున నీతని కీపుస్తకముల కిట్టిగతి పట్టియుండును" నని వీరేశలింగముపంతులుగారు వ్రాసియున్నారుగాని, వేంకటకవివిరచితతాళపత్రగ్రంథములు శిథిలములయి పోయియుండుట చేతనో, లేక, యేకారణచేతనో యవి నశించిపోయియుండుటచేతనో, యాకవీంద్రునిగ్రంథములు, చాలభాగము, నామమాత్రావశేషము లయియున్నవనుమాట సత్యమే యగును.

ఆంధ్రలోకమున కుపయోగపడవలె నన్నసచ్చింతతోడనే రచి యింపఁబడినయాగ్రంథము లీకాలంబున లేకపోయినంతమాత్రముచేత నక్కవిఁగూర్చి యంతకాఠిన్యమును వహించి, పంతులుగారట్లుమాత్రము సంతాపకరంబుగ నుండకమాన దని నిశ్శంకముగాఁ జెప్పవలసి వచ్చినందుల కెంతయుఁజింతిల్లుచున్నాఁడను.

ఈచరిత్రమందే, వీ రాంధ్రకవితాకన్యకయొక్కసూక్ష్మచరిత్రము ను వ్రాయుచు, బలిజవంశజుఁడును, బలరామచరిత్రకృతికర్తయు నయిన ప్రౌఢకవిగుడారువేంకటదాసకవినిగూర్చియుఁ బంధగర్భచిత్రకవిత్వవిశా



రదుఁడయినగణపవరపువేంకటకవినిగూర్చియు వ్రాయుచు, "సర్వసార స్యమును బూర్ణముగాఁ జెఱిచి యవయవములు విఱిచి తమభాషావ ధూటిని విరూపిని జేసి శవప్రాయను జేసిరి.,, అని వ్రాసియున్నారు. ఇతరకవులసామర్థ్యంబు నీర్ష్యాగుణంబనునది యించుకయును లేకుండున ట్లుగ, మాడభూషి వేంకటాచార్యకవిచరిత్రమునందు "ఇతఁడు సంస్కృ తాంధ్రములయం దత్యంతపాండిత్యము గలవాఁడయి, శతలేఖినీపద్య సంధానసామర్థ్యమును అష్టావధానసైపుణియు వ్యస్తాక్షరీకౌశలమును గ లవాఁడయి యుండెను. ఈకవిగోదావరీమండలములోని పెంటపాడుగ్రా మనివాసియై కృష్ణామండలములోనినూజవీడుసంస్థానమునందు చిరకాల ముండి విద్వాంనభినవ పండితరాయాది బిరుదాంకముల నందినవాఁడు. చిన్నతనమునం దీయనధారణశక్తి యత్యద్భుతమైనదిగా నుండెను. అప్పు డితఁడు ద్విసంథాగ్రాహి యగుటయేకాక రెండుమాఱులు చదివినపద్య మును తలక్రిందుగా నొప్పగించుటకును నెనిమిదిభాషలలో వ్యస్తాక్షరి చెప్పుటకును సమర్థుఁడయి యుండెను.,, అనియును, మండపాకపార్వతీ శ్వరకవిచరిత్రమునందు "ఈకవి సంస్కృతాంధ్రములయందు మంచి పాండిత్యము గలవాఁడయి మృదుమధురనిరర్గళధారతోఁ జతుర్విధకవి త్వమును జెప్పఁచువచ్చుటయేకాక వినయసౌశీల్యాదిగుణసంపత్తి గల వాఁడయి యుండెను.,, అనియు నీమొదలగురీతుల నాయాకవులచరిత్ర ములయందు వ్రాసి, మెచ్చుకొనుస్వభావమునే యపారముగ వెల్లడిం చినవీరేశలింగముపంతులుగా రనేకపద్యముల నొక్కపద్యమునందే యి మిడ్చి తనపద్యమునకుం బెద్దపేరు పెట్టుకొనితనసామర్థ్యంబును వెల్లడిం చుకొనినగుడారువేంకటదాసకవిం జూచి, యంతకంటెనెక్కువసంఖ్యగల పద్యముల నొక్కపద్యమునందే యిమిడ్చి, తనపద్యమున కంతకంటెను బెద్దపేరును బెట్టుకొని యెక్కుడుసామర్థ్యంబును వెల్లడించుకొనినగణప

వరపు వేంకటకవినిగూర్చి, "మనయీ వేంకటకవి," "మనయీ వేంకటకవి," యని తమచదువరులు పరిహసింపవలయు ననునుద్దేశముతో, "ఒక్కదానిలో నేయితరపుస్తకములోను లేనంత యమితముగాఁ జెప్పి తనశిల్పివ్యాపారకౌశలము నెంత చూపినను, కాళ్లతో నడచి గమ్యస్థానమును జేరుసామాన్యమార్గమునువిడిచి యడ్డముగా భూమిమీఁదఁబడి కడుపుతో దొర్లి ప్రయాసపడి గమ్యస్థానమును జేరి యసాధారణప్రౌఢిమను జూపిన బుద్ధిమంతునిశక్తిని మెచ్చుకొనునట్లే యిట్టికవితాచమత్కృతులు మెచ్చుకొనఁదగియుండునుగాని యంతకంటె నెక్కువ శ్లాఘాపాత్రములు గావు," అని వ్రాయుటకుం గలకారణ మెవ్వరికి దుర్గ్రాహ్యము గాక యుండును? పంతులుగా రిట్లధికకాఠిన్యమునువహించి వ్రాయుటవలననే వేంకటకవి యసాధారణశేముషీవిశేషుఁ డని చెప్పవలసి యున్నది. బంధగర్భచిత్రకవిత్వాలంకారములం దమకవితాకన్యకను "పద్యములలోఁ బద్యములను దూర్చినవానిని మెచ్చుకోరు," అని వ్రాసినవీరేశలింగముపంతులుగా రలంకరించితమకుం గలసామర్థ్యమునుగూడ వెల్లడించి, యట్లు వ్రాసియుండినచో, నయ్యది చదువరులకుం గొంతవఱకు శాంతిని గలిగించియుండునుగదా!

పంతులుగారు తాము రచియించిన "సరస్వతీనారదవిలాపము," లోని,

సీ. దయమాలి తుదముట్టఁ ♦ దలకట్లు నిగిడించి
ధీరుఁడై నన్ను బా ♦ ధించు నొకఁడు;
పాదంబులోపలఁ ♦ బాదంబు లిమిడించి
వీరుఁడై నన్ను నొ ♦ ప్పించు నొకఁడు;
ప్రాసంబుపైఁ బెక్కు ♦ ప్రాసంబు లడరించి
పోటుబంటై నన్నుఁ ♦ బొడుచు నొకఁడు;
బెండుపల్కులు గూర్చి ♦ నిండించి నగ లంచు
దిట్టయై చెవులు వే ♦ ధించు నొకఁడు;



ఖడ్గచక్రాదిరూపముల్ ♦ గానిపించి,
వర్ణములు మార్చి నన్నుఁ జిక్కు ♦ పఱుచు నొకఁడు;
కుమతు లొడ్డ తెల్ల విఱిచి ప్రా ♦ ణములు తీయ;
నొడలిపస లేక శుష్కించి ♦ యున్నదాన.

అనుపద్యమును రచియించుచుండినప్పుడు, వేంకటకవినే ముఖ్యముగా నుద్దేశించు చుండిరని నేను నిశ్చయముగాఁ జెప్పఁగలను.

విశేషసామర్థ్యసంపన్నుఁ డని చెప్పవలసిన వేంకటకవి మృతకవియే గాక, మనయీకాలమునందు జీవించియే యున్నపక్షమున నీ వేంకటకవి పేరీయాంధ్రకవులచరిత్రమునం దుదాహరింపఁబడియుండక యేయుండు నని నేను నిశ్చయముగా నూహించుచున్నాను. వేంకటకవి యితరకవులు రచియించినపద్యములను మించియుండవలయు ననునుద్దేశముతో బద్యములను రచియించునుత్సాహస్వభావముగలవాఁ డని చెప్పుటకు సందేహము లేదు. అట్టిప్రకృతిని గలిగియుండుట సాధారణముగాఁ గవులకుస్వభావ మని మనము చెప్పఁగలము. అందుల కుదాహరణంబుగ దూరముగాఁ బోనేల? చూడుఁడు. మృదుమధురపాకము గలదయి రసవంతమయి సహృదయాహ్లాదకరంబుగ నుండునట్లుగ హరిశ్చంద్రోపాఖ్యానమును రచియించినశంకరకవి తన "హరిశ్చంద్రోపాఖ్యానము," నందు బంచమాశ్వాసమునందు, హరిశ్చంద్రుఁడుచంద్రశేఖరునింగూర్చి వినుతించినకథాభాగమునందు,

సీ. జయ పార్వతీమనో ♦ జలజాతమార్తాండ!
జయ రసాతలవిభూ ♦ షణకరండ!
జయ గజాసురగర్వ ♦ జలదజగత్ప్రాణ!
జయ భక్తలోకర ♦ క్షాధురీణ!
జయ ఫాలలోచన ♦ జ్వలనజితానంగ!
జయ పాణిసంభృతో ♦ జ్వలకురంగ!

జయ వియద్వాహినీ ♦ శశికళాకోటీర!
జయ కుందచందన ♦ సమశరీర!
జయ రమాధీశభారతీ ♦ ప్రియపురంద
రాదిగీర్వాణమకుటవి ♦ న్యస్తరత్న
పటలశోభావిభాసిత ♦ పాదపద్మ
జయ మనోహరకలధౌత ♦ శైలసదన!

అని పద్యమును రచియించి యుండగా, వీరేశలింగముపంతులుగా రా కథాభాగమునందే, తమ "సత్యహరిశ్చంద్రనాటకము" నందు,

సీ. జయజయ యంబర ♦ చరవాహినీజూట!
జయ చంద్రమఃకళా ♦ సత్కిరీట!
జయజయ పాతక ♦ జ్వాలనామలకృపీట!
జయ వినిర్దళితకుం ♦ జరనిశాట!
జయజయ పావక ♦ నయనాంచితలలాట!
జయ నివసద్రౌప్య ♦ శైలకూట!
జయజయ వ్యాఘ్రపురా ♦ ఘసనిర్భరాఖేట!
జయ ధృతసీరజా ♦ సనకరోట!
జయ భువనపావనామ్నాయ ♦ సంఘఘోట!
జయ నిశాసమయచరచ్ఛ్మ ♦ శానవాట!
జయ సతతభూషణీకృత ♦ సర్పఝాట!
జయ కనద్రుచిరామోఘ ♦ శంబఖేట!

అను పద్యమును రచియించియున్నారు.

శంకరకవిపద్యమునందు మొదటినాలుగు పాదములయందును మాత్రమే, యొక్కొక్క పాదమునందు, వేఱువేఱుగ నంత్యనియమము లుండియున్నవి. కాని, "రమాధీశభారతీప్రియ పురందరాదిగీర్వాణమ



కుటవిన్యస్తరత్నపటల శోభావిభాసిత పాదపద్మ!" యని సంబోధింపఁబడియుండుటంజేసి, హరిశ్చంద్రునిభక్తితాత్పర్యవిశేషంబు హెచ్చుగఁ గానఁబడుచు, నీశ్వరునిప్రాముఖ్యము, మనసు నాకర్షించునట్లుగ, వెల్లడింపఁబడియున్నది. వీరేశలింగముపంతులుగారిపద్యమునందో, కష్టసాధ్యంబుగ నుండునట్లుగ నొక్కరీతియంత్యనియమము రెండుసారులు గానవచ్చుచున్నది.

* * * * *

మఱియు నీవేంకటకవి విశేషముగా గ్రంథచౌర్యమును జేసినవాఁడని వ్రాసియున్నారు. కాని, యాకవికాల మేదో సరిగాఁ దెలియరాకపోయిన దని స్పష్టముగా వ్రాసినవీరేశలింగముపంతులుగా రట్లు నిందారోపణమునుగావించుటకుం గల ప్రబలాధార మేదియో నేనూహింపఁ జాలకున్నాను. పంతులుగారా వేంకటకవికవితాసామర్థ్యమును మొదలంటకదలించి యట్లాగ్రహముతోఁ గఠినముగా వ్రాయుటకుంగల కారణమా వేంకటకవి స్వసామర్థ్యమును విశేషముగా నభినందించుకొనుచు,

సీ. అల విన్నకోట పె ♦ ద్దనలక్షణజ్ఞత
శబ్దశాసనకవి ♦ శబ్దశుద్ధి
ప్రాబంధికపరమే ♦ శ్వరు నర్థమహిమంబు
భయకవిమిత్రుని ♦ పదలలిత
శ్రీనాథువార్తాప్ర ♦ సిద్ధి నాచనసోము
భూరికాఠిన్యంబు ♦ పోతరాజు
యమకవిధము మల్ల ♦ యమనీషి చిత్రంబు
పింగళి సూరక ♦ విపరుశ్లేష
నాంధ్రకవితాపితామహు ♦ నల్లికబిగి
ముక్కుతిమ్మన తేటయు ♦ భూషణునియు

లంకృతియు నీకెకలదా త ♦ లంపలక్ష
ణకవి యప్పయ వేంకట♦ సుకవిచంద్ర!

అని వ్రాసికొనియుండుటయే యని మనము నిశ్చయింపవలసి యున్నది. కాని, పూర్వమనేక సంవత్సరములక్రిందట వీరేశలింగముపంతులుగారు, తమ “వివేకవర్ధని,, పత్రికయందు “అసద్గ్రంథములు,, అను శీర్షికతో, సాహిత్యమునందుమాత్రమేకాక సంగీతమునందును మిగుల ప్రావీణ్యముగలిగి, యుద్గ్రంథములను రచియింపఁ గలిగినమహాకవియగు రామరాజభూషణుని వసుచరిత్రమునుగూర్చి, “వసుచరిత్రాది గ్రంథములునహిత మంతగాఁజదువఁదగినవి కావు. అవిసహితముపరిమళయుక్తమయివిషస్వభావముగల పుష్పములవలెతమసౌరభము ననుభవింపఁ బూనువారిని కామోన్మత్తులనుగాఁ జేయకమానవు.,, అని వ్రాసియున్ననేఁ, జిరకాలమునకుఁ దరువాత రచియింపఁబడిన యీయాంధ్రకవులచరిత్రము వ్రాయఁబడునప్పటికట్టి యభిప్రాయమును గలిగియుండక యుండుటయేకాక,

“ఈరామభూషణకవి మొట్టమొదట రచియించినకావ్యము వసుచరిత్రము. ఈప్రబంధముతో సరిరాఁదగినశ్లేషకావ్యము తెనుఁగున మఱియొకటి లేదు. ఇందలివర్ణనలు మిక్కిలిమనోహరము లయి యున్నవి; పదములకూర్పు మిక్కిలి సుందరముగానున్నది. శబ్దార్థాలంకారములాహ్లాదకరముగానున్నవి. రసభావాదులు యథాయోగ్యములుగా నున్నవి. ఈగ్రంథము రచియింపఁబడినతరువాత నేఁటివఱకును ప్రబంధములను జేయఁబూనినకవు లెల్లను వసుచరిత్రమును ప్రతిరూపముగాఁ జేకొని దాని ననుసరించి తమగ్రంథములనురచియించియున్నారు.,,

అని సహితమువ్రాసియుండిన తెఱంగుననే, వేంకటకవింగూర్చిన యిప్పటియుద్దేశములనుమార్చుకొనియెద రేమో యాగతకాలముంగూర్చి యెవ్వరుచెప్పఁగలుగుదురు? “బంధగర్భచిత్రకవిత్వముల కొఱకై శ్రమ



పడి కూర్చినభాగములను విడిచినపక్షమున, ఈతనికవిత్వముత్తమము మీఁద రసవంతమయిపదలాలిత్యముకలదయి మనోహరముగానే యున్నది.,, అనివ్రాసినపంతులుగారింకముందీ వేంకటకవి బంధగర్భచిత్రకవిత్వములకొఱకై శ్రమపడికూర్చినభాగములీవేంకటకవియసాధారణసామర్థ్యమును వెల్లడించుచున్నవను భావమును వెల్లడింపకయుందురా యని నేఁదలంచుచున్నాఁడను.

* * * * * * *

లోకములోఁగల స్త్రీలందఱును, సోదరీమణులనియును, పురుషులందఱును, సోదరులనియునే సిద్ధాంతముగాఁగల పరమావధిగలపంతులుగారు వేశ్యాకులసంజాతయగు ముద్దుపళనిచరిత్రమును వ్రాయుచు, “ఇది,, “దీని,, “దీనికి,, ననునీచార్థబోధక పదములనదియేపనిగ నుపయోగించియుండుట, యీయాంధ్రకవుల చరిత్రమునందు మఱియొక చింతనీయాంశంబుగనున్నది. కులభేదమును పాటింపని బ్రహ్మసమాజమతము నవలంబింపనికాలమునందు ముద్దుపళనిచరిత్రమును వ్రాసియుండుటచే నట్లువ్రాసియుందురని మనముకొంతవఱకు నిశ్చయింపవలసియున్నది. కులాంగనలగుకుమ్మరిమొల్ల తరిగొండవెంకమ్మల చరిత్రములనువ్రాయునప్పుడు, “ఈమె”, “ఆమె,, అనివ్రాసియున్నట్లువ్రాయుట కిష్టము లేకయున్నను, మంచిసంస్కృతాంధ్ర సాహిత్యమునుగలిగి, లోకోక్తులతోడను, జాతీయములతోడను, నాతికఠినమృదుమధురకవిత్వమును జెప్పఁగలిగినముద్దుపళనిని గూర్చి యట్లత్యంతనిరసన భావద్యోతకంబుగ వ్రాసియుండుట, పూర్ణిమాచంద్రబింబమువంటి యీయాంధ్రకవులచరిత్రమునం దొకకళంకమువలెఁ గానఁబడుచున్నది. ముద్దుపళనిరచియించిన యిళాదేవీయమను నామాంతరముగల రాధికాసాంత్వనమునందు,గద్యమునందు,“చోళసింహాసనాధ్యక్ష ప్రతాపసింహమహారాజబహుమతానేక చామీకరాంబరాభరణముత్యాలు గర్భశు

క్తిముక్తాయమాన" యని వ్రాయఁబడియున్నంత మాత్రముచేత "అది తంజావూరుసంస్థానప్రభువయిన ప్రతాపసింహునియొంపుకు కర్తయయిన; నట్లువ్రాయుటకుంగల ప్రబలాధారములున్న వా" యని కూడసంశయింపవలసి యున్నది. మఱియు, నొకవేళనది యేసత్యమయిన యెడల, నాంధ్రకవితాభిమానియు,సరసుఁడునయిన యాప్రతాపసింహుని సంతసింపఁజేసి గొప్పబహుమానము నందవలయుననునుద్దేశముతో నేపురుషకవియో యట్టిరాధికా సాంత్వనమునురచియించి, ముందుగా ముద్దుపళని నిమెప్పించి, సఫలీకృతమనోరథుఁడయి యుండవచ్చునేమో యని కూడనొకసంశయము గలుగుచున్నది. ఏదియెట్లున్నను, రాధికా సాంత్వనగ్రంథములోని భాగముల నేకములు స్త్రీలువినఁదగినవియు స్త్రీనోటినుండి రాఁదగినవియుఁ గాక దూష్యములయియేయున్నందున నాకవిత్వమునుగూర్చి పంతులుగారుకాఠిన్యమును వహించి వ్రాయవచ్చును. కాని, యిదియదియనునగౌరవార్థకపదములు ప్రయోగింపఁబడిన స్థలములయందు "ముద్దుపళని" యనియో, వేశ్యాకాంత వారకాంతమొదలగు నుపపదములను బ్రయోగించియుండినచో సమీచీనంబుగనుండునని భావించుచున్నాఁడను.

* * * * * * *

పంతులుగారు, తమజీవితకాలమునందు, నిర్వహింపనిశ్చయించుకొనినస్త్రీపునర్వివాహమహాకార్యముయొక్క భారము నీయాంధ్రకవిచరిత్రగ్రంథవిరచనమునందును, మఱచియుండకయే, యున్నారు. అల్లమరాజుసుబ్రహ్మణ్యకవిచరిత్రమునుగూర్చి వ్రాయుచు "కవిత్వప్రౌఢిమ తెలియుటకయి శ్రీకృష్ణకల్యాణములోని కొన్నిపద్యముల నిందుదాహరించుచున్నా" నని,



చ. చెలిమిని గాదె క్రొత్తలు వ ♦ చించెద వ్రాయదువంశనాథ నీ
యలఘుభుజాబలశ్రితుల ♦ మామముబోటుల మీవు లేనిచోఁ
జెలువుఁడు లేనియింతులటు ♦ చింతిలుచుందుము; నీవు చెంగటన్
వెలసిన నింద్రుకోడఁ దగు ♦ వేల్పులరీతి సుఖింతు మెంతయున్.

అనుపద్యమునుజూపి, చెలువుఁడులేనియింతులయెడ జాలిఁజూపవలయునని బోధించియున్నారు. పైపద్యమునందు వ్రాయఁబడినతెఱంగున వ్రాసినదొక్కయల్లమరాజు సుబ్రహ్మణ్యకవి యేకాఁడు. వలనుపడినప్పుడెల్లనట్లువ్రాయుటకు మనయాంధ్రకవులలో ననేకులు జాలిగుండెగలవారలేయని చెప్పఁగలము. భగవద్భక్తాగ్రేసరుండును, బురాణకవికులశిరోమణియునగు బమ్మెరపోతనామాత్యునిచే నిరుపమానంబుగ రచియింపఁబడిన శ్రీమదాంధ్ర భాగవతమునందలి యష్టమస్కంధమున గజేంద్రమోక్షకథాభాగములోనున్న,

మ. తనవేంచేయుపదంబుఁ బేర్కొనఁడనా ♦ థస్త్రీజనాలాపము
ల్వినెనో! ముచ్చులు ముచ్చిలించిరో! ఖలుల్ ♦ వేదప్రపంచంబుల
న్దనుజానీకము దేవతానగరిపై ♦ దండెత్తెనో! భక్తులం
గని; చక్రాయుధుఁ డేడి చూపుఁ డని ధి ♦ క్కారించిరో దుర్జనుల్

అనుపద్యరత్నమునుగాంచి యనేకులానందించియే యుందురు.

* * * * *

ఇందు నాచనసోమునిచరిత్రమునందు "ఒక్కయెఱ్ఱాప్రగడకవిత్వమే కాదు. భారతమును రచియించిన కవిత్రయములో నెవ్వరికవిత్వమును సోమునికవనముతో సరిరాదని నాయభిప్రాయము" అని వ్రాయఁబడియున్నది. ఎఱ్ఱాప్రగడచేసినహరివంశము ప్రౌఢముగా నుండలేదన్న యభిప్రాయముతో నీతఁడీయుత్తరహరివంశమును రచియించినట్టు కనఁబడుచుండుటంజేసి, యిరువురుకవులు రచియించినహరివంశములను బరి

శీలించి, "సోమనాథునికవిత్వము మిక్కిలి ప్రౌఢముగాను, సర్వవిధముల నెఱ్ఱాప్రగడకవిత్వముకంటె మేలైనదిగాను ఉన్నది", అని వ్రాసినను వ్రాయవచ్చునుగాని, పురాణశైలి నెక్కసారిగ మహోన్నతదశకుఁ దీసికొనివచ్చినపురాణకవులగు నన్నయతిక్కనలతోడ, శృంగారాదిరసప్రధానంబుగ నుండునట్లు ప్రబంధకవిత్వమును జెప్పుటకుం జాలియుండి, సరసకవిత్వపటుత్వసంపదనుబట్టి సర్వజ్ఞుఁ డనుబిరుదు పేరునకుందప్పక తగినప్రబంధకవియని చెప్ప నొప్పు సోమనాథునింబోల్చిచూచుటకు ముందుగా నెట్లుపిలువఁడునో నేనూహింపఁజాలకున్నాను. సోమనాథునికవిత్వమును దెలియఁజేయఁజాలుట కక్కవిచే రచియింపఁబడినయుషాకన్యాపరిణయకథలోని రమారమి ముప్పదిపద్యములుగల కొంతభాగమునిందుఁ బ్రకటించియున్నారు. దీనింబట్టిచూడఁగా సోమనాథుని కవిత్వమునందు వీరలకుఁగల యత్యాగౌరవంబును, బాల్యమునుండియు వీరలకుఁ బ్రబంధకవిత్వమునం గలమించినయనురాగంబును జదువరులకు సులభముగా వెల్లడిగాక మానదు.

పదలాలిత్యముగలిగి, యమకాదిశబ్దాలంకార భూయిష్ఠమయి ప్రౌఢ్యముగానుండి, భక్తిరసప్రధానమయినకవిత్వమునఁ గరంబుచెన్నువహించు శ్రీమదాంధ్రభాగవతమునంతటిమహాగ్రంథరాజమును రచియించిన బమ్మెరపోతనామాత్యునింగూర్చి వ్రాయుచు "పూర్వలాక్షణికులందఱు నంగీకరింపనిపోతనకవిత్వమునందు బొత్తిగాఁదోషము లే లేవని సాధింపఁజూచుటకంటె, భాగవతమునకు తరువాత రచియించిన వీరభద్రవిజయమునందుఁగూడఁ గొన్నిదోషములు కనుపట్టుచుండుటచేత పోతనకృతభాగవతమునందును గొన్నిదోషము లున్నవని యొప్పుకొనుటయే న్యాయము", అనియిందు వ్రాసియున్నారు; కాని, కూచిమంచి తిమ్మకవిసార్వభౌముఁడు, తనసర్వలక్షణసారసంగ్రహమునందు,



సీ. ఘనుఁడుపోతనమంత్రి ♦ మును భాగవతము ర
చించి చక్రికి సమ ♦ ర్పించునెడల
సర్వజ్ఞసింగయ ♦ తన్మాత్రముం దడి తన,
కిమ్మని వేఁడఁగా ♦ నీయ కున్న
వలిగి యాపుస్తకం ♦ బవనిఁ బాతించినఁ,
జివికి యం దొకకొంత ♦ శిథిల మయ్యెఁ
గమ్మఱ నది వెలి ♦ గందలనారప,
రాజును మఱి బొప్ప ♦ రాజు గంగ
రాజు మొదలగుకవివరుల్ ♦ తేజ మెసఁగఁ
జెప్పిరాగ్రంథములయందె ♦ తప్పు లొదవెఁ
గాని పోతకవీంద్రుని ♦ కవితయందు
లక్షణం బెందుఁ దప్పునా? ♦ దక్షహరణ!

సీ. అఖిలవేదాంతవి ♦ ద్యారహస్యవిదుండు,
సహజపాండిత్యవి ♦ శారదుండు
మత్తక్షితీశాధ ♦ మస్తోత్రవిముఖుండు,
శంభుపదాబ్జపూ ♦ జారతుండు
పటుతరకవితావి ♦ భాసితప్రముఖుండు,
సకలాంధ్రలక్షణ ♦ చక్రవర్తి
రఘుకులేశనిదేశ ♦ రచితమహాభాగ,
వతపురాణుఁడు పుణ్య ♦ వర్ధనుండు
బుధజనహితుండు బమ్మెర ♦ పోతనకవి
యెన్న రేఫఱకారంబు ♦ లెఱుఁగఁ డనుచు
నజ్ఞు లొకకొంద ఱాడుదు ♦ రామహాత్ము
కవిత కెందును లోపంబు ♦ గలుగ దభవ!

అని సమంజసముగ వ్రాసియుండుటంజేసియు, ఈచరిత్రమునందే „పోత
నకవిత్వమునందు గొన్ని లక్షణవిరుద్ధములయిన ప్రయోగము లుండుట
చేత వెల్లంకితాతంభట్లు మొదలయిన పూర్వలాక్షణికులు దానిని స
లక్షణగ్రంథముగా నంగీకరించినవారుకారు. * * * ', „రేఫఱకా
రముల ప్రాసమైత్రినిబట్టి పూర్వలాక్షణికులు భాగవతమును నిరాకరిం
పలేదనియు వారుదానినుదహరింపకపోవుట కితరదోషములే కారణము
నియు నాయభిప్రాయము. * * *,, అనివ్రాయఁబడి „అయినను
మన మేభాగము పోతకవి విరచితమో యేభాగము తచ్ఛిష్యవిరచిత
మో యేయేపద్యములు శిష్యజనపూరితములో, యేవియెవరిదోషము
లో దృఢముగా నిర్ధారణము చేయఁ జాలము,,అని సహితము వ్రాయఁ
బడి యుండుటంజేసియు, మీఁదుమిక్కిలి పోతరాజస్వహస్తలిఖితగ్రంథ
మేదియు మనకు లభ్యంబుగాకుండుటంజేసియు, శ్రీమదాంధ్రభాగవత
మునందలిదోషములకెల్లను సమ్మహాకవిపోతరాజునె యుత్తరవాదిగఁ
జేసి, వానింగూర్చివ్రాయుచు „సహజపాండిత్యుఁడగుటచేత నీతనికవిత్వ
మునం దక్కడక్కడఁ గొన్నివ్యాకరణాదిదోషములు కానవచ్చుచు
న్నవి,, అనివ్రాయుటకన్ననందలి దోషములనెల్లను ప్రక్షిప్తంబులుగఁ
బరిగణించుటయేయెంతయు సమీచీనముగా నుండునని నేఁ దలంచెదను.
ఇందుల కుపబలంబుగ నీచరిత్రమునందే, యటుపిమ్మట, „పూర్వలాక్ష
ణికు లందఱునంగీకరింపని పోతనకవిత్వమునందు బొత్తిగా దోషములే
లేవని సాధింపఁ జూచుటకంటె, భాగవతమునకు తరువాత రచియించిన
వీరభద్రవిజయమునందుఁగూడఁ గొన్నిదోషములు కనుపట్టుచుండుట
చేత పోతనకృతభాగవతమునందును గొన్నిదోషము లున్నవని యొప్పు
కొనుటయే న్యాయము,, అని సహితము వ్రాయఁబడి యున్నయది.
శ్రీమదాంధ్రభాగవతమునంతటి మహాగ్రంథమును రచియించినయనం
తరము పోతనరచియించినవీరభద్ర విజయమునం దక్కడక్కడఁ



గొన్నిదోషము లుండిన నుండవచ్చును. అట్టిదోషముల కెల్లను గార
ణ మంతటిశ్రీమదాంధ్రభాగవతమును రచియించుటవలనఁ గలిగినమ
నోదార్ఢ్యము తొలంగుటయేయని మనమూహింపవలసి యున్నది.

కాని, మనోదార్ఢ్యము తొలంగినకాలమునందు రచియింపఁబడిన
గ్రంథమునందలిదోషముల నాధారంబుగఁ జేసికొని „కొన్నిదోషము
లున్నవని యొప్పుకొనుటయే న్యాయ" మని వ్రాయుట కంతగా వీలు
పడదుగాని, కవి మనోదార్ఢ్యమునం దున్నకాలమున రచియింపఁబడిన
గ్రంథములయందలికవిత్వమునకును, మనోదార్ఢ్యము తొలఁగినకాలం
బున రచియింపఁబడిన గ్రంథములయందలి కవిత్వమునకును సముద్ర
మంతవ్యత్యాస ముండియుండక మానదని వ్రాయుటకు మాత్రము లేశ
మయినను సంశయము లేదు. ఎట్టులయినను, వాగనుశాసనుం డని
బిరుదువడసిననన్నయభట్టారకునింగూర్చి వ్రాయుచు, సముచితంబుగ
నుండునటులు „మూలముతో సరిపోల్పక ప్రత్యేకముగాఁ జూచునప్పు
డుమాత్ర మాంధ్రభారతము మనోహరముగా నుండుననుటకు సందే
హము లేదు,, అనివ్రాసియు, „కొన్ని చోట్లమూలముకంటెను హృద్య
ముగానుండి రసాతిశయము పుట్టించు ననుటయు సిద్ధవాదాంశ,, మని
యును వ్రాసి, యక్కవి కర్హగౌరవంబు నొసంగినతెఱంగుననే, యి
చ్చో, „షోడశకళాపరిపూర్ణమైన చంద్రబింబమునందుఁ గొంచెము కళం
క మున్నట్టుగా సర్వజనసమాదరణీయ మయినయీతనికవితాసుధాస
ముద్రమునందుఁ గొన్ని నెఱసు లున్నను దానికొకకొఱఁతగలుగఁబోదు,,
అనిసహితము వ్రాసి, యమ్మహాకవికిం బోతనామాత్యునకును నర్హగౌ
రవంబు నొసంగియే యున్నారు.

ఇందిట్లభిప్రాయభేదముగలస్థలములక్కడక్కడఁ గానఁబడును;
కాని, యిట్లుబహువిధగ్రంథపరిశోధనముకావించి, యిట్లుకవులచరిత్ర

ములను వ్రాయుటమాత్రముతదితరుల కంతగా సులభసాధ్యము గానేరదు. ఆంధ్రకవులచరిత్రముయొక్క ప్రథమభాగము 1890వ సంవత్సరమునజరిగిన ప్రథమశాస్త్రపరీక్షకుం బఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడినది. తరువాత ననేకసంవత్సరములు వరుసగా నీయాంధ్రకవులచరిత్రమును బ్రథమశాస్త్రపరీక్షకుం బఠనీయగ్రంథముగా నిర్ణయించి గ్రంథకర్త కర్హ్మాప్రోత్సాహమును గల్పించియున్నారు. గడచిప్రచురింపఁబడుచువచ్చిన చింతామణిపత్రికయందు ద్వితీయభాగమును బ్రచురింప నారంభించి, కొందఱిచరిత్రములనుమాత్రము వ్రాసి యున్నారు.

ఈయాంధ్రకవులచరిత్రమును వ్రాయనారంభించినట్లు 1889వ సంవత్సరముననే యిక్కడినాటకోజ్జీవకసమాజమువారికోరికప్రకారముగా నెంతయు సులభముగానుండి మిగుల రసవంతముగానుండునట్లు "సత్యహరిశ్చంద్రనాటకము" ను శ్రీవివేకవర్ధనిపత్రికయందుఁ బ్రచురించి, దానిని, ప్రత్యేకంబుగఁ బుస్తకముగ సహితము ముద్రింపించి యున్నారు. ఈనాటక మిప్పటి కనేకకూర్పులనందియున్నది. ఇది యొక్కదినమాడుటకు మిక్కిలి పెద్దదిగానుండుట విచారించి, దీనియందలి కొన్నిభాగములనుతగ్గించి, కొంతకథమార్చి ముద్రింపవలెనని యత్నింపఁగా దీనింజదివినవారనేకు లున్నవిధముగానే ముద్రింపవలసినదని కోరియుండున, మార్పులేమియుచేయక దీనిని మొదట వ్రాసినప్రకారముగానే ముద్రింపించి యున్నారు.

సుప్రసిద్ధినిగాంచిన హరిశ్చంద్రునియొక్కయు, నారాజేంద్రుని ధర్మపత్నియగు చంద్రమతియొక్కయుస్తుతిపాత్రము లగుచరిత్రములంద ఱెఱింగియే యున్నారు. పద్యగద్యాత్మకంబుగ, శంకరకవి, హరిశ్చంద్రోపాఖ్యానము నైదాశ్వాసములగ్రంథమును మున్ను రచియించి యున్నాఁడు. శంకరకవి రచియించిన "హరిశ్చంద్రోపాఖ్యానమును, ఈ "సత్యహరిశ్చంద్రనాటకము"ను సావకాశంబుగఁ బరిశీలించి చదువువా



రలకు, హృదయరంజకంబుగ నుండునట్లు కవిత్వము చెప్పుటయం దిరువురకును గలసామర్థ్యము సులభముగా గోచర మగుచుండును. భూతవర్తమానములని యోచించి, గ్రంథములపై నభిప్రాయము లొసంగువారలేకాని, గుణాగుణంబుల విమర్శించి గ్రంథములపై నభిప్రాయంబు లొసంగువారలంతగాలేని నేటికాలమును జక్కఁగా గుఱు తెఱింగియే పంతులుగారు తాము, కవికులసార్వభౌముఁ డయినకాళిదాసుఁడు రచియించిన "మాళవికాగ్నిమిత్ర" మనునాటకరాజమును దెనిఁగించుచు రచియించిన,

గీ. సర్వమును బ్రాఁత దని యెంచు ♦ సాదుగాదు;
క్రొత్త దనియె కావ్యమునకుఁ ♦ గొఱఁతరాదు,
యోగ్యులు గ్రహింతు రారసి ♦ యుత్తమంబు;
మూఢుఁ డన్యులనే నమ్ము ♦ బుద్ధి లేక.

అనుపద్యమును విపులముగాఁ బెంచి యెంతయుమనోహరంబుగ నుండునట్లు,

ఉ. ప్రాఁతది యన్నకారణముఁ ♦ బట్టియె సర్వము మేల్మిఁ జెందునే?
నూతనమన్న హేతువున ♦ న్యూనతఁజెందునె క్రొత్త వన్నియున్?
ఖ్యాతిగ నుత్తము ల్గుణము ♦ నారసి మంచిగ్రహింతు రెప్పుడున్
బ్రాఁతవె మంచివందు రవి ♦ మస్కృతఁ గేవలమూఢమానవుల్.

అని వ్రాసియున్నారు.

ఈనాటకరాజమునుగూర్చి పొడిపొడిమాటల నుడువక, సమానవర్ణనాస్పదములయినయాయాస్థలములందలిపద్యముల నిట నుదాహరించుటయే సర్వవిధంబుల శ్రేయోదాయకం బని తలంచి, యట్లు చేయుచున్నాఁడను.

క. పరకాంతోదరులునసహా
దరులుం దల్లులును భూత ♦ దయ యెల్లప్రుడుం

గర ముల్లసిల్లుమిత్రుఁడు
వరధర్మముఁదలఁచిచూడ ♦ వర్మ మతనికిన్. శ.క.

చ. వరసతులెల్లఁ దల్లులు స్వ ♦ భావగుణంబులు ధర్మవర్తనల్
పరమసుహృత్తు సూనృతము ♦ బంధుచయంబు జగజ్జనంబు, స
త్కరుణవిభూషణంబు సము ♦ దంచితశాంతతవిత్తమట్టియా
నరపతి స్వప్నమందయిన ♦ నవ్వులకైనను కల్లలాడునే. క. వీ.

చ. నృపతులు తొంటివారలు వి ♦ జృంభణలీలఁ జమూసమేతులై
విపినముల న్వినోదగతి ♦ వేటమెయిం జరియించుచుండరే?
తపసులయాశ్రమంబులకుఁ ♦ దద్దయు నీవలెనిష్ఠురక్రియం
గృపహృదయంబులోవదలి ♦ కీడుఁదలంపరుగాక యెన్నఁడున్. శ.క.

ఉ. రాజులు మున్ను వేటలకు ♦ రారె మదించిన దుష్టజంతులన్
దేజము చూపికానలను ♦ దీవ్రశరంబుల ద్రూపుమాపరే?
యేజననాథు లేయెడల ♦ నాశ్రమభూములు చొచ్చి నీవలెన్
నైజమదోద్ధతిన్ మునివ♦నంబుల సాధుమృగాళిఁ గూల్చిరే? క. వీ.

క. దారుణశార్దూలమునకు
సారంగము లట్లు మము వి ♦ చారింపక యీ
క్రూరునకు నప్పగింపఁగ
నేరూపున బుద్ధిపుట్టెఁ ♦ గృప వదలి నృపా! శంకరకవి.

చ. తడవుగఁ జిక్కలం బెనిచి ♦ దారుణలీలను గండుఁబిల్లికిన్
గడపట నప్పగించి చను ♦ కైవడి, మమ్మిటు లింతకాలముం
గొడుకులకన్న నెక్కుడుగఁ ♦ గూరిమినారసి మీర లిప్పుడీ
చెడుమునివాతఁద్రోచిచనఁ ♦ జెల్లునెనిర్దయవృత్తినక్కటా! కం. వీ.

సీ. నిద్దంపునునుమించు ♦ టద్దంబుఁ బ్రహసించు
ముఖమండలము గల ♦ మోహనాంగి





చెలిదమ్మిఱేకు ♦ లవిభ్రమంబుల గెల్చుఁ
కన్నులు గలకల ♦ కంఠకంఠిఁ
బూవుగుత్తులతోడఁ ♦ బోరాడ నోపువ
క్షోజముల్గలమృగ ♦ రాజమధ్యఁ
గొదమతుమ్మెదలకుఁ ♦ గొద ఘటింపఁగఁజాలు,
కుంతలంబులు గల ♦ గురునితంబఁ
బచ్చపగడంపుఁదీఁగకు ♦ హెచ్చుఁ జూపు
కెంపువాతెఱ గలరాజ ♦ కీరవాణిఁ
బ్రణుతి గాంచిన నాపాలి ♦ భాగ్యలక్ష్మి
విక్రయించెదఁ గొనరయ్య! ♦ వేగవచ్చి కం. వీ.

సీ. కలలోన నైన న ♦ వ్వులకైన నిసుమంత,
బొంకి యెఱుంగని ♦ పుణ్యశీల
తప్పుఁ జేసిన నైనఁ ♦ దన్నుదూఱిన నైనఁ
గోపించి యెఱుఁగని ♦ గుణధురీణ
పెఱలను దనవారి ♦ వేఱుఁగాఁ జూడక
సమతనారయునట్టి ♦ సదయహృదయ
కానిమాటలు తన్నుఁ ♦ గలుషాత్ము లాడినఁ,
గలహింప నొల్లని ♦ గరితమిన్న
పరులసొమ్ము తృణంబుగ ♦ భావమందు
దలఁచియెప్పుడువర్తించు ♦ ధన్యచరిత
చంద్రమతి నాదుభార్య నీ ♦ సాధ్వీమణిని
విక్రయించెదఁ గొనరయ్య ♦ విబుధులార! కం. వీ.

పైపద్యంబున శంకరకవి, చంద్రమతి సమ్మఁదలఁచిననక్షత్రకునివలెం జెప్పక, నఖకచకుచాదివర్ణనంబు సేయుకవీశ్వరునివశువునంబరమపతివ్రతను జంద్రమతిని మిగుల పరిహాసపాత్రముగా నుండున ట్లభివర్ణిం

చియున్నాఁడు. పంతులవారో యట్లుచేయక శ్రుతచరిత్ర యగుచంద్రమతియొక్క సుగుణగణంబులను వెల్లడించియున్నారు.

సీ. మాతామహుండును ♦ మాతామహియుఁ జేయు
గారాము గైకొనఁ ♦ గానవైతి
వానందమున నెత్తి ♦ యర్మిలిముద్దాడు
మేనమామలమేలు ♦ గాన వైతి
గరిమ నక్కునఁ జేర్చి ♦ శిరము మూర్కొనుతండ్రి
కౌఁగిట మెలఁగంగఁ ♦ గాన వైతి
వుత్సంగమున మించి ♦ వాత్సల్యమున దాది
గైసేయు మోదంబుఁ ♦ గానవైతి
పరిజనంబులుసఖులును ♦ ప్రమదమెసగఁ
బూని యొనరించు ప్రియములు ♦ గానవైతి
చుట్టముల కెల్ల వెలివడి ♦ రట్టుపడిన
నాకు జనియించి యిల్లైతి ♦ వే? కుమార! శం. క.

సీ. తతహంసతూలికా ♦ తల్పంబునను జేర్చు
మృదుతరదేహమా ♦ యిది కుమార!
కమ్మసంపెఁగనూనె ♦ కడురాచి పెంచిన
ముంగురులా యివి ♦ ముద్దుకుఱ్ఱ!
నవరత్నమయభూష ♦ ణంబులఁ బెనఁగొన్న
హస్తంబులా యివి ♦ యన్నుఁగుపట్టి
చిరుగజ్జియలు మ్రోయఁ ♦ జెలువొప్ప నడయాడు
చరణంబులా యివి ♦ వరకుమార!
నేలఁ బొరలాడుచును బెను ♦ ధూళిభృంగి
తాలుమాలుగఁ బడి చెల్వు ♦ తప్పి యున్న



నీదుకోమలాంగకము లీ ♦ నేత్రములును
గాంచి యెట్లోర్తురా? నను ♦ గన్నతండ్రి. కం. వీ.

ప్రత్యక్షమునం దున్న మరణమందినకుమారునిం గాంచి యెక్కడెక్కిడనో యున్న బంధువర్గంబును దలంచుచుఁ జంద్రమతి దుఃఖించునట్లు శంకరకవి పద్యమునురచియించియున్నాఁడు. కాని, పంతులవా రట్లుచేయక, ప్రత్యక్షమునందున్న లోహితాస్యునింజూచుచు వానింగూర్చియే వీరదాసుఁడు దుఃఖించుచున్నట్లు పద్యమును రచియించియున్నారు.

శంకరకవివిరచిత హరిశ్చంద్రోపాఖ్యానమునందలి యుత్తమోత్తమము లగుపద్యములలో నొక్కటి యగు

సీ. కుముదమిత్రోపల ♦ గోపురంబుల చేత
విద్రుమప్రాకార ♦ వితతి చేతఁ
మరకతహరినీల ♦ మండపంబుల చేత
బహుశాతకుంభకుం ♦ భముల చేతఁ
జాల దీపించు మౌ ♦ క్తికముగ్గుల చేతఁ
గనుపట్టుపట్టుమే ♦ ల్కట్ల చేతఁ
గమనీయపద్మరా ♦ గచ్ఛత్రముల చేత
వృషరాజకేతన ♦ శ్రేణి చేతఁ
మహితకర్పూరధూపధూ ♦ మముల చేత,
నవ్యమాణిక్యనీరాజ ♦ నముల చేత,
శంఖభేరీమృదంగఘో ♦ షముల చేత,
వెలయు నవ్విశ్వనాథుదే ♦ వళముఁ గాంచె.

అనుపద్యమునకు వీరేశలింగముపంతులుగారు, స్వభావోక్తులు విలసిల్లునట్లుగ,

ఉ. మేలిమిపైఁడిపూఁతలను ♦ మెచ్చులు గుల్కెడుచిత్రజంతులన్
జాలఁగ నొప్పి మిన్నలము ♦ చక్కనిగోపురమందు గుంపులై

చాలుఁగఁ బౌపురంబు లవె ♦ సందడిచేయఁగ విశ్వనాథుదే
వాలయ మాదెసన్ దవుల ♦ నల్లదె చూడ్కికి వేడ్కఁ గొల్పెఁ జుఁ.

అనుపద్యమును రచియించియున్నారు.

సముచితభావము అంతగా లేక, కఠినసంస్కృతపదభూయిష్ఠ మగు నతిదీర్ఘసమాసమును గలిగియుండునట్లుగ శంకరకవిరచియించిన,

మ. అకటా! చేరెడు నేలకుం దగఁడె? స ♦ ప్తాంభోధివేష్టితభవ
త్సకలద్వీపకలాపభూపమకుటాం ♦ చత్పద్మరాగోజ్జ్వల
ప్రకటానర్గళనిర్గళత్కిరణకుం ♦ భత్పాదుఁ డైనట్టిరా
జకుమారుం డని యేడ్చెఁ గన్నుఁగవ న ♦ శ్రుల్కాల్వలై పాఱఁగన్.

అనుపద్యమునకు, వీరేశలింగముపంతులుగారు, మంచిభావము నైదు గలిగియుండునట్లుగ,

చ. అకటకటా! కుమార! చతు ♦ రబ్ధిపరీతమహీతలం బకం
టకముగ నేలినట్టిప్రక ♦ టప్రతిభుం డగుచక్రవర్తిపు
త్రకునకు నీకుఁ బ్రేతవసు ♦ ధాస్థలిలోపల మూఁడుమూళ్ల నే
లకును ముహూర్తకాలము న ♦ లంతిస్వతంత్రత లేకపోయెనే?

అనుపద్యమును రచియించియున్నారు.

మొట్టమొదట నాయీవీరేశలింగకవిచరిత్రము ప్రకటింపఁబడిన 1894వ సంవత్సరముజూన్ నెలకుం దరువాతఁ జెన్నపురమునందలి యొకానొకపత్రికాధిపతిగారు, 1895వ సంవత్సరము డిసెంబరునెలలోఁ దమ మాసపత్రికారాజమునందు, „శంకానివర్తి,, యనుశీర్షికతో, „హరిశ్చంద్రునికథ, శంకరకవిచేఁ బద్యగద్యాత్మకంబుగను, రాయబహద్దరు వీరేశలింగముపంతులవారిచే నాటకరూపంబుగను, నాంధ్రంబున నొనర్పంబడియున్నది. ఈకావ్యద్వయమును, నందఱుచే నానందముతోఁ బఠింపఁబడుచువచ్చె. ఇట్లుండ వీనితారతమ్యనిర్ధారణము చేయవలయు ననుజిజ్ఞాస యిటీవలయొకరికిం బొడముటంబట్టి, వీరిరువురిలోఁ బ్రాచీనకవికంటె నాధునికకవియే శ్రేష్ఠుఁ డనునొకయభిప్రాయము ప్రచురింపఁబడియె. ఇది జరిగి కొన్నిమాసము లాయెను. ఆయభిప్రాయము నెవరు లక్ష్యింపరైరి. అదియు నందఱిచే విస్మృతమాయె. ఇట్లు తనంతట మాసిపోయినపక్షము నుద్దేశించి తద్వ్యతిరిక్తవాద మొకటి కొన్నిదినములకు ముందు వాకొనఁబడెను. తనపత్నిని విక్రయింప వారణాసీపణ్యవీథిం జేరినప్పుడు, హరిశ్చంద్రుఁ డాకాంతామణిరూపలావణ్యముల వర్ణించి సుగుణగణంబుల విడనాడినటుల శంకరకవి వర్ణించుట సందర్భవిరుద్ధ మని పూర్వపక్షము చేసి, యానారీమణిగుణములఁ బేర్కొనినట్లు వీరేశలింగముపంతులవా రొనర్చినది సమయోచిత మగు నని సిద్ధాంతీకరించినవారు ప్రథమపక్షమువారు. విక్రయమునకుఁ దేఁబడినపుడు, మైసొగసు వర్ణించుటచేఁ, గొనఁ గోరువారికి నాసక్తి యినుమడించుఁ గాన శంకరకవిమార్గమె ప్రశస్త మనువారు రెండవపక్షమువారు. ఇట్టిచర్చ ప్రయోజనహీన మగువితండావాద మని మాయభిప్రాయము. ఈరీతిని గ్రంథవివేచన చేయుట పండితమ్మన్యత్వమును, బహోభాగిత్వమును నిరూపించుటయే కాక వేఱుతీరు కా దని తెలియమికి మేము చింతించెదము. ఉభయపక్షములవారును గవియంతరంగమును దమబుద్ధిబలముచేఁ గనఁగోరుచున్నారు గాని వేఱు గాదు. వీరేశలింగముపంతులవారిపక్షము నవలంబించినవారు వారివిహితకోటిలోనివారైనను, నీయభిప్రాయము పంతులవారిదిగ నుండునెకో యనుశంకకు మే మొంతమాత్ర మవకాశ మొసంగఁ జాలము. * * * కవి (శంకరకవి) యొక్క ముఖ్యోద్దేశ మిదియె యనుటకు నాసందర్భమును జూడుఁడు.

ఎవరిని హరిశ్చంద్రుఁడు సంబోధించుచున్నాఁడు?

జారులను. దురాచారులను గాదు. సజ్జననుతకీర్తుల, గుణసాగరుల

ఎట్టిబుద్ధితో నాలకించుమనుచున్నాఁడు?

సమీచీనపదార్థమును సంపాదింప వలెనను స్వకార్యపరత్వముతోఁ గాదు. కృపామతితో

విక్రయ మేల చేసెద వనియె?

కేవలధనార్థివై గాదు. ద్రుహిణనిభుఁడగు గాధిపుత్రునకు ధాత్రి
దాన మిచ్చుటఁ జేసి.

వృథాగానా?

కాదు, మఖార్థము.

ఎట్టిమతితో నిచ్చెనవె?

ప్రేమన్.

* * * * *

వర్ణింపక యే వేద్యమగు దృగ్గోచరాంశమును వర్ణించుట యనౌచిత్యక మని వీరేశలింగముపంతులుగారు తలఁచి యుందురు. * *»

అని వ్రాసి, తాము ప్రథమపక్షమువారో, రెండవపక్షమువారో వెల్లడించుకొనక, శంకరకవికవిత్వమునందుఁ దమకుమాత్రమే యత్యంతాభిమానము గల దని లోకమునకుం దెలియఁ జేసికొని యున్నారు. హరిశ్చంద్రుఁడు, చంద్రమతిని విక్రయింపనారంభించినది కేవలధనార్థివై కాదఁట! ఆహా! చెన్నపురిపత్రికాధిపతిగారియుక్తిసామర్థ్యము!!

శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమునందలి,

గీ. జనుఁడు దంతావళము నెక్కి ♦ చాల నిక్కి
గగనతలమున కై రత్న ♦ మెగిరి పోవ
వైచినంతయుఁ బాడవు ద్ర ♦ వ్యంబుఁ దెచ్చి
రాశిగాఁ బోసి మా కిమ్ము ♦ రాజ గొనుము.

అనుపద్యమున కాపత్రికాధిపతిగా రర్థము నెట్లు చెప్పి, హరిశ్చంద్రుఁడు చంద్రమతి నమ్మఁ దలంచినది "కేవలధనార్థివైగా" దని యెట్లుసమర్థింపఁ జూచెదరో నే నూహింపఁజాలకున్నాను.



మఱియు,

మ. అతిసమానులు ద్రవిసు ♦ ధాంశుకులీనులు మన్మథద్విష
న్మిత్రనిభార్థవంతులు న ♦ మేయబలాఢ్యులు నైన బ్రాహ్మణ
క్షత్రియవైశ్యశూద్రకుల ♦ సంభవులార! మదీయభార్య స
త్పుత్రవతిన్ ధనార్థినయి ♦ పోకడఁ బెట్టెద రండు విల్వఁగన్.

అని శంకరకవి పద్యమును రచియించి, హరిశ్చంద్రుఁడు కేవలధనార్థియే యయి తనభార్యను జంద్రమతిని విక్రయింప సిద్ధపడినట్లు స్పష్టముగా భావమును వెల్లడించియున్నాఁడు.

పూర్వకవి యనుచక్కనియాధారముమీఁద నే తాఁ బట్టినకుందేటికి మూఁడే కాళ్లని వాదింపఁ జూచువారలవలె శంకరకవికవిత్వము సర్వవిధంబుల నిర్దుష్టమయిన దని వాదింప జూచుట వెడఁగుతనంబును, జడస్వభావము ననియే చెప్పవలసి యుండును. పూర్వకవికృతంబు లగు గ్రంథము లయినను, వర్తమానకవికృతగ్రంథము లయినను, ధారాళమగుకవితాప్రవాహమును గలిగి, నిర్దుష్టము లయి మనోహరంబులుగ నుండినచో నీర్ష్యామహాదేవతను దూరముగాఁ దోలఁగఁ ద్రోలి సంతోషమును వెల్లడించుటయే సజ్జనలక్షణంబుగదా! ఎట్టిగొప్పకవియైనను, భ్రమప్రమాదాదులు మానవప్రకృతిధర్మంబు లగుటం జేసి, భ్రమప్రమాదాదులకుం బాల్పడినను బాల్పడి యుండవచ్చును. అందులకుం దార్కాణంబుగ శంకరకవి, తనహరిశ్చంద్రోపాఖ్యానమునందు,

సీ. * * * * * *

తే. కాన వేగంబ నన్నుఁ గిం ♦ కరునిఁగాఁగ
వీటిలో నెవ్వరికి నైన ♦ విక్రయించి,
నిరవశేషంబుగా నప్పు ♦ నేఁటితోడ
నంతయును దీఱునంతద్ర ♦ వ్యంబుఁ గొనుము

శా. ఓరీ! మాల! దురాత్మ! నీమనములో ♦ నొక్కింతయుం శంక లే
కీరీతిన్ దురహంకృతిన్ బలుక నో ♦ రెట్లాడెరా? నీకు నా
హా! రాజీవసఖాన్వయున్ విలువ నీ ♦ వర్హుండవే? పొమ్ము; నన్
జేరన్ రాకుము మద్యపానకృతదు ♦ శ్చేష్టావికారంబునన్.

మ. మును నాతోడుత నీవుపల్కినక్రమం ♦ బుం గాదె? భూపాల! యె
వ్వనికైనన్ నను విక్రయింపు మని గ ♦ ర్వస్ఫూర్తి వర్జించి నీ
వన వే యీగతి నేటికిన్ దిరుగ స ♦ త్యప్రౌఢిం బోనాడి యీ
తని హీనుం డని మాటిమాటికిని నిం ♦ దల్పల్క నీ కేటికిన్?

క. జననీజనకులు సత్యం
బును సుజ్ఞానంబు వినయ ♦ మును ధైర్యంబున్
దనయుఁడు మిత్రుండును నా
కనుజుఁడు సుకృతంబు శాంతి ♦ యాలు దలంపన్.

అని పరస్పరవిరుద్ధభావములను వెల్లడించి, సత్యమునుగాని, సుజ్ఞానంబుగాని, వినయముగాని, శాంతిగాని, యేలోకంబునను గానరాకుండునట్లుగ హరిశ్చంద్రుని పాత్రమును బ్రదర్శించి యున్నాఁడు. ఇప్పుడు, "ప్రాచీనకవికంటె నాధునికకవియే శ్రేష్ఠుఁ డనుసభిప్రాయము నెవరు లక్ష్యింపరైరి.," యని వ్రాసినచతుర్భాషావిశారదులు, నిరుపమానవిమర్శన సామర్థ్యసంపన్నులు, చెన్నపురిపత్రికాధిపతు లెట్లు తమవాదమును సమర్థింపసాహసించెదరో చూచెదముగాక! సంస్కారజ్ఞానావృతమనస్కులగువీరేశలింగముపంతులుగారు, జపతపాదులనుగూర్చియును, మౌనులనఁబడెడువారలనుగూర్చియును, దమకుం గలయుద్దేశములను, దమసత్యహరిశ్చంద్రనాటకమునందుఁ గవితారచన యనర్గళధారగాఁ బ్రవహించునట్లు, మొత్తముమీఁదసందర్భశుద్ధి చెడకుండునట్లుగ,

చ. అరయఁగ నంతరాత్మను దు ♦ రాగ్రహపాపమునుండి పాపి సు
స్థిరమతి నిష్కళంకముల ♦ జేసిన గాక, జపంబు, వల్కలాం
బరములు, మౌనముల్, జడలు, ♦ వహ్నులుఁ, గృష్ణమృగాజినంబులున్,
బురుషుఁ దపస్విఁ జేయునె? స ♦ మూలముమమ్మగుఁగాక యన్నియున్.

ఉ. కానల నుంట నిష్ఫలము ♦ గాఁ జను నింద్రియనిగ్రహంబు లే
దేని; మనుష్యుఁ డింట వసి ♦ యించియు నింద్రియనిగ్రహం బొగిన్
దా నొనరించు నేని, సత ♦ తంబును సత్ఫల మొందు; శాంతుఁడౌ
మానవుఁ డెందు నున్న నిను ♦ మా యదె యాశ్రమరాజమౌఁజుమీ!

చ. ఒనరుగృహాదిభోగములు ♦ యోగము లే? వ్రతివృత్తి వ్రేల్ప నిం
ధనములె యాధనంబులు? ర ♦ ణన్మణిభూషలు వేదఘోష లే?
మొనసినపూవుఁదోటలు త ♦ పోవనవాటులె? రాజ్య మాజ్యమే?
మునికి నివేల భూవిభవ ♦ ముల్? వెతపెట్టఁగఁగాక సాధులన్.

అనుపద్యములను హృదయరంజకంబుగ రచియించి, వెల్లడించియున్నారు. కాని, వీరెంతసంస్కారజ్ఞానాభిలాషు లయినను, దమనాటకమునందుఁ బంచమాంకమునందు, స్వామికార్యమును నిర్వహించునుద్దేశముతో, వధ్యశిల నధిరోహించియున్న తనప్రాణనాయికను జంద్రమతిని గనికరమునంజూడక, శిరంబు తెగవ్రేయ నున్నహరిశ్చంద్రునకుఁ బ్రదక్షిణము చేసి, "జన్మాంతరములున్నచో, నాకు జన్మజన్మములయందును సత్యశీలుఁడైనయీహరిశ్చంద్రనృపాలుఁడే భర్త యగునట్లు ప్రసాదింపుము" అని చంద్రమతి జన్మాంతరములంగూర్చి సంశయించుచున్నట్లు సమయానుచితంబుగ వ్రాయుటమాత్రము సమంజసంబుగ నుండలేదని తలంచుచున్నాఁడను. ఈకథాభాగమునందే, శంకరకవి,

తే. నిఖిలలోకైకవంద్య! యో ♦ నీరజాప్త!
నాకుఁ గృపతోడ జన్మజ ♦ న్మములయందు
సత్యసంశీలుఁ డగుహరి ♦ శ్చంద్రనృపతిఁ
బ్రాణనాయకుఁగా నొన ♦ ర్పంగవలయు.

అని చంద్రమతికి జన్మాంతరములయందు లేశమును సంశయము లేనట్లుగఁ జంద్రమతిపాత్రంబు నెంతయు సమంజసంబుగ నుండునట్లు వ్రాసియున్నాఁడు.

ఎట్టులైనను బంతులవా రింతగ్రంథమునించుమించుగ ముప్పదియైదుదినములలో రచియించినా రనుసంగతియటుండనిచ్చి యాద్యంతమువఱ కొక్కతెరంగున నిట్లుసుబోధక మగు సులభశైలిని గలిగియుండి, ధారాళ మగుకవితాధోరణిం గలిగి యిట్లనితప్రపంచకజ్ఞానమును వెల్లడించునట్లు గ్రంథమును రచియించుటమాత్రము వర్తమానమునందెన్నిక గాంచుచున్నకవులమనుకొనువారలలో నెవ్వరికిని సులభసాధ్యముగా నేర దని నేను దృఢముగాఁ జెప్పఁగలను.

హరిశ్చంద్రుడు, నిజసతీలలామంబగు చంద్రమతిని విక్రయించుసందర్భంబున, శంకరకవి,

“పూవుగుత్తులతోడ ♦ బోరాడ నోపువ
క్షోజముల్ గలమృగ ♦ రాజమధ్యఁ
గోదమతుమ్మెదలకుఁ ♦ గోద ఘటింపఁగఁజాలు
కుంతలంబులుగల ♦ గురునితంబ”

అని సమయానుచితంబుగ నుండునట్లు చంద్రమతిని వర్ణించుట యనుచితం బని తలంచియే వీరేశలింగముపంతులగారు సౌందర్యాది దృగ్గోచరాంశములను వర్ణింపక విడిచిపెట్టి చంద్రమతియొక్కసుగుణగణంబులును వర్ణించుట యెంతయు సముచితంబుగ నున్నదని చెప్పవలసి యున్నది. వీరేశలింగముపంతులుగారియట్టియుద్దేశములను జక్కఁగా గ్రహించియే యాచెన్నపురిపత్రికాధిపతిగారు వర్ణింపకయే వేద్య మగుదృగ్గోచరాంశములను వర్ణించుట యనావశ్యకమని వీరేశలింగముపంతులుగారు తలంచియుందురు,, అని వ్రాసి తమకుం గలబుద్ధికౌశలమును వెల్లడించుకొనియున్నారు.



గ్రంథమాధుర్యమునంతయు నింతింతనరాని యోపికతోడం జవిఁజూచిననాకింకను విశ్రామంబుపయి మనసుపోకయున్నను, గ్రంథవిస్తరభీతిచే నింకనీతిగుంభితములును హృద్యంబులునయి వేద్యప్రధానములగు పద్యములనుగొన్నిఁటిని మాత్రమిట నుదహరించి యిందెల్లెడ ధారాళంబుగఁ బద్యములను గుప్పించినపంతులవారి యనర్గళకవితా ధారను వెల్లడించు స్వకపోలకల్పితంబని చెప్పనొప్పు నీనాటకరత్నముంగూర్చినసంగతినంతయు నింతటితో ముగించెదను.

చ. సిరులుతొలంగినన్ సఖులు ♦ చేరరు చేరవరారు బంధువుల్
కరముఁ దిరస్కరించుఁ గుల ♦ కాంతయు లోకులు సద్గుణంబులన్
సొరిదిని దుర్గుణంబులుగ ♦ జూతురుఁ పేదరికంబుకంటెఁ దా
మరణమె శ్రేయ మంచుఁ బలు ♦ మాఱును నేమదిలోఁ దలంచెదన్.

చ. తనకుపకారమున్ సలుపు ♦ దాత యెడం గరముం గృతఘ్నుఁడై
ముని యతఁ డెగ్గుచేసినను ♦ భూమిపయిం గడుడస్సి యాఁకటన్
వనరుచుఁ జెట్టుచేరజని ♦ బాగుగ నీడను విశ్రమించి పం
డ్లను దిని యమ్మహీజ మొక ♦ టం దెగఁగొట్టు కిరాతుఁబోలఁడే.

చ. వినుము ధనంబు భీరులను ♦ వీరులుగాఁగను దోపఁ జేసెడున్
ఘనతరబుద్ధిమంతులుగఁ ♦ గన్పడఁజేయును బుద్ధిహీనులన్
బనుపడఁ దోపఁజేయు గుణ ♦ వంతులగా గుణహీనులన్ సదా
జనులను మోసపుచ్చి ధన ♦ సంపద చిత్తము మత్తుగొల్పెడున్.

చ. కొందఱు యాచకాధములు ♦ క్రూరముఖస్తుతి కుబ్బి యీవిచే
ముందట నేమొముక్తితముఁ ♦ బొందెదమన్ భ్రమ దాతలంచుఁ బే
రందఁగ నాలుబిడ్డల గృ ♦ హంబున నంగదఁ బెట్టిదానముల్
క్రందుగఁ జేయుచుందుదురు; ♦ కారె కిరాతకు లట్టివా రిలన్?

ఉ. నీతికి హేమభూషణమ ♦ ణిప్రకరంబుల వన్నె రా దిలన్
నీతికి వన్నె పోదు ధర ♦ ణిన్ వెలిమాలినచింపిగుడ్డలన్
నీతికిగౌరవం బెపుడు ♦ నిల్చుఁజుమీ సహజంబుగానె వి
ఖ్యాతిగ నీతివర్తనము ♦ నందఱు మానక యుండఁగావలెన్

గీ. దుష్టు లిద్దఱు తమలోన ♦ దొమ్ములాడి
సాధుజనులకు మహిఁగీడు ♦ సలుపునట్లె
యెండుమ్రోడులు రాచుకొం ♦ చిచ్చు వహ్నిఁ
గలుగఁ జేసి వనం బెల్లఁ ♦ గాల్పఁదొడఁగు.

గీ. చిన్న సూది బెజ్జంబంత ♦ చిల్లియున్నఁ
గడవెడుజలంబుఁ గ్రమముగాఁ ♦ గాఱునట్లె
పాపమున కింత యెడసందు ♦ వదలు నెడల
సర్వపుణ్యముల్ క్రమముగా సమసిపోవు.

ఇట్టిమనోహరము లగునీతిబోధకజ్ఞానదాయకపద్యరత్నములను రచియింపఁ జేయఁ గలశాంతమనోబలమును గలిగి యున్నకాలమునందిక్కవి యీక్రిందిపటమునఁ జూపఁబడినరీతినుండియుండెను.



K. Veeresalingam



తరువాత సీ1888వసంవత్సరమునందు "వ్యవహారధర్మబోధిని, రెండవసారిముద్రింపఁబడినది. ఇంచుమించుగా నేఁబదిపుటలనుగలిగిన యీవ్యవహారధర్మబోధిని నైదంకములుగ విభజింపఁబడి యున్నది; న్యాయవాదులనఁబడెడువారల యొక్కయు, నుద్యోగస్థుల యొక్కయు నక్రమము లిందుఁ జక్కగ వెల్లడింపఁబడినవి; జనసామాన్యమునం దండఱీవ్యవహారధర్మబోధినిని "ప్లీడరునాటక,, మనివ్యవహరించు చుందురు. దీనిని సావకాశంబుగఁ జదువువారలకు వీరేశలింగముపంతులువారించు మించుగనిరువది యిరువదియైదుసంవత్సరముల ప్రాయమునందున్న కాలమునుండియుఁ బాఠశాలలయం దుపాధ్యాయులుగనే యుండియున్నను నిట్లింతవిశేషముగా వ్యవహారధర్మములను గుఱించి స్వానుభవమును వెల్లడించునట్లు వ్యవహారాంశములనువెల్లడించుటంజూడ నయ్యది యత్యంతాశ్చర్యజనకంబుగ నుండక మానదు. న్యాయసభలలోనివ్యవహారముల నెఱుంగఁ దలంపుగలవార లీవ్యవహారధర్మబోధినిని జదివి చూచినచో నయ్యవి వారలకు సులభముగా బోధపడక మానవు.

ఈసంవత్సరమునందే, మొట్టమొదట శ్రీవివేకవర్ధని పత్రికయం దప్పుడప్పుడు ప్రచురింపఁబడుచువచ్చిన వినోదకరంబుగానుండు సంభాషణములఁగొన్నిటిని హాస్యసంజీవని మొదటిభాగమునుగ బ్రచురించియున్నారు. ఈమొదటిభాగమునందు వినోదతరంగిణి, ఆచారము, అపాత్రదానము, గురుశుశ్రూష, పెళ్ళివెళ్ళినరువాత పెద్దవెళ్ళి, ఉన్మత్తప్రలాపము, గ్రహణములు, యోగ్యాయోగ్యవిచారము, వర్షము, హిందూమహాజనులమతసభ, శకునములు, దురాచారదూషణము, నవనాగరికులు, లోకోత్తరవివాహము, అను హాస్యసంభాషణములు గానవచ్చుచున్నవి; ఈప్రథమభాగముయొక్క మొదటికూర్పుప్రతులన్నియు గొలదికాలములోననె విక్రయింపఁబడియుండుటం జేసి యీప్రథమభాగము 1891వ సంవత్సరమునందు మఱల ముద్రింపఁబడినది; ఇట్లు 1891వ

సంవత్సరమునందు రెండవభాగము ముద్రింపఁబడినది. ఈద్వితీయ భాగమునందు రోగచికిత్స, మూఢభార్య—మంచి మగఁడు, శిశుపోషణము, కులాభిమానము, వసూళ్ళు, వేశ్యావిషయసంవాదము, నాడులభేదము—విద్వత్సభ, స్వర్గలోకసుఖము, చంద్రగ్రహణము—తేలుమంత్రము, నారదసందర్శనము, యజ్ఞప్రయత్నము, జమీందారీధర్మఖర్చు, హిందూవివాహములు, వినాయకచతుర్థి, అంత్యపుష్కరమాహాత్మ్యము, జమాబందీ, గొట్టాలమ్మసభ, బహుభార్యాత్వము, అనువిషయములనుగూర్చినహాస్యసంభాషణలు గానఁబడుచున్నవి. హాస్యసంజీవనులను వ్రాయుటయందు నిరుపమాన సామర్థ్యముగలవారని యాంధ్రప్రపంచమునందంతటను సుప్రసిద్ధినిగాంచిన వీరేశలింగముపంతులవారియీ హాస్యసంజీవనులంగూర్చి నేనిప్పుడు శ్లాఘింపవలసిన యావశ్యకము లేదు. ఈహాస్యసంజీవనులంజదువువారలకు విశేషముగా లోకానుభవముగలుగకమానదు. పుస్తకరూపంబుగఁ బ్రచురింపఁబడక మిగిలిన హాస్యసంజీవనులను మఱికొన్ని భాగంబులుగఁ బ్రచురించినచో నయ్యవి చదువరులకు జ్ఞానదాయకంబులుగను నానందజనకంబులుగను నుండకమానవనుతలంపుతో నవి యెల్లను జాలవఱకు మొదటిసంపుటమునందుఁ బ్రకటింపఁబడి యున్నవి.

తరువాత మన తెనుఁగుభాషయందుఁ బ్రకృతిశాస్త్రములు లేని లోపమువిస్తారముగానున్నందున, దానింగొంతవఱకు నివారించుటకయి శారీరశాస్త్రసంగ్రహమును మొట్టమొదట బ్రచురించి యున్నారు. వీరు మొదట పదార్థవివేచకశాస్త్రమును ప్రశ్నోత్తరరూపమున తెనిఁగించి ప్రచురించుచుండఁగా నాకాలమునం దీపట్టణములోనుండిన "కులాచారసంస్కరణ సమాజమువా" రాపనినిమఱియొకరికి నిర్ణయించి శారీరశాస్త్రమును తెనిఁగింపుడనివీరినికోరిరి. వారికోరికననుసరించి యింగ్లీషుభాషలోని శారీరశాస్త్రములను పెక్కింటినిజదివి, తాళపత్రలిఖితములగు హిందూ శారీరశాస్త్ర గ్రంథములను గొన్నింటిని బరిశీలించి చూచి, యీశారీరశాస్త్రసంగ్రహమును రచియించి. ప్రచురించి యున్నారు. ఇయ్యది, అస్థివివరణము, కండరవివరణము, నాడీవివరణము, రక్తవివరణము, శ్వాసాశయవివరణము జీర్ణసాధనవివరణము, స్వీకారిబహిష్కార్యవయవవివరణము, జ్ఞానేంద్రియవివరణమునని యెనిమిదిప్రకరణములుగ విభజింపఁబడియున్నయది. ఇందెనిమిదవప్రకరణంబునఁజివర "పారిభాషికపదానుక్రమణిక" యని యింగ్లీషుపదములకు తెనుఁగు వ్రాయఁబడియున్నది. ఇందిప్పుడేఁబది మూడు పటములు ముద్రింపఁబడినవి. ఇయ్యది యెంతసులభశైలిని వ్రాయఁబడి యున్నదియును జదువరులందఱెఱింగియేయుందురు. ఇట్లుప్రకృతిశాస్త్రములను రచియించువారలకు విద్యాశాఖవారుతగినప్రోత్సాహము నీయకుండినందులకు మనమెంతయు చింతింపవలసియేయున్నను, జనసామాన్యము గ్రంథకర్తకుందగిన ప్రోత్సాహమును గలుగఁజేసినందులకు మనమెంతయు సంతసింపవలసియున్నది.

ఇదియేప్రకారముగాఁ దొమ్మిదిప్రకరణంబులు గలిగియుండువట్లుగ నఱువదియొక్కపటములతో "జ్యోతిశ్శాస్త్రసంగ్రహము", ను, బ్రకటించియున్నారు. ఇందును, జిట్టచివరఁ బారిభాషికపదానుక్రమణిక చేర్పఁబడియున్నది. సంగ్రహమని వ్రాయఁబడి యున్నను, జాలవఱకు విపులముగనే యుండునట్లువ్రాయఁబడిన యీగ్రంథమునందు, సాధ్యమయినంతవఱకుఁ బారిభాషికపదములనువిడిచి సర్వజనులకును సులభముగానుండునట్లు సులభశైలినే యుపయోగించియున్నారు. ఈశాస్త్రజ్ఞానమువ్యాపించినపక్షమున జనులలోఁ జిరకాలమునుండి వచ్చుచున్న మూఢవిశ్వాసములనేకములు తొలఁగిపోక మానవని నిస్సంశయముగాఁ జెప్పవలసియున్నది. ఆంధ్రభాషాభిమానులును, ముఖ్యముగా విద్యాశాఖవారునిట్టి ప్రకృతిశాస్త్రగ్రంథములంగొనుచును బాఠశాలలలో నుపయోగింప నాజ్ఞయొసంగుచుండుటచేతనే వీరికెంతయుఁబ్రోత్సాహము

గలిగి, "జంతుస్వభావచరిత్రము" ను వ్రాయనారంభించి యందు మొదటి భాగమునందుఁ జాలభాగమును ముగించియున్నారు. ఈజంతుస్వభావచరిత్రమునం దిప్పటికి, డెబ్బదిరెండుపటములు ముద్రింపఁబడి యున్నవి. మనోహరమగుశైలిని రచియింపఁబడిన యీచరిత్రమును బాఠశాలలలోని క్రిందితరగతులలో నుపయోగింపఁబడునట్లు విద్యాశాఖవారు నిర్ణయించినచో, బాలురకుజంతుస్వభావము హృదయాహ్లాదకరంబుగ బోధపడుటయే కాక, చక్కనివచనరచనయునలవడునని నిశ్చయముగాఁ జెప్పవలసియున్నది. ఈగ్రంథకర్తగారు తాముపడినశ్రమకుం దగినంత ప్రోత్సాహము లేకపోవుటచేతనే తరువాత నిట్టిప్రకృతిశాస్త్రగ్రంథములను వ్రాయుటమానుకొనిరని సంతాపకరంబుగఁ జెప్పవలసియున్నది.

* * * * *

స్త్రీపునర్వివాహ విషయములయందును దదితరవిషయములయందును వీరికి విశేషముగా సహాయులుగానుండి, మరణపర్యంతమును మతబహిష్కృతులయి స్త్రీపునర్వివాహసమాజముననే యుండియున్న బసవరాజు గవర్రాజుగారు 1888వసంవత్సరము జూలయినెల 16 వ తేదీని కాలవశులయిరి. గవర్రాజుగారి యీయకాలమరణము. వీరేశలింగము పంతులవారి కొకగొప్పనష్ట మనియు, నత్యంతనిరుత్సాహకర మయినదనియును ముమ్మాటికిఁ జెప్పవలసియున్నది. గవర్రాజుగారియెడల వారిమిత్రుల కందఱకును గలిగిన కృతజ్ఞతను, మిత్రవాత్సల్యమును వెల్లడించుటకై యిటీవల వీరేశలింగముపంతులవారు స్వంతధనమునఁగట్టించిన యిక్కడి పట్టణమందిరమున గవర్రాజుగారి పటమునుంచిరి. ఈ1888వసంవత్సరము ఆగష్టునెల 5వతేదీని మహారాజులంగారి బాలికాపాఠశాలయందు జరిగినమహాసభయందు గవర్రాజు గారినిగూర్చి వీరేశలింగముపంతులవారొకయుపన్యాసము నొసంగియున్నారు. గవర్రాజుగారి యీసూక్ష్మచరిత్రమును జూచువారల కందఱకును వీరేశలింగము పంతులవారికిని గవర్రాజుగారికిని గలమైత్రి వెల్లడిగాక మానదు. గవర్రాజుగారి యెడల వీరి కెంతమిత్రవాత్సల్యము గలిగియున్నదియు వీరల కెంతకృతజ్ఞతాస్వభావము గలిగి యున్నదియును, నేఁటికిరమారమి యిరువదియైదుసంవత్సరములక్రిందటనగా 1885వసంవత్సరము జూను నెల 9వతేదీని చెన్నపురమునందలి బాబూబాలికాపాఠశాలామందిరమున నొసంగఁబడిన "రాజమహేంద్రవర స్త్రీ పునర్వివాహచరిత్రము" నందలి,

"నాకు మొదటినుండియు పరమాప్తుఁడయి యొక్క యీకార్యమునందుమాత్రమే కాక దేశక్షేమమునిమిత్తమయి నేను చేయఁదలపెట్టిన మంచికార్యములలో నెల్లను నాకు కుడిబుజమయియుండి, పైకి పేరు నాదైనను చాటుననాకంటెను బహుగుణము లధికముగా పనిచేయుచు వచ్చుచున్నబసవరాజగవర్రాజుగారి సాహసచరిత్రమునిచ్చట ముఖ్యముగా శ్లాఘింపవలసియున్నది. పదిమందియొక్కసారిగా లోకాంతరగతులైనప్పుడు పుట్టునంత సంక్షోభము ఈవివాహదినమున వారియింటపుట్టినది. భార్యవంకవారును తనవంకవారునైన బంధువులనేకు లొక్కసారిగా గొల్లునగోలపెట్టి మధ్యాహ్నసమయమున మృతునినిమిత్తమై యేడ్చునట్లేడ్చుచు శపించుచు లేచి పోయిరి. తల్లిదండ్రులు చిన్నతనములోపోయినప్పటినుండియు పెంచిపెద్దవానినిచేసిన పెద్దతల్లి తన్ను విడిచిపోయినను సహించుకొనియుండి భార్యదీర్ఘవ్యాధిచేత బహుమాసములు మంచమెక్కియుండి బంధువులురాక బహుబాధలు తటస్థించినను ప్రాయశ్చిత్తమన్న పేరునయినతలపెట్టక ఈదినమువఱకును పరోపకారకరమయిన యీకార్యము నిమిత్తము వ్యయప్రయాసములను సంతోషపూర్వకముగా వహించుచున్న యీనామిత్రుని నేనెట్లు శ్లాఘింపవలయు

న్నో నే నెఱుఁగకున్నాను.'' అనుదానిం గాంచిన వారలకు బోధపడక మానదు.

ఈగవరాజుగారి చిత్రపటము 1892వ సంవత్సరము జనవరినెల 13వ తేది బుధవారమునాఁడు సాయంకాలమయిదుగంటలవేళ నెల్లవారికిని బహిరంగముగాఁ బ్రదర్శింపఁబడి, యిక్కడి పట్టణమందిరమునం దుంచఁబడినది. ఆసమయమునం దీపట్టణములో ముఖ్యులుగానున్న తగుమనుష్యులందఱు విజయముచేసిరి. అప్పుడిక్కడి రాజకీయశాస్త్రపాఠశాలకుఁ బ్రధానోపాధ్యాయులయిన ఇ. పి. మెట్కాఫ్‌దొరగా రగ్రాసనాసీనులయిరి. గవరాజుగారి చిత్రపటమును దెప్పించుటకయి యేర్పడినసభకుం గార్యదర్శులయిన న్యాపతి సుబ్బారావుపంతులుగారు మొట్టమొదట లేచి, యీపట్టణమునందు గవరాజుగారిస్మరణమును స్థిరపఱుచుటకయి యీయనమిత్రులును, బరిచితులును జందా వేసిన విధమును గూర్చియు, వేయఁబడినచందా మొత్తము మొదలయినవానినిగూర్చియు, చిత్రపటమునకయిన వ్యయములనుగూర్చియుఁ గొంత చెప్పిరి. పిమ్మట, మెట్కాఫ్‌దొరగారు, గంభీరభాషణములతో గవరాజుగారి సత్యప్రియత్వాది సద్గుణములనుగూర్చియు, సత్కార్యాచరణమునం దాయన చూపిన ధైర్యసాహసాదులనుగూర్చియు, స్త్రీపునర్వివాహప్రవర్తకవిషయమున పడినప్రయాసమునుగూర్చియుఁ, గొంతప్రశంసించి, యీయనవలె నెల్లవారును బ్రవర్తింపఁ బ్రయత్నింపవలయుననియుఁ, బురజనులు సద్వర్తనమును గౌరవించుటకయి చేసిన యీకార్యమం దెల్లవారును యోగ్యమయినసడవడి గలవారుగానుండునట్లు చేయుటకు ప్రోత్సాహకరముగా నుండుననియు మొదలగుసంగతులతోఁ జక్కఁగానుపన్యసించి పటము తెరతీసి, యందఱకును జూపిరి. అప్పుడుచూచినవా రందఱును రూపమును సరిగా వ్రాసిన చిత్రకారుని నేర్పునకు సంతోషించి మిక్కిలి శ్లాఘించిరి.



అటుపిమ్మట నిక్కడి రాజకీయశాస్త్రపాఠశాలయందే యుపాధ్యాయులుగానుండి పేరుగాంచుచుండిన వావిలాల వాసుదేవశాస్త్రిగారు లేచి, తామురచియించి తెచ్చిన,

క. శ్రీజగదండవిధాయక,
పూజితనిజమహిమ ♦ సకలపుణ్యహృదయ, నా
నాజంతుతరణ ♦ సతతస
భాజన, రక్షింపుమీ ♦ సభాజనుల సదా.

క. శ్రీమహారాజ్ఞీ రా
జ్ఞీహైందవచక్రవర్తి ♦ నీవిక్టోర్యా
మోహితశాత్రవసైన్యస
మూహా! జేజీయతామ్ సము ♦ జ్జ్వలకీర్తి!

సీ. రాజరాజనరేంద్రు ♦ రాజధానియయిన
రాజమహేంద్రవ ♦ రంబునందు
సామంతరాజులై ♦ భూమిపాలించిన
విప్రవంశముతోడ ♦ వియ్యమంది
యసమానయశముతోఁ ♦ బసమీఱుచుండిన
బసవరాజమహాన్వ ♦ వాయమందు
జనియించి బాల్యాన ♦ జననీజనకులను
గోల్పోయి పెత్తండ్రి ♦ కూర్మిఁ బెంప
మెప్పు లందుచుఁ జదువులో ♦ మెఱుఁగు వడసి
దక్షులై రి ప్రవేశప ♦ రీక్షలోన,
నాంగిరసవత్సరంబున ♦ నౌర! యెదటి
ప్రతిమలో నున్న శ్రీగవ ♦ రాజుగారు.

క. ఎల్లరు సంతసపడఁగా
ఫెల్లన మెట్కాఫుగారు ♦ వేంచేసిరిగా

జిల్లాస్కూల్ బలపడియెను
చెల్లి గవర్రాజు మీఁది ♦ చెట్టందుకొనెన్.

గీ. బుద్ధివైశద్యమున గురు ♦ బోధఁ దెలిసి,
హూణమాంధ్రము కడుశ్రద్ధ ♦ పూని చదివి,
మొదటి తేఁపను దేరిన ♦ మువ్వురందు
గురులమనసున కెక్కెను ♦ గుణయుతు మీఱి.

గీ. పౌరపాఠశాలఁ ♦ బ్రథమబోధగఁ జేర్చి
కుప్పుసామిశాస్త్రి ♦ గొప్ప చేయ,
నార్జనంబుచేసి, ♦ యధ్యాపకఖ్యాతి
సకలకలలు నేర్చి ♦ జాడ లరసె.

క. పట్టపరీక్షకుఁ జదు వీ
పట్టణమున నెలకొనంగ ♦ వడివడిగాఁ దా
నెట్టైనఁ జదివి తుదకును
పట్టార్హపరీక్షఁ దేలి ♦ బహుమతి వడసెన్.

గీ. కతిపయాబ్దములకుఁ ♦ గాలేజిలోఁ బని
మాని ప్రాడ్వివాక ♦ మహిమఁ జెంది
న్యాయవాదిపదము ♦ నంది నేల గడించి
చిన్నవయసునందె ♦ చేరె దివము.

క. పరలోక మందినావే?
చిరకాలమ్మునందునుండి ♦ చేసిన స్నేహం
బరుదుగఁ దెగఁ గోయుచు, నో
కరుణాళూ! బసవరాజు ♦ గౌరీరాజా!

క. కరుణాళుఁడ వనఁ దగదే?
నిరతము హీనావయవుల ♦ నిర్నిద్రంబా



కరుణంబునఁ బ్రోచినస
ద్గరిమకు నో బసవరాజు ♦ గౌరీరాజా!

క. సరియేరీ నీ కిల వా
గ్విరచనమునఁ బౌరసౌఖ్య ♦ ప్రకరణమందున్
గురుసత్యవితరణంబునఁ
గరుణాళూ! బసవరాజు ♦ గౌరీరాజా!

ఉత్సాహ.

బసవరాజవంశభూష! ♦ బంధువారపోషకా!
అసదృశంపుసారవాక్య ♦ యచ్చితాంతరాత్మకా!
గ్రసితవైరిభావ విహిత ♦ గౌరిరాజనామకా!
అసము డించి వసముగాక ♦ యన్యలోక మేగితే?

క. అటుకనుమూసినమిత్రుని
నిటువిజ్ఞానంపుమహిమ ♦ నీసభలోనం
దిటముగ నిల్పం గంటివి
పటుమా! నీపుణ్య మిపుడు ♦ వశమా పొగడన్?

గీ. అన్నిఁటిని మాయచేయంగ ♦ నందె వైచి,
యున్న కాలము చెలియాపు ♦ మన్ను చేయు
కుండ, శాశ్వతపటిచిన ♦ పండితులకు,
వినతి చేసెద నిదిగో నే ♦ వినయమునను.

గీ. కరుణ శాస్త్రులగార్ నను ♦ స్కూల, మంచు
బావిలో మాటవలె నన్నుఁ ♦ బల్కరించి,
నాఁడు మన్నించితివి కృత ♦ జ్ఞత యెలర్ప,
నేఁటి కిదె తీర్చికొంటిని ♦ నీఋణంబు.

సీసమాలిక.

నీబుద్ధివిశదమ ♦ నేఁబరీక్షాప్రశ్న
లిచ్చి దిద్దిననాఁడె ♦ యెఱుకపడియెఁ;

అనృతంబుపై నుప ♦ న్యాస మిచ్చిననాఁడె
నీసత్యవృత్తి కు ♦ ల్లాసపడితి;
నీసరి లేక నా ♦ నాసమాజములందుఁ
బల్కరింపఁగ వచః ♦ పటిమ దెలిసె;
దక్షత చెడినబాం ♦ ధవపోషణముగుండ
నీదయావాసనల్ ♦ నివ్వటిల్లె;
వినయమింగల్గిన ♦ విద్య నీ వున్నప్డు
తొంగిచూచుచుఁ దాఁ ద ♦ అంగలించె;
కాంతానురక్తులు ♦ కపటస్వభావులు
నీకంటెఁ బడఁగఁ జే ♦ కాకుపడిరి;
స్థిరమతి ద్రెక్కొల్పె ♦ స్త్రీపునరుద్వాహ
స్వార్థాభిమానంబు ♦ సర్వదిశలఁ;
మిత్రాపదలు మాన్ప ♦ నాత్రంపడుటచూచి,
నీజాలిగుండె వ ♦ ర్ణింపఁ గంటి;
ఉన్నతోద్యోగంబు ♦ లొంద రాజాజ్ఞగా,
నీవంశమర్యాద ♦ నెఱి వహించె;
గునుపూరు వంగోలు ♦ చననెల్లబాళ్లల్ల
నభిజనంబులచెల్మి ♦ యందుకొనియె;
సంవత్సరాది వి ♦ జయదశములకొల్ల
దీనవాత్సల్యంబు ♦ తేటపఱచె;
నీపోలికలబొమ్మ ♦ నేపార వెలయించు
నేటిసంబరములు ♦ నిన్నుఁ దెలిపె;
మంచితనం బెప్డు ♦ మరణంబునం జూడ
వలె నన్నమాట నీ ♦ వలన నిలిచె;



నీగురుభక్తికి ♦ నేఁటిసభాపతుల్
మెట్కాఫుమిత్రులే ♦ మేటిసాక్షి;
నీనిగర్వశిరోమ ♦ ణిత్వ మీచేసేఁత
నకసా వెలింగించె ♦ బ్రకటితముగ;

మిత్రుఁడా! నీవు సమయాన ♦ మేలు చేసి,
నన్ను బ్రతికించినందుకై ♦ నాదుపర్వ
నిల్పినందుకై యీసభ ♦ నిలిచి, నేను
నీసుగుణములు చాటితి ♦ నీసు లేక.

అనుపద్యముల నాసభకు వచ్చినసర్వజనులకును జాలిపుట్టునట్లుగాఁ జదివిరి.

తరువాత, నిక్కడిమహారాజశ్రీ చిలంబి ఆదినారాయణప్పనాయుఁడుగారు,

గీ. బసవరాజవంశ ♦ పావనుఁ డకలంక
మానసుండు సుజన ♦ మాననీయుఁ
డనుపమానసద్గు ♦ ణాన్వితుఁ డనఘుండు
గౌరవాధికుండు ♦ గౌరరాజు,

గీ. ఇట్టిసన్మిత్రసందర్శ ♦ నేచ్ఛ గలుగు
జనులహృదయాంతరంబులు ♦ జల్లనంగఁ
గన్ను లలరంగ సంపూర్ణ ♦ కళ చెలంగఁ
బలుతెఱంగులగంగుల ♦ పటము తెనరు.

క. ఈపోయినమిత్రునిస
ద్రూపాకల్పేరుచిత్ర ♦ రూపం బిదియా
రూపింపఁగ నీపురుషునిఁ
జూపఁ దునక చంద నీకుఁ ♦ బాడియె? దేవా!

ఆ. తిరిగి బ్రతికివచ్చి ♦ తే? మిత్రరత్నమా!
యనెడుభ్రాంతి మనసు ♦ లందుఁ గలుగ
నిట్లు నిర్మితమయి ♦ యీప్రతిబింబంబు
లలితమందిరము న ♦ లంకరించె.

అనుపద్యములను జదివి; తమకుఁ గలకృతజ్ఞతామాత్రభావములను వెల్లడించియున్నారు.

* * * * *

ఒక్కయీస్త్రీపునర్వివాహకార్యములందు మాత్రమే కాక పలువిషయంబులఁ జిరకాలమాంధ్రదేశమునం దెంతయు పేరువడసిన శ్రీవివేకవర్ధని పత్రికను బ్రచురించుట యందింగ్లీషుభాగమును విశేషముగా వ్రాయుచు దోడుపడుచువచ్చిన బసవరాజు గవర్రాజుగారిమరణానంతరమున వీరికి పలువిధములయిన కష్టములు సంప్రాప్తమయినవని చెప్పవలసియున్నది. ఇటీవల వచ్చినయభియోగములకును పలువిధములయిన గ్రంథములను వ్రాయకుండుటకును ముఖ్యకారణ మీగవర్రాజుగారి యకాలమరణమే యనిముమ్మాటికి జెప్పఁగలను. గవర్రాజుగారి మరణానంతరమున 1889వసంవత్సరమున శ్రీవివేకవర్ధనియొక్క పదునాలుగవ సంపుటమును బ్రచురింపనారంభించిరి. ఈసంపుటమునందు "తిర్యగ్విద్వన్మహాసభ"యను పటములతో నున్నహాస్యసంభాషణమును నీతిబోధకమయినకథను గలిగియున్న "మహారణ్యపురాధిపత్య"మనుమఱియొకపుస్తకమును బ్రచురింపఁబడినవి. గవర్రాజుగారిమరణకాలమునందుజరిగిన సభాపతులనబడు వారలయొక్క సంభాషణములను బూనిపరికింప వీరేశలింగముపంతులవారి మనసునకుఁగలిగిన మితిలేనిసంతాపమును మతబహిష్కృతులయినవారల శవములనుగూర్చి జరుపఁబడెడి శాస్త్రచోదితము లగుపరిహాసపాత్రములును నిందాస్పదములు నగుకర్మలను గాంచు



నప్పుడు వీరలకుఁ గలిగినయాగ్రహమును ప్రాయశ్చిత్తప్రహసన, మనిచెప్ప నొప్పునీతిర్యగ్విద్వన్మహాసభను వ్రాయఁజేసినవని చెప్పఁగలను. ఇందలి కామధేనువును వత్సమునుగూర్చిన అశ్వపతిగారు గోదేవిగారు వృషభేంద్రరావుగారు మేషేశ్వరుడుగారు భైరవమూర్తిగారు కొంకనక్కదీక్షితులుగారు రామబంధుశాస్త్రిగారు మార్జాలపంతులుగారు గార్ధభేంద్రశాస్త్రులవారు బకసోమయాజులుగారు వ్యాఘ్రపుధానులుగారు, వరాహభట్లుగారు ఆంజనేయశర్మగారు, మల్లుభట్లుగారు మర్కటజోస్యులుగారుతిమ్మన్నచయనులుగారు అను నీతిర్యగ్విద్వన్మహాసభికులసంభాషణములెంత నీతిబోధకములుగనుండి యున్నవియు నిదిపలువురచేనెంతవిశేషముగ సంతోషముతోఁ జదువఁబడినదియు నీతిర్యగ్విద్వన్మహాసభ ప్రచురింపఁబడిన శ్రీవివేకవర్ధని పత్రికయొక్క విడిపత్రికలేయెంతవిశేషముగా నమ్ముడువోయినదియు నెఱింగినవారలకు బోధపడకమానదు. ఇప్పుడీతిర్యగ్విద్వన్మహాసభను మూషకాసుర విజయమనుమఱియొక సంభాషణముఁగూడచేర్చి పుస్తకరూపముగా ముద్రింపించియున్నారు. జంతుస్వభావచరిత్రమునందలి పటముల నీతిర్యగ్విద్వన్మహాసభయందు నీతిబోధకములుగను జ్ఞానదాయకములుగను నుపయోగించియున్నారు.

ఈతిర్యగ్విద్వన్మహాసభయు, మహారణ్యపురాధిపత్యమును బ్రచురింపఁబడుచువచ్చిన యీ 1889వసంవత్సరమందే యీరాజమహేంద్రవరమునందొక గృహస్థుని యింటిపై రాళ్ళు పడుచున్నవనియును రాళ్ళనట్లు పాఠశాలయందలి విద్యార్థులచేతను మఱికొందఱిచేతను ఇక్కడి యున్నతపాఠశాలయందుఁ బ్రధానోపాధ్యాయులుగ నున్న ఏలూరిలక్ష్మీనరసింహముగారే వేయించుచున్నారని వారిపైతాలూకా మ్యాజస్ట్రేటువారియెదుట నొకయభియోగము తేఁబడెను. ఆయభియోగము చివరకుఁ గొట్టివేయఁబడినది. అందువీరేశలింగముపంతులుగారు సాక్ష్యమీయవలసివచ్చినది. ఆయభియోగమునందును నిటీవల వీరేశలింగ

ముపంతులవారిపై తమ్ముపత్రికలయందు “మహారణ్యపురాధిపత్య,, మను
దానిని వ్రాసిహాస్యాస్పదునిగఁ జేసిదూషించి రనియుఁ, గొండఱు
పెద్దమనుష్యులయెదుటఁ “పెద్దమనిషి కాఁడు. సడతతిన్న నిదికాదు. పోఁకిరీ
దుర్మార్గుఁడు,, అనుమొదలయినరీతుల దూషించిరనియును లక్ష్మీనరసిం
హముగారు తెచ్చిన యభియోగములయందును, విశేషముపనిచేసి
లక్ష్మీనరసింహముగారికి సహాయభూతులయిన యిక్కడి నిడమర్తిజల
దుర్గప్రసాదరాయుఁడుగారు. ఇటీవలవచ్చిన రెండభియోగములకును
ముఖ్యకారణములు రాజ్యవ్యవహారమునందు వాదిపక్షమునం దెవ్వరును
తగిన న్యాయవాది లేకయుండుటయును, బ్రస్తుతాంశమునకుఁదగిన ప్ర
శ్నముల నడుగక ముందభియోగములు తెచ్చుటకు వీలగునట్లు ప్రత్యుత్త
రంబులం బడయుటయే యని మనమునిశ్చయింపవలసి యున్నది. కార్య
వాదు లనిచెప్పవలసినలక్ష్మీనరసింహముగా రిక్కడియనుగతకరగ్రాహి
కడను, మండలన్యాయాధిపతికడనునభియోగములు తెచ్చినది వీరేశలింగ
ముగారికిఁ గారాగృహనివాస శిక్షనువిధింపఁజేయుటకును, గౌరవనష్ట
పరిహారార్థంబుగ మూఁడువేలరూపాయలను వీరేశలింగముగారివలనఁ
గైకొనుటకును నయి యున్నవి. వ్రాయఁదలంచినచో నెన్నిసంపుటము
లయినను నగునని ముమ్మాటికిఁ జెప్పవలసిన యాయభియోగములు రెం
టిలోను మొదటియభియోగము యఫ్. ఎచ్. హ్యామ్నెట్ దొరగారివ
లనఁ గొట్టివేయఁబడినది. మర్యాదనష్టమునకై తేఁబడిన మూఁడువేల
రూపాయలయభియోగమునుగూర్చి యప్పటి మామండలన్యాయాధిప
తులగు ఎచ్. టి. రాస్‌దొరగారు వాదిప్రతివాదులు తమతమకర్చులను
తామేభరించుకొనవలయు ననియునష్టగౌరవపరిహారార్థంబుగ వాది య
గు లక్ష్మీనరసింహముగారికిఁ బ్రతివాది యగు వీరేశలింగముగా రొక
యణా నియ్యవలయుననియును తీర్పునొసంగియున్నారు. రాస్‌దొరవా
రుతమతీర్పునందు, నీచపరిహారమునకుం దగినయభియోగములలో నిది



యొకటియని వ్రాసియున్నారు. ప్రపంచమునందు మనుజునకుఁ గలగౌ
రవమునకు విలువకట్టుటయెట్లు? లక్ష్మీనరసింహముగారు తమగౌరవము
యొక్క విలువమూఁడువేలరూపాయ లని యభియోగము తెచ్చుటకుఁ
గాని రాస్‌దొరగారొకయణాగౌరవముగా నిశ్చయించుటకుఁగాని కల
యాధారము లివి యని యెవ్వరూహింపఁగలుగుదురు? వేయేల? ఈయభి
యోగములయందు వాదిప్రతివాదు లిరువురును విశేషముగానష్టమున
కును గష్టమునకును బాత్రులయియే యున్నారు గాని మఱివేఱుగాదు.
ఈయభియోగములయందు విశేషముగాఁ బాటుపడినయిరువురున్యాయ
వాదులునగు న్యాపతిసుబ్బారావుపంతులుగారియెడలను, నిడమర్తి జల
దుర్గప్రసాదరాయఁడుగారియెడలను గ్రమముగా వీరేశలింగముపంతులు
గారును, లక్ష్మీనరసింహముగారును, నెంతకృతజ్ఞతాతిరేకము గలవార
లుగ నుండవలయునో నేనూహింపఁజాలకున్నాను. ఒకపట్టణమునంది
ట్లు ప్రముఖులుగానుండి, పరులకు మార్గప్రదర్శకులుగా నుండవలసిన
వారేయిల్లు పరస్పరకలహనిమగ్నమానసు లయి యుండుటంజూడ నెం
తయు సంతాపకరంబుగ నుండక మానదుగదా!

ఇట్లభియోగములయందున్న కాలమునందే 1892 వ సంవత్సర
మునందు, హూణభాషయం దాలివరు గోల్డుస్మిత్తను కవివరుఁడు వ్రా
సియున్న “ది ట్రావెలర్,, అనుపద్యకావ్యమును “పథికవిలాసము,, అను
పద్యకావ్యమునుగ రచియించియున్నారు. ఈభాషాంతర మెంతహృ
ద్యంబుగనున్న దియునిందలి,

చ. పగ లొగిఁ బాటుపడ్డశ్రమ ♦ పాయఁగ హాయిగ విశ్రమింపఁ, గ్రం
దుగఁ జలిమంటఁ గ్రాగ, నతి ♦ థుల్ మునిమాపున నెందుఁ బోదురో
తగనిజుపేద లార్తులును ♦ దామెట కేగి సుఖింతురో, యొటఁ
దిగి పరదేశి యాదరణఁ ♦ దేలునొ, యాయిలు ధన్య మయ్యెడున్

మ. ఘనలోభాత్మకుఁ డొంటిగాఁ దనధనా ♦ గారంబు దర్శించి, యో
లిని గూర్చుండి ధనంబుఁబల్మఱును దా ♦ లెక్కించి లెక్కించి, యా
ధనముల్ దప్పలుకుప్పలైకడుఁ బ్రమో ♦ దంబియ్య, నుప్పొంగు, నా
వెనుకన్ గన్గొని వెచ్చనూర్చు మఱియున్ ♦ విత్తంబు లేకున్కికిన్.

ఉ. వయసునుబట్టి భేదము ల ♦ వంబును గల్గదు—వృద్ధనారులున్
దయము మెయి న్నిజార్భకుల ♦ నాట్య మొనర్పఁగఁ దెచ్చి రుబ్బుచన్
బ్రియమున సంగరాభినయ ♦ విద్యను బ్రౌఢిమఁ గన్న తాతయున్
జయజయ యంచు గంతు లిడ ♦ షష్టివయఃపటుభారమగ్నతన్.

అనుపద్యములంగాంచిన నవి తేటతెల్లంబు గాకమానదు. ఈషధికవిలా
సమునందలి ఫలితార్థము,

చ. హృదమునందె లోనవసి ♦ యించెడుసౌఖ్యము బైలఁ గాంచ, నే
వెదకుటయెల్ల వ్యర్థ మగు ♦ వేసట యయ్యె బహుప్రయాసతన్;
వదలి సుఖంబు విశ్రమము,♦ పైఁ బ్రతిరాజ్యము నిచ్చుసౌఖ్యమున్
వెదకఁగ దేశ దేశముల♦ వెంబడి నేటికి సంచరించితిన్ ?

అనుపద్యమునందుఁ గానఁబడు చుండును. విశ్వాశాఖవా రిట్టిభాషాంత
రములకు యుక్తకాలమునందె తగినప్రోత్సాహము నొసంగి, యిట్లే
‹‹వ్యానెటీ ఆఫ్ హ్యూమన్ విషెస్,, అనుదానివి సహితము భాషాం
తరీకరింపఁ జేయునుత్సాహమును గ్రంథకర్తకుఁ గలుగఁజేసిన నెంతయుఁ
జక్కగానుండియుండునుగదా!

ఆ. వె. హనాణకవులపోక♦ లోకయింత తెలుపంగఁ
దెలుఁగువారికొఱకుఁ ♦ దేటగాను
‹‹గోల్డుస్మిత్తు,, ను కవి♦ కూర్చినయట్టియా
పథికచరిత మేమ♦ వ్రాసినాఁడ.

అని వ్రాసియున్నారు. కాని, యీహనాణభాషాంతరమునందలి కవిత్వ
శైలి నభిజ్ఞానశాకుంతలప్రబోధచంద్రోదయాది సాంస్కృతికభాషాంతర



ములయందలి మృదుమధురకవితా విధానముతోడం బోల్చి చూచి
నప్పుడుమాత్ర మియ్యది యంతగా హృదయరంజకంబుగ నుండక యే
యున్నదనియే చెప్పవలసియుండును.

* * * * * *

తరువాత, 1891వ సంవత్సరమునందుండియు న్యాపతి సుబ్బా
రావుపంతులవారిచేఁ బ్రచురింపఁబడుచువచ్చిన చింతామణిపత్రికయందు
వీరేశలింగముపంతులవారు ‹‹సత్యరాజాపూర్వదేశయాత్ర,,లను నొక
వచనప్రబంధమును నాలుగుభాగంబులుగ రచియింప నారంభించి నేటికి
మొదటిరెండుభాగములను మాత్రమే ముగించి యున్నారు. అందు, స
త్యరాజాచార్యు లాడుమళయాళమునందును, లంకాద్వీపమునందును
గడపిన చర్యలు మొదలగునవి మెంతయుల్లాసజనకంబులుగనున్నవియు
ను చదువరుల కెఱుకపడియే యుండవచ్చును. ఈయపూర్వదేశయాత్ర
యొక్క మొదటిభాగము కన్నడము, అరవము, ఇంగ్లీషుభాషలలోనికి
భాషాంతరీకరింపఁబడి యున్నది.

మొట్టమొదట 1885వ సంవత్సరమునందుఁ గొంచెము తెలిఁగిం
పఁబడి యాకాలమునందుఁ బ్రచురింపఁబడుచువచ్చిన వివేకవర్ధనీపత్రిక
యందుఁ బ్రచురింపఁబడిన ‹‹ప్రబోధచంద్రోదయ,,మను నాటకరాజ
మీచింతామణిపత్రికయందుఁ ముగింపఁబడినది. గీర్వాణభాషయందుఁ
బ్రబోధచంద్రోదయమును కృష్ణమిశ్రుఁ డనుకవిశేఖరుండు రచియిం
చియున్నాఁడు. ఈనాటకమునందలికథ వేదాంతవిషయమేయయినను
కృష్ణమిశ్రుఁడు దీనిని హృదయరంజకముగాను సుబోధకముగాను జేసి
యున్నాఁడు. ఇందువివేకము (జ్ఞానము) నకునుమహామోహము
(అజ్ఞానము)నకును ఘోరాటము జరగఁగా మొదల నజ్ఞానమే ప్రబలముగా
నున్నను గడపట జ్ఞానముచేతఁ బరాజితమయియడఁగిపోయినట్లు చెప్ప
బడినది. ఇందుసుగుణదుర్గుణములు పురుషులుగాను స్త్రీలుగాను జె

ర్పఁబడి యాయాపట్టులయందు వానివాని ప్రభావముతో నిక్కలి, మనోహరముగా వర్ణింపఁబడినవి.

వీరేశలింగముపంతులవారు తెనిఁగింపనారంభించినయాప్రబోధచంద్రోదయనాటకమునే యిక్కడి దొరతనమువారి "టీచర్సుకాలేజి" యందాంధ్రోపాధ్యాయులుగనున్న బ్రహ్మశ్రీ వడ్డాది సుబ్బరాయఁడుగారు సహితము తెనిఁగించియున్నారు. ఒకరు తెనిఁగించినగ్రంథము మఱియొకరు తెనిఁగించుట కనేకకారణములుండవచ్చును. సుబ్బరాయఁడుగారి భాషాంతరమునుగూర్చియు వీరేశలింగముపంతులవారిభాషాంతరమునుగూర్చియు నేటి కనేకపత్రికలయందువిశేషముగాఁ బ్రశంసింపఁబడియున్నది.

పూర్వవర్తమానకవులంగూర్చి, వీరు "తమసరస్వతీనారదవిలాపము" నందు, సరస్వతిపలుకుచున్నట్లుగ,

మ. రమణీయోక్తులచేత సర్వగుణసా ♦ రస్యంబు గల్పించుచుం
డమి నాయంగచయంబునన్ సహజ ♦ సౌందర్యంబు పెంపొందఁ గొం
చె మలంకారము లుంచి తొల్లిటికవుల్ ♦ చేష్టాచమత్కారభా
గ్యము హెచ్చించుచు దీర్ఘకాలము ననుం ♦ గాపాడి రర్హక్రియన్

శా. అటు సుఖయింపుచుండఁగ ను ♦ దాస్యమునందు నిరర్థకంబులై
పటపటలాడుశబ్దముల ♦ బల్మిని బెట్టి, రసంబు నెట్టి, య
కృటిలములే కలంకరణ ♦ కైతవముం గొని మేను కొట్టి, యి
ప్పటిఖలు లార్తి పెట్టెదరు ♦ ప్రాణము తీసి ననుం గలంచుచున్.

క. తెలియుదు సు విన్నప్పుడు నా
పలుకులయర్థము నాకె ♦ భావము లేమిన్;
వెలభూషలుగా కివి సం
కెల లటు కదు వాదుమేని ♦ కిన్ వెత నింపన్.



అని భావించుచు, నీప్రబోధచంద్రోదయనాటకముం దెనిఁగించుచుఁ "జింతామణి" పత్రికయందుఁ బ్రకటింపనారంభించినతోడనే, కొందఱు ధనికులీర్ష్యాస్వభావంబుననో, లేక, యిందలిభాషాంతరము వీరేశలింగముపంతులగారిభాషాంతరము కాదని తోఁపఁజేయునంతటిరసవంతముగ నదిగ నుండుటచేతనో, లేక, యియ్యది గ్రంథచౌర్యమే యని తలంపఁజేయఁగలసామర్థ్యంబుగలవారలగుటచేతనో, యియ్యది వీరేశలింగముపంతులుగారికవిత్వమే కాదనియు, నిందలిపద్యములు, నందిమల్లయ్య ఘంట సింగయ్య లనునిరువురుపూర్వకవులు రచియించినపద్యకావ్యము నందలిపద్యములే యనితమతమయభిప్రాయంబుల నక్కడక్కడ వెల్లడింప నారంభించిరి.

కాని, నందిమల్లయ్య ఘంటసింగయ్యలు రచియించినప్రబోధచంద్రోదయ పద్యకావ్యముయొక్కవ్రాఁతప్రతిని సంపాదించుకొని, చూచినపిమ్మట, సత్యము బోధపడి యూరకుండిరి. పంతులుగారియాంధ్రకవుల చరిత్రమునందు మధ్యకవులని పేర్కొనంబడిన పూర్వకవులగు మల్లయ్య సింగయ్యలు, వరుసఁగాఁ దమగద్యములయందు "మనీషితల్లజ" "మలయమారుతాభిధానకవిపుంగవ" యని వ్రాసికొనినస్వదత్తములయినబిరుదునామములకుం దగినట్లుగనున్నదాయని వారిప్రబోధచంద్రోదయపద్యకావ్యమును జదివి చూచువారలకుమాత్రము సంశయముగలుగకమానదు. కాని, మొత్తముమీఁదఁ బరికించి చూచువారలకు మాత్రమాయిరువురుకవులకవిత్వము, రసవంతముగను, నాతికఠినముగను, శ్రావ్యంబుగను నుండకమానదని తోఁచకమానదు. కృష్ణమిశ్రరచితగీర్వాణప్రబోధచంద్రోదయనాటకమును బద్యగద్యాత్మకంబుగ రచియింప నారంభించినయాయిరువురుకవులును దమగ్రంథమునందు,

క. అనవుడు ననంతవిభుగం
గన వారలఁ జూచి యిట్టి ♦ ఘననాటకముం

తెనుఁగునఁ బ్రబంధశయ్యకు
నొనఁగూర్పఁగ నేర్పుసుకవు ♦ లుర్విం గలరే?

అని వ్రాసికొని, స్వోత్కర్షప్రకటనమును విశేషముగాఁ గావించుకొని యున్నారు. అట్లు

తెనుఁగునఁ బ్రబంధశయ్యకు
నొనఁగూర్పఁగ నేర్పుసుకవు ♦ లుర్విం గలరే?

అనియును,

ఉ. ఈదృశవర్తనంబునకు ♦ నెక్కుడు బోధ మగున్ బ్రబోధచం
ద్రోదయ మాంధ్రభాష నతి ♦ యోగ్యకవీంద్రులచేత నంకితం
బై దిశలం బ్రసిద్ధముగ ♦ నందినఁ గస్తురితావి పైఁడికిన్
ఱమర హేమకాంతి ధర ♦ ణిన్ మృగనాభికిఁ గల్గులాగునన్.

సీ. వివరింప నిది సర్వ ♦ వేదాంతసారంబు
తలఁపఁగా నిది గట్టి ♦ తెలివిత్రోవ,
యిది భోగమోక్షసం ♦ పదలకు మూలంబు
మోసలే దిది ఘనర ♦ బులకు ఘనము,
జ్ఞానకర్మరహస్య ♦ సాధనంబును నిది
యిది నవరసముల ♦ నీనుసురభి,
షడ్దర్శనంబులు ♦ సరవి నిం దున్నవి
సందేహములు దీఱ ♦ విందుఁ గాని
యిమ్మహారసపాకము ♦ నెఱిఁగినట్టి
జనుఁ డెఱుఁగఁడు మఱి తల్లి ♦ చన్నుపాలు;
దీనిసరి చెప్ప మఱి లేవు ♦ త్రిభువనముల
దొరక దీకృతి నీవంటి ♦ దొరకుఁగాని.

అనియును మల్లయ్యసింగయ్యకవులు వ్రాసియున్నారన్న యొక్కయంశము నుబట్టియే యాకాలమునందును ప్రబోధచంద్రోదయనాటక మెట్టి



సర్వోత్కృష్టనాటకంబుగఁ బరిగణింపఁబడుచుండినదియు బోధపడకమానదు.

ఇఁక నీపూర్వకవికృతపద్యకావ్యమునుగూర్చియును, వీరేశలింగకవికృతాంధ్రీకృతనాటకముంగూర్చియును విశేషముగా నిప్పుడు పెంచి వ్రాయక రెండుగ్రంథములనుండియు సమానార్థదాయకములగు కొన్ని పద్యములను మాత్రమిటనుదాహరించుచున్నాను.

నందిమల్లయ్య. ఘంటసింగయ్య.

మ. అలిగీతంబులతోడిపుష్పలతలున్ ♦ హర్మ్యంబులుం జందనా
చలమందానిలకందళంబులును వా ♦ సంతంబునుం బండువె
న్నెలలుం గాంతలు నాకునమ్మినబలా ♦ నీకంబులై యెల్లచో
టుల నుండంగ వివేక మెట్లొదవుబు ♦ ట్టుంబోధ మెబ్భంగులన్.

వీరేశలింగకవి.

ఉ. సుందరమందిరంబులును ♦ సోయగపుంజవరాండ్రు షట్పదా
మందరవ్రొల్లసల్లతలు ♦ మల్లెలతావుల నొప్పుగాడ్పులున్
జందురుఁ డున్నరేలు నెట ♦ నాకు నమోఘబలంబులోట గ
ల్గొందఁగ, నవ్వివేకుఁ డెటు ♦ లుండుఁ? బ్రబోధుఁడు నెట్లుపుట్టెడున్

క. తనువునకు నాత్మవేఱఁట
యనుభోగించునట పిదప ♦ నాముష్మికమున్
వినుఁ డీదురాశ గగనా
వనిరుహపుష్పఫలభోగ ♦ వాంఛన్ బోలెన్. మ. సిం

చ. కలదఁట! యాత్మ యొక్కటి జ ♦ గంబున దేహముకంటె వేఱుగా
ఫల మది మీఁదగాంచునఁట! ♦ భద్రముఁగాబరలోకమం దహా!
వలవనియాదురాశయు న ♦ భస్తరురాజము పూచి స్వాదుస
త్ఫలముల నిచ్చునన్ భ్రమము ♦ వంటిదికాదె తలంచిచూడఁగన్? వీ.

మ. నను గామించిన దీలతాంగి నను నా♦ నందంబుగాఁ జూచి యి
వ్వనజాతనన కౌఁగిలించె నను ని♦ వ్వామాక్షి కాంక్షించె నం
చు నరుల్ భ్రాంతి వహింతు రేల పిశితా♦స్థుల్ గూడి రూపైనమో
హినియే కార్యము కానరానిపురుషుం ♦ డీక్షింపఁ గాంక్షింపఁగనే.
మ. సిం.

మ. ననుఁగామించెను బాల యీమె,యొలమిన్ ♦ నన్నీమృగాంకాస్యచూ
చెను, నీయుత్పలనేత్ర కౌఁగిటను జే♦ర్చెన్ నన్ననుచున్ గామి యో
ఘనమూర్ఖా! నినుఁ గాంచె నెవ్వతె? నినుం♦గామించె నెవ్వర్తె యం
గన మాంసాస్థులబుంగ లోపలినిరా♦కారుం డె వీక్షించెడున్. వీ.

మత్తకోకిల

త్రోవఁ బాంథులు పుష్కరంబునఁ ♦ దోయదంబులు వార్ధిలో
నావికుల్ సలిలప్రవాహము♦ నన్నగంబులు కూడుచున్
బోవుచుండెడి కైవడిం బితృ♦పుత్రబంధులు పోక స్వ
భావికంబని కోవిదుల్ మదిఁ♦ బట్టికొల్పరు శోకమున్. మ. సిం.

ఉ. దారిని బాంథు లేటివర♦దన్ దరుకాండము లాకసంబునన్
వారిదముల్ సముద్రమున ♦ నావికులుం వడిఁ గూడి పాయు న
ట్లారయఁ దల్లిదండ్రులును♦నాత్మజులున్ సఖులున్ సహోదరుల్
చేరుచుఁ బాయుచుండు టిది♦ సిద్ధము ప్రాజ్ఞుల కేడశోకముల్. వీ.

ఉ. యెవ్వనియందు విశ్వ ముద♦ యించు నడంగుఁ దలంపఁ నీజగం
బెవ్వనిదీప్తిఁ గానఁబడు♦ నెవ్వని తేజము చిత్సుఖాత్మకం
బెవ్వని బుణ్యు లెల్ల గురి ♦ యింపుచు ద్వైతతమంబు బాసి తా
రెవ్వలనన్ భవంబునకు ♦ నేగరు వాని నుతింతు నక్రియన్. మ. సిం.

చ. ఎవ్వనిలో జగంబు జని ♦ యించి రమించి లయించు నీజగం
బెవ్వనికాంతిచే వెలుగు♦ నెవ్వని తేజము సత్సుఖోజ్జ్వలం



బెవ్వనిగొల్చి ద్వైతతమ♦మెగఁ బునర్భవ మొంద రెవ్వరున్
నెవ్వడిఁ బుణ్యు లాపురుషు♦నిత్యుని శాంతు స్తుతింతు సక్రియన్. వీ.

* * * * * *

ప్రబోధచంద్రుఁడు తనయందు నుదయమగుటకుం బ్రతిపురుషుఁడు నేలాగు ప్రయత్నము చేయవలయునో తత్ప్రకారమంతయు నొతేయుఁ జక్కఁగ వివరింపఁబడిన యాప్రబోధచంద్రోదయ నాటకము నిక్కడి బ్రహ్మశ్రీ వడ్డాదిసుబ్బారాయకవిగారుగూడ,

చ. తెలిసినవాఁడ నంచు నిది ♦ దెల్గొనరింపఁ దలంప నీశ్వరా
త్యలఘుఘృణో వలబ్ధకవి♦తామృతవాహిని నడ్డగింపఁగా
నలవి యె కింత గామిఁ జూడి;♦ యాప్యులు దీనిరసంబుఁ గ్రోలుఁడీ
నరసులు సద్విమర్శనము♦ నన్ వడఁబోసి శుచిం బొనర్చున్.

అని వ్రాసి, తెనిఁగించియున్నారు. ఈయిరువురువర్తమానకవులభాషాంతరములు నిప్పటికి నేకులు చదివిచూచి, యాయాభాషాంతరముల కవితాతారతమ్యములననిర్ణయించుకొని యేయుందురను సంపూర్ణవిశ్వాసముతో నిరువురుకవుల భాషాంతరములనుండియు మూఁడేసిపద్యముల నుమాత్రమిటనుదాహరించుచున్నాఁడను.

సుబ్బారాయకవి.

ఉ. వేఁడిగ నుచ్చలద్బహుల ♦ ఫేనిలబుద్బుదరక్తమొల్కఁ, నా
వాఁడికృపాణధారను, భ♦వద్గళనాళము లీలఁ దున్మితూ
టాడి, వడిం ఢమడ్డమరు♦డాంకృతి హూతపిశాచభూతముల్
నేఁ డిటఁ గ్రోవ, భర్గగృహి♦ణీమణికిం దగువిందుఁ జేసెదన్.

వీరేశలింగకవి.

ఉ. ఈనిశితోగ్రఖడ్గవి♦నికృత్తభవద్గళనాళికోచ్చలత్
ఫేనిలబుద్బుదౌఘయుత♦భీకరశోణితభూరిధారలన్

నేనిదె తృప్తి చేసెద వి♦నిశ్చలభక్తిని దుర్గకిప్డు క్రీ
డానినదోల్లసద్ఢమరు ♦ ఢాంకరణాగతభూతవర్గకున్.

సుబ్బారాయకవి.

పంచచామరము.

ధరారజోభరానుమేయ ♦ ధావనాశ్వధావన
క్షురాగ్రచుంచితోర్వ్యలౌచ ♦ ఘోటముల్ వహింప, మం
దరావనీధరాదితేయ ♦ దైత్యమధ్యమానసా
గరారవంబుతో శతాంగ ♦ కంబు నింగి నేగెడున్.

వీరేశలింగకవి.

మ. ప్రచురోద్ధూతరజచ్ఛటానుమితశుం ♦ భద్యానధావత్ఖురా
గ్రచయేషత్పరిచుంబితోర్వ్యపరిభా ♦ గంబుల్ మహావాహముల్
ప్రచలన్మందరమధ్యమానజలధి ♦ ధ్వానోగ్రఘోషంబుగా
నుచితప్రౌఢినివ్యోమమార్గమున, నో ♦ హో! తేరుఁగొం
పోయెడున్.

సుబ్బారాయకవి

మ. అవె ధారాజలయంత్రసంస్ఖలితతో ♦ యస్ఫారఝుంకారముల్
ధవళాంశుద్యుతిభాసమానములు, సాం♦ ద్రప్రాంశుసౌధాగ్రముల్
రవణిల్లుం బయిఁ జిత్రకేతనము లా♦ డన్ లోనఁ గ్రొమ్మించున
ట్టివ లొప్పారుశరచ్ఛతాభ్రములనీ♦ టుల్ గీటునం బుచ్చుచున్.

వీరేశలింగకవి,

శా. ధారాయంత్రపతజ్జలోదితనితాం♦ తధ్వానసంయుక్తముల్
నీరేజారికరప్రభాధవళముల్ ♦ చెల్వొందు సౌధాగ్రముల్
భూరిప్రేక్ష్యములై శరద్ధవళజీ ♦ మూతాంతరాజత్తటి
చ్ఛీరమ్యంబు లవే పతాక లెసఁగున్ ♦ జిత్రద్యుతి న్మేడలన్.



ఈయిరువురినాటకములను సావకాశంబుగఁ బద్యంబునకుం బిమ్మటఁ బద్యంబును వచనంబునకుం బిమ్మట వచనంబును సంపూర్ణంబుగాఁ జదివిచూచినపిమ్మట వీరేశలింగకవికృతనాటకమునందలి కవిత్వమే రసపుష్టిగలిగి నాతికఠినమృదుమధురంబుగనుండి యనర్గళ ధారగాఁ బ్రవహించుచుఁ గరంబు హృదయరంజకంబుగనుండి భాషాంతరీకరించుటయందు వీరేశలింగముపంతులగారి కాకాలంబునఁ గలసామర్థ్య మసదృశమయినదని తోఁచియున్నది. పరసకవితా విధాననిర్ణయమునుగావించుచు నిక్కవి సరస్వతీనారదవిలాపమునందుఁ బ్రాణసంయుతంబుగ నుండునట్లు రచియించిన,

క. సుందర బహురసపుష్టి న
మందానందంబు బుధుల ♦ మది కిడ దేనిన్
ఛందోబద్ధం బగుపద
బృందాటోపంబు తాఁ గ ♦ విత్వం బగునే?

క. రసములు కావే ప్రాణము
లసమానకవిత్వకాంత ♦ కవనీస్థలిలో
రసహీన మైనకవితకుఁ
భాసఁగించునలంకృతి శవ ♦ మున కిడుతొడవౌ.

క. విను ఛందోబద్ధం బను
ఘనకారణముననె బ్రతుకుఁ ♦ గన నగు శేనిన్
తను వది వదలి వెసం జ
క్కనిమృతి నొందుటయె లెస్స ♦ కవితాసతికిన్.

క. కవితాసతి జీవకళన్
శ్రవణోత్సవభాషణంబు ♦ సలిపెడున ట్లుం
డవలెం గాక యొకప్పుడు
శవమువలె న్నిద్రితవలెఁ ♦ జన దుండంగన్.

అట్టిపద్యములభావము లెంతసార్థకంబులుగ నుండున ట్లీప్రబోధచంద్రోదయనాటకము తెనిఁగింపఁబడినదియుఁ జదువరు లెఱింగి, యానందించు నట్లుగ నింకఁ గొన్నిపద్యముల నీక్రింద నుదాహరించు చున్నాను.

శా. ఆహా! లేనిపదార్థ మున్న దని మి ♦ థ్యల్ పల్కునయ్యాస్తిక
ద్రోహుల్ నాస్తికులంచు దూష్యులనుచున్ ♦ దూషింత్రు సత్యా
(ర్థ్యులన్.
మాహాత్మ్యస్థితిఁ బంచభూతపరిణా ♦ మం బౌను చైతన్యమం
దోహం; బెవ్వరు దేహభిన్నునిఁగ నెం ♦ దుం జూచిరే జీవునిన్?

గీ. యజ్వలకు ద్రవ్యనాశక్రి ♦ యాదికంబు
వలన స్వర్గఫలం బది ♦ వచ్చునేని,
ధరణిలో దావవహ్నిద ♦ గ్ధంబులైన
పాదపంబులవలనను ♦ ఫలము లొదవు.

గీ. పుడమిలో యజ్ఞమునఁ జంపఁ ♦ బడెడునట్టి
పశువునకు స్వర్గసౌఖ్యంబు ♦ వచ్చునేని,
యజ్ఞపశువునుగాఁ జేసి ♦ యజ్ఞకర్త
స్వర్గసుఖ మందఁ దనతండ్రిఁ ♦ బనుపరాదె?

క. మరణము నొందిననరులకుఁ
గరమును శ్రాద్ధంబు తృప్తిఁ ♦ గలిగించెనుచో,
ధర నాఱినదీపంబున
కురుకాంతిని దైలదాన ♦ ముత్పాదించున్.

చ. చెలువగుమందిరంబుల వ ♦ సింపఁగవచ్చు; విలాసినీతతిన్
గలయఁగవచ్చు; భోజన మొ ♦ నర్పఁగవచ్చు; నభీష్టవేళలన్
దెలిమృదుశయ్యలందుశయ ♦ నింపఁగవచ్చుఁ; గృతాంగరాగులై
వలచుప్రియాళితోఁ గడప ♦ వచ్చును రాత్రులు పండువెన్నెలన్.



మ. చనలేదే బహుకోట్లు నీకిటు మహా ♦ సంసారమం దెందఱో
జననుల్ తండ్రులు తాత లాత్మభవులున్ ♦ జాయల్ పితృవ్యాగ్రజుల్
విను మస్లాట, సుహృత్తు లెల్లఁ బుడమిన్ ♦ విద్యుత్ప్రకాశాభజీ
వనులంచుం దలపోసిపోసి మదిలో ♦ భాస్వత్సుఖం బందుమా.

* * * * * *

ఇప్పుడు పిఠాపురమునం బ్రకటింపఁబడుచున్న ‹‹కవిత›› యను మాసపత్రికయం దిక్కడి శాస్త్రపాఠశాలయందుఁ బ్రధానపండితులుగనున్న గీర్వాణాంధ్రోభయభాషావిశారదులగు ఆకుండివ్యాసమూర్తిగారు తెనిఁగించిన ప్రబోధచంద్రోదయనాటకము ప్రకటింపఁబడుచున్నది. ఇది ప్రబోధచంద్రోదయనాటకమునకు మూడవభాషాంతరము.

వీరలిట్లు ‹‹చింతామణిపత్రిక›› యందుఁ బ్రబోధచంద్రోదయాంధ్రకవిచరిత్రాది గ్రంథములను రచియించి ప్రకటించుచుండుటయేకాక, యీకాలమునందువీరి చేఁ బ్రకటింపబడుచుండిన ‹‹సత్యసంవర్ధని›› యనుమాసపత్రికకుంగూడ విశేషంబుగ వ్రాయుచునే యుండిరి. ఈ1892వసంవత్సరమునందుఁ, బూర్వాచారపరాయణుల కెంతయు జ్ఞానదాయకంబులుగ నుండునట్లు ‹‹ కులచారసంస్కారపూర్వనాగరికపంచరత్నము›› లని యైదు సీసపద్యములను రచియించియున్నారు. ఇంచుమించుగా నిరువది మువ్వది నిమిషములలో వ్రాయఁబడి, స్వభావసిద్ధమయిన ప్రవాహశైలింగలవచన పద్యరచనకొక చిన్ననిదర్శనముగా, నిజముగాఁ గులాచార సంస్కారపూర్వనాగరిక పంచరత్నములని చెప్పఁదగిన

సీ. పరులసొమ్ముల్ హరింపఁ ♦ బన్నినకర్మలు
వెలయ వంచును విల ♦ పించు నొకఁడు;
జనుల మూఢులఁ జేయ ♦ నొనరించుకృషి యెల్లఁ
జెడిపోయెడు నటంచు ♦ నడలు నొకఁడు;

వలదు విద్య యటంచుఁ ♦ బలుకుఁ జేయఁగ నెంచు,
వనిత చదువ నంచు ♦ వగచు నొకఁడు;
తల్ల గొఱిగించి వెం♦తలఁ బెట్టఁగఁ దలంచు,
సంతి సుఖించునం♦ చేడ్చు నొకఁడు;
పసితనంబుననే పెండ్లి ♦ పొసఁగ కున్నఁ
గూఁతు నెట్లమ్ముకొననంచుఁ ♦ గుందు నొకఁడు;
వీరు పూర్వనాగరికు లొఁ పెద్ద లిపుడు,
దుష్కులాచారరక్షణో♦ద్యోగు లకట!

సీ. మగఁడు పోయినభామ ♦ మఱలఁ బెండ్లాడుచో,
సొత్తు దక్క దటంచు ♦ సోలు నొకడు;
పతి పోయినయువతి ♦ పరిణీత యైనచోఁ,
బనికత్తె లే దంచు ♦ వనరు నొకఁడు;
ధవుఁ బాయుకాంత యు ♦ ద్వాహంబునాడుచో,
జారత్వ మెట్లంచు ♦ సణుగు నొకఁడు;
భర్తృహీనాంగన ♦ భర్తఁ గైకొన్నచో;
వ్రతము లడఁగు నంచుఁ ♦ గొఁతుకు నొకఁడు;
మృతపతిక సాధ్విగా శిశు ♦ మేధయాగ
మూలదక్షిణ పోనంచు ♦ మూల్గు నొకఁడు;
వీరు పూర్వనాగరికు లా! ♦ పెద్ద లిపుడు,
దుష్కులాచారరక్షణో♦ద్యోగు లకట!

సీ. నీరజాక్షి చదువు ♦ నేర్చుచో నరమాంస
విక్రయం బెట్లంచు ♦ వెఱచు నొకఁడు;
మానవతి విదుషి ♦ యైనచో వెఱ్ఱినో
ములు పట్టు నెట్టంచుఁ ♦ బొక్కు నొకఁడు;



కమలాస్య సద్విద్య ♦ కఱచుచో ననుదేవు
నిఁగ నెంచు టెట్లంచుఁ ♦ బొగులు నొకఁడు
పికవాణి పాండితి ♦ బెర యుచో దెబ్బలు
పడుట యెట్లంచును ♦ బనవు నొకఁడు;
హంసయాన విద్యావతి ♦ యయ్యె నేని,
ప్రతిమలను గొల్చు టెట్లంచుఁ ♦ బదరు నొకఁడు;
వీరు పూర్వనాగరికు లా ♦ పెద్ద లిపుడు
దుష్కులాచారరక్ష ణో ♦ ద్యోగు లకట!

సీ. తరవాణి ముందుగాఁ ♦ ద్రాగి శ్రాద్ధము పెట్టి,
నిష్ఠాపరుల మంచు ♦ నిక్కువారు,
సంధ్యావార్చక చల్ది ♦ సాపాటు గావించి,
కర్మిష్ఠులమటంచుఁ ♦ గవియువారు,
కల్లుసంద్రము లాది ♦ పేళ్లెన్నొ వల్లించి,
శాస్త్రవేత్తలమంచుఁ ♦ జాటువారు,
కల్లుకం పడఁగంగఁ ♦ బెల్లుచుట్టలు ద్రాగి,
యాహితాగ్నుల మంచు ♦ నడరువారు,
న్యాయసభలందుఁ దప్పు సా ♦ క్ష్యంబు లిచ్చి,
శిష్టజనవరిష్ఠుల మంచుఁ ♦ జెలఁగువారు,
వీరు పూర్వనాగరికు లా ♦ పెద్దలిపుడు
దుష్కులాచారరక్షణో ♦ ద్యోగు లకట!

సీ. బాలరండల కాశ ♦ పడి చెడి విధవల
పెండ్లిండ్లు వలదంచుఁ ♦ బ్రేలువారు;
రాళ్లఁ గొల్చుచుఁ దూలి ♦ బ్రహ్మంబు సేవించు
వారె భ్రష్టు లటంచు ♦ వదరువారు,

కన్నకూఁతుల నమ్ముఁ ♦ గాఁ గోరి బాల్యవి
వాహముల్ మేలంచు ♦ వాగువారు,
చాటునఁ గల్లుఁద్రాగి ♦ చనుదెంచి తేయాకు
నీరానువారి నిం ♦ దించువారు,
స్త్రీల వంచించి మించి బా ♦ ధింప నెంచి
యబలలకు విద్య కీడంచు ♦ నఱచువారు,
వీరు పూర్వనాగరికు లౌ ♦ పెద్ద లిపుడు
దుష్కులాచారరక్షణో ♦ ద్యోగు లకట!

అను పద్యములు 1892 వ సంవత్సరము సెప్టెంబరు నెలయందుఁ బ్రచురింపఁబడిన సత్యసంవర్ధని యొక్క రెండవ సంపుటముయొక్క మూడవసంచికయందుఁ బ్రకటింపఁబడి యున్నవి. ఇట్లీసత్యసంవర్ధని పత్రిక కప్పుడప్పుడు వ్రాయుచు వచ్చిన "కలిపురుషశనైశ్చరవిలాసము" "యోగాభ్యాసము" మొదలగునవి యెంతెయు నీతిబోధకంబులుగను, జ్ఞానదాయకంబులుగను నుండి చదివియానందింపఁ దగినవిగా నున్నవి.

దొరతనమువారు, నూతనసంవత్సరారంభమునందును, శ్రీవిక్టోరియా మహారాజ్ఞిగారి జన్మదినమునను, దమపరిపాలనకు లోఁబడిన ఘనతగాంచిన జనుల గౌరవార్థకంబుగ నేఁటేఁట బిరుదునామముల నిచ్చుచుందురు. దేశక్షేమాభివృద్ధుల నపేక్షించువారల కత్యంతోత్సాహజనకంబుగ నుండునటులీ 1893 వ సంవత్సరమునందు, వీరికి న్యాయదయాగుణస్వభావసంపన్నులగు మనప్రభుత్వమువారు "రావుబహద్దరు" అను బిరుదునామము నొసంగియున్నారు. మితిమించిన ప్రయాసంబునకు లోనయి, కష్టసాధ్యములగు కార్యముల నెఱవేర్చిన యీపంతులుగారికి దొరతనమువా రొసంగిన గౌరవంబున కాంధ్రదేశీయులందఱును సంతసింప వలసినదేయున్నది. కాని, యింతవఱకును బిరుదునామముల నందిన వారలయొక్కయు వీరేశలింగము పంతులుగారియొక్కయు సామ



ర్థ్యవిశేషంబును, గౌరవాధిక్యమును యోచించి చూచినప్పుడు మాత్రము, రావుబహద్దరను బిరుదు నొసంగుటవలన వీరేశలింగము పంతులుగారు విశేషముగా ఖ్యాతియు, గౌరవమును గాంచిరని చెప్పుటకంటె నీయాంధ్రదేశంబున నెంతయుఁ బ్రఖ్యాతిని బడసిన వీరేశలింగము పంతులుగారి కొసంగుటవలన "రావుబహద్దరు" బిరుదునకే యెక్కువగా వన్నెవచ్చియున్నదని నేను దృఢముగాఁ జెప్పఁగలను.

ఈరావుబహద్దరను బిరుదును గూర్చి యిక్కడి పఠనమందిర సమాజమువారు 1893 వ సంవత్సరము జనవరి 2 వ తేది నొక సభచేసియున్నారు. ఆసభయందిక్కడ రాజకీయ శాస్త్రపాఠశాలయందుఁ బ్రధానోపాధ్యాయులు గనున్న ఇ. పి. మెట్కాఫ్‌దొరగా రగ్రాసనాధిపత్యమును వహించిరి. ఆసమయమునందు, మెట్కాఫ్‌దొరగారు, వీరేశలింగముపంతులుగారిం గూర్చి హృదయాకర్షణ యోగ్యంబుగ సహజగంభీరభాషణంబులఁ జెప్పిన యంశంబుల నించుక చక్కఁగా యోచించువారలకు వీరేశలింగముపంతులుగారు తమపైయధికారుల గౌరవానుగ్రహముల నెంతవిశేషముగా సంపాదించుకొనఁ జాలిన సుస్వభావమును, సామర్థ్యాతిశయమును గలవారలో సులభంబుగ బోధపడక మానదు గదా!

ఈ1894వసంవత్సరమునందు రాజ్యలక్ష్మీదేవిగారును, బసిప్రాయమునుండియుఁ గుమారునివలె నతిగారాబంబునఁ బెనుచుకొనుచున్న వీరేశలింగమను చిన్నవాఁడును, దామునుగలసి చెన్నపురంబునకరిగి, వేసంగికాలపుసెలవులలో, ననేకసంవత్సరంబు లుపనిషత్తులు మొదలగు హిందువుల యుద్గ్రంథములు దెలుఁగర్థముతోఁ జనువఁగలుగఁజేయుభాగ్యమునుగలిగించుచు దేశసంచారము చేయుచుండి విశేషముగాఁ బాటుపడుచువచ్చిన లోకాంతరగతులయిన బ్రహ్మశ్రీ మన్నవబుచ్చయ్యపంతులుగారి ప్రోద్బలంబున నక్కడదాము కొనినగృహమునందే సుఖముగాఁ

కాలముగడపి మఱలనిటకు వచ్చియున్నారు. వేసంగికాలమునందిక్కడ నెండలువిశేషముగా నుండుటచే నే సముద్రతీరప్రదేశంబునకో లేక యే చలువప్రదేశంబునకో యరుగుచుండుటయు నక్కడి మిత్రబృందముతో లోకోపకారకరకార్యములనుగూర్చి సదాలోచించుచుండుటయు వీరికిఁజిరకాలమునుండి వాడుకగానుండియున్నది. వీరుసాధారణముగా నెప్పుడు నేదియో వ్రాయుచునో లేక యేయింగ్లీషు తెలుఁగు సంస్కృతగ్రంథములను జదువుచునో లేక యేపత్రికలనో చదువుచునోయుండునట్టి స్వభావంబుగలవారలగుటంజేసి చెన్నపురంబుననున్న యాసెలవులలో బుచ్చయ్యపంతులుగారిచే నెంతయు జ్ఞానదాయకంబుగనుండునట్లుగఁ బ్రకటింపఁబడుచువచ్చిన హిందూజనసంస్కారిణి యనుమాసపత్రికకు జీసస్‌చరిత్రమును మిగులహృదయరంజకంబుగ నుండునట్టి శైలిని వ్రాయుచువచ్చిరి. కాని యిప్పటికాఱుప్రకరణములు మాత్రమే ముగింపఁబడినవి. ఈచరిత్రమును జదివిచూచువారలకు జగత్ప్రసిద్ధమతోద్ధారకులలో నొకండగు జీసస్ మహాపురుషునియెడలను వానిమతబోధలయెడలను నీచరిత్రకారునికెట్టి గౌరవాభిప్రాయములు గలిగియున్నదియును వెల్లడిగాకమానదు. మఱియు నిందుసందర్భానుసారంబుగ నెన్నియో లోకానుభవసిద్ధాంతములెంతయుఁ జక్కగా వివరింపఁబడియున్నవి. మతాచారసంస్కారులు సాధారణంబుగఁ బాలగుచుండు నిరంతరానేక కష్టములను నట్టివారలయెడల నాయాకాలములయందుండు జనులుచూపుచుండు నిరసనేర్ష్యాదిదుస్స్వభావములను గాలక్రమంబున నట్టివారలు మరణానంతరంబునఁ బొందుచుండు గౌరవాదులను వ్యక్తీకరించియున్నారు.

ఈజీసస్ చరిత్రములోని,

„అతఁడాటలకయి గ్రామసమీపమున నుండుకొండలకుఁబోయి తోడిబాలకులతోఁగూడి విహరించియుండును. కొంతసేపాటలాడిన



చ్చి యతఁడు వడ్రపుపనిలో తనతండ్రికి తోడుపడుచుండియు నుండవచ్చును. అతఁడుచిన్నతనములో తండ్రివద్ద పనినేర్చుకొని కొంతకాలము కులవృత్తిని చేసెననుటకు సందేహము లేదు. „

„లోకోపకారులైన మహాపురుషులకు వారితరువాతివారు మహావంశసంభవతయు దేవాంశసంభవతయు నారోపించుటయెచ్చటను క్రొత్తగాదుగదా!„

„కానియతఁడు వేదములయొక్క యీశ్వరకర్తృకత్వమును పరబ్రహ్మముయొక్క యవతార సద్భావమును నిరాకరించి బ్రాహ్మణులతో బ్రబలవిరోధము పెట్టుకొనెను.„

„కన్నులుమూసికొని ప్రార్థించునప్పుడు జనులుతమ్ముచూచుచున్నారోలేదో కనిపెట్టుటకై నడుమ నడుమ కన్నులు తెరచి చూచుచుండుటయు, ఇతరులు తమ్ముదాతలని చెప్పుకొనుటకయి డంబముతో నలుగురును చూచునట్లు దానములు చేయుచుండుటయు తమ్ము పుణ్యపురుషులని జను లనుకొని గౌరవించుటకయి భక్తవేషమున కనుకూలముగా వస్త్రధారణము చేసికొనుచుండుటయు లోనుగాఁగల దాంభికవ్రతముల నతఁ డనుదినమును ఫారసీలలోఁ జూచికోతపడి యెల్లవారిమనస్సులను పరిశోధించిచూచుచుఫలము లిచ్చెడు సర్వేశ్వరుఁడంతటనిండియుండఁగాఁ దదనుగ్రహకరణమునకు దాంభికులైన యాచార్యపురుషులతో పనియుండదనియు కొడుకులకును తండ్రికిని నడుమ మధ్యవర్తులుండవలసిన యక్కఱ లేదనియు మనశ్శుద్ధిలేనప్పుడు బాహ్యస్నానములు మనుష్యుని పవిత్రుని జేయఁజాలవనియు కనఁబడినవారికెల్లను నిర్భయముగా బోధింపనారంభించెను.„

„ప్రకృతిశాస్త్రజ్ఞానమత్యల్పముగానుండిన యాకాలములో నతఁడు ప్రార్థనలచేత తానుమేఘమార్గమును మరల్పఁగలననియు, రోగమును మరణమును మాన్పఁగలననియు, సమస్తము నీశ్వరేచ్ఛాయత్తమగుటచే భక్తపరాధీనుఁడైన యతఁడు భక్తజనాభీష్టసిద్ధికలిగించుటకై

గొట్టియద్భుతములైనఁ జేయవచ్చుననియు, నమ్ముటయొకవింతగాదు.,,

"అడవులకుఁబోయి కాయములు శుష్కింపఁజేసి తాపసులయి వసించుట యీ దేశమునందువలెనే యాదేశమునందును పూర్వకాలము నందాచారమయి యుండెను.,,

"స్నానములు ముక్తిదాయకములని ప్రాగ్దేశమునందెల్ల వారికి నమ్మకమగుటనుబట్టి యతఁడు జనులుపశ్చాత్తప్తులయి తనశిష్యులగుటకుంగముగా జ్ఞానస్నానమనుపేర జార్డన్‌నదీజలావగాహన మేర్పఱిచెను. ఆతనియాయుపదేశమువిని పశ్చాత్తప్తులయి వేలకొలఁది జనులుకన్నులనీరుగారముంకలలోనుండి వెలువడిపోయి నదిలోస్నానముచేసి వచ్చి యాతనికి శిష్యులగుచుండిరి.,,

"దయ్యములనుగూర్చిన నమ్మకమాకాలపువారి కందఱికిని నున్నట్లే జీసస్సునకుఁ గూడనుండి యుండవచ్చును.,,

"మతాచార్యులు ప్రతిదేశమునందును మాయలమారులై, దేశక్షేమమునపేక్షించి తమమార్గములకుఁ బ్రతికూలముగా పనిచేయువారిని వారిపూనికనుండి మరల్చుటకయి నయమున భయమున బతిమాలియు బెదరించియు నానావిధమాయోపాయములు పన్నుదురు.,,

అనువాక్యములవలన నీచరిత్రకారునికి జీససునెడల నెట్టియుద్దేశమున్నదియును వెల్లడియగుచున్నది. మఱియు నిందుస్వానుభవము పనేకస్థలములయందుఁ గానవచ్చుచునేయున్నది. వీలుపడినప్పుడీచరిత్రము ముగింపఁబడఁ దగినదిగానున్నది.

* * * * * *

మతాభిమానుల కందఱకును మతస్థాపకులచరిత్రములను జదివి యొందుముయాలమున జీవితకాలమునందు సుఖానందములనందుట యత్యంతావశ్యకమయిన కార్యమని నేనిటఁ బేర్కొనఁ జెప్పనక్కఱలేదు. చదువరులకెంతయు హృదయరంజకంబుగ నుండకమానదని చెప్పవలసి



న మనోహరముగునటులు వ్రాయఁబడుచువచ్చిన యీశైలినే, సాధ్యమగునంత శీఘ్రకాలములో, బుద్ధునియొక్కయు, మహమ్మదుయొక్కయు చరిత్రములనుసహితము రచియించిప్రచురించెదరని కోరుచున్నాఁడను.

* * * * * *

తరువాత 1895-96 సంవత్సరములలో నేపకారముగానైనను చెన్నపురంబునకుంజని యక్కడ నొకముద్రాక్షరశాలను స్థాపించి, తాము రచియించిన గ్రంథములనెల్ల నింగ్లీషుకవుల గ్రంథములవలె సంపుటములుగ ముద్రింపవలయునని నిశ్చయించుకొని చెన్నపురంబుననున్న రంగయ్యసెట్టిగారు మొదలగువారల సాహాయ్యంబున నక్కడిరాజధానీ సర్వకలాశాలయం దాంధ్రపండితులుగఁ దమయుద్యోగమును దమబుద్ధికౌశలంబున మార్పించుకొని, 1897వ సంవత్సరాంతమునఁ జిరకాలంబునుండియున్న తమ శ్రీవివేకవర్ధని ముద్రాక్షరశాల నిక్కడి మ. రా. రా. చిత్రపునరసింహరావుగారికి విక్రయించి యేతత్సంవత్సరాంతముననే చెన్నపురంబునకుం బయనమయిచని యక్కడ శ్రీచింతామణి ముద్రాక్షరశాలను స్థాపించి, తమగ్రంథములనెల్లను, ప్రహసనములు, నాటకములు, భాషాంతరీకృతనాటకములు, వచనప్రబంధములు–పద్యకావ్యములు, స్త్రీలకుపయోగించు కథలు స్త్రీలకుపయోగించు పుస్తకములు, ఉపన్యాసములు—జీవచరిత్రములు, సాహిత్యప్రకృతిశాస్త్రగ్రంథములు, కవిచరిత్రములునని పదిసంపుటములను మొత్తము మీఁద నిరువదిరూపాయలు విలువగలిగియుండునట్లుగఁ జక్కగహృదయాకర్షణ యోగ్యంబుగనుండునట్లుగఁ బ్రకటించియున్నారు. చెన్నపురంబుననున్న యీకాలమునందే పూర్వకవికృతములయిన "చిత్రభారతము" "పరిభావతీప్రద్యుమ్నము," "దశకుమారచరిత్రము,, "ఉత్తరహరివంశము" ననుపద్యకావ్యరత్నముల నెంతయు బ్రయాసపడి ముద్రింపించి మనయాంధ్రభాషకు మహోపకారంబును గావించియున్నారు.

పత్రికలను స్థాపించియు, నుపన్యాసంబుల నొసరెగుచును దను చేతనగుకొలందిని దేశక్షేమమునకును, భాషాభివృద్ధికిని నిరంతరమును బాటుపడుచు, లెక్కలేనిశిథిల తాళపత్రగ్రంథములను సంపాదించియు, జీర్ణములగుకాగితపు వ్రాతప్రతులను సంపాదించియు, నింతింతని చెప్పుటకు వీలులేనిశ్రమకులోనై, యోపికతోఁ బరిశీలించిచూచి, సవరించి, కవిరాజమనోరంజనము, మొల్లరామాయణము, ప్రభావతీప్రద్యుమ్నము, పాంచాలీపరిణయము, రామాభ్యుదయము, యయాతిచరిత్రము, విజ్ఞానేశ్వరము, ఉత్తరహరివంశము, చిత్రభారతము, పంచతంత్రము రాజశేఖరచరిత్రము, ఆంధ్రభాషాభూషణము, అడిదముసూరకవి ప్రణీతగ్రంథములు, శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానము, ఆంధ్రభాషార్ణవము, జైమినిభారతము, చమత్కారమంజరి, ప్రబోధచంద్రోదయపద్యకావ్యము, దశకుమారచరిత్రము, సుదక్షిణాపరిణయము, భోజరాజీయము ననునిరువదియొకం డమూల్యగ్రంథముల నాంధ్రభాషాయోషామణికి కలంకారంబులుగ నొసంగిన వీరేశలింగముపంతులుగారియెడ మనయాంధ్రదేశీయులంద ఱెంతకృతజ్ఞులుగా నుండవలసినదియో నేనూహింపఁ జాలకున్నాను.

* * * * * * *

1900వ సంవత్సరము ఫిబ్రవరినెల 28వ తేదిని న్యాపతి సుబ్బారావుపంతులుగారి సోదరులగు శేషగిరిరావుపంతులుగారికి స్త్రీపునర్వివాహమును జరిగించియున్నారు. ఈవివాహముజరిగినతోడనే, చిరకాలమునుండి దేశభాషాభివృద్ధికరంబుగను, సంఘసంస్కారాభివృద్ధికరంబుగను గాఢంబుగ నల్లుకొనియున్న సహవాసమున కీయిరువురకును భంగముకలిగినదని సంతాపకరంబుగఁ జెప్పవలసియున్నది. స్నేహితునకాగ్రహమువచ్చునని యించుకయును దలంపక సత్కార్యమని తమయంతరాత్మబోధించిన కార్యమునుండి తమమనస్సును మఱలింపక కార్యసామ



ర్థ్యంబును గాంచినవీరేశలింగముపంతులుగారి స్వభావముబోధపడకమానదు. స్త్రీపునర్వివాహవిషయములయందు వీరేశలింగముపంతులుగారికిఁ జిరకాలంబునుండి సర్వవిధంబుల సాయపడుచువచ్చిన సుబ్బారావుపంతులుగార్లు, తమసోదరునకు వివాహముచేయఁబడిన తోడనే వీరేశలింగముపంతులుగారితోడం దమకుంగల సహవాససంబంధమును సంపూర్ణంబుగా మానుకొనుటకు ముఖ్యకారణము, సుబ్బారావుపంతులుగారికి సంఘసంస్కారమునం దభిలాష లేకుండుట యనికాని, వీరేశలింగముపంతులుగారి యెడల వారలకు గౌరవముతగ్గిపోవుటయని కానినేఁ జెప్పఁజాలనుగాని, పెంచి, విద్యాబుద్ధులుచెప్పి పెద్దవారలనుగఁ జేసి, కొండంతయాశతోనున్నవారు పరితాపము నొందుచున్నారనుమనోవిచారమేయని మున్మాటికిని జెప్పఁగలను. మఱియు నిప్పుడా శేషగిరిరావుపంతులుగారు లోకాంతరగతులగుటవలన మఱియు సంతాపకరంబుగ నుండకమానదుగదా!

* * * * * * *

చెన్నపురంబుననున్న యీకాలమునందే, పసితనంబునుండియు నింతింతని చెప్పనలవిగాని ప్రేమానుబంధంబునఁ దాముపెనుచుకొనుచుండినవారు, తమతండ్రిగారును, సాహసంబున మొదట స్త్రీపునర్వివాహంబును జేసికొనినవారు నగుగోగులపాటి శ్రీరాములుగారిహితోపదేశంబున శాస్త్రయుక్తంబుగఁ బ్రాయశ్చిత్తమును గావించుకొని, హిందూసంఘములోఁ గలిసి, యంతవఱకును బట్టపరీక్షయందుఁ గృతార్థులగునంతవఱకును, "గందుకూరివీరేశలింగ"మనియే పిలువఁబడుచుఁ, బిమ్మటనొక్కయింటిపేరును మాత్రమే మార్చుకొని, యిప్పుడు, "గోగులపాటి వీరేశలింగ" మని పిలువఁబడుచున్నారు. చిరకాలమునుండి వీరేశలింగముపంతులుగారును, విద్యాసాగరునివలెనే తమకుమారునకు నొకమంచి సంబంధమునుగుదిర్చి స్త్రీపునర్వివాహమునే చేయవలయు ననియేలోప

లనాలోచించుచుఁ దమకుం బిమ్మటఁ దమయాస్తినంతయు నీయవలయు ననితలంచుచునేయుండిరని నిస్సందేహముగాఁ జెప్పఁగలను. కాని, యట్టి యాస్తి నంతయును దృణప్రాయముగాఁ దలంచి తమయంతరాత్మబోధలననుసరించి ప్రవర్తించిన నాప్రియమిత్రమగు గోగులపాటి వీరేశలింగముగారి స్థిరస్వభావంబునకుం గొంతవఱకు సంతోషించుచునేయున్నాఁడను. వీరేశలింగముపంతులుగారికి సంతానము లేకయున్నను, లోకానుభవమించుక స్వానుభవమునకువచ్చి, లోకానుభవకవిశిఖామణియగు కనుపర్తి అబ్బయామాత్యుని “కవిరాజమనోరంజనము”నందలి,

చ. కొడుకులు గల్గుదాఁక నొక ♦ కొన్నిదినంబులు చింత నందనుల్
పొడమిన నాయువు స్బలము ♦ బుద్ధియు విద్యయుఁ జాలఁ గల్గఁగా
నుడుగనిచింత కల్గి తను ♦ నోలి భజింపనిచింత తండ్రి కె
ప్పుడుఁ గడుచింత సేయుదురు ♦ పుత్రులు శత్రులుగాక మిత్రులే?

అనుపద్యరత్నమునందలి భావములనేకములు మనసునకు స్ఫురించియే యుండవచ్చును.

* * * * * * *

తరువాత 1904వ సంవత్సరాంతమున నుపకారవేతనముం గైకొని, తాము చేయఁ దలంచుకొన్నపనిని తమ్మెఱింగియున్న యీపట్టణమునకే వచ్చి యెఱింగియున్నవారలలోనే యారంభించుట యధికప్రయోజనకరంబుగనుండునని చక్కగా భావించుకొని, లోకములో జన్మభూమి యెట్టివారికిని బ్రియతమమైనదియే యగుటం జేసి, చెన్నపురంబునఁ దాము కొన్నమేడ యిండ్లను, దామక్కడనున్నకాలంబున స్థాపించిన వితంతుశరణాలయగృహంబునువిడిచి, యీరాజమహేంద్రవరంబునకే మఱలి వచ్చిరి. లేశమయినను విసుగులేనివీరు గ్రంథకర్తల కాయుధమని చెప్పనొప్పుకలమును విడువఁజాలని స్వభావము విశేషముగానలవాటుపడినవారలగుటచే నిక్కడకు వచ్చిన శీఘ్రకాలములోనే, విక్రయింపఁగా



మిగిలిన శ్రీచింతామణీముద్రాక్షరశాల నిటకుం దెప్పించి, 1905వ సంవత్సరము మార్చి 1వ తేదినుండి “సత్యవాదిని” యనువారపత్రికను బ్రకటింప నారంభించి యెప్పటివలెనే సంఘసంస్కారాభివృద్ధికిం బాటుపడ నారంభించిరి.

ఈసత్యవాదిని పత్రికయొక్క మొదటిసంచికయందు దీర్ఘమగు స్వవిషయమును వ్రాసి “మాయభిప్రాయములతో నేకీభవింపనివారు మమ్ముదూషించినను, దూషణమునకుఁ బ్రతిదూషణముచేయక “సత్యమేవజయతే” యనువాక్యమును మూలసూత్రముగాఁ గైకొని, మాకుఁ దోఁచినయుక్తులను జూపి, దానిఫలమును సత్యస్వరూపుఁడైన యీశ్వరునికే విడిచిపెట్టెదము. ఈశ్వరుఁడు మాకు సహనమును, పరోపకారచింతయు సదా కలిగించునుగాక!” అని దానిని ముగించి యున్నారు. తరువాత నీపత్రికయొక్క 5వ సంచికయందు, 1905వ సంవత్సరము మార్చి 29వ తేదిని “సాభిప్రాయవిషయన్యాసము” అనుశీర్షికక్రింద “విపరీతవివాహము” అని,

“పట్టపరీక్షయందుఁ గృతార్థులయి, సరస్వతియను పత్రికకధిపతులయి సంస్థానాధిపతులలో వివేకులని పేరొందఁదగిన శ్రీపోలవరము జమీన్దారుగా రీనడుమతమవివేకమును విడిచి విధ్యుక్తముగా వివాహమాడిన భార్యవిలపించుచుండఁగా విడనాడి పదేండ్లపసుచును మరల వివాహమాడిరని వినుటకెంతయుఁ జింతనొందుచున్నారము. ఈయన యారంభదశయందు సంఘసంస్కారమునం దాదరముగలవాఁడయి, బాలవితంతు వివాహములను బ్రోత్సాహపఱచుచు, వితంతుశరణాలయమునకు వేయిరూపాయల నిచ్చియుండుటను జూచి యీయనవలన నీదేశమునకెంతో మేలుకలుగునని తలఁచియుంటిమి గాని యీయనచదువుకొన్న చదువును వయస్సుతో వర్ధిల్లవలసిన వివేకమును నిట్లువదలఁగలిసి దేశమునకనర్థదాయకమగునని మేమెన్నఁడును భావించి

యుండలేదు. ఈమధ్యనీయన యార్యమతోద్ధారకులుగా మాత్రి యార్యమతబోధినికి ప్రధానపోషకులైరని వింటిమిగాని యీయార్యమతాభిమానమింత శీఘ్రకాలములోనే యీయనను సన్యస్తవివేకునిఁజేసి, యధర్మముగా సహధర్మచారిణిని త్యజింపఁజేయునంతటి దుస్థితికిఁదెచ్చునని యూహింపలేకపోయితిమి. ఆర్యమతబోధిని యీవివాహమునెట్లు వర్ణించి శ్లాఘించునో చూడవలసి యున్నది. ఆర్యమతబోధిని యని నేతిబీరకాయవలె పేరుపెట్టుకొని, దేశాభివృద్ధికయి పాటుపడెడు సంఘసంస్కర్తలను నోటికసిదీఱ నిష్కారణముగా నిందించుదీక్షను వహించుటకంటె నీతినివృద్ధిచేయుటకై ప్రయత్నించుట యెంతయధికశ్రేయోదాయకముగా నుండును! నీతిమాలిన చదువుచదువుకాదు; ఎంతచదివినవాఁడైనను, నీతిలేనివాఁడైనచో నట్టివాఁడు సజ్జనపరిత్యాజ్యుఁడయి పవిత్రమైనమనుష్య నామమునకే యనర్హుఁడగును. భ్రమప్రమాదాదులు మనుష్యులకు సహజములగుటచేత తప్పుచేయుట వింతకాదు. చేసినతప్పును దెలిసికొని, మించినదాని కనుతాపపడి, ముందు తనప్రవర్తనమును బాగుచేసికొనుట బుద్ధిమంతునిలక్షణము. కాఁబట్టి యుత్తమురాలైన తమప్రథమభార్యను మరలఁగొనివచ్చియింటనుంచుకొని యాదరించి చక్కఁగా నేలుచుకోరితెచ్చుకొన్న యీక్రొత్తభార్యయెదిగి కాపురమునకువచ్చినప్పుడీయుగ్రమహిషికిఁ గలిగించినసౌఖ్యమునే కలిగింపక యన్యస్త్రీవిముఖముతో నాయబలనర్ధాఁగియనుటకుఁ దగినట్లుగానాదరింతురని మాజమీన్‌దారుగారికి హితబోధచేయుచున్నారము. ఇట్లుచేసినచో నీయవమానకర వివాహమువలనఁ గలిగెడు దుష్ఫలములంతగా ననర్థదాయకములు కాకుండును. ప్రథమభార్యయిట్లు పరితాపపడుచుండఁగా నోరెఱుఁగని తనకూఁతుని మరల నిచ్చి వివాహముచేయుటకీక్రొత్తమామగారికి మనసెట్లువచ్చినదో! ధనమునకాశపడి లోకములో నెటువంటివారును తమకన్నకూఁతులనైన ధనాశాపిశాచమునకు బలియిత్తురుగదా!,,



అనుకూలములవంటి వాక్యములను జూచినతోడనే కాకినాడలోఁ బ్రకటింపఁబడుచుండిన ఆర్యమతబోధిని యనునార్యమతబోధకపత్రికారాజము పదతాడితమహాదందశూకంబువలె బుసలుకొట్టుచు నేమేమో నిరర్థకాగ్రహవాక్యజ్వాలలను వెడలింపనారంభించుచు వీరేశలింగము పంతులుగారికిం గృతఘ్నతాది దోషముల నారోపింప మొదలుపెట్టి యుండుటంజూచిజూచియూరకుండనేరక సత్యవాదినియును బ్రత్యుత్తరములకుం బ్రారంభించియేయుండెను. అందులకుం దరువాతఁ బ్రకటింపఁబడిన సత్యవాదినిలోని కాకినాడకాకాశాతి ఉత్తరము ననునవియే ముఖ్యనిదర్శనంబులుగనున్నవి.

సత్యవాదినిపత్రికలో వీరేశలింగముపంతులుగారు "అతిపరిశ్రాంతిచే దుర్బలశరీరుఁడనయి విశ్రాంతి నపేక్షించియున్న వృద్ధునకునాకు సహితము మరలనిప్పుడు వ్రాయుటకు యౌవనమునందలి శక్తినిచ్చుచున్నది.,, అనివ్రాసి ప్రకటించిన యత్యంత దీర్ఘమయిన ఉత్తరములోని

"శృంగారప్రబంధమగు నారసిక మనోరంజనము శృంగారప్రబంధములే మంచి వనుకొను బాల్యదశలోఁ జేయఁబడినదియు నట్టిగ్రంథములు దేశక్షేమకరములు కావన్న యభిప్రాయము కుదిరినతరువాతమరల నట్టిశృంగారకావ్యములు నాచేరచియింపఁబడలేదనియు నీనీతిశాస్త్రబ్రహ్మకొకవేళఁ దెలియదనుకొన్నను నేనుదెలిపినపిదపనైనను గడచినదానిని త్రవ్వక యూరకుండ వలసియుండును.

నన్నుస్తుతించుచు నాజన్మదినోత్సవమును జరుపుటకేనుప్రోత్సాహ పరచినట్లర్థము వచ్చునట్లుగా నార్యమతబోధిని సూచించుచున్నది. నేనుచెన్నపురిలోనున్నప్పుడు సహితమిట్టి యుత్సవము జరుపవలదని తత్ప్రేరకులకు వ్రాసియుంటిని. ఇక్కడకు వచ్చినతరువాత సహితమీసంవత్సరమట్టిపని నడపవలదని ప్రార్థించి బహువిధముల నిరుత్సాహపఱచియున్నాను. ఐనను నామాటచెల్లినదికాదు. నామిత్రులుకొంత

రువచ్చి యీయుత్సవసమయమునందచ్చటికి రావలసినదని నన్నెంతని ర్బంధించినను వారిమాటనంగీకరింపక యక్కడికిఁబోవమానితిని. ఇంత కంటె నేనేమిచేయఁగలను? నామిత్రులుశత్రులయినారని కాకినాడయా ర్యమతబ్రహ్మలాక్షేపించిన న్యాపతిసుబ్బారావు పంతులవారు సహిత ము గతసంవత్సరము జరిగిన యీయుత్సవమునకై దురూపాయలుదయ చేసినారని వార్తాపత్రికలలోఁ జదివితిని.

సంఘసంస్కర్తలు విద్యార్థులను తలిదండ్రులనుండి విడఁదీయు చున్నారన్న మాటమనకల్లలపండితుని కవనకల్పనయేకాని సత్యముకాదు.

ఈనడుమ నేవితంతుశరణాలయమునకు వేయి రూపాయలనిచ్చి నమహోపకారిని కృతఘ్నుఁడనయి నేనేమోతిట్టితినఁట! ఈదూషణ పండితుని పాండిత్యమెంత శ్లాఘనీయముగా నున్నది! ఈయనకుఁ గృతజ్ఞ తకును, కృతఘ్నతకును గలభేదము తెలియనట్టున్నది. ఒకరిమేలుకోరి చెప్పినహితవాక్యములుతిట్లఁట! హితబోధచేయుటకృతఘ్నతయఁట! ఇటు వంటి విపరీతబుద్ధులుగలపండితులు పత్రికాధిపతులయి లోకమునకుతమ నీ తులను గఱపఁబూనినచో లోకముబాగుపడకుండునా? ఒకనిపోషకత్వ ములోనుండి వారుతప్పుదారి త్రొక్కినప్పుడు చెవికి చేదుగానుండుహిత మును జెప్పధైర్యములేక యిచ్చకములాడుటకృతఘ్నత. తమకుమేలు చేసిన వారకార్యకరణమునకుఁ బూనినప్పుడు వారియాగ్రహమునకు భయపడక యప్రియములయినను హితవాక్యములను నిశ్శంకముగాఁ బలుకుట కృతజ్ఞత. నాకువారియెడలఁ గృతజ్ఞతకలిగియుండుటబట్టియే నిర్భయముగా నేను హితముచెప్పసాహసించితిని. ఆయనకు హితము చెప్పి సన్మార్గమునకుఁ ద్రిప్పజూచుటకనేకవిధముల నాకు స్వాతంత్ర్య ముగలదు. ఆయన నాకు బంధుఁడు; శిష్యుఁడు; మిత్రుఁడు. ఈమూఁడు సంబంధములనుబట్టి యాయన చేసినకార్యమకార్యమనియు మించినదా నికి పశ్చాత్తాపపడి పాపపరిహారప్రయత్నము చేయవలసినదనియు, తాను



చేసినపనియే మంచిదని సాధింపఁజూచుట యపచారమనియు వారిక్షేమ మునుగోరి మరలహెచ్చరించుచున్నాను. ఆర్యపత్రికావిలేఖకుఁడయిన యీయసంగతబ్రహ్మ తానుచేసిన పనికి సిగ్గుపడవలసినదానికి మాఱు గాఁ దనపత్రికకు జమీందారుగారు పోషకులగుటకోర్వలేక, యిట్లువ్రా సినట్లునాయందునిందారోపణము చేయుచున్నాఁడు. * * * ఈయపూర్వపత్రికావిలేఖకుఁడుతనస్వభావమును నాకారోపించి తనబు ద్ధిలక్షణమును వెల్లడిచేసికొనుచున్నాఁడు. వేయిరూపాయలుకాదుకదా యిటువంటి మఱిపదివేలరూపాయలయినను ఇచ్చకములాడుటకు దుర్నీ తిని పోషించుటకును ఇచ్చినయెడల నేను తృణప్రాయముగా నిరాకరించె దను. నేనధికధనవంతుఁడను కాకపోయినను నాకు జమీన్దారీలేక పోయినను నాభోగానుభవములను తగ్గించి మిగిల్చి యీధర్మకార్యము నకై యింతకుపదిరెట్లు నేనిచ్చియుండుట లోకమెఱుఁగును. జమీన్ దారుగారిచ్చిన వేయిరూపాయలనైనను వితంతు శరణాలయమున కిచ్చి రిగాని నాయుపయోగమునకయి కాదు. ఆయనయిచ్చినవేయిరూపా యలను నిధిగానుంచి యన్నివ్యయములను నేనేయింతవఱకు భరించు చున్నాఁడను.,,

"నాబోధను శ్రీగోగులపాటి వీరేశలింగముగారును, న్యాపతి సుబ్బారావుపంతులుగారును దివాన్‌బహదర్ ఆర్. రఘునాథరావుపం తులుగారును, పల్లెచంచలరావుపంతులుగారును కూడ వదటఁగలిపిరని మాయపర సత్యహరిశ్చంద్రులు వ్రాయుచున్నారు. గోగులపాటి వీరే శలింగమును తల్లిపోవుటచేత పుత్రప్రేమతో నేనుపెంచివిద్యాబుద్ధులు చెప్పించినను, అతఁడు నాపుత్రుఁడుకాఁడనియు నేనాతనిని వితంతువును వివాహమాడుటకయి పెంచలేదనియు నెల్లరునెఱుఁగుదురు. వివాహ ము బలవంతపెట్టి చేయవలసినదికాదనియు వధువుగాని వరుఁడుగా తమయిచ్చవచ్చిన వారిని వరింపవలయుననియు నామతము. అదియేనేను

బోధించెడునీతి. గోగులుపాటి వీరేశలింగము చేసినదానిలో నీతిమాలి నదేదియు లేదు.,,

అను మొదలగువాక్యము లర్థప్రత్యుత్తరములుగనుండి యార్యమతబోధినికి జ్ఞాననేత్రమును జక్కఁగా వికసింపఁ జేయునవిగనే యున్నవని చెప్పవలసియున్నది. ‹‹నానిజమైన లోపములను దప్పకచూపుఁడు; నేను దిద్దుకొనెదను.›, అనివినయమును వెల్లడించుచు, ‹‹మీరిప్పు డార్యమతమును పేరితోబోధించెడి దనార్యమతము; మీరవలంబించు మార్గ మనార్యమార్గము; మీరుబోధించెడి దనార్యధర్మము.,, అని జ్ఞానోదయమును గలిగించి, ‹‹మీరుసత్యమునం దాదరముకలవారు కండు; దుర్నీతినిదూషించు వారుకండు.,, అనిహితోపదేశము నార్యమతబోధినికిం జక్కఁగాఁ జేసియున్నారు.

కాని, ‹‹వెయ్యేఁగా వెయ్యేఁగా వెఱ్ఱివాఁడేగెలిచెనన్న ట్టీయన వ్రాఁతలు జనులనుభ్రమపెట్టి నేనుపూనిన మహాకార్యమునకుఁగూడ విఘాతము కలిగించునని తోఁచినందున,,నని వీరేశలింగముపంతులుగారు వ్రాయుటచూడఁగా మిగులవింతగా నున్నది. ఆపత్రికారాజమునకుం గలలెక్కలేని చదువరులసంఖ్యనుబట్టి యట్లువ్రాసియున్నారో, లేక, యట్టిసుప్రసిద్ధ పత్రికవ్రాసెడు వ్రాఁతవలన జనులుభ్రమపడక మానరను కాలమిదియని నిశ్చయముగాఁ దలంచియట్లు వ్రాసియున్నారో దుర్గ్రాహ్యముగా నున్నది.

* * * * * *

తరువాత సీ 1906వ సంవత్సరము ఫిబ్రవరినెల 12వ తేది సోమవారమునాఁడు ‹‹సంస్కర్తలవిందు,, అనియొకటి జరుపఁబడియున్నది. ఈ విందీమధ్య నూతనముగా యజ్ఞోపవీత విసర్జనముచేసిన దేశిరాజుపెద బాపయ్యపంతులు బి. ఏ. యల్. టి. గారియింట పితృదినమగుటంజేసి యాసందర్భమున జరుపఁబడినది. యజ్ఞోపవీతవిసర్జనమును గావించు



కొనిన యీబాపయ్యపంతులుగా రావిషయంబున వీరేశలింగముపంతులుగారికి మార్గప్రదర్శకులైరని చెప్పవలసియున్నది. వీరట్లుయజ్ఞోపవీతమును విసర్జించిన శీఘ్రకాలములోనే వీరేలింగముపంతులుగారును దమయజ్ఞోపవీతమును విసర్జించియుండిరి. వీరేశలింగముపంతులుగారు మాత్రమట్లుతమయజ్ఞోపవీతమును విసర్జించివేయుటకు ముఖ్యకారణము, చిరకాలమునుండి తాముహిందూమత శాస్త్రానుసారంబుగఁ గావించుచుండిన స్త్రీపునర్వివాహ కార్యములయందుఁ జాలకాలమునుండి తాముబోధించుచు వచ్చిన బోధనములకు వ్యతిరిక్తంబుగఁ దామాచరింపవలసి వచ్చుచున్న ‹‹గణపతిపూజలు,, పసపుముద్దపూజలు,, మొదలగునవి తప్పిపోవునట్లుగఁ జేసికొనఁదలంచి, యట్లుచేయనిశ్చయించుకొనియుండుటయేయని నేనునిశ్చయముగాఁ జెప్పఁగలను. వీరేశలింగముపంతులుగారు యజ్ఞోపవీతవిసర్జనమును గావించుకొనినది మొదలుకొని తరువాత జరిగినస్త్రీపునర్వివాహ కాలములయందుఁ బీటలమీఁదఁ గూరుచుండి చేయవలసిన వివాహకర్మకాండభారము వారికి లేకయేయుండెను. పరమహాస్యాస్పద మయినదని తమకుందోఁచిన యాకర్మకాండమును దొలఁగించుకొనుటకిదియొకసదుపాయమనియే చెప్పవలసియున్నది.

* * * * * * *

జీవితముయొక్క సార్థకతను కాలదీర్ఘతచేతఁగాక, చేసిన మంచిపనులచేతనే లోకముచే నిర్ణయింపఁబడవలసియుండునను సర్వసిద్ధాంతమును జేసికొనిన వీరేశలింగముపంతులుగారు,

ఉ. దేహము వాయుసంచలిత ♦ దీపిక, పుత్రకళత్రమిత్రసం
దోహము స్వప్నకాలమునఁ ♦ దోఁచెడిసందడి, రాజ్యభోగస
న్నాహము జంత్రపుంబ్రతిమ ♦ నాట్యము, సంపద యింద్రజాల మీ
వైహికసౌఖ్య మేమిసుఖ ♦ మంచుఁ దలంచెద నయ్య! నారదా!

అని యొకానొక లోకానుభవసంపన్నుండయిన పూర్వకవి వరుండు

చెప్పిన వాక్యసారమును జక్కఁగా గుఱుతెఱింగిన వారలగుటం జేసి, తాము నిరంతరాయంబుగ జరుగునట్లు చేయఁదలఁచిన స్త్రీపునర్వివాహ కార్యములుతమయనంతరమునసహితముసాధ్యమగునంతవఱకుఁ జక్కగా జరుగునట్లుగ "రాజమహేంద్రవరపు హితకారిణీసమాజము" అనుపేరిట నొక సంఘము నేర్పఱచి, తమకుంగల గొప్పయాస్తిని మరణశాసన పూర్వకముగా దానమొసంగి, తమకుంగల విశేషౌదార్యస్వభావంబును లోకమునకు వెల్లడించియున్నారు.

లోకములో మరణమెప్పుడు సంప్రాప్తమగునో యెవ్వరికిం దెలియరాదుగదా, "మనమందఱమును మరణమునకు సదా సంసిద్ధులమయి యుండవలెను." అని యొకప్పుడు చక్కఁగా వ్రాసిన వీరు తాము చేయుచున్న కార్యములు లోకము మెచ్చునట్లుగ నడచుచుండవలయునను తలంపుతో మరణశాసనము వ్రాసియుండుట యొకవింతగాదు. మఱియు, మొట్టమొదట స్త్రీపునర్వివాహమును జేసికొనిన గోగులపాటి శ్రీరాములుగారు హిందూమతసంఘమునుండి బహిష్కరింపఁబడి, పిమ్మట భార్యను విడనాడి, యనంతరము క్రైస్తవమతమునవలంబించి, యొక క్రైస్తవమతాంగనను బరిణయమయి, కాలవశులయినపిమ్మట, వారు హిందూమతమునందుండిన కాలంబున జన్మించి మిగుల పసితనంబు నుండియుఁ బుత్రప్రేమతో నీవీరేశలింగముపంతులుగారిచేఁ బెనుపఁబడుచు "కందుకూరి వీరేశలింగ"మని పిలుచుకొనఁబడుచుండిన యిప్పటి గోగులపాటి వీరేశలింగముగారు తమకన్నతండ్రియగు గోగులపాటి శ్రీరాములుగారి యాస్తినంతయును, శ్రీరాములుగారు పెండ్లియాడిన క్రైస్తవాంగనకుం గొన్నివందలరూపాయల నొసంగి, న్యాయశాస్త్రప్రకారముగా స్వాధీనముచేసికొని యుండుటం జూచియును, "ఎవరుముందుగా పోదురో, యెవరెప్పుడుపోదురో, యెవ్వరికిని తెలియదు" అని యొక సందర్భంబున వ్రాసిన వీరొకవేళం దామే ముందుగా లోకాంతరగతు



లగుటయే తటస్థించునెడలఁ దమకుంగల ధైర్యములేక తమ యుద్దేశములకు భిన్నముగఁ దమభార్య లోకమునకు వెఱచియు, బంధుజనుల పలుకుల నాలించియు నడువక తప్పదను దృఢవిశ్వాసముగలిగియుండియును జాలదూరమాలోచించియే వీరు తమమరణశాసనమును వ్రాసియున్నారని మనము నిశ్చయింపవచ్చును.

* * * * * * *

వీరీ 1907వ సంవత్సరమున, నిదానమును దూరదృష్టియునంతగాలేని కొందఱు విద్యాధికులును, బిన్నవయస్కులగుకొందఱు విద్యార్థులును, బత్రికలలో వ్రాయువ్రాఁతలకును, సభలలోనొసంగు నుపన్యాసంబులకును, సలుపుకార్యంబులకును, మిగులవింతయు, నెంతయు వంతయుఁబొందుచుండిరని చెప్పవలసియున్నది. మహోపకారంబునుగావించుచున్న విదేశమునందుఁ గృతజ్ఞతలేనియొక్క స్వదేశాభిమానమంతగాఁ బ్రయోజనకరమగునది కాదను ముఖ్యోద్దేశముగల వీరు కొంతకాలమునకుం దరువాత వ్రాసినయీశ్వర ప్రార్థనమును,

"ఓసర్వకారుణ్యా! మేమెల్లప్పుడును శ్రద్ధాభక్తులతో విద్యనభ్యసించుచు, జ్ఞానాభివృద్ధిని చేసికొనునట్లు ప్రసాదింపుము. విద్యవలన మేము వినయపరులమును, నీతిమంతులమును అయి సర్వకార్యములయందును నీకు ప్రీతికరముగా వర్తించునట్లు మమ్ము నడుపుము. మేము పొందిన విద్యాలాభమును ఇతరులకుఁ గూడఁ గలిగించుచు, స్వార్థపరత్వమును మాని సాధ్యమైనంతవఱకు పరోపకారపరాయణత్వమును పూని, ఈశ్వరభక్తియు, ప్రభుభక్తియు కలవారమయి, మమ్ముఁగన్నతల్లిదండ్రులకును, మేముచదివిన పాఠశాలకును, మేముజన్మించిన దేశమునకును ఖ్యాతితెచ్చునట్టి సద్వర్తనమునుబడయుటకయి సదా ప్రయత్నించుచుండుబుద్ధిని మాకు కరుణింపుము. ఓం. తత్సత్."

అనిముగించి, యందఱకును, ముఖ్యముగా విద్యార్థులకందఱ కును జక్కనిహితోపదేశమును గావించియున్నారు.

రాజమహేంద్రవరపు హితకారిణీ సమాజమునందొక సాంఘి కుఁడుగనుండి, వీరేశలింగముపంతులుగారికి స్త్రీపునర్వివాహకార్యముల యందును, వితంతుశరణాలయాదికార్యములయందును విశేషముగాఁ దోడుపడుచుఁ గుడిభుజమువలెనుండి వారికి విశేషోత్సాహమును గలి గించుచు వచ్చినదేశరాజు పెదబాపయ్యగారు 1908వ సంవత్సరము మార్చినెల 9వ తేది సోమవారమునాఁడు చెన్నపురిలోఁ గాలవశులయిరి. ఇక్కడి ప్రార్థనసమాజములో ననుష్ఠానపరులైన బ్రాహ్మణకుల జులలోనీతఁడు ప్రథముఁడు. 1908వ సంవత్సరము మార్చి 24వ తేది గల ,,సత్యవాదిని,, పత్రికయందుఁ బ్రకటింపఁబడిన ,,వ్యాధిశాంతించిన పక్షమున మేమిచ్చట స్థాపింపఁబోయెడి యాస్త్రీకోన్నతపాఠశాలయందు ప్రధానోపాధ్యాయుఁడుగా నుండి పనిచేయుటకు నిశ్చయించుకొనెను. అట్టిభాగ్యముమాయున్నతపాఠశాలకుపట్టినదికాదు." అను రెండువా క్యములనుబట్టియే, వీరేశలింగముపంతులుగారికా బాపయ్యగారి యెడల నెట్టిగౌరవమిత్రభావములు గలిగియున్నదియును బోధపడక మానదు. శుద్ధవర్తనమునం దెంతయుఁ బూనికగలవాఁడయి, బహుస్థలములకుఁ బోయి త్రాగుబోతుతనమును మాన్పుటకొఱకును, వ్యభిచారవృత్తిని నిర్మూలించువిషయమునందును నుపన్యాసములిచ్చుచువచ్చి, స్వశక్త్యను సారంబుగఁ బాటుపడుచువచ్చిన యీ బాపయ్యగారిని గూర్చి యిక్కడి బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, నవరత్నములని,

మ. అకటా! పోయితె దేశరాజకులదీ ♦ పాంకూరమా! సద్గుణ
ప్రకరా! బ్రహ్మసమాజమందిరమహా ♦ భారోద్వహస్తంభమా!
సకలార్యస్తవనీయవర్తన! సదా ♦ చారప్రియా! ధీవరా!
యకలంకాత్మక! సత్యవాక్యరత! బా ♦ పయ్యా! సుహృద్రత్నమా!



శా. అన్నా! యెక్కడ దాపురించెనొకొ నీ ♦ కాపాడురోగం బయో!
యెన్నో మందులు మ్రింగిచేసితివిగా ♦ యెన్నాళ్లో పథ్యంబు ల
ట్లున్నం దప్పెనె మృత్యు? వింతపని ముం ♦ దుండ న్సుఖంబెట్లగున్
బన్నంబే యగుఁగాని నీకు తుద బా ♦ పయ్యా! సుహృద్రత్నమా!

శా. వంటం జేయఁగ సేవకుండును లభిం ♦ పన్ రానివేళన్ హాయిన్
మంటం జేసి స్వహస్తపాకి వయి నీ ♦ మంబున్ గడున్ ముందుకున్
గెంటం జూచితికాని యేదొమింప చి ♦ క్కాంజాలు నంచూరకో
వంటేఁజాలును మాటలేటికిఁక బా ♦ పయ్యా! సుహృద్రత్నమా!

మ. నినుఁ బైవారలు క్రింది కంపి యవమా ♦ నింపం దృణప్రాయ మీ
పని నాకం చెద నాత్మగౌరవమునే ♦ పాటించి ముమ్మాటికిన్
ధనమే పావనమంచు నెంచ కలవి ♦ ద్యాసాగరుండట్టు లా
పనిమాన్కొంటివి దేశరాజుపెదబా ♦ పయ్యా! సుహృద్రత్నమా!

మ. పినతండ్రుల్దులఁదూఁగువారు సిరులం ♦ బెంపొంది మీమిత్రులున్
ధనవంతుల్మఱి మామగారు తహసీల్ ♦ దారుండు నీకోరుమా
త్రన సాయం బవలీలఁ గూర్తు రయినన్ ♦ రవ్వంతయుం గోర వె
వ్వనిసాయంబును దేశరాజుపెదబా ♦ పయ్యా! సుహృద్రత్నమా!

శా. నీసౌజన్యముఁజూచి నీదువయసు ♦ న్నీనేమముంజూచి యా
నీసామర్థ్యముఁజూచి దేహగతమా ♦ నీరోగముం జూచి హా!
యీసన్మార్గుఁడు మాకు దక్కఁడని నా ♦ జేవీడుకొన్నారుగా
యాసన్మిత్రులు దేశరాజుపెదబా ♦ పయ్యా! సుహృద్రత్నమా!

మ. మదికి న్నచ్చినయట్టిధర్మమును న ♦ మ్మి న్నమ్మిదానిన్ మహా
పద ప్రాపించిన నాచరింపను మనో ♦ వాక్కాయకర్మంబులం
దెది సత్యం బగుదానినే నెఱప నీ ♦ కే చెల్లునయ్యా! గుణా
స్పద సద్వర్తన! దేశరాజుపెదబా ♦ పయ్యా! సుహృద్రత్నమా!

శా. ఎంతో శాంతము బూడిదయ్యెఁ జదు వెం ♦ తే నేలపాలయ్యె నెం
తెంతో మంచితనంబు దగ్ధమయిపో ♦ యెం జెల్లె నెంతో గుణం
బెంతో యీశ్వరభక్తిబూగ్గు లయిపో ♦ యె న్నాఁడు నీతో శ్మశా
నాంతర్భూముల నెంతకష్ట మిది బా ♦ పయ్యా! సుహృద్రత్నమా!
మ. పరమాత్ముండు గుణైకలబ్ధుఁ డయినన్ ♦ భవ్యాత్ములున్ సత్క్రియా
నిరతు ల్సద్గతి గాంతు రంట నిజమే ♦ నిన్ సార్వకాలంబు నీ
శ్వరపాదద్వయసేవకుండ వగుటం ♦ బ్రాపించు నీయాత్మ యీ
శ్వరసాన్నిధ్యము చేశ రాజు పెదబా ♦ పయ్యా! సుహృద్రత్నమా!

అను పద్యములను బ్రకటించి యున్నారు. 1906 వ సంవత్సరారంభము నందుఁ దమబంధు లెంతనిర్బంధించినను దూషించినను సరకుగొనక, యజ్ఞోపవీతమును విసర్జించి, వర్ణభేదమును బాటింపక సర్వవర్ణములవారితోను గలిసి భోజనముచేసి, తాను ధర్మమని నమ్మినదానిని నిశ్శంకముగా నాచరించిన దృఢచిత్తుఁడని క్రియచేఁ జూపియున్నారనియు, బరిశుద్ధాస్తిక మతసిద్ధాంతానుష్ఠానపరులలో మొట్టమొదటివారనియు నెందఱెన్నివిధంబుల శ్లాఘించియున్నను, నేటివఱకును మఱియితరులెవ్వరును యజ్ఞోపవీతవిసర్జనంబును గావించినవారు గానఁబడకయే యున్నారు. తొందరపడియే యట్లు యజ్ఞోపవీత విసర్జనముం గావింపకయే యుండినచో, బాపయ్యగారల్లు పలువిధములగు కష్టములకుం బాల్పడుటయు, సంతాపకరశీఘ్రమృత్యువు పాలగుటయు సంభవింపకయే యుండునని నిశ్చయముగాఁ జెప్పవలసి యున్నదిగదా!

* * * * * *

నేటికి రమారమి నలువదివత్సరములనుండి భాషాభివృద్ధివిషయమునను, సంఘసంస్కరణవిషయంబునను వీడని పట్టుదలతోడను నిరుపమానధైర్యముతోడను పాటుపడుచుండిన వీరేశలింగముపంతులుగారియెడలఁగల కృతజ్ఞతాస్వభావంబుననే పదిసంవత్సరంబులనుండి వీరిజన్మదినమహో



త్సవము హృదయానందకరంబుగ మన తెనుఁగుదేశమునం దక్కడక్కడ ముఖ్యపట్టణములయందు జరుపఁబడుచున్నదని చెప్పుటకు సంతోషము గలుగుచున్నది. జన్మదినమహోత్సవములు వీరారాధనంబును బురికొల్పునని చెప్పవలసియున్నది. ఆయాకాలములయం దాయాదేశముల యందు జనుల పుణ్యావశంబున జ్ఞానసంపన్నులును, వీరవరులు నగు పురుషులును, స్త్రీలును జన్మించుచు జనుల హృదయముల నాకర్షించుచుండుట లోకముయొక్క స్వభావమయియే యున్నది; అట్టి సుగుణసంపన్నుల గుణజాలంబుల ననుకరించునట్లుగఁ దమజీవితకాలమును గడపుచుండుటవలన జనులకు సుఖప్రదాయకంబుగను, శ్రేయోదాయకంబుగను నుండునని వేఱుగఁ జెప్పనావశ్యకము లేదు. ఆప్రకారముగాఁ బ్రతిసంవత్సరమును, వీరి జన్మదినమహోత్సవము పలువురకు సంతోషకరంబుగను, సత్కార్యాచరణమునం దుత్సాహము గలిగించునదిగను జరుపఁబడుచునే యుండెను.

ఈ 1908వ సంవత్సరము ఏప్రియల్ నెల 14వ తేదితో వీరికి నరువదిసంవత్సరములు పూర్తియగుటంజేసి, నాఁడువీరిషష్ఠిపూర్తిజన్మదిన మత్యంతాహ్లాదకరంబుగ వీరియానందాశ్రమంబున జరుపఁబడినది. ఆసంతోషకరసమయమునకు వీరిప్రార్థనంబును గౌరవించి, యనేకులు మిత్రులును, పరిచితులును, సంబంధులునువచ్చి సంస్కారవిషయమునం దమకుంగల గౌరవానందంబులను వెల్లడించియున్నారు. మామండల న్యాయాధిపతులైన బ్రహ్మశ్రీ పార్థసారథిఅయ్యంగారు దయచేసి, వీరేశలింగముపంతులు గారికిని, జూడవచ్చినవారలకందఱకును బరమానందమును గలిగించిరి. మ. రా. శ్రీ గోపిసెట్టి నారాయణస్వామినాయఁడుగారుగురుభక్తితో సత్యంతోత్సాహంబుతోఁ బంతులుగారికి నొకశాలువ నొసంగియున్నారు. చెన్నపురివిజ్ఞానచంద్రికా మండలివారిపక్షమున బ్రహ్మశ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు ప్రీతిపూర్వకముగా నొక

శాలువును బంపిరి. బ్రహ్మశ్రీ ఆదిపూడి సోమనాథరావుగారు ప్రేమతో నూతనవస్త్రంబుల నొసంగిరి. వీటరుగారను వారు పంతులుంగారిఛాయాప్రతిమ నొసంగిరి. మఱియుఁ బిఠాపురపురాజుగారును, మునగాల జమీందారుగారును మొదలగు ధనగుణ సంపన్నులు, పంతులుగారి కభినందన పత్రికలను తంతీవార్తలను బంపి తమకుంగల సంతోషగౌరవభావములను వెల్లడించియుండిరి.

మనయాంధ్రదేశంబున స్త్రీపునర్వివాహ సంస్కరణవిషయంబున వీరు పడిన ప్రయాసమింతింతని చెప్పనలవిగాదు. వీరు నాటిన సంస్కారబీజమంకురించియెదిగి వృక్షమై మహాఫలముల నొసంగి యున్నదిగదాయని హర్షించుచుండిన పంతులుగారినప్పుడు చూచినవారలకు, సత్కార్యాచరణంబునఁ బ్రయాసపడువారలు సఫలప్రయత్నులెన్నఁటికైనను గాకమానరుగదా యనితోఁచియున్నది. వీరిప్రేరణముచేతనే వివాహితలైన వితంతుకాంతలబిడ్డలును, బిడ్డలబిడ్డలును వీరితోఁగూడ నానందాశ్రమవేదికయందుఁగూరుచుండి యున్నప్పుడు వీరనుభవించినసంతోషంబును, మనుమరాలని చెప్పుకొని గర్వపడఁదగిన యొకబాలికమృదుమధురస్వరముతో వీరింగూర్చి ప్రశంసించినపుడు వీరొందినయానందంబు నప్పుడు చూచితీరవలసినదియే కాని యిట్టిదియని చెప్పుటకు శక్యము గాదు. వీరింగూర్చియాసమయంబునఁ బిఠాపురపు రాజుగారి కాకినాడ సర్వకలాశాలయందుఁ బ్రధానోపాధ్యాయులుగనున్న వేంకటరత్నము నాయఁడుగారు సత్యమును బలికియుండగా ,,నేనేమోఘనకార్యములు చేసినట్టుసభలో వేంకటరత్నమునాయఁడుగారు మొదలయిన మిత్రులు కొందఱు నన్ను శ్లాఘించిరి,, అనివ్రాయఁబడిన వీరేశలింగముపంతులుగారి వాక్యమువింతను గలిగించుచు, వీరివినయసౌశీల్య స్వభావములను వెల్లడించుచున్నది.

* * * * * * *



దయాసముద్రుఁడని చెప్పవలసిన డి. కే. కర్వేగారుపునహానగరంబున స్థాపించిన వితంతుశరణాలయము వలెనే యొకశరణాలయము నీరాజమహేంద్రవరమున స్థాపించి, జీవితకాలమంతయును వితంతువుల కష్టములనింక నసాధ్యమగు నంతవఱకుఁ దొలఁగింపవలయు ననుముఖ్యోద్దేశముతోఁ బాటుపడవలయునని నిశ్చయించుకొని, పట్టణంబునకుం దూర్పుభాగమునన్నున్న విశాలమగు నొకతోఁటనుగొని, పట్టణమునందలి తమపూర్వనివాససౌధగృహమును విడిచి, యాతోఁటలోనికే కాపురమునకరిగి, కడచిననాలుగైదుసంవత్సరములనుండియు నక్కడనే నివసించుచుఁ దామక్కడస్థాపించిన వితంతుశరణాలయముయొక్కయు, నాతోఁటయొక్కయు నభివృద్ధికి సర్వవిధంబుల నిరంతరమును మితిలేనియోపికతోఁ బాటుపడుచున్నారు.

* * * * * * *

తరువాత సీ1909వ సంవత్సరము ఏప్రిలునెలలో వీరిజన్మదినోత్సవ మానందాశ్రమమున జరుపఁబడినది. ఆసమయంబునవీరు చెప్పిన,

,,ఓసోదరులారా! మీరందఱు నాయెడల దయచేసి నేఁడిక్కడకువచ్చి, నాకువిశేషానందమును గలిగించినందులకు నాకృతజ్ఞతాపూర్వకములగునేకవందనము లర్పించుచున్నాను. సంవత్సరములు నిమిషములలో వచ్చుచును బోవుచు నున్నవి. కడచినసంవత్సరములో నేనేమియు దేశోపకారకరమగుకార్యముఁ జేయనయితినని మీకిప్పుడు తెలియఁజేయుటకు మిగులవిచారించుచున్నాను. మఱల నింకొకసారి యిక్కడకు మీరందఱుఁ జేరునప్పుడు దేశక్షేమకరము లగునీకార్యములను జేయఁగలిగితినని చెప్పెదనని నమ్ముచున్నాను. భగవంతుఁడునాకు మనోదార్ఢ్యమును, దేహబలమును బ్రసాదింపవలయునని హృదయపూర్వకముగాఁ బ్రార్థించుచున్నాను. నేఁడు మీకందఱకును శ్రమగలిగించినందులకు నన్ను మన్నింపవలయునని కోరుచున్నాను.''

అనుమార్గముం జూచువారలకు, వీరు శాంతియును, సంతుష్టియు లేనిస్వభావముగలవార లని తోఁచకమానదు.

పిమ్మటనీసంవత్సరము వేసంగికాలవుదినములు బెంగుళూరునందు గడుపవలయునని తలంచి, ముందుగాఁ జెన్నపురంబునకరిగి, యక్కడిచిరకాలస్నేహితులగు రంగయ్యసెట్టిగారు మొదలగువారలతోఁ గొన్నిదినములుమాత్రమే గడిపి, తరువాత బెంగుళూరునకుం జనిరి. వీరు బెంగుళూరునం దున్నకాలమునందే యీ 1909వ సంవత్సరము జూన్ నెల 19వ తేదినిపట్టపగలు పదిగంటలకుసంభవించిన రైల్వేమహావిపత్తునందుఁ దమచిరకాల మిత్రులును, సకలసద్గుణసంపన్నులునగు సమర్థి రంగయ్యసెట్టిగారు ఘోరమరణముపాలయి రనునత్యంతసంతాపకరమయిన సమాచారము తెలిసి యుండెను. ఇంచుమించుగ ముప్పదియైదు నలువది సంవత్సరములనుండి తమయం దెంతయోదయగలిగి, చేతనయిన ప్రోత్సాహమును విశేషముగాఁ గలిగించుచువచ్చిన రంగయ్యసెట్టిగారికి హఠాత్తుగ సంభవించిన యత్యంతభయంకర మరణంబునకు వీరేశలింగముపంతులుగా రెంతవిశేషముగా సంతాపమునొంది నదియునువీరువ్రాసిన కొన్నియుత్తరములవలనఁ గనుఁగొనవచ్చును.

ఈప్రక్కను జూపఁబడినపటమువలన శ్రీరంగయ్యసెట్టిగారి సహజసత్స్వభావమును జాలవఱకు మనముగ్రహింపవచ్చును.

* * * * * * *

ఈలోకములో నందఱికి నేనిమిషముననో మరణముసంభవించుచుండుట ప్రకృతిసిద్ధమయినదిగా నున్నది. కాని, మరణానంతర మొక్కబంధుమిత్రులే దుఃఖించునట్లుగాక, లోకమంతయు వ్యసనపడులాగునను, దననడతనుజూచియు, వినియు నందఱుసంతసించులాగునను జీవితకాలమునుబరోపకారకరకార్యములతోఁ నలంకరించుకొనినవాని జన్మమే జన్మము గదా!



THE LATE MR. S. RANGAYYA CHETTY, B.A.

అట్లు బెంగుళూరునందుఁ గొన్ని మాసములు సుఖముగా నివసించి, రాజమహేంద్రవరమునకు వచ్చి, యీ 1910వ సంవత్సరమునందలి దుర్భరమయిన వేసంగికాలమును బెంగుళూరునందుఁ దాము కొనిన గృహమునందు గడపుటకు ఏప్రియలు నెలలోఁ జని యీ జూలయి నెల 9వ తేదిని రాజమహేంద్రవరంబునకుం దిరిగివచ్చి యెప్పటివలె నుత్సాహముతోఁ బనిచేయుచున్నారు. బెంగుళూరునందున్న మాసములలో జూలై నెల 3 వ తేదిని మ. రా. రా. శ్రీ న్యాపతి శేషగిరిరావుపంతులుగారి వితంతుకుమార్తెయగు జానికమ్మగారికిఁ బరిణయంబునుగావించియున్నారు. తమకుమార్తెకు విద్యాభివృద్ధిని గావించి, తగిన వరునింజూచి వివాహమునుగావింపవలయునని కోరుచు నుత్తరమున్వ్రాయుచు వీరేశలింగము పంతులుగారి యొద్దకుఁ జానికమ్మగారిని బంపియున్నారు. వీరేశలింగము పంతులుగారును జానికమ్మగారిని పుత్రికావాత్సల్యంబునం జూచుకొనుచుఁ దగిన వరునరసి వివాహమును గావించియున్నారు కాని, తమకోరిక నెఱవేఱుటను జూచి సంతసించు భాగ్యము శేషగిరిరావుగారికి లేకపోయినదిగదా యని వీరేశలింగము పంతులుగా రెంతయు సంతాపము నొందుచున్నారని చెప్పవలసియున్నది.

మైసూరురాజ్యమునందు వితంతువివాహములను గూర్చినశాసనము లేకుండుటంజేసి యావివాహము బెంగుళూరునందుఁ జేయఁబడక, బెంగుళూరునకు సమీపమునందుండి బ్రిటిషుప్రభుత్వములోఁ జేరియున్న ఉల్సూరులోఁ జేయఁబడినది. ఇప్పుడు వీరు బెంగుళూరునందలి చామరాజుపేటలో నొకగృహమును గొనియున్నారుగాన, నింక, ముందు వేసంగికాలమునఁ బ్రతిసంవత్సరమును నధమము నాలుగు మాసములయిన నక్కడ స్వగృహంబున నివసింపఁ దలంచి యున్నారు. కావున, వీరిసత్కార్యాచరణస్వభావంబును, నిరంతరపరిశ్రమంబును, గార్యసాఫల్యమునందు వఱలుఁ గల పట్టుదలయు నింక మహిసూరురాజ్యమునందు

హితము స్త్రీపునర్వివాహములు జరుగునట్లు చేయక మానవని నేనును దృఢముగాఁ జెప్పఁగలను.

* * * * * * *

వీరేశలింగము పంతులుగారి పూర్వు లెట్టిగొప్పయుద్యోగములను జేసినవారలయినను, ధనకాములుగాక కీర్తికాములు మాత్రమే యయియుండుటం జేసి, వీరికిం బూర్వార్జితమయిన విశాలమయిన యొక్కమేడయిల్లు మాత్రమే చిట్టచివరకు మిగిలియుండెను. "బెల్లమున్నచోట నీఁగలు ముసురునట్లు తమవాఁ డొకఁడు మంచిదశలో నున్నప్పు డెక్కడెక్కడివో తరములనాఁటి బంధుత్వములు తెలుపుకొనుచు వచ్చి బంధువులాశ్రయింతు" రనిపంతులుగారు "స్వీయచరిత్రము" నందు వ్రాసికొనిన వాక్యము లోకాచారముయొక్క సత్యమును జక్కగా వెల్లడించుచున్నదిగదా! అట్లు వీరిపూర్వులు మాన్యములు, ధనము మొదలయినవి వీరికి విడిచియుండక యుండుటం జేసియే వీరు మొట్టమొదట ధనవంతులుగాక యుండిరి. ధనవంతులు గాకయుండి యుండుటం జేసియే యిట్టి మహోన్నతపదవికి వచ్చియున్నారని ముమ్మాటికిని జెప్పవలసియున్నది. బాల్యమునందుఁ జాలవఱకుఁ దల్లిగారి యమపాజ్ఞలకు లోనయి యుండుటం జేసియు, ప్రకృతిసిద్ధముగాఁగల సత్స్వభావము నాధారముగాఁ జేసికొని యలవాటుపడిన యెడతెగనిపూనికను దినదినాభివృద్ధినొందునట్లు చేసికొనియుండుటం జేసియు సర్వజనోపయుక్తంబులగు నట్లనేకగ్రంథములను రచియింపఁగలిగి సర్వజనసమ్మానమునందుచున్నారు. ఇందుల కిక్కడి "శ్రీ వీరేశలింగపుస్తకభాండాగారము" యొక్కనిదర్శనముగానున్నది. మాపట్టణమందిరమునందలి ప్రార్థనసమాజసౌధమున నలరారుచు, 50 మంది సామాజికులను, 120 మంది చందాదారులను, 1000 మంది ఆమచదువరులను గలిగి, 1200 ఆంధ్రగ్రంథములతోను, 100 ఆంగ్లేయగ్రంథములతో నొప్పుచు 40 ఆంధ్రాంగ్లేయ



వార్తాపత్రికలచే నలంకరింపఁబడి యనుదినము ననేకచదువరుల నాకర్షించుచున్న యాపుస్తకభాండాగారమును దిలకించువారల కెంతయయిన నానందముగలుగక మానదు. ఇట్లు దేశమునందు గ్రంథములయందును బత్రికలయందును బలువురకామోదముగలుగునట్లు చేయనారంభించి విశేషముగాఁ బాటుపడినవారలలో వీరేశలింగముపంతులుగారే ప్రముఖులని సంతోషపూర్వకంబుగఁ దెలుపవలసియున్నది.

ఈ యాంధ్రదేశములో సనాతనాచారంబుగ స్థాపింపఁదలంచి, దుర్ఘటప్రయత్నములు గావించి సఫలీకృతమనోరథులయిన స్త్రీపునర్వివాహ మహాదుర్ఘటకార్యములయందుఁ దమకు నిరంతరముఁ దోడునీడనలెనుండి, పెట్టనికోటవలెం గాపాడిన విద్యార్థిబృందములయెడలఁ గృతజ్ఞతానురాగ స్వభావములను గలిగియున్న వారలగుటంజేసియే, వర్తమానభవిష్యద్విద్యార్థులే దేశాభివృద్ధికి మూలపురుషులగుదురను సంపూర్ణవిశ్వాసమును గలిగియుండియే కొన్ని సంవత్సరములకుం బూర్వమీపట్టణమున నిక్కడి బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు స్థాపించి చక్కఁగానడుపుచుండిన పాఠశాలం గైకొని, దానిని ఆస్తికోన్నత పాఠశాలనుగఁ గావించి, దేశభాషాభిమాన హృదయులగు శ్రీపిఠాపురపు సంస్థానాధిపతు లగు మహారాజశ్రీ శ్రీరాజారావు వేంకటకుమార మహీపతిసూర్యారావు బహదూర్ జమీందారుగారత్యంతౌదార్యపూర్వకంబుగ నొసంగిన ధనసాహాయ్యంబున నేతత్పాఠశాలకొకమనోహరవిశాలభవనమును గట్టించుచున్నారు. మఱియుం దమ పాఠశాలలోని విద్యార్థులకు దేవునిగూర్చిన సత్యజ్ఞానమలవడునట్లుగను రాజభక్తియభివృద్ధి నొందునట్లుగను గృషిసల్పుటకుం బ్రయత్నించుచుండుట యెంతయుశ్లాఘనీయంబుగ నున్నదిగదా!

దేశములోఁ జదువరుల సంఖ్యయనునది యంతగాలేనికాలంబునఁ బత్రికలను స్థాపించియుఁ, బలువిధములగు గ్రంథములను రచియించి

చియుఁ బత్రికాగ్రంథపఠనస్వభావము విశేషముగా నుదయింపఁజేసి,
యయ్యది దినదినాభివృద్ధినొందునట్లుచేసి, పత్రికలను స్థాపించియు, గ్రంథ
ములను రచియించియు, ధనమును సంపాదించుకొని స్వతంత్రజీవనమును
జేసికొనవచ్చునని మార్గముం గనఁబఱచినదివీరేశలింగము పంతులు
గారే యనికృతజ్ఞతాస్వభావమునుగలిగినవారలెల్లరు నొప్పుకొనక
మానరు. స్వీయముద్రాక్షరశాలను గలిగియుండుటం జేసియు, బాల్య
మునందు వివాహముచేయఁబడినయామెతప్ప, సోదరసోదరీపుత్రపుత్రి
కాదు లెవ్వరులేమిం జేసియు సంసారాభ్యంతరంబు లేవియు లేకుండుటం
జేసియు, నెమ్మదిగాఁ గూరుచుండి వ్రాసికొనఁ జేయఁజాలిన నిశ్శబ్దంబుగ
నుండెడుసౌధగృహం బను మహాభాగ్యంబును వీరిపూర్వులు వీరికి
నిలిపి యుండుటం జేసియు, మేలుకొనిన వలదువలదని నయభయంబుల
బోధించుచునాజ్ఞయొసంగు తలిదండ్రులు మొదలగు వారలెవ్వరు లేకయుం
డుటం జేసియు,మఱియువ్రాసినవాని నెల్లనుబరమామోదంబునఁ బఠనీయ
గ్రంథములనుగ యుక్తకాలంబునఁ జేయుశక్త్యుత్సాహంబులుగలదయా
గుణశాలి విద్యాశాఖయం దున్నతపదంబు నలంకరించియుండుటం జేసి
యు నిన్నిగ్రంథములను రచియింపఁగలిగిన వీరేశలింగముపంతులు
గారు, తాము చెన్నపురంబునుండియీపట్టణమునకుమరలివచ్చినతరువాత
నక్కడి తమ చింతామణీముద్రాక్షరశాల నిక్కడిసత్యవ్రోలు
గున్నేశ్వరరావు సోదరులకు విక్రయించి యుండుటంజేసి, యెందఱి
పుస్తకములనో ముద్రింపించి, పలువురకుఁ జాలకాలము మనస్సుఖానం
దంబులను గలిగించిన వీరిప్పుడు తమగ్రంథముల నితరుల ముద్రాక్షర
శాలలలో ముద్రింపించుకొనవలసి యున్నారు. మార్పే కాలముయొక్క
స్వభావముగదా!

ఈప్రకారముగాఁ బరోపకారచింతతో, సుఖముగాజీవితకాలసం
ధ్యాకాలమును గడుపుచున్నయిక్కడికిం బత్నీవియోగ మీనెల 11 వ



తేదిని సాయంకాలము, కొన్నిగంటలలో దాపుదాపునకు వచ్చుచున్న
సంగతి యెవ్వరికిం దెలియకయే యుండెనుగదా! భవిష్యత్తు తెలియకుం
డుట మానవస్వభావము. ఆనాఁటిసాయంకాల మెప్పటివలె నిరువురును
గలిసి భోజనము చేసిరి. వీరేశలింగముపంతులుగారు నిద్రించుటకు మేడ
మీఁదికిం జనిరి. తరువాతఁ గొంతసేపటికిం బనుల నెల్లను జక్కబెట్టు
కొని, రాజ్యలక్ష్మమ్మగారును మేడమీఁదికిం జని, యీశ్వరప్రార్థనముం
గావించుకొని, వసారాలో వేఱుగ నొకమంచముమీఁదఁ బండుకొని
యుండిరి. పాప మాయమ కానిద్రయే దీర్ఘనిద్రను జెందించు నని యె
ఱుంగకయే యుండెనుగదా!

లోకములోనిజీవకోట్ల కెల్లను గమ్యస్థానము మరణమే కదా!
జననమరణములు స్వభావధర్మములు. ఎవ్వరు ముందుగాఁ బోదురో, యె
వ్వ రెప్పుడు పోదురో యనుసందేహమును గలిగి పంతులుగారు విశేష
ముగా నాలోచించుచునే యుండి రని చెప్పుటకు సందేహము లేదు.
చాలాకాలమునుండి విశేషముగాఁ జదువుచుండుటకును, వ్రాయుచుండు
టకునలవాటుపడినపంతులుగారంతగా రాత్రులయందు నిద్రింపకుండుట
కేయలవాటుపడి యుండిరి. నిరతాలోచనమువలన మనుజుఁ డించుక గాఢ
నిద్రకుమాత్రమే యలవాటు పడుచుండుట సిద్ధము. తాము స్థాపించిన
వితంతుశరణాలయ మేప్రకారముగా నభివృద్ధి నొందునో, తమయనంతర
మునందు సహిత మాశరణాలయము నెంతయు బాగుగా జరుగఁజేయఁ
గలిగెడు మంచియాదాయము వచ్చునట్లు తమతోఁటను వృద్ధిచేయుట
యెట్లో, తమయాస్తికపాఠశాలాభవనము ముగింపఁబడుట యెప్పుడో
యనుమొదలగు ననేకాలోచనములచే నిండియుండి శాంతి యనునది
యింతయు లేనిమనస్సును గలియుండినపంతులుగారు రాత్రి యెప్పటి
వలె రెండుగంటలకు లేచి తాము లేచునప్పుడు మామూలుగాఁ బలుక
రించుచు "క్రిందికిదిగుచున్నారు. జాగ్రత" యనుమాటవచ్చుటకు లేవ

కుండుటఁ జూచి యొకవేళఁ బనుల బడలికచే లేవలేదు కాఁబోలుననుకొని క్రిందికి దిగిమఱలి వచ్చి యెప్పటివలె నాలుగుగంటలకైనను నామె లేవకుండుటం జూచి సమీపమునకుం జని పాపము మరణమని యెఱుంగక వేళయైనది లేవవేమి? యనిపలుకరింపఁ బలుకకున్న నప్పటికిని నిజస్థితి నెఱుంగఁజాలక చేయిపైఁ జేయివేసి చూచునప్పటికి నొసలు చల్లగానుండుట జూచి చల్లగాలిలోఁ బరుండియుండుటం జేసియే యట్లు చల్లగా నున్నదని తలంచి పాప మప్పటికి నిజస్థితి నెఱుంగఁజాలక యైదు గంటలవఱకు నూరకుండి ఇప్పటికిని నిద్రనుండి లేవకుండుట యేల? అని తలంచుకొని గట్టిగాఁ బలుకరించి కదలించి కదలకున్న భ్రాంతినొందిన మనస్సుతో నెట్లో మేడదిగి చిన్నతనమునుండియుఁ బుత్రప్రేమతోఁ బెంచుచు విద్యాబుద్ధులు చెప్పించి వితంతువివాహము చేసి కాపాడుచున్న పులవర్తి సుబ్బారావను చిన్నవానిం గేకవేసి యున్నస్థితిం జెప్ప నాతఁ డప్పుడు సమీపమునందున్న డాక్టరుదొరగారిం దీసికొని వచ్చి చూపించి నతోడనే యాదొరగా రామె నాలుగైదుగంటలకుఁ బూర్వమే కాలధర్మమునొందినట్లు తెలియఁజేసి పంతులుగారికి ధైర్యము చెప్పుచు మేడ మెట్లు దిగి చనినతోడనే యట్టిసమయమునం దెట్టిమనోధైర్యము గలవానికైనను గుండె చెదరిపోక మానదు గావునఁ బాపము పంతులుగారు మేడమీఁద నేలఁ గూలఁబడి ఓయీశ్వరా! యీవృద్ధకాలమునందు నాకెట్టికష్టమును గలిగించితివి? అని యీశ్వరుంగూర్చి యొకసూక్ష్మ ప్రార్థనంబును గావించుకొని లోకాచారప్రకారముగా నావారలని చెప్పఁ గొనఁదగినవార లెవ్వరును లేకపోవుటం జేసి యాకష్టకాలమునం దోదార్చువారు లేక తమకుం దామె ధైర్యమును దెచ్చుకొని లోకానుభవజ్ఞాన సంపన్నులగుటచేఁ గంటికి ఱెప్పయుంబలెఁ గాపాడుచు నెన్నికష్టములు సంప్రాప్తములైనను గష్టములవలననే ధైర్యమును చిక్కులవలననే యుత్సాహమును బాధలవలననే ధర్మమునందు దృఢానురాగంబు



ను దినదినాభివృద్ధి నొందించుకొనుచుఁ బతియే దైవ మని భావించుకొనుచుఁ గాలము గడుపుచుండినయామె వియోగంబునకుఁ బొరలి పొరలి వచ్చుదుఃఖసముద్రంబు సాఁపుకొనుచు నతిభారంబుగ దినములను గడుపుచుండుటం జూడ నెంతయుఁ జింతాకరముగ నున్నది.

మొట్టమొదట స్త్రీపునర్వివాహములు జరుపఁబడనున్నకాలంబున రాజ్యలక్ష్మమ్మగారిబంధువులు మొదలగువార లనేకులు భర్తను విడనాడి పుట్టినింటి కరుగవలయు నని యెన్నెన్నివిధముల బోధించి చెప్పిన నాబోధల నెల్లను బెడచెవిం బెట్టి, యెవ్వరికిని భయపడక ధర్మమే పరమదైవత మనిభావించి యంతరాత్మయొక్కవాక్యమే వేదవాక్యముగా నమ్మి యార్పరానిమంటవలెఁ బ్రజ్వలించుచుండెడిపరోపకారచింతను గలిగియుండినభర్తహృదయమును జక్కగా గుఱుతెఱింగి, నాఁటినుండియుఁ బతి నెడఁబాయక "సహధర్మచారిణి" యనుసన్నామమునకుం బాత్రురాలయినయాయమసద్గుణములను బూర్ణముగా నిట వర్ణింపఁ జాలకున్నాను. సంతానము లేమిం జేసి యామె పిల్లలనిన నెంతయుఁ బ్రేమతోఁ జూచుచువచ్చుచుండెను. ఎవ్వరైనం దమ్ముఁ జూడవచ్చినచో వారిపిల్లల కేఫలములో యిచ్చి పిల్ల లానందమునందుచుండ సంతోషించుచుండనిసమయమును జూచియుండ లేదు. యీక్రింది సంతాపకరమగుసమాచారమువలన నామెకుం బిల్లలయెడంగలదయార్ద్రహృదయము బోధపడక మానదు.

కొన్నిమాసములకు వెనుక నొకబ్రాహ్మణవితంతువు గర్భిణియై యిక్కడివితంతుశరణాలయమునకు వచ్చి నిర్భయముగా సుఖముగాఁ గాలము గడుపుచుండి యొకయాఁడుశిశువుం గని కొన్నిదినములు మాత్ర ముండి యాశిశువును దయమాలి వదలి శరణాలయమును విడిచిపెట్టి తనగ్రామమునకుఁ జనెను. క్రూరాచారపిశాచభయంబున దయానిర్దాక్షిణ్యస్వభావురా లయినతల్లిచే విడువఁబడినయాశిశువుం దా

మే పెంచుకొనునుద్దేశముతో, శిశువు నీయవలయు నని యక్కడియ
మెరికాలూథరన్ మిషన్ వైద్యశాలయందుఁ బనిచేయుచున్నదొరసాని
గా రడిగినను నీయమని చెప్పి, మిక్కిలి ప్రేమతో నెంతయుఁ గష్టప
డుచుఁ బెంచుచుండ నాశిశువునకు జబ్బుచేయుటచే మరణదినమున నా
దొరసానిగారికి “రేపు తప్పక యుదయమున మందునకు వచ్చెద” నని
సమాచార మంపి యానాఁటిరాత్రి తాము కాలవశు లగుట సంభవించి
నది. ఎంతయుఁ బ్రేమతోఁ బిల్లను బెంచవలయు నని యభిలషించిన
యామెకోరిక నిరర్థక మయినది గదా యని పంతులుగా రెంతయుఁ
జింతించుచు నాశిశువు నాడాక్టరుదొరసానిగారి కిచ్చివేసిరి. ఇప్పు డా
శిశువు దొరసానులచేతులలో లాలనముల ననుభవించుచు సుఖముగాఁ
బెరుఁగుచున్నది. అది యంతయుఁ గన్నులారఁ గాంచి, జాలియును
సంతోషమును బొందిననా కీదేశంబున నమెరికాయూరోపుఖండముల
యందువలె నట్టిశిశువులను బెంచువైద్యశాలలను స్థాపింపఁబూనుదయా
సముద్రులు మనదేశమునం దుదయించుభాగ్య మెన్నఁడు గలుగునో
యని తోఁచుచున్నది. మనదేశములోని యుదారస్వభావు లగుసంస్థా
నాధిపతులకును, జనసామాన్యమునకు నీపరమధర్మకార్యముం గూర్చిన
యాలోచన లుదయించి, శీఘ్రకాలములోనే యాయాలోచనంబులు
కార్యములుగాఁ బరిణమించునుగాక!

ఈయాగస్టునెల 12వ తేదినాఁ డుదయమునఁ దెల్లవారకముందు
గనే రాజ్యలక్ష్మమ్మగారి యత్యంతసంతాపకరమరణసమాచారము పట్ట
ణమునందు వ్యాపింప నారంభించినది మొదలు, పాపముపంతులుగారి
కంతయకస్మాత్తుగ సంభవించినకష్టమున కెంతయుఁ బరితపించుచు,
ననేకు లెఱింగినవారలు, పురుషులును, స్త్రీలును, లెక్కలేకుండ, నా
తోఁటకుఁ బోవుచుండి, పరోపకారస్వభావము గలయావృద్ధదంపతుల
యెడలం దమకుం గలజాలిని, విచారంబును, వెల్లడింప నారంభించిరి.



మొట్టమొదట నాకీసమాచార మాదినమున నేడుగంటలకు, మార్గము
లోఁ దెలిసినతోడనే, “పాపము పాము గఱచినది గాఁబోలు” నని
తోఁచి, వీరేశలింగముపంతులుగారియెడల నాకుం జిరకాలంబునుండి
గాఢంబుగఁ గలిగియున్న గౌరవానురాగంబుల కారణంబుచే నప్పుడ
వారితోఁటకుం జని, యత్యంతదుఃఖసముద్రనిమగ్నహృదయు లయి,
కన్ను లెఱ్ఱఁబాఱి, వెలవెలఁబోయినముఖముతో నున్నపంతులుగారిం
జూచి యెంతయుఁజింత నొంది, సంగతుల నెల్ల నాలోచించినకొలఁదిని
“ఒకవేళజీవితకాల మతిభారంబుగ నుండుటచే నెంతకాల ముండిన
నేమి యున్నదని విషప్రయోగంబును గావించుకొనెనో, యెవ్వరైన
నేమికారణంబుచేత నయినను, విషప్రయోగంబును గావించి యుండి
రో” యని నామనసునకుం దోఁచ నారంభించినది. పిమ్మట నట్టికార
ణంబుల కవకాశం బేదియుం గానరాకుండుటచే, “ఒకవేళ నానాఁ
డామె, నిద్రింపఁబోవుటకుం బూర్వము వేసికొనినతములపాకులలో గుడ్డే
దియయున నుండి యట్లాకస్మికమరణమును గలిగించియుండవచ్చునా.”
యని పరిపరివిధంబుల మనసున కనుమానము గలుగ నారంభించి, మర
ణమున కదియునుం గారణము గానిచో, నానాఁడు రాత్రి కొన్నిదినం
బులనుంచి నిలువయుంచిన యావుపాలజున్ను నించుక యధికంబుగ
భుజించుటచే వాత మగోచరంబుగఁ బ్రబలి యందులకుం జల్లగాలి
విశేషముగా బలపడి, యటుపిమ్మట నాలోచనభారము తోడుపడి, హృ
త్కార్యమున కడ్డమువచ్చి, చైతన్యము నిలిచియుండవచ్చు నని నిశ్చ
యింపఁ జేసినది. ఎట్టు లయినను నత్యంతరహస్యస్వభావంబు గల
మృత్యు వామెను మ్రింగివేసినది.

తరువాత జరుగవలసిన దహనాదికార్యములనుగూర్చి యాలో
చింపఁబడునప్పుడు, పంతులుగారు, తమభార్యదహనస్థలంబును మనశ్శాంతి
గలుగునట్లుగఁ జూచుచుండవలయు ననుగాఢమమకారస్వభావంబున నా

మొకుండోఁటలోనే దహనసంస్కారంబును జరిగింపవలయు నని నిశ్చయించుకొని, యీసమాచారంబు నందఱుమిత్రులకుం దెలియఁజేసి, నాఁడు మూఁడుగంటల కాతోఁటలోనే యొకమూల దహనక్రియఁ గావించి యున్నారు. రాజ్యలక్ష్మమ్మగారి మరణముం గూర్చినయత్యంత దుఃఖకరసమాచారంబును దంత్రీముఖంబునఁ బిఱుగునఁ దెలిసికొని కృష్ణామండలంబులోని నర్సారావుపేటయందు సబ్ రెజిష్ట్రారుగ నున్న గోగులపాటివీరేశలింగముగారు మూఁడునాలుగురోజులలో నిక్కడకు వచ్చి, వీరేశలింగముపంతులుగార్కి కించుక దుఃఖోపశమనమును గావించి, కొంతమనశ్శాంతిని గలిగించి యున్నారు.

స్త్రీపునర్వివాహములను జేసికొనినవారలలోఁ గొందఱికోరికప్రకారముగా దహనస్థలంబునుండి బూడిదె యిక్కడికోటిలింగములకడగోదావరిలో స్త్రీపునర్వివాహసంఘము వారివలననే కలిపివేయఁబడినది. అందులకు వీరేశలింగముపంతులుగారేమియు నడ్డముచేయఁజాలక, యేమి చేసిన నేమి ప్రయోజన మనియూరకుండిరి.

పంతులుగారు తమ భార్యపేరట నొకసమాధిని గట్టింపవలయు నని దహనానంతరమునఁ గొన్నిశల్యములను భద్రపఱచి యుంచుకొనిరి. ఇప్పు డామెజ్ఞాపకార్థ మయి యొకసమాధిని నిర్మింపించి యాసమాధిచుట్టును మనోహరంబుగ ననేకవిధంబు లగుపుష్పాలమొక్కలను నపరూపములగు ఫలవృక్షములను వేయింపఁదలంచి పనిచేయించుచున్నారు. అప్పుడు పంతులుగారు లోకాచారవిరుద్ధంబుగ దహనఖననసంస్కారంబుల రెండింటిని జేసియున్నా రని చెప్పవలసియుండును.

ఐదాఱుదినముల ప్రాయముగల చిన్నతనముననే తల్లి కాలవశురాలగుటచేఁ గన్నతల్లికంటె నెక్కుడుప్రేమతో సకలకష్టములను బడిపెంచినతల్లిఋణంబు దీర్చుకొనవలయు ననుతలంపుతోఁ బ్రేమాస్పదురాలయినతమపెంపుడుతల్లి శల్యంబులను గొన్నింటిని దీసికొనిన గోగుల



పాటివీరేశలింగముగారట్లుచేసియుండుటకుం గారణ మాశల్యంబులు కృష్ణానదిలోఁ గలుపుటకును బరమపవిత్రస్థల మని హిందువులచే నెన్నఁబడుకాశీపురంబున గంగానదిలోఁ గలిపివేయుటకు నే యని యూహింపవలసి యున్నది.

మరణానంతరంబున జీవుల కాత్మలున్నవనియు నట్టియాత్మల కుత్తమలోకంబులను గల్గింపవచ్చు ననియును దలంచుట భ్రాంతియే యని చెప్పవలసి యున్నను దమతల్లిగారియెడల గోగులపాటివీరేశలింగముగారికిం గలవీడని ప్రేమానుబంధంబున కొంతయుసంతసింపవలసియే యున్నది. రాజ్యలక్ష్మమ్మగారికి హిందూశాస్త్రానుసారంబుగఁ గర్మ యేదియు నెవ్వారివలనను జేయఁబడక యేయున్నది. కాని,

క. మరణము నొందిననరులకుఁ
గరమును శ్రాద్ధంబు తృప్తిఁ ♦ గలిగించెడుచో
ధర నాఱినదీపంబున
కురుకాంతిని దైలదాన ♦ ముత్పాదించున్.

అని ప్రబోధచంద్రోదయనాటకరాజంబున వ్రాయఁబడినచొప్పున నుద్దేశములుగల పంతులుగారుమాత్రము తరువాత సంఘులకును వికలాంగులకును నన్నదానంబు నొసంగియున్నారు.

ఎందఱి కెన్ని యుపశమనవాక్యంబులనైనం జెప్పవచ్చును. ఎంతయు మనశ్శాంతిదాయకంబులుగ నెట్టివేదాంతవాక్యంబుల నయినను వ్రాయవచ్చును గాని, కష్టకాలంబున నెట్టిజ్ఞానసంపన్నునకైనను ధైర్యమునవలంబించియుండుటమాత్రము సుసాధ్యంబు గాదుగదా! చూఁడుఁడు,

ఉ. భీరుఁడు చావుచావనుచు ♦ వేసరుచున్ మరణార్తి నొందెడున్;
ధీరుఁడొ యొక్కసారియె మృ ♦ తింగనునప్పుడు బాధ నొందెడున్
ధారుణి దేహధారులకుఁ ♦ దప్పక చావెప్పుడైన నుండఁగా,
నూరక చావుకై వగపు ♦ నొందఁగ నేటికి మాటిమాటికిన్?

మ. జనకుండో సుతుఁడో సఖుండొ తనువుం ♦ జాలింప, ధీశూన్యు లి
మ్మనశోకాగ్నిఁ దపింతు రెంతయును ర ♦ మ్మర్మోన్మదుకొంచొక్కటన్;
గన సంసార మసార మంచు శమసౌ ♦ ఖ్యంబుం గడుం బెంచుచున్
ఘనధీమంతుల కావియోగచయమే ♦ కల్గించు వైరాగ్యమున్.

ఉ. దారిని బాంథు, లేటివలఁ ♦ దన్దరుకాండము, లాకసంబునన్
వారిదముల్, సముద్రమున ♦ నావికులున్, వడిఁగూడి పాయున
ట్లారయఁ దల్లిదండ్రులును ♦ నాత్మజులున్ సఖులున్ సహోదరుల్
చేరుచుఁ బాయుచుండు టిది ♦ సిద్ధము; ప్రాజ్ఞుల కేడ శోకముల్.

మ. చనలేదే బహుకోట్లు నీకిట మహా ♦ సంసారమం దెందఱో
జననుల్ తండ్రులు తాత లాత్మభవులున్ ♦ జాయల్ పితృవ్యల్గురున్?
విను మల్లాట, సుహృత్తు లెల్లఁ బుడమిన్ ♦ విద్యుత్ప్రకాశాభజీ
వనులంచుం దలపోసిపోసి మదిలో ♦ భాస్వత్సుఖం బొందుమా.

అని యిట్లు సంపూర్ణపరిపక్వజ్ఞాననిమగ్నమానసంబునఁ బద్యంబులు రచియించి జ్ఞానబోధ చేయం జాలినపంతులుగారికి నెవ్వరేమి చెప్పఁజాలుదురు? ఐనను, మనయాంధ్రదేశంబునందుఁ జిరకాలమునుండి బహువిధంబుల సర్వజనవిశ్రుతు లయియుండుటం జేసి, యనేకులు స్వయముగా నెఱింగినవారలు ననేకు లెఱుంగనివారలు, ననేకసమాజములవారలును దమకుం గలిగినవిచారముం దెలుపుచుఁ బ్రతిదినము నుపశమనవాక్యములతోఁ గూడినయుత్తరములను వ్రాయుచుఁ బంతులువారికిం జమచే నగుధైర్యము నీయాపత్కాలంబునఁ గలిగించుచున్నారు.

*   *   *   *   *   *   *

చిరకాలంబునుండి నివసించుచుండిన యీపట్టణమునందలి తమ మేడయింటిని విడిచి, నిరంతరపరిశ్రమంబుచే వితంతుశరణాలయంబును సర్వవిధంబుల నత్యున్నతస్థితికిం దీసికొనిరావలయు నను ముఖ్యోద్దేశముతో నానందాశ్రమంబునకుం బంతులుగారు కాపురమునకుం జను



నాఁటిసాయంకాలంబున, రాజ్యలక్ష్మమ్మగారు శ్రీచింతామణీముద్రాక్షరశాల యిప్పుడున్నయింటిగుమ్మముకడకు వచ్చి వెలుపలనుండి "నాయనా! ఇల్లు జాగ్రత; తలుపులు మూచుకొనుచుండుము," అని పిమ్మట నెక్కడపంతులుగారు వినెదరో యని కొంచెము నెమ్మదిగా "వనవాసమునకుఁ బోవుచున్నా," మని పుత్రప్రేమతో నాతోఁ బలికినయావాక్యములును, బరోపకారార్థము సర్వదా శ్రమపడు పంతులుగా రుపకారవేతనముం గైకొని యిప్పుడైనను గొంత విశ్రాంతినొందక మానరాయను ధైర్యముతో నుండి, పనిచేయఁగలిగినకాలమింక నున్నను నింకను విశేషముగాఁ బాటుపడవలయు నని, కొంతకాలమునకుముందుగనే యుపకారవేతనముం గైకొని యహోరాత్రము లది యేచింతగాఁ బనిచేయు పంతులుగారింగూర్చి సంభాషించుచు "ఇది యేమి? విశ్రాంతి యనునది లేక యిట్లు కష్టపడుచున్నారు! శరీరదార్ఢ్యము లేనివారు." అని మనోబాధ నందుచుఁ బలుదెఱంగులఁ బ్రేమయు గౌరవంబును వెల్లడి యగునట్లుగఁ బలుకుచువచ్చిన యానిరుపమానపతిభక్తిసూచకవాక్యంబు లిప్పుడు నామనసునకు వచ్చుచు నింక నెవ్వ రట్లు పంతులుగారింగూర్చి చింతించువా రున్నా రని చింత పొడముచున్నది. కాని, లోకములోఁ బోషించువారలజీవితకాలమునందుఁ బోష్యవర్గముగాని వారలే ముందుగఁ గాలధర్మము నొందుచుండినచో నయ్యది యెంతయు సుఖప్రదంబుగ నుండు నని వేఱుగఁ జెప్పనక్కఱ లేదు. ఇప్పుడు పంతులుగారికిం గలిగినభార్యావియోగమువలన వారికి ముఖ్యముగా రెండుచింతలు తొలఁగి పోయిన వని చెప్పవలసియున్నది. పంతులుగారు, తమయనంతరమునం దొకవేళఁ దమభార్యయే జీవించియుండుటయే తటస్థించినయెడల, దుష్టమగుకాలమహిమచేతను, దుర్నివారు లగుబంధుమిత్రాదుల ప్రోత్సాహముచేతను, దుస్సహము లగులౌకికబాధలచేతను నామె తనప్రవర్తనమును విధిలేక మార్చుకొనవలసివచ్చి, యట్లు చేసి ప్రాయశ్చిత్తాదు

లను గావించుకొనిన తమ కెక్కడ సగౌరవము గలుగునో యనియును విష ప్రయోగంబును గావించుకొనియో యేనూతిలోఁ బడియో ప్రాణముల నెక్కడఁ బోఁగొట్టుకొనునో యనియును డోలాయమానమానసులయి కొంతకాలమునుండి శాంతిభంగము గలిగిన మనస్సుతోడనే కాలము గడుపుచుండిరి. “ఓపరమేశ్వరుఁడా! నాభర్తకు ముందుగనే నీసాన్నిధ్యమునకు నన్నుఁ గొనిపొమ్ము; ఇదియే నాహృదయపూర్వకమగు ప్రార్థనయని యనేకసారులు ప్రార్థించిన రాజ్యలక్ష్మమ్మగారి ప్రార్థన యాలింపఁబడెనో యనునట్లుగ నామెకోరిక ప్రకారంబుగ లోకాంతరగతురా లయినయామె యెంతయు ధన్యురాలనియే మువ్మాటికిని జెప్పవలసి యున్నది. కాని, పరులయుపచారమును గోరుచుండు వృద్ధకాలమునం దున్న భర్తకుం బూర్వంబుగనే తామువిడిచిపోవలయునని కోరుచుఁ జేయుచువచ్చిన యామెప్రార్థనంబులు మాత్రము కఠినస్వభావమునే కలిగి యున్న వని యించుకసూక్ష్మదృష్టితో నాలోచించి చూచువారలకు గోచరంబులు గాకమానవు. ఆమెయట్లు ప్రార్థించుచువచ్చుచుండుటచేతనే యామె కట్లు భర్తకంటె ముందుగమరణము సంభవించిన దని చెప్పఁజాలను. దుర్భరమనోదేహపరిశ్రమంబుచే హృదయము పనిచేయుట యాఁగి చైతన్యస్వభావము నిలిచిపోయిన దనియే చెప్పవలసి యున్నది.

గంభీరస్వభావు లని చెప్పవలసినపంతులుగారికంటె నత్యంతగంభీరస్వభావురా లని చెప్పవలసిన యారాజ్యలక్ష్మమ్మగారుసర్వశక్తిసంపన్నుఁడును, బరమకరుణానిధియును, లోకనియంతయునని యెల్లవారలచేతను గొనియాడఁబడు పరమేశ్వరునియెడల నెంతయు విశ్వాసమును గలిగి రచియించినయీశ్వరప్రార్థనకీర్తనములను దిద్ది ముద్రింపింపవలయు నని యెన్నిసారులు పంతులుగారి నడిగియున్నను నామెకింతలో మరణము సంభవించు నని పాప మాయన యెఱుఁగఁజాలకుండి యట్లామెకోరికప్రకా



ముగా నామె జీవితకాలములో నాకీర్తనములను ముద్రింపించి యామెకు సంతోషము గలిగింపఁ జాలకుంటిని గదా యని చింతించుచుఁ బంతులుగా రిప్పు డాకీర్తనములను ముద్రింపింపఁదలంచి యున్నారు. ప్రకృతిసిద్ధముగా నుగ్రస్వభావమునకే విశేషముగా నలవాటుపడియున్న పంతులుగా రెప్పుడయినను గోపభీషణవాక్యములను బలుకుచు వచ్చినచో నది వారిస్వభావ మనిసహజాత్యంతశాంతస్వభావముతోఁ బరమపతివ్రతాస్వభావంబు వెల్లడియగునట్లు వినయగౌరవంబులఁ బ్రత్యుత్తర మిచ్చు నామెసత్స్వభావ మెంతశ్లాఘాపాత్ర మైనదియో నే వర్ణింపఁ జాలకున్నాను.

పంతులుగా రట్లనేకసంవత్సరములు చిరకాలాగతదుఃఖకరానేకాచారదుష్కరోత్తుంగ తరంగములతో వీడనిపట్టుదలతో నత్యంతోత్సాహంబుతోఁ బోరాడుచుండి మహాభయంకర జంఝామారుతములవలెఁ గష్టము లెల్లయెడలం గ్రమ్ముకొని వచ్చుచున్నను గష్టములనెల్లను బటాపంచలగునట్లు గావించుచు వచ్చిన దాపతివ్రతాలలామ మగు భార్యయొక్క సాహాయ్యముచేతనే యని చెప్పవలసి యున్నది. భార్యావియోగాతిదుఃఖభారంబున మనోదార్ఢ్యమును విశేషంబుగాఁ దొలంగియున్న పంతులుగారి కిప్పుడు శ్రీమదాంధ్రభారతమునందలి నలోపాఖ్యానకథాభాగములోని,

గీ. అఖిలదుఃఖరోగార్తున ♦ కౌషధంబు
సురుచిరంబుగ భార్యయ ♦ చూవె యెందు
నెనర భార్యాసమేతుఁడై ♦ యున్నవాని
కెంత లాపద లయ్యును ♦ నెఱుకపడవు.

అనుపద్యముయొక్కభావ మీకాలమునం దెంతయువిశేషంబుగ స్వానుభవంబునకు వచ్చుచున్న దనిమిగులఁ జింతాకరంబుగఁ జెప్పవలసి యున్నది. సత్య మనియును, ధర్మ మనియును, లోకోపకార మనియును

నమ్మినదాని ననుష్ఠించుటలో లోకమంతయు ద్వేషించినను, బంధువులను, మిత్రులనుకడపట దేహమును విడువవలసి వచ్చినను దేనికిని వెనుకతీయుస్వభావము గలవారు కారని చెప్పవలసిన పంతులుగారి వ్రాఁతల వలనను గార్యములవలనను ననేకులకు మనస్సంతాపము గలిగియే యున్నదనుమాట సత్యమే యగును. పలువురకుఁ గలిగించినమనస్సంతాపము ఫలింపక మానునా యని పూర్వాచారపరాయణులు కొందఱనుకొనుచుండ వచ్చును. బ్రతికియున్నప్పు డనేకుల కోర్వలేనితన మున్నను, జీవితకాలములో నెకరియాధిక్యమును విపుట కొందఱికర్ణములకు శూలాయమానముగ నున్నను, మరణాంతర మట్టియసూయాదులు క్రమక్రమముగా నశించి సత్కార్యాచరణస్వభావంబును, సచ్చరిత్రంబును ప్రేమకుహేతువులు గాకమాన వనుసంపూర్ణవిశ్వాసంబుతోఁ బనిచేయుచున్న పంతులుగారిసత్స్వభావంబు నాగతకాలం బింతకంటె నెక్కుడుగా గ్రహింపఁగలిగి, సంతసింపక మానునా యని యిట దెలుపవలసి యున్నది.

ఏకాలమునందును, ఏదేశమునందును,సహజసత్స్వభావసంపన్నుల సత్కార్యములను గూర్చియు, సద్గ్రంథములను గూర్చియు నీర్ష్యామహాపిశాచావేశుల నిరంతరమును జింతించునిరర్థకవిమర్శకులు బయలువెడలు చుండుటయొక వింతగాదు. అట్టివిమర్శకుల వ్రాఁతలు శలభము మహాజ్వాలనార్పఁజాలని తెఱంగున, వీరికీర్తి కిసుమంతయుఁ గొఱంతను గలిగింపఁ జాలవు. అఱువదిసంవత్సరములు దాటి, దేహమనోదార్ఢ్యములంతగా లేక, వయఃకాలమునందువలెనే పాటుపడవలయు నను నుత్సాహముగల వీరేశలింగముపంతులుగారినీకాలమునం దేదైనఁ బద్యకావ్యమును రచియింపఁ గోరుటకంటె వేఱుకృతఘ్నత యుండదని యెఱింగిన వాఁడనయినను, వృద్ధదశయందు వీరు పద్యకావ్యము నెట్లు రచియించెదరో చూడవలయు ననుహృదయపూర్వకానందము గలిగియున్న వాఁడ



నగుటం జేసి, శ్రీమదాంధ్రభారతము నాంధ్రీకరించి, "కవిబ్రహ్మ"యని మహాకవులచేఁ గొనియాడఁబడు చున్నతిక్కనసోమయాజినిం గూర్చి వీరు వ్రాయుచు, "తిక్కనసోమయాజి వ్రాసిన పదియేను పర్వములలోను నలువదియాఱాశ్వాసములకంటె నెక్కువ గ్రంథము లేదు. ఒక్కొక్క యాశ్వాసమునకు నాలుగువందల యేఁబదేసి పద్యములచొప్పున లెక్క చూచినను, శ్రీమహాభారతములోఁ దిక్కనసోమయాజి రచియించిన భాగమంతలోను నించుమించుగా నిరువదివేల పద్యములకంటె నధికముండవు. దినమునకుఁ పదిపద్యముల చొప్పున రచియించినను, ఇంత గ్రంథము నయిదాఱుసంవత్సరములలో రచియింపవచ్చును. కాఁబట్టి యిట్టి గ్రంథరచన యొక యసాధ్యములోనిది కాదు." అని వ్రాసి యుండుటం జేసి, దినమునకుఁ బదిపద్యముల చొప్పునఁ గాకున్నను, బదిదినములకొకపద్యముచొప్పున నైనను రచియించుచు దమకుంగల చింత దొలఁగునట్లీకాలమునం దొకమంచిపద్యకావ్యంబును రచియింపఁ బ్రయత్నించెదరని కోరుచున్నాఁడను.

పరోపకారార్థంబుగఁ దాము చేయ నారంభించిన స్త్రీపునర్వివాహమహాకార్య వ్యాపనమును విడనాడక, నాస్తికాదిపతితనామముల నిందించుచు లోకమంతయుఁ బ్రతిఘటించినను, హృదయపూర్వకంబుగ నమ్మి చేయు దేశోపకారకరకార్యము లెంతసాహసమునయినను వహించి, కార్యసాఫల్యంబునకుం బూనుటయే మనుజుని జీవితముయొక్క పరమార్థ మగుటం జేసి, కృతఘ్నులును, శాస్త్రజ్ఞులు నగువారలయసూయతా సూచకము లగు ప్రల్లదములను లేశమయినను బాటింపక, సఫలీకృతమనోరథులుగాఁ బ్రయత్నించుటయే మహాత్ముల కవశ్యకర్తవ్యమగుటం జేసి, సత్కార్యవ్యాపనముం జేయఁగోరుచుఁ బ్రపంచమునందు మనుజునకు నీతిమార్గావలంబనముకంటె వేఱుసన్మతము లేక యుండుటం జేసి, సర్వోత్కృష్టంబుగనుండి యత్యంతశ్లాఘాపాత్రంబుగ నుండునట్లుగ

నిక్కవిచే స్వకపోలకల్పితంబుగ రచియింపఁబడిన "సత్యహరిశ్చంద్ర నాటకము నందలి,

సీ. ఆగారవాదుల ♦ కారయు ధర్మంబె
కారణం బియ్యలఁ ♦ గాదయేని,
దీర్ఘకాలముక్రింద ♦ దివి కేగి యున్నట్టి
రాముని నాధర్మ ♦ రాజు నిప్పుడు,
దేవసన్నిభులఁగ ♦ భావించి పూజింప,
వారిసచ్చరితల ♦ గాతవింప,
మహిమీఁద వారలు ♦ మనకుఁ జేసినయట్టి
యతులోపకార మే ♦ దైనఁ గలదె?
మనము రావణు దుర్యోధ ♦ నునిఁ గరంబు
దూషణ మొనర్చి ద్వేషింపఁ ♦ దొల్లివారు
మనకు నపకార మిమ్మహీ ♦ మండలమున
నెప్పు డైనను జేసిరే ♦ యించుకైన?

ఉ. సీత విపత్తులం బొగలి ♦ చేడ్పడె నన్నపుడార్తి చెందఁగా,
సీత మహోపకార మిటఁ ♦ జేసిన దేది జగజ్జనాళికిన్?
క్ష్మాతలమందు శూర్పణఖ ♦ కష్టపరంపర చెందె నన్నచోఁ,
జేతిములం జెలంగి నది ♦ చేసినదేది మహోపకారమున్?

ఉ. సీతికి హేమభూషణము ♦ శ్రీప్రకరంబుల వన్నె రా దిలన్;
సీతికి వన్నె పోదు ధర ♦ శిన్ వెలిమాలినచింపిగుడ్డలన్;
సీతికి గౌరవం బెపుడు ♦ నిల్చుఁ జుమీ సహజంబుగానె; వి
ఖ్యాతిగ సీతివర్తనము ♦ నందఱుమానక యుండఁగావలెన్.

చ. సిరులను జూచియున్ మురగ ♦ సింధురసాధనుతాళిఁ జూచియున్,
గరువముపొందుచుండ్రు కను ♦ గానకమూఢులు ధారుణీస్థలిన్;
మరణము సంభవించునెడ ♦ మాత్ర మవేవియు లేనివారలై



ధర నసెకారు లయ్యెదరు ♦ తా మొకనిల్వెడుభూమికే యిటన్.

చ. ప్రజ లెఱుఁగంగలేరు సిరి ♦ పట్టులమర్త్యులతారతమ్యముల్;
నిజమును దాము గన్గొనఁగ ♦ నేర్తురు ధారుణిలోనిమానవ
ప్రజముల నెవ్వ రుత్తములొ ♦ వాకొనరానియయోగ్యు లెవ్వరో
రుజల శరీరము ల్తొలఁగి ♦ రూపఱుపిమ్మట మెల్లమెల్లఁగన్.

అనుపద్యముల ఫలితార్థమును జక్కఁగా గ్రహించి, పరోపకారార్థంబుగనె జీవితకాలమును వినియోగింప నెల్లవారును బాటుపడుచుండెదరని నెమ్మనమ్మున నమ్ముచు, నేనీచరిత్రమునందు నాయసమర్థతచేఁ జేసిన దోషములనెల్లను దయార్ద్రహృదయంబున మన్నించెదరని వీరేశలింగముపంతులుగారికి హృదయపూర్వక మగునాకృతజ్ఞత నిందుమూలముగ వెల్లడించుచు, నధికపరిశ్రమానంతరమున సంపూర్ణవిశ్రాంతి నొందవలసిన యీకాలమునందు సహితము, పాలుమాలికయనునది లేశమును లేక పాటుపడుచున్న శాంతిలేని యీమహాత్మునకు, జీవితకాలము తటిల్లతవంటిదియేయని చెప్పవలసి యున్నను సత్కార్యాచరణస్వభావరజ్జువు న లోకమునకుం దమమనసును బెనివేసినవిధంబు నించుకసూక్ష్మబుద్ధితో నాలోచించిచూచి, శతవర్షంబు లాయుష్కాలముండును గాకయని తలంచుచు, సుప్రసిద్ధబొబ్బిలి సంస్థానమునం దమూల్యాలంకారంబుగ నుండి వాసిగాంచిన మండపాక పార్వతీశ్వరపండితకవి యీ "వీరేశలింగకవిచరిత్ర" ముంగూర్చి పూర్వ మొసంగిన యభిప్రాయము నిందుదాహరించి నాప్రియసహోదరు లగుచదువరులయనుజ్ఞను వేఁడుకొనుచు, నంతటఁ గొంతవిశ్రాంతి నొందఁ దలంచియున్నాఁడను.

క. శ్రీ లేటికి సిద్ధింపవు?
మే లేటికిఁ గోరకుండ్రు ♦ మిము బోఁటులకుం?
దో లేటి సుబ్బరాయా!
పా లేటికి సాటి యగుభ ♦ వత్కృతిఁ గనినన్.

### మాలికోత్పలమాలిక.

శ్రీశ్వరభక్తుఁడై కృతుల ♦ నేకముగా నొనరించి ధాత్రిలో
శాశ్వతకీర్తిఁ గాంచినర ♦ సజ్ఞుఁడు ప్రాజ్ఞుఁడు సన్మనోజ్ఞుఁడున్
విశ్వసనీయవాక్పటిమ ♦ విశ్రుతుఁ డింక బహుశ్రుతుండు ప్రా
ణశ్వసనోపమానుఁడు జ ♦ నంబులపట్లఁ బరోపకారమే
విశ్వమునందు మే లయిన ♦ వృత్తమటంచుఁ దదేకదీక్షచేఁ
బశ్వనుకారివర్తనముఁ ♦ బాయనిబాలవితంతువుల్ స్వతం
త్రశ్వశురాదిబాంధవజ ♦ నప్రతిఘంబున గుప్తరీతిగా
శిశ్వసుహత్యలెన్నయినఁ ♦ జేయుటకున్ వెనుదియ్యకయ్యయో!
దుశ్వపచాదిపల్లవుల ♦ తోఁ బొరలాడుచు మారుజుల్మతీ
యశ్వములట్లు మత్తిలుచు ♦ నత్తయు మామయుఁ దల్లిదండ్రులు
గ్రశ్వయథుభ్రమం దమకు ♦ గాఢచికిత్స లొనర్చుచుండఁ జం
డాశ్వతరంబులట్లు మద ♦ నార్తిసహింపమి నయ్యొ గర్భమి
ట్లాశ్వసనీయవాక్పటిమ ♦ నక్కులటం దిటదీర్చి గర్భమున్
నిశ్వసనంబుతోఁ దిగిచి ♦ నిర్భయతం గని తత్పవిత్రతన్
విశ్వజనీనమానటులు ♦ వేమఱుఁ జాటుట యొండెఁ గల్గుటల్
శశ్వదుదంతపత్రికలు ♦ సాటగఁ వించు దయార్ద్రచిత్తుఁడై
విశ్వసృడాజ్ఞచే సఫల ♦ విక్రముఁడై విధవావివాహముల్
నశ్వరగానియుద్యతి నొ ♦ నర్చుచు మేల్గను కందుకూరి వీ
రేశ్వరలింగమంత్రిసుక ♦ వీంద్రుచరిత్రకు మండపాక కా
మేశ్వరపార్వతీశ్వరక ♦ వీశ్వరుఁ డబ్బుర మొంది మన్మథా
బ్దాశ్వయుజాదిమప్రతిప ♦ దాఖ్యతిథిన్ లిఖియించె నీక్రియన్.

---



"Like a beautiful flower full of colour, without scent,
The fine words of him who does not act accordingly are fruitless
Like a beautiful flower full of colour and full of scent,
The fine words of him who acts accordingly are full of fruit.

As the bee—injuring not
The flower, its colour, or scent—
Flies away, taking the nectar;
So let the wise man dwell upon the earth.'

---

